# బాణుని కాదంబరి
# దాని వైశిష్ట్యము

(1977వ సంవత్సరము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమీ వారు నిర్వహించిన రచనలపోటీలో రు. 3500 బహుమతిని పొందిన విమర్శగ్రంథము)

రచయిత
వేదము వేంకటరామన్, ఎం. ఏ.
ఆంగ్లశాఖాధ్యాపకుడు
వేంకటగిరిరాజ కళాశాల
నెల్లూరు

ప్రకాశనము
ఆర్. సంయుక్త
32, పొగతోట,
నెల్లూరు.

# అంకితము

బాణుని 'కాదంబరి' ని ప్రప్రథమముగ పాశ్చాత్యశాస్త్రీయపద్ధతిలో పలువ్రాత ప్రతులను, పూర్వ ముద్రణములను సేకరించి, సమీకరించి, దోషములను తొలగించి సాధుపాఠములను నిర్ణయించి, నేటికిని మిక్కిలి ప్రామాణికమైన ప్రతిని సిద్ధముచేసి, దానికి సుదీర్ఘ విమర్శనాత్మకమైన ఆంగ్లపీఠికను ముందుతొడిగి, పాండిత్యస్ఫోరకము, పాఠకసాహాయ్యకము, జిజ్ఞాసాజనకమును అగు విపులాంగ్లవ్యాఖ్యానమును వెనుకచేర్చి, చక్కని నాగరిలిపిలో ముద్రించి, క్రీ. శ. 1882 లో వెలువరించి, భారతీయులకు మహోపకారమొనరించిన పాశ్చాత్య గీర్వాణభాషావిదగ్ధుడు —

స్వర్గీయ

## శ్రీ పీటర్ పీటర్సను

మహాశయుని స్మృతికి ఈ నా "బాణుని కాదంబరి — దాని వైశిష్ట్యము" అను తెలుగు విమర్శగ్రంథమును నమ్రతతో అంకితము చేయుచున్నాను.

సీ॥ స్కాట్లండులో జన్మ, సంస్కారమాంగ్లము,
ఏసుమతమునందు నెదిగి వచ్చి,
భరతదేశము చేరి భారతసాహితీ
సేవ చేయ మిగుల సిద్ధమయ్యె —
సంస్కృత ప్రాకృత సంప్రదాయగ్రంథ
సంపాదనము చేసి సంస్కరించి,
గ్రంథముద్రణముల కర్తగా వెలుగొంది,
'కాదంబరి' ని మాకు కరుణనిచ్చి,

గీ॥ పీటరుస నుపనామక పీటరనెడు
నాంగ్ల సంస్కృత పండితు డమరుడయ్యె —
ప్రాచ్యవిబుధుల మస్తక రత్న మతనిఁ
బ్రస్తుతింతు వినతి నప్రాచ్యబుధుని.

నెల్లూరు
4-6-1980

వేదము వేంకటరామణ

# పీటర్ పీటర్సను జీవితసంగ్రహము

పీటర్ పీటర్సను సంయుక్తబ్రిటనునకు ఉత్తరమండలమయిన స్కాట్లండు రాజధాని, ఎడింబర (Edinburgh) నగరములో క్రీ. శ. 1847 లో జన్మించెను. ఎడింబర విశ్వవిద్యాలయమున లాతినుగ్రీకుభాషాసాహిత్యములందు పట్టము పొంది అచ్చటనే ప్రసిద్ధసంస్కృతపండితుడు ఔఫ్రెక్ట్ (Aufrecht) నొద్ద సంస్కృతము జదువనారంభించెను. తదుపరి ఇంగ్లండులోని ఆక్స్‌ఫర్డ్ (Oxford) విశ్వవిద్యాలయమున జగద్విఖ్యాతులయిన సంస్కృతవిద్వాంసులు మోనియర్-విలియమ్స్ (Monier Williams), మెక్స మూలర్ (Max Muller)ల దగ్గర సంస్కృతాధ్యయనమును పూర్తిచేసి క్రీ. శ. 1872 లో సంస్కృతమున పట్టభద్రుడై భారతరాజ్యాంగవిద్యాశాఖలో (Indian Educational Service) చేరి, బొంబాయిలోని ఎల్‌ఫిన్‌స్టన్ (Elphinstone) కళాశాలలో ప్రధానసంస్కృతాచార్యుడుగ నెలకొనెను.

ఈపదవి సత్యముగ మహాపండితుడు రామకృష్ణగోపాల భాండార్కరునకు చెందవలసినది. ఆంగ్లాధికారులపక్షపాతమువలన పీటర్సనునకు ప్రసాదింపబడినది. భాండార్కరునకు అన్యాయము జరిగినదని గుర్తించిన పీటర్సను, ఇందులో పీటర్సను తప్పు లేదని గ్రహించిన భాండార్కరు, ఒకరియెడలనొకరు అత్యంతసౌముఖ్యమును జూపుచు ప్రాణమిత్రులైరి. పీటర్సనుపై భాండార్కరు సుహృద్భావమునకు పీటర్సను మరణించినపుడు ఆయన ఇచ్చిన సానుభూతిభాషణము దర్పణము. ఎటులైననేమి, మంగళాంతము మంగళమే. వారిరువురి ఆధ్వర్యవమున సంస్కృతగ్రంథముద్రణక్రతువు గొప్పగ ఫలించినది. వారు 'బొంబాయి సంస్కృతగ్రంథమాల (Bombay Sanskrit Series)' అనుపేర ప్రారంభించిన సంస్థలో అనేకసంస్కృతపుస్తకములు, నిర్దుష్ట మనోహరముగ దేవనాగరిలిపిలో ముద్రణభాగ్యము పొందినవి.

పీటర్సను బొంబాయిలో ప్రముఖపౌరుడై పెక్కుపదవులను గొప్పగ నిర్వహించినను నేడు అతనిని మనకు స్మర్తవ్యునిగ చేసినది అతని సంస్కృతప్రాకృత హస్తలిఖితగ్రంథసేకరణము. అతనివలన మారుమూలలలో క్రిమిదష్టమగుచున్న అమూల్యగ్రంథములనేకములు గ్రంథాలయమును చేరి సురక్షితములై పలువురకు ఉపయోగపడుచున్నవి. వానిలో కొన్నింటిని పీటర్సను పరిష్కరించి ముద్రింపించినాడు. అవి 1. కాదంబరి 2. శార్‌ఙ్గధరపద్ధతి (సంకలనగ్రంథము) 3. సుభాషితావళి (సంకలనగ్రంథము) 4. న్యాయబిందు (బౌద్ధము). జైనగ్రంథమయిన 'ఉపమితిభావప్రపంచకథ'ను ముద్రించు యత్నములోనుండగ అతని జీవితము నిండుకొన్నది. ఏబదిరెండేండ్లకే అతడు మనదౌర్భాగ్యవశమున మరణించినను భారతీయసాహితీప్రియులకు చిరస్మరణీయుడైనాడు. క్రైస్తవుడు కావున,

అతనియాత్మ శాంతిని పొందుగాక.



# విషయసూచిక

## అవతారిక



## గ్రంథము

| విషయము | పుట |
|---|---|




గ్రంథకర్తృ పరిచయము తద్వంశాభివర్ణనము

కళాప్రపూర్ణ మరుపూరు కోదండరామ రెడ్డి

# వేదము వేంకటరామన్

## ఎరుకకలిమికి ఒక మిత్రుని హర్షము

"**Scholarship seems to be incorrigible in your community**" —**Dr. C. R. Reddy**

"విద్వత్తు మీ కుటుంబాలలో మాన్పరానిది

ఇదీ! ద్రావిడభాషామతల్లి పుత్రులై ఆంధ్రభాషాదేవిని సురభికుసుమాలతో అర్చించిన పుదూరు ద్రావిడ బ్రాహ్మణుల చదువుల మదింపు. 15, 16 భాషలలో నిగ్గయిన పాండిత్యం సంపాదించి మద్రాసు ప్రెసిడెన్సీకాలేజిలో గుస్టాఫ్ ఆపర్టు తరువాత మొదటి భారతీయ సంస్కృతాచార్యుడుగ ఉద్యోగంలో ఉండి ద్రావిడభాషలకు అపారసేవ జేసిన తాతవెల్లి మిరాదారు (T. M.) శేషగిరిశాస్త్రి M.A., ఇమ్మడి వేదం వేంకటరాయశాస్త్రి M.A. కు మాతామహుడని విని ఆవెలతీర్పరి, డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి అన్నమాట! ఇది నూటికి నూరుపాళ్లు నిజం. ఆ తెగకు చెందిన వేదం వేంకటరామన్, M.A. ను పరిచయం చేసేముందు వేదం వంశంలోని కొందరు గొప్పవారిని తలచుకోవడం న్యాయం.

### వేదం వేంకటరమణశాస్త్రి (క్రీ. శ. 1817? - 1900)

(ప్రథమ) కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రి తండ్రి, వేంకటరమణశాస్త్రి, మొదట మద్రాసు ముత్యాలపేటలో బేరిసెట్టి కులమువారు నెలకొల్పిన పాఠశాలకు ప్రధానోపాధ్యాయులై సంస్కృ

తము, తెలుగు, తమిళము మూడు భాషలను బోధించుచుండిరి. శబ్దరత్నాకర కర్త బహుజనపల్లి సీతారామాచార్యులు అప్పుడు ఆ బడిలోనే తెలుగు ఒజ్జ.

వేంకటరమణశాస్త్రి అద్వైత వేదాంతి. వ్యాకరణ పతంజలి అని పేర్గాంచిన దిట్ట. గడుసుదనం ఈ కుటుంబంలోనివారికి ఒంటబుట్టి చతురోక్తులపంట పండించినది. ఈయన చిన్నయసూరికి సమకాలి కుడు, నెచ్చెలి. సూరి వ్యాకరణానికి ముందే వేంకటరమణశాస్త్రి ఒక చిన్న తెలుగు వ్యాకరణాన్ని "లఘువ్యాకరణము" అనే దాన్ని వ్రాసి ప్రకటించినారు. ఎవరో కలహప్రియుడు, "బాల వ్యాకరణం" వచ్చిన తరువాత, ఆయనను "మీవ్యాకరణం మళ్లీ అచ్చువేయరాదా?" అని ముఖప్రీతిమాటలు అనగా,

"చిన్నయసూరి వ్యాకరణం సూర్యునివలె వెలుగొందు చుండగా నాగుడ్డిదీపమెందుకు" అని అనగలిగిన సత్యప్రియులు — ఈ వేంకటరామన్ ముత్తాత.

ఆయన సత్యప్రియత్వానికి ఇంకొక నిదర్శనం ఉన్నది. శిష్టు కృష్ణమూర్తి తాను వ్రాసిన వ్యాకరణకారికలను చిన్నయసూరి కాపీకొట్టి తన వ్యాకరణం వ్రాసినాడని ఒక కడుపుమంట బొల్లి కతను వ్యాపింపజేసినాడు. కాని పండితుల ఎదుట వేంకటరమణ శాస్త్రి శిష్టే సూరివ్యాకరణాన్ని కాపీకొట్టినాడని నిలబలికినారు.

వేంకటరమణశాస్త్రికి నలుగురు పుత్రులు పుట్టి ముగ్గురు మిగిలినారు. వారు వరుసగా 1. వేంకటరాయశాస్త్రి, 2. వేంకటా చలంఅయ్యరు, 3. సూర్యనారాయణశాస్త్రి.

## వేదం వేంకటాచలం అయ్యరు (క్రీ. శ. 1865 - 1931)

అన్న కళాప్రపూర్ణునికి ఎందును తీసిపోని తమ్ముడు. రాజ మహేంద్రవరంలో హైస్కూలు హెడ్‌మాస్టరుగా కొద్దికాలం

పనిచేసినారు. అప్పటి ఆయన శిష్యులలో ఇద్దరు తెలుగు వెలుగులు కలరు. వారే చిలకమర్తి లక్ష్మీనరసింహం (ఆరామద్రావిడి), ఆంధ్ర కేసరి టంగుటూరు ప్రకాశంపంతులు. వీరిద్దరు తమ స్వకీయచరిత్ర లలో గురువుగారిపై నెనరుచూపినారు.

వేంకటాచలమయ్యారు B. A. పరీక్షలో సంస్కృతమున మద్రాసురాజధానిలో ప్రథములుగ ఉత్తీర్ణులయినందుకు గోడేగజపతి సంస్కృత బహుమానమును, 400 వెండిరూపాయలను (అప్పుడు 40 సవరల బంగారం కొనవచ్చు) పొందడం వల్ల దానితో మద్రాసులో B. L. చదివి నెల్లూరుజిల్లా కావలిలో ప్రాక్టీసు మొదలుపెట్టి నెల్లూరు కొనుకు వచ్చి న్యాయవాదిగా స్థిరపడినారు.

వీరు కాలేజిరోజులలోనే ఇంగ్లీషు, సంస్కృతములు కాక ఫ్రెంచిభాషను గట్టిచేసుకున్నారు. హిందూదేశప్రాచీనచరిత్ర వీరికి అభిమానవిషయము. అందులో పరిశోధనలు చేయుడానికి అనేక ఇతరభాషలను అభ్యసించారు. ఆర్యభాషలయిన గ్రీకు, లాటిను, పార్సీ, జర్మను, ఇటాలియను భాషలు, సెమెటికువర్గంలో హీబ్రూ, అరబ్బీ, ప్రాచీనమృతభాషలయిన ఈజిప్టు, మెసపొటేమియాభాషలు (అప్పటికి సింధునాగరికత సంగతి పూర్తిగ తెలియదు), ఇక తమిళ కన్నడాదులు ఆయన తన రిసర్చికి ఉపకరణాలుగా నేర్చుకొన్నారు.

ఈ వ్యుత్పత్తితో అయ్యారు 1. ఆర్యావర్త భరతవర్షాలను గురించి (రామాయణంలో కొన్ని ఘట్టాలు మెసపొటేమియాకు చెందినవని స్థిరపరిచారు) 2. సప్త ద్వీపముల ఎల్లలు (అమెరికా విషయములు) 3. పురాణాల ప్రాచీనత మొదలగు అనేకవ్యాసాలను ఆంగ్లంలో వ్రాసి పత్రికలలో ప్రకటించారు. వాటిని చదివి ప్రభావితులయిన కొద్దిమందిలో ఈ కోదండరామరెడ్డి ఒకడు.

విమర్శలో అయ్యరు క్రొత్తత్రోవలు తొక్కినారు. వీరి ఆంగ్ల పుస్తకము "Notes on-the Study of the Preliminary Chapters of the Mahabharata (Being an attempt to separate the genuine from the spurious matter)" సాంప్రదాయిక వాదదుర్గంపైన విసరిన బాంబై నూతనాంశాలను ఎన్నిటినో బయట పెట్టినది. భాండార్కరు సంస్థ వారి మహాభారత పరిశోధితముద్రణంలో పాఠనిర్ణయాలకు అయ్యరు పుస్తకం దారిచూపించినది. ద్రౌపదీకచగ్రహణమే కాని వస్త్రాపహరణం లేదనీ, ఉపకీచకులకథా ఒకగ్రీకు కథానుసరణం అనీ ఇంకా ఇంకా వైరిపండితులు గుండెలు బాదుకునేటట్లు నిరూపించినారు.

ఈసందర్భంలో నాకుగురువులు శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారిని గురించి కొంత ప్రస్తావించవలసి ఉన్నది. వేంకటాచలమయ్యరు తన భారతవిమర్శను తెనిగించమని కోరుతూ నెల్లూరు పండితుడు, న్యాయవాది మంచివిమర్శకుడు అయిన ఒంగోలు వేంకటరంగయ్యకు వ్రాసిన ఒక లోకల్ కార్డులో (నేనుచూచినా) ఎవరో ఉత్తరాది పండితుడు తన విషయాలను గ్రహించినట్లున్నది అని వ్రాసినారు.

అప్పుడు భారత విమర్శచేసి పత్రికలకు వ్రాస్తుండిన వారు పెండ్యాలవారు. అయ్యరు చెప్పిన ఉత్తరాది పండితుడు ఆయనే అని ఆనాడు నెల్లూరులో కొందరనుకొన్నారు. కాని పెండ్యాలవారి విషయంలో వేంకటాచలమయ్యరు పొరపడినారని నేను గట్టిగా చెప్పగలను.

పెండ్యాలవారు బందరు జాతీయకళాశాలలో నాకు (1920-24) ఆంధ్రోపాధ్యాయులు (వేదాల రంగాచారితో బాటు), వారికి ఇంగ్లీషు రాదు. ఒకటి రెండు ఇంగ్లీషు పదాలను ఆయన ఉచ్చరిస్తే, మహావక్త, హాస్యోక్తి చతురులు అయిన చెరుకువాడ వెంకటనరసింహాం,

సుబ్రహ్మణ్యశాస్త్రి ఇంగ్లీషును మర్డర్ (హత్య) చేస్తున్నాడని ఎగతాళి చేసేవారు. శాస్త్రిగారే నాకు విమర్శకజ్ఞానం ప్రసాదించినది. వీరూ ద్రౌపదీవస్త్రాపహరణం లేదని మరికొన్ని ఉపపత్తులను చూపినారు. వ్యాసుడు అనేది బిరుదేనని మనకు 28 మంది వ్యాసులున్నారని నిరూపించినారు. కట్టమంచివారి సూచనపై రాజసూయ యాగము నరమేధమేనని స్థిరపరచినారు. వీరు స్వోపజ్ఞతో భారతాన్ని విమర్శించి కాకతాళీయంగా వెంకటాచలమయ్యారు వాదాలను బలపరచినారు. Parallel thoughts; great men think alike — అంతే.

అటువంటి వేంకటాచలమయ్యారు పరిచయభాగ్యం నాకున్నదని (అక్లేశ కళాప్రపూర్ణుని, ఆయన మనుమడు ఇప్పటి వెంకటరాయశాస్త్రి పరిచయం కూడా) పొంగిపోతుంటా. నేలటూరు వేంకటరమణయ్య (చారిత్రికుడు), మానవల్లి రామకృష్ణకవి నాకు ధారాశుద్ధికి, మామిడిపూడి వేంకటరంగయ్యగారు (చారిత్రకుడు, విద్యావేత్త) మొదలైన పుదూరుద్రావిడ మేధావులు నన్నెరిగి అభిమానించినారు.

నెల్లూరు మెక్లీన్‌క్లబ్బులో ఒకమూలగదిలో వేంకటాచలమయ్యారు ప్రతి సాయంత్రం చుట్టతాగుతూ (ఉబ్బసానికి, ఆయుర్వేద ధూమపానం) సంస్కృతరామాయణవిమర్శకు నోట్సు వ్రాసుకుంటుండేవారు. కాసేపు బ్రిడ్జి ఆట చూచేవారు. నా బిడింగును చూచి "నీ డబ్బు స్వార్జితంగా ఉన్నట్లు లేదే - లేకుంటే ఆ రెక్‌లెస్ బిడింగు ఏమి" అని ఎత్తిపొడిచేవారు. ఆయన మనసు ఎంత వెళుసో అంత మెత్తన. బార్‌రూములో ఆయన అందరిని నవ్విస్తూ మాట్లాడేవారు.

న్యాయవాదిగా తప్పుడుకేసు పట్టి ఎరుగరు. అల్లూరి పెద్దరెడ్డి పౌణకా వీరారెడ్డి ఒక అక్రమ వ్యాజ్యం చేయమని అయ్యారును

కోరగా ఆయన తన్ను తరిమికొట్టినాడని ఆరెడ్డే తన బారకాసు బసలో పలుమారు సరసంగా చెప్పగా నేను విని ఉన్నా.

వేంకటాచలం అయ్యరు పుత్రులు ఇద్దరు — విశ్వనాథన్, దక్షిణామూర్తి. ఇద్దరూ B. A. B. L. అయినా లాయరు వృత్తి చేయలేదు. వ్యాపారంలో దిగితే అది అసలే ఒంటపట్టలేదు. ఆయిద్దరినీ నేను బాగా ఎరుగుదును.

వేదం వేంకటరామన్

విశ్వనాథము మొదటి కొడుకే ఈగ్రంథకర్త వేంకటరామన్. తల్లి రాజ్యలక్ష్మి, మామిడిపూడివారి ఆడపడుచు.

పుష్పఫల భరితమయిన వేదం వంశవృక్షంలో వేంకటరామన్ ఒక నిండుకొమ్మ. ఆవంశ సౌరభాన్ని విరజిమ్మే మూడవతరపువాడు. ఈ ద్రావిడులు మనుమని 'పేరన్' అంటే "(తాత) పేరుకలవాడు" అని అంటారు. ముత్తాత వేంకటరమణశాస్త్రి పేరునే ద్రావిడీకరణం చేసిపెట్టినారు. తాతల పాండిత్యం రక్తంలోనే ఉండగా ఇంద్రధనుస్సు రంగులవలె బహువిషయాలలో ఆసక్తి రక్తి కలవాడు, స్నేహశీలి, సాహిత్యప్రియులలో నూరికలిపినట్లు కలిసిపోతాడు.

వేంకటరామన్ జననం 9-7-1930. చిన్నప్పుడు బడులలో తళుకు బెళుకు లేకుండా సామాన్య తరగతిలోనే ప్యాస్ అవుతూ వచ్చినా B. A., లో (1949) గణితశాస్త్రంలో ప్రథమశ్రేణిలో తేలినాడు. హైస్కూలు వదలగానే ఇంగ్లీషుపై మమకారం పుట్టి నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియన్, వి. ఆర్. కాలేజి లైబ్రరీల పుణ్యాన ఆంగ్ల నవలాప్రపంచంలో ఒక అంచునుండి ఇంకొక అంచుకు ఒక మేధావిగానడచి, తన తండ్రివలె, ఆభాష నుడినానుడులను, ఆ సాహిత్య సౌందర్య రసాలను దిగద్రావి త్రేచినాడు. దానితో మంచి అస్తిభారం పడింది.

ఇతని ఉద్యోగజీవితం కొంతవరకూ ఊసరవిల్లి రంగులవలె మారింది. ఆర్థికదుఃస్థితివల్ల పై చదువులు సాగక, ఇంటిభారం మోయకతప్పక, ఒకసంవత్సరం వి. ఆర్. కాలేజిలో (1949-50) ఇంగ్లీషు ట్యూటరు, తరువాత (1950-51) గండవరం (నెల్లూరుజిల్లా) బోర్డుహైస్కూలులో లెక్కల టీచరు, తరువాత (1951-52) పోస్టాఫీసు గుమాస్తా చేసి, అటుపైన మళ్లీ B. A., ఇంగ్లీషు సబ్జెక్టుతో ప్యాస్ అయి వి. ఆర్. కాలేజిలో పాతసీటులోకి వచ్చాడు. 1955 లో నాగపూర్ యూనివర్శిటీ M. A., ఇంగ్లీషు పరీక్షను ప్రైవేటుగా ప్యాసయి 1956 లో వి. ఆర్. కాలేజీలోనే ఇంగ్లీషు లెక్చరరుగా నిలబడ్డాడు.

ఆంగ్లసాహిత్యంలో భాషలో కొంత లోతు, పరపు కలవాడని పేరు సంపాదించినాడు. ఆంగ్లంలో ఏదైనా సందేహంవస్తే అడుగదగినవాడని ఊరిలో గుర్తింపు పొందినాడు. ఉన్నదానితో తృప్తిపడి, లేనిదానికి నోరుదెరిచి అడుగక, నెల్లూరులో పొగతోటలో తాత కట్టించిన సౌధభాగంలో హాయిగా ఉంటున్నాడు.

పుట్టుకతో వేంకటరామన్ ఒక అనాసక్తయోగి అనవచ్చు. ఇది ఆతనిని ఒకవిధంగా సోమరిని చేసినది. మొదట B. A., పరీక్షలకు కొన్ని గైడులు వ్రాసి తరువాత విరమించుకొన్నాడు. కాని ఆంగ్ల సాహిత్యంలో తోడి అధ్యాపకులు పట్టించుకోని శాస్త్రభాగాలను ఒంటికి పట్టించుకుంటూ జ్ఞానవృద్ధిని పొందుతూనే ఉండినాడు. 1966 సంవత్సరం ప్రాంతంలో ఒక జ్ఞానోదయం అయ్యింది. ఆంగ్లంలో ఎంతలోతుకుపోయినా అది సన్నిహితసమాజానికి అంతపనికివచ్చేది కాదు అని తెలుసుకొని భారతీయసాహిత్యం తెలుసుకోవాలని సంస్కృతంమీద పడినాడు. ఉత్సాహమే కార్యసాఫల్యానికి మూలమని నిరూపించాడు. 1971 నాటికి సంస్కృతంలో కొంచెం పట్టు చిక్కింది. తరువాత ప్రాకృతాలవైనం కూడా చూడడం మొదలు

పెట్టినాడు. ఈ భారతీయసాహిత్యసముద్రంలో వాహ్యాళి నౌకను నడపడమే కాని, గ్రంథకర్త కావాలని నిన్న మొన్నటిదాకా ఈయనకు బుద్ధిపుట్టలేదు. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాదమీ వారు 'కాదంబరీవైశిష్ట్యం' అని పోటీ పందెం పెట్టగా వ్రాసిపిచ్చిరేగి ఆ మహాకవిని గురించి విపులపరిశోధన చేసి, పాశ్చాత్యసాహిత్యిక దృష్టిని ప్రాచ్యసాహిత్యంమీద పెట్టి, కూలంకషమైన విషయసంపుటాన్ని తయారుచేసినాడు. ఇక ప్రైజురాక ఏమంటుంది? అచ్చుకు పోయ్యేముందుదాకా విషయాన్ని పరిశోధిస్తూ సవరిస్తూ మంచి విమర్శగ్రంథాన్ని ఆంధ్రపాఠకలోకానికి సమర్పించినాడు. బాణుని కాదంబరిని గురించి ఇంత విపులమయిన చర్చ మరి ఏ ఇతరభాష లోనూ ఇప్పటిదాకా లేదనవచ్చు.

ఇతని గుణపక్షపాతబుద్ధికి పొలిమేరలు లేవు. తన పుస్తకాన్ని తన తాతకో తండ్రికో లేక ఇంకొక పోషకునికో అంకితం చేయక భట్టబాణుని కాదంబరికి పరిశోధితముద్రణం (Critical Edition) ప్రసాదించిన, ముందుశతాబ్దంలోని, పాశ్చాత్యపండితుడు పీటర్ పీటర్సనుకు సమర్పించినాడు.

ఈ వేదంవారికి సాంక్రామికవ్యాధివంటిది సాహిత్యసాటవం. ఆ పెదతాత కళాప్రపూర్ణుడు కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదను — బండకవిత్వమని అర్థంకాక సాంప్రదాయిక పండితులుకూడా చదువక విడువగా, తాళపత్ర గ్రంథములలోను తప్పులతడికెలుగా ముద్రించిన గుజిలీప్రతులలోనుమగ్గి సాహిత్యప్రియుల విస్మృతిపథంలో పడిపోతున్నదానిని — బయటకులాగి ఆ ఆముక్తమాల్య సౌరభాన్ని విపులవ్యాఖ్యానంతో విరజిమ్మి ఆ కావ్యాన్ని ఆంధ్రసాహిత్యంలో అద్వితీయంగా నిలిపినట్లు,

ఆరాయల సంస్కృతనాటకం "జాంబవతీపరిణయం" లిపికర ప్రమాదములకు శతాబ్దాలుగా గురిఅయి అర్థము కనపడని అక్షర

జాలంగా ఉన్న ప్రాకృతాలతో పండితులకే దుర్భేద్యంగా ఉండడం చూచి, ఓర్వలేక దానిని బంతి బంతి మాట మాట పట్టి చూస్తూ ప్రాకృతాన్ని సరిదిద్ది, సంస్కృతఛాయ కల్పించి, పాఠకసులభంగా ముద్రించి కృష్ణరాయల కీర్తి ధ్వజానికి ఇంకొక కింకిణిని కట్టాలని కంకణం కట్టుకొని ప్రయత్నిస్తున్నాడు.

దీనికిగాను కొంతకాలంగా ప్రాకృతభాషార్ణవంలో తలమును కలుగా మునిగి ఈదులాడుతున్నాడు. దీనిలో ఈ పుదూరుద్రావిడుల చిత్రమయిన కార్యదీక్ష కనపడుతున్నది. ఒక చిన్న ఉపాఖ్యానం—

మొదట చెప్పిన T. M. శేషగిరిశాస్త్రిగారికి వేదం వేంకటాచలం అయ్యరు కంటె మరినాలుగు భాషలువచ్చు. ఆయనను ఒక సింహళభాషాగ్రంథాన్ని అనువదించమని ప్రభుత్వము ఆదేశించినది. ఆనాటికి శేషగిరిశాస్త్రికి ఆభాషరాదు. రాదని చెప్పడం సిగ్గుచేటని శాస్త్రి మౌనంగా ఆపుస్తకాన్ని తీసుకొని అప్పటినుంచీ ఆభాషను అధ్యయనంచేసి (ఆర్యభాషలు ఎన్నో తెలిసిన ఆయనకెంత) ఆరు నెలలలో పుస్తకాన్ని అనువదించి గవర్నమెంటు రిమైండరు వచ్చే లోపలనే అధికారులకు అప్పగించారట!

అట్లనే కృష్ణరాయల "ఎలుగుగొడ్డు బిడ్డపెళ్లి" కిగాను ప్రాకృతాలు చదవి అర్హత సంపాదించుకొని వేంకటరామన్ ఆపనిలో ఉన్నాడు. విధి అనుకూలిస్తే "జాంబవతీపరిణయం" సరిదిద్దగలననీ, నాజీవితంలో నేను చేసే గొప్ప సాహిత్యకార్యక్రమం అదే కావచ్చుననీ అంటాడు వేంకటరామన్. ఉర్దూ పారశీకాలతో కూడ వేంకటరామన్‌కు కొంత పరిచయం ఉంది.

వేదంవారి కుటుంబాలు శేషగిరిశాస్త్రి కుటుంబంతో రెండు పాయలుగా కలిశాయి. కళాప్రపూర్ణుని కొమారునికి శేషగిరిశాస్త్రి కొమార్తెనీయగా వేంకటాచలయ్యరు కొమార్తెను శేషగిరిశాస్త్రి

గారి రెండవకుమారుని కిచ్చినారు. వేంకటరామన్ భార్య శేషగిరి శాస్త్రి మునిమనుమరాలు, సంయుక్త. ఆమె హిందీభాషలో M. A. నవీనుల పెక్కులు లేక ముత్యాల వంటి ముగ్గురు మగ బిడ్డలతో హిందూగృహిణిగా సంసారం సాగిస్తున్నది. పిల్లలు చిన్నవారు. పెద్ద కొడుకు విశ్వనాథన్ (పేరన్) ఇంటర్మీడియటు చదువుతున్నాడు.

ఇంజనుకు స్టీం ఎక్కి వేంకటరామన్ వ్రాతదారి పట్టినాడు కాబట్టి కొన్ని మంచిపుస్తకాలు రావచ్చు.

ఈసరిసమిత్రుడు నిర్మాణాత్మకమైన విమర్శకశక్తితో నూతన దృష్టిలో మన ప్రాచీనసాహిత్యాన్ని సంస్కృతిని చూచి, మనోరంజక మయిన సూచనలు చేస్తుంటాడు. ఇతని కలుపుగోలుతనమే భావిజీవితానికి దారిబత్తెం. ప్రారబ్ధవాది. భౌతికశక్తుల ప్రాబల్యంకూడా వ్యక్తిజీవితపథాన్ని నిర్ణయిస్తుందని అంటుంటాడు.

ఈ పరిచయాన్ని కట్టమంచివారి మంచిమాటలతో ప్రారంభించినా. ఆయన మాటలతోనే ముగిస్తా.

"వేదంవారు సాహిత్యరంగంలో ఎగిరి అందుకొనని ఎత్తుగాని, దూకి తాకని లోతుగాని లేదు."

(కళాప్రపూర్ణ వేంకటరాయశాస్త్రినిగురించి రెడ్డిప్రశంస).

వేంకటరాముని హరిహరనాథుడు దయజూచుగాక.

నెల్లూరు
5-6-80

మరుపూరు కోదండరామరెడ్డి

# మ్రొక్కులు - నెనరులు

ఇది నామొదటిపుస్తకము. భాగ్యవశమున ఆంధ్రప్రదేశ సాహిత్య అకాదమీ వారు 1977 వ సం॥లో నిర్వహించిన రచనలపోటీలో ఉత్తమముగ ఎన్నుకొనబడి ర్పు. 3500/- బహుమతిని పొందినది. ఈపోటీని నిర్వహించిన అకాదమీ కార్యవర్గమును, పోటీకి వచ్చిన రచనలను పరిశీలించి నాపై గుణపక్షపాతము చూపిన అజ్ఞాత పరిశీలకులను కృతజ్ఞతతో స్మరించుట నాప్రథమ కర్తవ్యము.

నావృత్తి ముప్పది యేండ్లుగ ఆంగ్లభాషాబోధనము. విద్యార్థిదశలో పాఠ్యభాగములు చూచినవితప్ప వేరు ఆంధ్రసాహిత్యపరిచయములేదు. సంస్కృతము చిన్ననాడు చదువుకొనలేదు. ఈబహుమతి లభించుట నాకు ముదావహమయ్యు విస్మయజనకమే.

ఈ బహుమతినిగురించి సహాధ్యాపకుడు శ్రీ వెన్నెలకంటి రామచంద్రరావు, M. A., సరసోక్తిగ అన్నమాట —

"మాతృభాష అఱవము; వృత్తి ఆంగ్లభాషాబోధనము; విమర్శవస్తువు సంస్కృతకావ్యము; వ్రాత తెలుగులో; దీనికి బహుమానము! ఆహా, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాదమీవారి నిష్పాక్షిక దృష్టి!"

అవును. వారు ఏమాత్రము ధర్మమును వదలి అనుగ్రహమును చూపియుండినను ఈబహుమతి నాదరిదాపులకుకూడ వచ్చియుండదని నావిశ్వాసము. వారి ధర్మదీక్ష నిరంతరము గుణగ్రహణదక్షముగనుండుగాక.

పోటీలో నెగ్గుట పూర్ణాంధులలో నేకాక్షిన్యాయమగునే కాని అనన్యసామాన్య ప్రజ్ఞకు తార్కాణము కాజాలదనుటయు సత్యము. నాపుస్తకములో లోపములనేకములు పాఠకులకు తోపకపోవు. అయినను ఈ పుస్తకము బహుమతినందుకొనుమేరకు సాహిత్యసోపానాధిరోహణము చేయుటయు నాసామర్థ్యముచేతమాత్రమేకాదు, ఎందరో విద్వద్వరేణ్యులు, పెద్దలు చిన్నలు, నాకు సహాయముచేసియున్నారు. వారిని స్మరించుటయే ఈ తొలిపలుకు పరమార్థము.

## నా సంస్కృతభాషాపరిచయమునకు కారకులు

జీవితములో నాలుగవదశాబ్దపు చరమభాగములో సంస్కృతాభ్యాసమున నాకు నిష్ఠ కుదిరినది. అంతవఱకును రెండుమూడుసారులు ప్రయత్నించుటయు శబ్దరూపములను ధాతురూపములను చూచి జడిసి వెనుతగ్గుటయు అయినది. సంస్కృతభాషపై పట్టు ఎట్లు చిక్కునా యను చింతలోనున్న నన్నుచూచి, కరుణించి, మాకాలేజీలోని సంస్కృతాధ్యాపకులు, తమిళాంధ్రములందును పండితులు, సరసులు శ్రీమాన్ వంగీపురం శ్రీనివాసరాఘవన్‌గారు ఒకనాడు ఇట్లనిరి —

"వాల్మీకిరామాయణంలో బాలకాండ తెచ్చుకో సంస్కృతం నీకు పట్టిస్తాను."

అట్లే బాలకాండను తెచ్చి, వారికిని నాకును విరామమున్న సమయములలో వారి 'శుశ్రూష' చేసితిని. వారు, సూటిగ అయిదవసర్గలో కథాప్రారంభమున

కోసలో నామ ముదితః స్ఫీతో జనపదో మహాన్
నివిష్టః సరయూతీరే ప్రభూతధనధాన్యవాన్.

అనుశ్లోకముతో మొదలుపెట్టి అందులోని ప్రతిశబ్దపు లింగవచనవిభక్త్యాది చర్చ చేయుచు, విభక్త్యంతములను కొండగుర్తులుగ నిరూపించుచు, క్రియాపదమును నిర్దేశించి, విశేషణములను విడమఱచి, సంధులను వ్యాఖ్యానించి, వాక్యాన్వయమును కుదుర్చుచు, పాఠము సాగించెడివారు. పదిసర్గలు ఇట్లు పట్టుగ చదువుటతోనే నాకు సంధులు బోధపడుటయు, శబ్దస్వరూపము కొంతయస్పష్టమయినను పరిచయమగుటయు, క్రియాపదమును గుర్తింపగలుగుటయు సంభవించినది. ఉత్సాహము హెచ్చినది. ఎబది సర్గలయినవి. తరువాత ఇరువురికిని కార్యభారమువలన చదువు ముగిసినది. కాని వారు వేసిన పునాది బలముచేత అకుంఠితోత్సాహముతో సొంతముగనే శ్రీ చదలువాడ సుందరరామశాస్త్రిగారి తాత్పర్యముల సహాయమున బాలకాండను పూర్తిచేసితిని. అట్లే అయోధ్యాకాండయు. విధినిర్ణయముకాబోలు రామాయణమును ఆరుకాండలను సొంతము పఠించితిని. అప్పటికి సొంతముగ సంస్కృతవ్యాఖ్యానములను కొంత యర్థము చేసికొనుశక్తి వచ్చినది.

తరువాత మరియొక గొప్ప అనుభవము కలిగినది. వి. ఆర్. హైస్కూలులో నావిద్యార్థిదశలో గురువులు, వి. ఆర్. కాలేజీలో తరువాత సహాధ్యాపకులు, సంస్కృతాంధ్రములందు మహాపండితులు, కవులు, అన్నిట ముఖ్యము — ప్రాచీనమార్గమున

విద్యాభ్యాసముచేసియు సాహిత్యవిషయమున ఇసుమంతయు 'చాదస్తము' లేనివారు — ప్రతివిషయమును సొంతముగనాలోచించి నిర్ణయించు ఆత్మవిశ్వాసమును సామర్థ్యమును కలవారు, కీ. శే. శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిలవారు అశ్వఘోషుని 'బుద్ధచరితము'నకు తెలుగుటీక వ్రాయసంకల్పించి నాసహాయమును కోరిరి.

వారు నాసహాయము కోరుట ఎవరికైనను కొంత విస్మయము కల్గింపకపోదు. కాని అందు ఒక సత్యముండినది. అశ్వఘోషుని 'బుద్ధచరితము'నకు సరియైన సంస్కృతవ్యాఖ్యానము లేదు. అదియును బౌద్ధము. దానినిగురించి ఆంగ్లమున విమర్శలు వ్యాఖ్యానములు కలవు. శాస్త్రిలవారికి కొంత ఆంగ్లభాషాజ్ఞానమున్నను ఒంటరిగ ఆంగ్లపండితుల భాషాశౌర్యమునెదుర్కొను సాహసము లేక, ఆంగ్లవిమర్శలను చూచి పనికివచ్చు సంగతులను చెప్పుమని నన్ను ఆదేశించిరి. నేనును క్రొత్త కావ్యమును చదువు అనువు కుదిరెనని సంతోషించి సాయంకాలములందు వారియొద్ద చేరగా, వారును మొదటిశ్లోకమునుండి వరుసగా సుమారు 1100 శ్లోకములను విడగొట్టి అన్వయమేర్పరచుచు, మధ్య నా చొప్పదంటుప్రశ్నలకు ఓపికతో సాదరముగ శాస్త్రచర్చతో సమాధానములు చెప్పుచు, కావ్యపఠనము నాచేతనే చేయించిరి.[1] వ్యాఖ్యానము లేని భిన్నసంప్రదాయపు కావ్యమును అంతగ ప్రత్యక్షరపరీక్ష చేసి చదువు భాగ్యము అందరకును కలుగదు. అదియొక యోగము.

సంస్కృతభాషాభ్యాసమునకు నాకు గురువులు అని చెప్పవలసిన వారు శ్రీ వంగీపురం శ్రీనివాసరాఘవన్, శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారలు. వారి ఋణము నాకెప్పటికిని తీరనిది.

శాభ్యాం శ్రీమద్భ్యాం
రాఘవ సుబ్రహ్మణ్యాభ్యాం
గురుభ్యాం
నమః

అప్పటినుండి సంస్కృతగ్రంథములను విధినిషేధములు లేక తోచినవానిని తోచినవరకు చదువుకొనుచుంటిని. సంస్కృతసాహిత్యము నాకు వినోదకర్మ (hobby).

---

1. వారు మూడుసర్గలకు మాత్రమే టీకను వ్రాతలోపెట్టిరి. తరువాత అస్వస్థతలోబడి కోలుకొనక దివంగతులైరి. ఆ వ్రాతప్రతి వారికుటుంబమువారియొద్ద కలదు.

## ఈగ్రంథరచనాప్రస్తావము

ఇట్లుండ క్రీ. శ. 1977, ఫిబ్రవరినెలలో, నాకు భ్రాతృవ్యులు, చారిత్రకమార్గ ణులు, సాహిత్యవిమర్శకులు, ఆంధ్రప్రదేశసాహిత్య అకాదమీవారు 1957 లో మొదటి సారిగా నిర్వహించిన గ్రంథరచనపోటీలో "నన్నెచోడుని కవిత్వము" అను గ్రంథ మునకు బహుమతిని పొందినవారు, బహువ్యాసకర్తలు, కళాప్రపూర్ణ వేదము వేంకట రాయశాస్త్రిగారి పౌత్రులు, తదేవనామధారులు, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి, ఎం. ఏ, గారు, సాహిత్య అకాదమీ సమావేశమునకుపోయి తిరిగి మద్రాసునకు పోవుచు నెల్లూరులో మాయింట దిగినపుడు ప్రసంగవశమున

"ఈయేడు పోటీకి బాణుని కాదంబరి" అనిరి.

అప్పటికి 'కాదంబరి'ని కాని మరియేయితర సంస్కృతగద్యకావ్యమునుగాని నేను చదువలేదు. కాని ఏదో ఉత్సాహము పూనినది. "నేను వ్రాసేదా" అంటిని "వ్రాయి" అనిరి. అది ఈపుస్తకమునకు బీజావాపము.

ఆమరునాడే, జగమెరిగిన జర్నలిస్టు, మా పెదతాతగారు కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారికి ప్రేమియని ఏకలవ్యశిష్యుడు, బహుగ్రంథస్రష్ట, బహుతరగ్రంథ ద్రష్ట, 1976 వ సంవత్సరము అకాదమీ రచనలపోటీలో వావిళ్లసంస్థ చరిత్రకు బహు మతిని శ్రీ బులుసు వేంకటరమణయ్యగారితో పంచుకొనినవారు, ఉపన్యాసమును ఏవిషయముపైనైనను ఒకేపరి రంజకముగను బోధకముగను చేయగల అపూర్వప్రజ్ఞ గలవారు, కవిత్రయభారతమును ఏడుమారులు లోతుగ చూచి ఆకావ్యముమీద సర్వాధి కారముగలవారు, నామీద అవ్యాజప్రీతిగలవారు, మాతాతగారు శ్రీ వేదము వేంకటా చలముగారి పరిశోధనలను, వ్యాసభారతవిమర్శను అప్పుడప్పుడు స్మరించు నేకైకాంధ్ర రచయిత, కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రి, కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగార్ల తరువాత అఖిలాంధ్ర ఖ్యాతిగల నెల్లూరు పౌరులు, ఇప్పుడు కళాప్రపూర్ణులు, శ్రీ మరు పూరు కోదండరామరెడ్డిగారు కనబడగా దీనిని ప్రస్తావించితిని. వారు తత్క్షణమే అకాదమీ ఆఫీసుకు వ్రాసి, పోటీప్రకటనపత్రమును తెప్పించి, తెచ్చి ఇచ్చి, 'ఇక కానీ' అనిరి. అది ఈపుస్తకమునకు అంకురార్పణము.

"నువ్వు సోమరివి. ఏమీ వ్రాయవు" అని బహుకాలముగ సుహృద్భావ ముతో నన్ను దెప్పుచున్నవారు, ఇప్పుడు కార్యశూరుడను కానున్నానని సంతోషించి నాకు మిక్కిలి ప్రోత్సాహమిచ్చిన, కళాప్రపూర్ణ శ్రీ మరుపూరు కోదండరామరెడ్డిగారికి వందనములు.

ఇక దోహదకారులు

విస్తారమయిన సాహిత్యపరిచయముగలవారు, చారిత్రకమార్గణులు, నాట్యశాస్త్ర రచయితలు, అనుక్రమణికా నిర్మాణనిపుణులు, బహువిషయ వ్యాసకర్తలు, సౌమ్యులు వృత్తిచే న్యాయవాదులు, శ్రీ నేలనూతల శ్రీకృష్ణమూర్తిగారు నారచనలో మిక్కిలి ఆసక్తిచూపి, కొన్ని ముఖ్యమయిన పుస్తకములను ఇచ్చి, కడవరకును ప్రోత్స హించుచు, కొన్నిపొరపాట్లను నివారించి, వ్రాతప్రతులను పోస్టులో పంపునప్పుడును దగ్గరనుండి నాకు ఎంతయో సహాయము చేసిరి వారి పరిచయమే సాహిత్యజిజ్ఞాసా జనకము. వారికి వందనములు.

నెల్లూరు పురములో ఏబది ఏండ్లకుపైగా ముఖ్యపౌరులు, వి. ఆర్. కాలేజిలో ఆంగ్లాధ్యాపకులుగ రిటైరు అయినవారు, నాకు ఆప్తవర్గములోనివారు, నాశ్రేయోభి లాషులు, ఈవిషయమున మద్విజయకాంక్షులు అయిన శ్రీ కాళహస్తి రామనాథము గారికి వందనములు.

జర్నలిస్టుగ మొదలుపెట్టి, చారిత్రకమార్గణుడుగ వికసించి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున C. P. బ్రౌను రిసర్చి ప్రాజెక్టును నిర్వహించి, నేడు వేమనకు అట్టి సేవయే చేయుచున్నవాడు, అక్షయ శక్తిసామర్థ్యములు, సత్యాన్వేషణాసక్తియు కలవాడును అయిన మిత్రులు శ్రీ బండి గోపాలరెడ్డి (బంగోరే) కొన్ని దుర్లభములయిన పుస్తకములను సంపాదించి ఇచ్చి కొన్ని విషయములను సరిజూచి చెప్పి నాకు అమూల్యమయిన సహాయమొనరించినాడు. అతనియెడ కృతజ్ఞుడను.

ఈరచన ప్రారంభమునుండి, ఏచిన్నసందేహము వచ్చినను అడుగగా దయతో ఆలోచించి, చర్చజేసి, తొలగించి, కొన్నియెడల మంచి సూచనలు చేయుచు, అచ్చుకు పోవుముందు, కొన్ని ముఖ్యభాగములను చదివించుకొని విని, కొన్ని ప్రమాదములను తప్పించి నాకు ఘనసహాయముచేసినవారు, పాండిత్యపూర్ణులయ్యు నిగర్వులు, ఇప్పుడు నెల్లూరు వేదసంస్కృతకళాశాల ప్రిన్సిపాలు, శ్రీమాన్ కె. ఎస్. రామానుజాచార్యులు నాకృతజ్ఞతకు అవశ్యము పాత్రులు. 1977 వ సంవత్సరము వేదసంస్కృతకళాశాల నాకు నిత్యయాత్రా తీర్థమయినది.

అచ్చటనే అప్పుడప్పుడు ఈపుస్తకవిషయమును సాదరముగ నాతో మాట లాడుచు, సూచనలు చేయుచు, తమ సౌమ్యతా సౌముఖ్యములచేత నన్నాకర్షించిన దర్పమొకింతయులేని పండిన పండితులు శ్రీమాన్ చిలకపాటి శ్రీనివాసాచార్యులకు వందనములు.

అట్లే, పూర్వము అచ్చట ఆంధ్రాధ్యాపకులై ఇప్పుడు ఇందుకూరుపేట గ్రామములోనుండు సంస్కృతపండితులు, తెలుగుకవులు శ్రీ చివుకుల వేంకటరమణయ్యగారు నాకు ఎన్నో సంగతులను చెప్పియున్నారు. ఒక బాణప్రశస్తి పద్యమును వారు నాకు చెప్పిరి. వారికి వందనములు.

పూర్వపరిచయములేకున్నను, ఇటీవల వారి 'ఆంధ్రరాజతరంగిణి' అచ్చయిన సందర్భములో నేను పరిచయభాగ్యమును పొందిన, శ్రీ స్వయంపాకుల వేంకటరమణశర్మగారు ఉభయకావ్యప్రౌఢి కలవారు, సంస్కృతవ్యాకరణము, అందును ధాతుపాఠము, ఇప్పటికిని ఉపస్థితముగ నున్నవారు, ఈ రచనలో నాకు సహాయము చేసిరి. వారికి వందనములు.

గొప్పపండితులు మామండలమున సాటిలేని పౌరాణికులు, మిక్కిలి సౌమ్యులు, శ్రీమాన్ నేలటూరు కృష్ణమాచార్యులుగారు నాయందు దయయుంచి ఆదరముతో అడిగినవి చెప్పెడివారు. వారికి వందనములు.

ఆంధ్రసాహిత్యపు లోతుపాతులు తెలిసి, తెలుగులో ఒకనిఘంటువును, ఒక లక్షణగ్రంథమును నిర్మింపదలచి గతత్రింశతివర్షములుగ నిర్విరామకృషిచేయుచున్న చిరమిత్రులు ఆంగ్లమున ఎం. ఏ., పట్టముగొన్నవారు, వి. ఆర్. కాలేజి ఆంధ్రశాఖలో భీష్మునివలె పిన్నలకు గురుస్థానముననున్నవారు, ఈకార్యమున నాకు ప్రోత్సాహకులును అయిన శ్రీ జి. సి. వి రమణరావుగారికి వందనములు.

వేదసంస్కృతపాఠశాలలో అధ్యాపకుడు శ్రీ బండి విశ్వనాథము, ఎం. ఏ., నాకు మొదటినుండి సాహాయ్యకుడై, ఒక్కొక్క అధ్యాయమును చదివి, కొన్ని తప్పులను నాయెరుకకు తెచ్చి, ఒకటి రెండధ్యాయములను మొత్తము నాచేత త్రిప్పి వ్రాయించి చాలమేలు చేసియున్నాడు. అకాదమీకి పంపు ప్రతులను సిద్ధము చేయించుట అతని మహోపకారము. అందునకు కృతజ్ఞుడను.

వి. ఆర్. కాలేజిలో ఆంధ్రాధ్యాపకుడు, పూర్వాశ్రమమున శిష్యుడు, ఇప్పుడు సహాధ్యాపకుడు, సాహిత్యపులోతు తెలిసియు, నిగర్వి, మితభాషి, అభిప్రాయములలో మితవాది, శ్రీ ఎం. వేణుగోపాలయ్య, ఎం. ఏ., నాపుస్తకమును రెండుపర్యాయములు ఓపికతోచదివి నిష్పాక్షికవిమర్శచేయుచు, వలయునెడల నా తెలుగువంకరలను సరిచేయుచు, గొప్పమేలు చేసినందులకు అతనియెడ కృతజ్ఞుడను.

మఱియు

శ్రీ ఎం. రామయ్య, ఎం. ఏ., (ఆంగ్లాధ్యాపకుడు, వి. ఆర్. కాలేజి), శ్రీ వేంకట స్వామి, ఎం. ఏ., (ఆంధ్రాధ్యాపకుడు, వి. ఆర్. కాలేజి), శ్రీ వేంకటరామయ్య (ఆంధ్రాధ్యాపకుడు, వి. ఎస్. కాలేజి), శ్రీ కె. వి. రమణయ్య (ఆంధ్రశాఖ, వి. ఎస్. పాఠశాల) ఇంకను ఎందరో నా శ్రేయోభిలాషులు, ఈ రచనాప్రయత్నమును ప్రోత్స హించినవారు కలరు. వారికి అందరకును ఇది కృతజ్ఞతానివేదనము.

తుదిలో చెప్పినను, నా పుస్తకమునకు కేవలము నిమిత్తకారణమైనను, నిమిత్తములేక కార్యమునకు మూలచ్ఛేదమగును కావున ఉత్తమకారణమయిన, శుద్ధ ప్రతినంతయు వ్రాసి పోటీకి నా పుస్తకము పోవునట్లు చేసిన సాహిత్యశిరోమణి శ్రీ వావిలాల అరుణాచలమునకు మఱియు మరియు కృతజ్ఞుడను.

చెప్పమరచినవారికి క్షమాపణలు.

ఈ పుస్తకములో వాడిన తెలుగువైనమును గురించి ఒకింత —

భాష సరళగ్రాంథికము. అరసున్నలు ప్రాయికముగ లేవు. విసంధి ఎక్కువగ పాటింపబడినది. శకటరేఫము ద్విత్వమునమాత్రము ప్రయుక్తము. సంస్కృతకావ్య మునుగురించి కావున సంస్కృతపదబాహుళ్యము అనివార్యమయినది.

సరళగ్రాంథికాంధ్రభాష ఆమాండలికాంధ్రమై సర్వాంధ్రమండలములకును సమానమై, ఒకరికి శ్రవణపేయమును మరియొకరికి కర్ణకఠోరమును కాకయుండును కాన, చిత్తూరినుండి శ్రీకాకుళమువరకు, గుంటూరినుండి గోల్కొండవరకును జనాదర ణము పొందునని ఆశ.

ఇక పాఠకునికిని పుస్తకమునకును మధ్య అడ్డు తగులక విరమింతును.

నెల్లూరు,
18-6-1980.

వేదము వేంకటరామన్.

శ్రీః

కావ్యం య ద్బహుమన్యతే బహుజనై
రాబాలవృద్ధై స్తథా
భిన్నాచారసుసంప్రదాయ కలితై ర్
భిన్నేషు కాలేష్వపి ।
వక్తుం తన్మహదిత్యశేషగుణవత్
సాహిత్యరత్నం శుభం
యుక్తం; తత్కవిరేతి నూనమమలాం
కీర్తిం దిగన్త స్థిరామ్ ॥



# బాణుని కాదంబరి

# దాని వైశిష్ట్యము



## 1. బాణప్రశస్తి

1. 1 రసాత్మకము, సుశబ్దశోభితము, రమణీయార్థప్రతిపాదకమును అగు కావ్యము బహుకాలముల, బహువిధజనులకు ఆనందము కలిగించును. అట్టికావ్యము లోకమున నిలిచి, ఉత్తమకావ్యముగా పరిగణింపబడి కవికి శాశ్వతకీర్తినిచ్చును. సంస్కృత సాహిత్యమున రఘువంశాదిమహాకావ్యకర్త కాళిదాసునకు, కాదంబరీకర్త బాణునకును దేశకాలాతీతమయిన కీర్తియున్నది. వారికావ్యముల యుత్కృష్టతకు వేరునిదర్శనములు అనావశ్యకము.

మనోహరములగు ఉపమలకు నిధియై, పదప్రయోగమున, ఔచిత్యపోషణమున అనన్యసామాన్యుడై, రసభావచిత్రణమున అసమానప్రతిభావంతుడై, "కవికుల గురువు" అను ప్రశంసను పొందిన కాళిదాసునికి నాటక - పద్యకావ్య - సాహిత్యము లందుగల మహోన్నతస్థానము బాణునికి గద్యసాహిత్యమున కలదు. ఇతరకవుల ప్రశంసలు కాళిదాసునకు తరువాత ఒక్క బాణునికే మిక్కుటముగ లభించినవి. పద్యగద్యకవులు బాణోత్కర్షచేసినవారు అనేకులు కలరు. వారియభిప్రాయములు దిక్ప్రదర్శనముగ క్రింద పొందుపరుపబడినవి.

### 1. 2. 1. భూషణభట్టు (క్రీ. శ. 7-వ శతాబ్దము)

బాణుని ఆకస్మికమరణమువలన అసంపూర్ణముగ నిలిచిపోయిన 'కాదంబరి' ని పూరించిన బాణునిపుత్రుడు భూషణుడు (లేక పుళిందుడు, పుళింధ్రుడు) కాదంబ ర్యుత్తరభాగ ప్రారంభమున పితృస్తుతి చేయుచున్నాడు.

(క) 'ఎవనిని (కాదంబరీకావ్యాలాపవ్యాజమున) ఇంటింట లోకులు స్తుతించు చున్నారో, నేనుచేసిన పుణ్యమువలన ఎవనినుండి నాకు జన్మలాభముకలిగినదో, ఎవనిచేత అనన్యశక్యమయిన ఈ (కాదంబరీ) కథ కల్పింపబడినదో, ఆ వాగీశ్వరుడైన తండ్రికి నమస్కరించుచున్నాను.'

ఇచట అసంపూర్ణకాదంబరికే, అప్పటికే కలిగిన ప్రసిద్ధియు, కుమారునివలన తండ్రి 'వాగీశ్వరుడు' అను బిరుదము పొందుటయును గుర్తింపదగును.

(గ) 'నాతండ్రి చనిపోయి ఆయనపలుకులు నిలిచిపోగా ఏకథాప్రబంధము (మధ్యలో) ఆగిపోయినదో దానిని, తదసమాప్తివలన సహృదయులదుఃఖమును చూచి (వారి పరితోషమునకై పూర్తిచేయ), నేను ప్రారంభించితిని. (అంతేకాని) నాకవిత్వ దర్పమువలన కాదు.'[2]

(చ) 'అమృతప్రవాహమే ముఖ్యాంశముగాగల చంద్రుని కిరణసంపర్కము వలన చంద్రకాంతశిల రసార్ద్రమయినట్లు, నాతండ్రి రచించిన (అమృతప్రవాహతుల్య

---

1. ఆర్యం యమర్చతి గృహేగృహఏవ లోకః
పుణ్యైః కృతస్య యతఏవ మమాత్మలాభః।
సృష్టైవ యేన చ కథేయ మనన్యశక్యా
వాగీశ్వరం పితరమేవ తమానతోఽస్మి॥

(ఉత్తర కాదంబరి - 3)

ఇచ్చట 'అనన్యశక్యా', 'సృష్టా' అని కాదంబరీకథను చెప్పుటచేత అది అనుకరణముకాదు అని సూచన. ఇది కాదంబరి బృహత్కథామూలకము కాదు అనువాదమునకు ఒక ఉపస్కారము. చూ. అధ్యాయము - 10

2. యాతే దివం పితరి తద్వచసైవ సార్ధం
విచ్ఛేదమాప భువి యస్తు కథాప్రబంధః।
దుఃఖం సతాం తదసమాప్తికృతం విలోక్య
ప్రారబ్ధఏవ స మయా న కవిత్వదర్పాత్॥

(అంటే - 4)

మగు) గద్యమునకు ఈడగు ఏయక్షరములు నావలన వెలువడినవో అవి నాతండ్రి ప్రభావమే.'[1]

(జ) 'లోకములో గొప్పవియగు ఇతరనదులు గంగతో కలిసిపోయి సముద్రమును చేరునట్లు (సాహిత్య) సముద్రగామినియగు నాతండ్రి వచనప్రవాహములో కథానుసంధానముకొరకు నావాక్స్రవంతియు కలుపబడినది.'[2]

అట్లు తనరచనయు సాహిత్యమున నిలుచునుగాక అని ఆశయము. భూషణుడు కృతార్థుడే.

అయినను, బాణునిగద్యముతో తనగద్యమును కలుపుట సాహసము కాదా? అనిన చెప్పుచున్నాడు —

(ట) 'కాదంబరీకావ్యరసము (కాదంబరి అనుకల్లు) కడుపునిండుగ త్రాగి జను లందరును మత్తెక్కి ఏదియు కొంచెమయినను తెలిసికొనలేకయున్నారు. కావున ఆ కాదంబరీశేషమును నా రసహీనపుమాటలతో అనుసంధానముచేయువాడనై నేను భయపడుటలేదు.'[3]

---

1. గద్యే కృతేఽపి గురుణా తు తథాక్షరాణి
యన్నిర్గతాని పితురేవ స మేఽనుభావః।
ఏకల్పవామృత రసాస్పద చంద్రపాద-
సంపర్క ఏవ హి మృగాంకమణేర్ద్రవాయ॥
(ఉత్తర కాదంబరి - 5)

2. గంగాం ప్రవిశ్య భువి తన్మయతాముపేత్య
స్ఫీతాః సముద్రమితరా అపి యాంతి నద్యః।
ఆసింధుగామిని పితుర్వచనప్రవాహే
క్షిప్తా కథానుఘటనాయ మయాపి వాణీ॥ (అందే - 6)

3. కాదంబరీరసభరేణ సమస్త ఏవ
మత్తో న కించిదపి చేతయతే జనోఽయం।
భీతోఽస్మి యన్న రసవర్ణవివర్జితేన
తచ్ఛేష మాత్మవచసా ప్యనుసందధానః। (అందే - 7)

## బాణుని కాదంబరి — దాని వైశిష్ట్యము

పూర్వభాగమున బాణుని కవిత్వమును ఆస్వాదించి సంతృప్తులయిన పాఠకులు ఉత్తరభాగములోని రసహీనతను, దోషములను గమనింపరని ఆశయము.

### 1. 2. 2. అభినందుడు (క్రీ. శ. 9-వ శతాబ్దము, పూర్వార్థము)

'శ్రీహర్షుడు గద్యకవియగు బాణునికి కవిత్వపారితోషికమును ఇచ్చెను.'[1]

పద్యకవులకు కవిత్వపారితోషికము లోకసామాన్యము గావున గద్యకవికిచ్చుట విశేషము - అని గ్రహింపవలెను. రాజాదరముపొందిన గద్యకవులలో బాణుడే ప్రథముడేమో !

### 1. 2. 3. రత్నాకరుడు (క్రీ. శ. 9-వ శతాబ్దము, పూర్వార్థము)

'మృదువును (?) సర్వతః ప్రౌఢమును అగు, ప్రవాహగౌరవాన్వితమగు, వాక్కుకలవారిలో గొప్పవాడు బాణుడు ఒకడు; రెండవవాడు రత్నాకరుడు ఈలోకమున అగ్నివలె మిక్కిలి ప్రకాశించుచున్నాడు.'[2]

మరియెవరును వీరిరువురికి సాటికారని భావము.

### 1. 2. 4. రాజశేఖరుడు (క్రీ. శ. 9-వ శతాబ్దము, ఉత్తరార్థము)

(క) 'హర్షచరితముతో మొదలిడి అద్భుతకాదంబరీకథావిశిష్టయై బాణునివాణి ఇచ్చవచ్చినట్లు అనార్యస్త్రీవలె లోకమంతయు తిరుగుచున్నది.

---

1. శ్రీహర్షో వితతార గద్యకవయే
   బాణాయ వాణీఫలమ్ ।
   (అభినందుని 'రామచరితమ్' 22 - 100)

2. తన్మందాభిప్రగల్భప్రసరగురుగిరా మగ్రణీః బాణ ఏకో ।
   [రాజన్] రత్నాకరశ్చ జ్వలనవదనసా జాజ్వలీతి ద్వితీయః ॥
   (రత్నాకరుని 'హరవిజయమ్' 50వ సర్గపై యధ్యాయమున 6వ పద్యపు 3, 4, పంక్తులు)

3. సహర్షచరితారబ్ధాద్భుత కాదంబరీకథా ।
   బాణస్య వాణ్యనార్యేవ స్వచ్ఛందా భ్రమతి క్షితౌ ॥
   (రాజశేఖరుని పేరిట 'సూక్తిముక్తావలీ' అను సంకలన గ్రంథమున)

## 1. బాణప్రశస్తి

బాణుని హర్షచరితమునకు కాదంబరికిని మిక్కిలి ప్రాచుర్యము కలిగినదని భావము. ఆనార్యస్త్రీతో బాణునివాణిని పోల్చుట నీచోపమకాక వ్యాజస్తుతి అని గ్రహింపవలెను.

(గ) భగవతి సరస్వతి ఎవనికి సిద్ధించునో వానికి భాసుడు, రామిలుడు, సోమిలుడు, వరరుచి, శ్రీసాహసాంకకవి, మేంతుడు, భారవి, కాళిదాసు, తరలుడు, స్కంధుడు, సుబంధువు, దండి, బాణుడు, దివాకరుడు, గణపతి, కాంతుడు, రత్నాకరుడు మొదలగు కవులందరును ఏమిలెక్క ?'[1]

ఇది రాజశేఖరుని స్వోత్కర్ష యైనను, ఆనాటికి గొప్పకవులని గణింపబడినవారి జాబితాలో బాణునికి, సుబంధువునకును స్థానమేర్పడినదని తెలియుచున్నది.

(చ) 'శబ్దము — అర్థము అనునవి సరిపాళ్లలో కలిసిన (రచనా)రీతిని పాంచాలీరీతి అందురు. అది శీలాభట్టారిక కవిత్వములోను, బాణుని కావ్యములలోను కానరాదగును.'[2]

1. 2. 5. త్రివిక్రముడు (లేక సింహాదిత్యుడు ; క్రీ. శ 10-వ శతాబ్దము, పూర్వార్ధము)

ధనువుంబోలె నిరంతర బాణ ద్వితీయమును (యుద్ధము) వినమ్రాకార ధరమును (ధారియు) గుణాఢ్యము నైనదానిచే (గుణాఢ్యుడు నైన వానిచే) ప్రజలు మిక్కిలి రంజింపబడిరి.[3]

---

1. భాసో రామిల సోమిలౌ వరరుచిః శ్రీసాహసాంకః కవిః
మేంఠో భారవి కాలిదాస తరలాః స్కంధః సుబంధుశ్చయః ।
దండీ బాణదివాకరౌ గణపతిః కాంతిశ్చ రత్నాకరః
సిద్ధా యస్య సరస్వతీ భగవతీ కే తస్య సర్వేఽపి తే ॥
(అతనిదే చాటువు. 'శార్ఙ్గధర పద్ధతిః' అను సంకలనమున )

( 2. శబ్దార్థయోః సమో గుంఫః పాంచాలీరీతి రిష్యతే ।
శీలాభట్టారికావాచి, బాణోక్తిషు చ సా యది ॥
(సరస్వతీ కంఠాభరణమున రాజశేఖరునిదిగా ఉదాహృతము )
శీలాభట్టారిక యను కవయిత్రి కృతులేవియు మనకు దక్కలేదు.

3. శశ్వ ద్బాణద్వితీయేన నమదాకారధారిణా ।
ధనుషేవ గుణాఢ్యేన నిశ్శేషో రంజితో జనః ॥
( త్రివిక్రముని 'నలచంపూః' లేక 'దమయంతీ కథా' 1 - 14)

బాణునికాదంబరియు, గుణాఢ్యుని బృహత్కథయు జనులను మిక్కిలి ఆనందింపజేసినవని భావము.

1. 2. 6. పద్మగుప్తుడు (లేక పరిమళకాళిదాసు ; క్రీ. శ. 10-వ శతాబ్దము, ఉత్తరార్ధము)

'శ్రీహర్షుడు అక్షరరమ్యతచేత మనస్సును హరించు కవులగు బాణమయూరులకు (తనసభలో) కూర్పుకలిగించినట్లు ఆ (సింధు) రాజు (వేటలో) రంగులయీకలు గల బాణమునకు రంగులయీకలుగల మయూరమునకు కూర్పు కలిగించెను.'[1]

బాణముతో నెమలిని కొట్టెనని భావము.

1. 2. 7. ధనపాలుడు (క్రీ. శ. 10-వ శతాబ్దము, ఉత్తరభాగము)

(క) 'బాణుడు ఒక్కడే (అసంపూర్ణకాదంబరితోనే) ప్రకాశించి కవులగర్వమును హరింపగా ఇక పుళింధ్రుడు (పుళిందుడు ? బాణపుత్రుడగు భూషణుడు) అందమందగా చెప్పవలెనా ?'[2]

---

(మిగులు) గుణాఢ్య శబ్దములోని శ్లేషమూలముగా ఈశ్లోకమునకు ధనుస్సు పరముగ అర్థముకలదు. ఇందలి శ్లేషలు — బాణ = 1. బాణకవి, 2. బాణము. నమదాకార = 1. (న - మద - ఆకార) గర్వములేని ఆకారముకల. 2. (నమత్ - ఆకార) వంగిన (విల్లుపరముగ). గుణాఢ్యేన = 1. బృహత్కథాకారునిచేత. 2. అల్లెత్రాడుతో కూడినదానిచేత ... ఇత్యాది.

1. స చిత్రవర్ణవిచ్ఛిత్తిహారిణోరవనీపతిః
శ్రీహర్ష ఇవ సంఘట్టం చక్రే బాణమయూరయోః ॥

(పద్మగుప్తుని 'నవసాహసాంక చరితమ్', 2 - 18)

ఇందలి శ్లేష — చిత్రవర్ణ = 1. రమ్యాక్షరముల, 2. రంగురంగుల. ఈపద్మగుప్తుడే భోజకాళిదాసు కథలలోని కాళిదాసు అని చెప్పదగును.

2. కేవలోఽపి స్ఫురన్ బాణః కరోతి విమదాన్ కవీన్ ।
కింపునః క్లృప్తసంధానపుళింధ్ర కృత సన్నిధిః ॥

(ధనపాలుని 'తిలకమంజరి' 1 - 26)

(గ) 'సముద్రుడు కాదంబరీతుల్యమైన (సురాతుల్యమైన) ఆనందమునిచ్చు అమృతమును పుట్టించి దేవతలహృదయములలో మెప్పును పొందినట్లు బాణుడు 'కాదంబరి'కి సోదరివంటి 'హర్షచరితము' అను ఆఖ్యాయికను రచించి పండితుల హృదయములలో మెప్పును పొందెను.'[1]

## 1. 2. 8. సోడ్ఢలుడు (క్షత్రియకవి క్రీ. శ. 11-వ శతాబ్దము)

(క) 'ఈలోకములోని రాజులలో శ్రీహర్షుడు(సంపదలచేత ఆనందించువాడు) అనుపేరు వట్టిపేరుగామాత్రము ఉన్నది. కాని (శ్రీహర్షుడు అను) ఏరాజు తన ఆస్థానములో బాణుని సువర్ణరాసులతో పూజించెనో ఆరాజును గీర్హర్షుడు (విద్యచేత ఆనందించువాడు) అని సార్థకముగా చెప్పవచ్చును.'[2]

---

(మిగులు) ఇందు బాణముపరముగా శ్లేష కలదు—బాణః=1. బాణుడు. 2. బాణము. కవీన్ = 1. కవులను. 2. నీటిపక్షులను. పులింధ్ర = 1. బాణపుత్రుడు. 2. కిరాతుడు. క్లృప్తసంధాన = 1. కల్పిత-అనుసంధాన, అనగా ఉత్తర భాగమును రచించిన. 2. అల్లెత్రాడు బిగించిన వింటితో.

ఈ శ్లోకము నుండియే బాణపుత్రునకు పులింధ్రుడు (లేక పాఠాంతరమున 'పులిందుడు') అను పేరున్నట్లు తెలియుచున్నది.

1. కాదంబరీసహోదర్యా సుధయా వైబుధే హృది।
హర్షాఖ్యాయికయా ఖ్యాతిం బాణోఽబ్ధిరివ లబ్ధవాన్ ॥

('తిలకమంజరీ' 1-27)

ఇందలి శ్లేష — కాదంబరీ = 1. సుర, 2. బాణకావ్యము. వైబుధే హృది = 1. అమరుల హృదయములందు, 2. పండితుల హృదయములందు. హర్షాఖ్యాయికయా = 1. ఆనందము ప్రకటించుటదానిచేత, 2 హర్షచరితము అను బాణుని ఆఖ్యాయికవలన.

2. శ్రీహర్ష ఇత్యవనివర్తిషు పార్థివేషు నామ్నైవ కేవలమజాయత వస్తుతస్తు।
గీర్హర్ష ఏష నిజసంసది యేన రాజ్ఞా సంపూజితః కనకకోటిశతేన బాణః ॥

(సోడ్ఢలుని 'ఉదయసుందరీకథా', 1-12)

(గ) "బాణుని 'హర్షచరితము' లోని కవితాశక్తితీక్ష్ణతనుచూచి ఈలోకములో ఎవరు కవితాశక్తి అను అస్త్రమదమును వీడకుందురు? కాళిదాసువాక్కు అను రసము (త్రాగి) తనిసిన ఏకవికి బుద్ధిమాంద్యముపోయి తీక్ష్ణత కలుగదు."[1]

కవులందరును బాణప్రతిభాహతులు. కాళిదాసప్రతిభాప్రేరితులును అగుదురని భావము.

(చ) 'శబ్దశాసకుడగు అభినందుని భజించెదను; అర్థపాలకుడగు వాక్పతిరాజును పొగడెదను; రసాధికారియగు కాళిదాసును స్తుతించెదను; శబ్దార్థరస సర్వేశ్వరుడగు బాణునికి నమస్కరించెదను.'[2]

## 1. 2. 9. గోవర్ధనుడు (క్రీ. శ. 11-వ శతాబ్దము)

(క) 'పూర్వము శిఖండిని (అను ద్రుపదపుత్రిక) శిఖండి అని (పురుషుడుగా) మారినట్లు అధికవాఙ్నైపుణ్యము పొందుటకై వాణియే (= బాణియే, సరస్వతియే) బాణుడుగ అయ్యెనని అనుకొనుచున్నాను.'[3]

శ్లేషలో వ-బ-లకు భేదము లేదు కావున వాణీ అను శబ్దమే 'బాణ' అని పుంలింగరూపమును పొందెనని చమత్కారము.

---

1. బాణస్య హర్షచరితే నిశితా ముదీక్ష్య
   శక్తిం న కేఽత్ర కవితాస్త్రమదం త్యజంతి।
   మాంద్యం న కస్య చ కవే రిహ కాళిదాస-
   వాచాం రసేన రసితస్య భవత్యఘృష్యమ్॥
   (ఉదయసుందరీకథా 1-17)

2. వాగీశ్వరం హంత భజేఽభినందం,
   అర్థేశ్వరం వాక్పతిరాజ మీడే।
   రసేశ్వరం స్తౌమి చ కాళిదాసం
   బాణంతు సర్వేశ్వర మానతోఽస్మి॥ (అందే 8-5)

3. జాతా శిఖండినీ ప్రాగ్యథా శిఖండీ తథావగచ్ఛామి।
   ప్రాగల్భ్యమధికమాప్తుం వాణీ బాణో బభూవేతి॥
   (గోవర్ధనుని 'ఆర్యాసప్తశతి' - 39)

(గ) 'పూర్వకవులగు గుణాఢ్యుడు, భవభూతి, బాణుడు, కాళిదాసు మొదలగు వారిచేత బహువిధఛందస్సులలో (బాణునిచే గద్యములో) నడుపబడిన సరస్వతిని (ఆర్యావృత్తములతో) పూజించెడు నాయందు దోషమేమి? పండితులు పరిశీలింతురు గాక.'[1]

బాణుని నలుగురు అతిప్రసిద్ధకవులలో ఒకనిగ చేయుట గుర్తింపదగును.

1. 2. 10. దుర్గసింహుడు (కన్నడకవి. క్రీ. శ. 11-వ శతాబ్దము)

"కవిరాజశిరశ్శేఖరుడు, అవనీశ్వరుడు, చక్రవర్తి (అయిన) హర్షనరేంద్ర ప్రవరుడు ఈయగా వశ్యవాణి అయిన బాణుడు 'కవిచక్రవర్తి' అను బిరుదును పొందెను."[2]

ఈ బిరుదప్రదానమును మరియెవరును చెప్పలేదు.

1. 2 11. మంఖకుడు (లేక మంఖుడు, మంఖుకుడు. క్రీ. శ. 12-వ శతాబ్దము)

తన 'శ్రీకంఠచరితమ్' అను కావ్యములో మూడు పద్యములలో బాణుని మిక్కిలి పొగడియున్నాడు.

(క) ఒకచోట,[3] సోదరుడైన లంకకుని (లేక లంకణుని, అలంకారుని) కావ్యమును ప్రశంసచేయుచు దానిని "బాణోపమమైన ప్రబంధము" అనియు,

---

1. పూర్వైర్విభిన్నవృత్తాం। గుణాఢ్య భవభూతి బాణ రఘుకారైః।
వాగ్దేవీం భజతో మమ। సంతః పశ్యంతు కో దోషః॥
(ఆర్యాసప్తశతి 31)

2. కవిరాజశిరశ్శేఖర। నవనీశ్వరచక్రవర్తి హర్షనరేంద్ర
ప్రవరం కుడె పడెదం వ। శ్యవాణి కవిచక్రవర్తి వెసరం బాణం.
(దుర్గసింహుని 'కర్ణాటకపంచతంత్రం' పీఠికాప్రకరణం - 16)

దీనిని దయతో ఎత్తివ్రాసి, తాత్పర్యముతో నాకు పంపిన డా॥ R. V. సుందరం గారికి కృతజ్ఞుడను. (వే. వేం. రా.)

3. బాణోపమః ప్రబంధో। లంకక, తవ పత్రలబ్ధదూరగతిః।
విధ్యతి కస్య న హృదయం। వివిధసముజ్జ్వాలవేశేన॥
(మంఖకుని 'శ్రీకంఠచరితమ్', 25)

(గ) మరియొకచోట,[1] "మేంఠుడు, భారవి, సుబంధువు, బాణుడు" అను నలుగురిని శిష్టకవులనియు వారు చనిపోగా కవిజిహ్వాగ్రనర్తకియగు సరస్వతి దుఃఖముతో ఆటమానిన దనియు,

(చ) మరియొకచోట,[2] "నా అంతఃకరణహరిణము (మూడవ కాండలో) వాల్మీకిచేతను, తరువాత బాణునిచేతను కొట్టబడినను చాపలముచేత కవిత్వము మానకుండగా ఓ అలంకార, నీ (కవిత్వములోని) ప్రతిపదమునందలి ధ్వనిలేశములచేత ఇప్పుడు శమించినది" అనియు,

ఉత్కర్ష చేసియున్నాడు.

## 1. 2. 12. జయదేవుడు (క్రీ. శ. 12-వ శతాబ్దము ?)

'కవితాకామినికి చోరకవి శిరోజాలము, మయూరుడు చెవిపోగు, భాసుడు చిరునవ్వు, కవికులగురువైన కాళిదాసు శృంగారచేష్ట, హర్షుడు ఆనందము, బాణుడన్ననో ఆమెహృదయమునందే నివాసముకల పంచబాణుడు — (ఇట్లుండ) ఆమె ఏకవికి చెందదో చెప్పుము, కుతూహలముగ ఉన్నది.'[3]

---

1. మేంఠే స్వర్ద్విరదాధిరోహిణి, వశంయాతే సుబంధౌ విధేః
శాంతే హన్త చ భారవౌ, విఘటితే బాణే, విషాదస్పృశః ।
వాగ్దేవ్యా విరమంతు మంతువిధురా ద్రాగ్ దృష్టయ శ్చేష్టతే
శిష్టః కశ్చన స ప్రసాదయతి తాం యద్వాణిసద్వాణినీ ॥
(మంఖకుని శ్రీకంఠచరితమ్, 46)

ఇందు 'వాణినీ' అను పదమునకు 'నర్తకీ' అని అర్థము. కాని "యద్వాణిసద్వాణినీ" అను సమాసము దుస్సాధముగ ఉన్నది.

2. త్రిభిః కాండైరాద్యః కవిరమునువిధ్యత్, తదను చ
తతో బాణేనాయం, తిదపి విదధే చాపలకలామ్ ।
అలంకార, త్వశ్చైః ప్రతిపదనిబద్ధధ్వనిలవైః
అథేదానీమంతఃకరణహరిణః శామ్యతి(?)మమ ॥ (అందే, 60)

3. యస్యాశ్చోరశ్చికురనికరః, కర్ణపూరో మయూరో,
భాసోహాసః, కవికులగురుః కాళిదాసో విలాసః ।
హర్షో హర్షో, హృదయవసతిః పంచబాణస్తు బాణః,
కేషాం నైషా కథయ కవితాకామినీ కౌతుకాయ ॥
(జయదేవుని 'ప్రసన్నరాఘవమ్ (నాటకము)' 1 - 22)

బాణుడు కవితాకామినీహృదయాంతర్వర్తియు, ఇతరకవులు ఆమెకు బాహ్యభూషణచేష్టాదులును అగుట గుర్తింపదగును.

1. 2. 13. కవిరాజు (క్రీ. శ. 12-వ శతాబ్దము, ఉత్తరార్ధము)

'సుబంధువు, బాణభట్టు, కవిరాజు (తానే) — ఈ ముగ్గురే వక్రోక్తిమార్గనిపుణులు. నాలుగవవాడు కానడే?'[1]

1. 2. 14. సోమేశ్వరదేవుడు (లేక సోమేశ్వరదత్తుడు. క్రీ. శ. 12-వ శతాబ్దము, ఉత్తరార్ధము)

'కాదంబరిని విని కవులు నోరుమూసికొనిరి. అది యుక్తమే. బాణధ్వనిలో అధ్యయనము పనికిరాదు అను స్మృతివాక్యము అందువలననే కదా?'[2]

1. 2. 15. ధర్మదాససూరి (క్రీ. శ. 13-వ శతాబ్దము, పూర్వార్ధము)

'రుచిర - స్వర - వర్ణ - పదయు, రసభావవతియును అయినది లోకులమనసు లను హరించును' (అని ఒకరనగా) 'అది ఏది? తరుణియా?' (అని మరియొక

1. సుబంధుర్ బాణభట్టశ్చ కవిరాజఇతి త్రయః ।
వక్రోక్తిమార్గనిపుణా శ్చతుర్థో విద్యతే న వా ॥
(కవిరాజు 'రాఘవపాండవీయమ్', 1 - 41)

2. యుక్తం కాదంబరీం శ్రుత్వా కవయో మౌనమాశ్రితాః ।
బాణధ్వనావనధ్యాయో భవతీతి స్మృతిర్యథా ॥
(సోమేశ్వరుని "కీర్తికౌముదీ" 1 - 15)

'అనధ్యాయము' అనగా వేదపాఠము వర్జింపకుండుట. గురుకులములందు కొన్ని సందర్భములలో పాఠము మానుదురు. ఇచ్చట "కుక్కుర - సృగాల - రాసభ - బాణ - రోదన - వేణు - వీణా - మృదంగ - శకట - శబ్దశ్రవణే అనధ్యాయః" అను స్మృతివాక్యము అనుసంధేయము. 'బాణధ్వని' మీద శ్లేష — 1. బాణకావ్యమైన కాదంబరీశ్రవణము, 2. వేటలో, యుద్ధములో బాణములు వేయునపుడు అల్లెత్రాటి ధ్వని.

రడుగగా) 'కాదు, కాదు. మధురశీలుడగు బాణునివాణి' (కవిత్వము) అని చమత్కారపు సమాధానము.[1]

1. 2. 16 కేతన (తెలుగుకవి. క్రీ. శ. 13-వ శతాబ్దము)

"అగునన గొమ్మయ తిక్కఁడు
జగతి నపూర్వార్థశబ్ద చారుకవితమై ।
నెగడిన 'బాణోచ్ఛిష్టం
జగత్త్రయ'మ్మనిన పలుకు (?) సఫలంబయ్యెన్" ॥[2]

ఇందువలన కేతననాటికి బాణునికీర్తి ఆంధ్రదేశమున బాగుగ వ్యాపించెననియు, 'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' అను సుప్రసిద్ధవాక్యమునకు 'జగత్త్రయం' అను పాఠాంతరము కలదనియు తెలియుచున్నది.

ఈపద్యపు భావముమాత్రము కేతనకే ఎరుక.

1. 2. 17. గంగాదేవి (క్రీ. శ. 14-వ శతాబ్దము)

'సరస్వతీదేవి తనచేతితో మీటిన వీణాధ్వనులనుకూడ మరపించు భట్టబాణుని వాక్కు (మాధుర్యము)ను ఇతరులు ఎట్లు ఊహింపగలరు?'[3]

---

1. రుచిరస్వరవర్ణపదా రసభావవతీ జగన్మనో హరతి ।
'తత్ కిం, తరుణీ?' — 'నహి, నహి, వాణీ బాణస్య మధురశీలస్య ॥'
(ధర్మదాససూరి, 'విదగ్ధముఖమండనమ్', 4-27)

ఇచ్చట శ్లేష — స్వర = 1. గొంతు, 2. అచ్చులు. వర్ణ = 1. దేహకాంతి, 2. అక్షరములు (హల్లులు?). రసభావవతీ = 1. రసికయు, భావుకయు, 2. రసములు, భావములు కలది — అని తరుణీపర్యాయముగను, కావ్యపర్యాయముగను శ్లిష్టము.

2. ఈ పద్యపుభావము "తిక్కన తన అపూర్వకవిత్వముచేత బాణునిమించుట వలన 'బాణోచ్ఛిష్టం జగత్త్రయమ్' అను నానుడి నిరర్థకము అయినది" అను ధోరణిలో ఉండదగును. 'సఫలంబయ్యెన్' అనుటకు మారుగ 'నఫలంబయ్యెన్' అనియున్న 'పలుకును + అఫలంబయ్యెన్' అని సరిపోవునని మిత్రులు K. S. రామానుజాచార్యుల సూచన.

3. వాణీపాణిపరామృష్టవీణానిక్వాణహారిణీమ్ ।
భావయంతి కథం వాఽన్యే భట్టబాణస్య భారతీమ్ ॥
(గంగాదేవి, 'మధురావిజయమ్' 1-8)

1. 2. 18. వామనభట్టబాణుడు (ఆంధ్రుడు. క్రీ. శ. 15-వ శతాబ్దము)

(క) 'రసవంతములైన గద్యమార్గములందు (సంచరించుటకు) బాణుడుతప్ప అన్యులు గ్రుడ్డివారు అని లోకములో ఇతరకవులకు రూఢియైన అపకీర్తి కలదు. దానిని వత్సకులాన్వయు డయిన వామనభట్టబాణుడు తుడిచివేయుచున్నాడు.'[1]

(గ) ఒక్కొక్కకవిని (పక్షిని) గొట్టుటయందు బాణమువంటివాడు, కవిత్వము అను దట్టపుటడవిలో విహరించుటయందు మయూరమువంటివాడు, సహృదయులసమూహమునకు సుబంధువును, అగు వామనభట్టబాణకవి - రాజు ఉత్కర్షను పొందుచున్నాడు.[2]

1. బాణాదన్యే కవయః కాణాః ఖలు సరసగద్యసరణీషు ।
ఇతి జగతి రూఢమయశో వామనబాణోఽపమార్ష్టి వత్సకులః ॥
(వామనభట్టబాణుని 'వేమభూపాలచరితమ్' అను గద్యకావ్యములో పూర్వకవిప్రశంస)
ఇందు బాణప్రశంస నిమిత్తము, స్వోత్కర్ష గమ్యము.

2. ప్రతికవిభేదనబాణః కవితాతరుగహనవిహారణమయూరః ।
సహృదయలోకసుబంధుర్ జయతి శ్రీభట్టబాణకవిరాజః ॥
(అందే, అంతమున స్వోత్కర్ష పద్యములు)

ఇందు 'బాణ, మయూర, సుబంధు' అను శబ్దములు వామనుడు తనకు విశేషణములుగ చెప్పుకొనుటవలన సందర్భముచేత వాని వాచ్యార్థములగు "బాణము, నెమలి, మంచిబంధువు" అనునవి ప్రధానములై ఆపేర్లుగల పూర్వకవులు ధ్వనిమాత్రముగుచున్నారని గుర్తింపవలెను.

గమనిక: ఈ సందర్భమున కొందరు విమర్శకులు 'వేమభూపాలచరితము', (అతనిదే) 'రఘునాథచరితము'ల నుండి మరికొన్ని పద్యములను కాదంబరీ - బాణప్రశంసగ ఉద్ధరించి చూపియున్నారు: కాని వాస్తవముగ అవి వామనుని స్వోత్కర్ష అని గుర్తింపవలెను.

అవి — 1. జయతి కవిభట్టబాణో, దధతి కవింమన్యభావమన్యేఽపి ।
ప్రద్యోతయతి రవిర్ద్యాం, ఖద్యోతాఖ్యా న కిం ను కీటమణేః ॥

### 1. 2. 19. విశ్వేశ్వరుడు (క్రీ శ. 18–వ శతాబ్దము)

తన 'ఆర్యాసప్తశతీ' అను కావ్యమున, కాదంబరీబాణుని అంతకుపూర్వము ఏకవియుచేయనంత గొప్పస్తుతి చేసియున్నాడు. తన పూర్వకవిస్తుతిలో అయిదు పద్యములు బాణప్రతిభామహోత్కర్ష.

మొదటిపద్యమున[1] — 'బాణుడు శ్రీకృష్ణునివలె ప్రకాశించుచున్నాడు' అని,

రెండవపద్యమున[2] — 'భారతకాదంబరీకారులు సమానులు' అని వ్యాసునితో సమత్వము,

మూడవపద్యమున[3] — 'కవికులగురువు' అను కాళిదాసుని బిరుదును బాణునికిచెప్పి, బాణుని బాణాసురునితో సమానుడగు శివప్రియుడుగ,

---

(మిగులు)2. సుగుణాలంకృతిసుభగా, ఫణితిరియం భట్టబాణ, భవదీయా ।
అధరయతి విధుతనఖముఖముఖరిత వీణానినాదమాధుర్యమ్ ॥
( వేమభూపాలచరితాంతమున )

3. బాణం సత్కవిగీర్వాణ మనుబధ్నాతి కః కవిః ?
సింధుమంధః కిమన్వేతి ద్యుమణిం వా తమోమణిః ?
( రఘునాథచరితమ్ )

'జయతి కవిభట్టబాణో' అను పద్యమున 'రవి — కీటమణి' క్రమముగా 'వామనుడు — ఇతరకవి'. అట్లే 'బాణం సత్కవి గీర్వాణం' అను పద్యమున 'ద్యుమణి — తమోమణి'. వామనబాణుడు కాదంబరీబాణునిమీద స్పర్ధచూపెనే కాని మెప్పు చూపలేదు.

1. అర్థపతితనయబంధుః, నిరుక్తగోసంఖ్యహార్ష చరితశ్చ ।
అభినందజననహేతుః, బాణః ప్రతిభాతి కృష్ణ ఇవ ॥
( 'ఆర్యాసప్తశతీ' - 46 )

2. వర్ణితవిధానపార్థా, శుకవైశంపాయనార్చ్యపదా ।
అకలయామస్తుల్యౌ భారతకాదంబరీకారౌ ॥ ( అందే - 47 )

3. కవికులగురుర్ య ఏకో, బహుభాసురరాజపూర్వదేవ్యదితః ।
అథ చిత్రభానులాలితపురః, స సర్వజ్ఞవల్లభో బాణః ॥ ( అందే - 48 )

నాలుగవపద్యమున[1] — 'ఇతరకవిరాజులకు వాగ్దేవి అయిన సరస్వతి బాణ నామముతో (శ్లేషవలన) అభేదత్వముచేత విలక్షణముగ 'వాణి (బాణి)' అయిన దనియు,

ఐదవపద్యమున[2] — 'కాదంబరీకావ్యము పార్వతీదేవివలె కవులకు సేవింపదగినది' అనియును,

అద్భుతమయిన, సుబంధుబాణతుల్యమగు, శ్లేషవైభవముతో వర్ణించియున్నాడు.

## 1. 2. 20. హరిహరుడు (కాలముతెలియదు)

'దండి (దండధరునివంటి దశకుమారచరితకారుడు) అండనుండగా కవులకు వడకుపుట్టుచున్నది. ఇక వారిమనస్సులో బాణుడు (శరమువలె) చొరగానే (వారికి) మాట గొంతులోనే నిలిచిపోయినది.'[3]

ఇందు దండియు బాణుడును స్తుతింపబడియున్నారు. ఇరువురును గద్యకవు లనుట గుర్తింపదగినది. కాని దండికన్న బాణునికి అధికగౌరవము గమ్యము.

---

1. పరిశీలితైవ సరసం కవిరాజైర్ బహుభిరత్ర వాగ్దేవీ ।
బాణేన తు వైజాత్యాత్ కథయతి సామైవ వాణీతి ॥
(ఆర్యాసప్తశతీ - 49)

2. చంద్రాపీడైకరతా, స్ఫురతి హి మేనాహృదయజాతా ।
కాదంబరీ కవీనాముపజీవ్యా సర్వమంగళేవేయమ్ ॥

ఇందలి శ్లేషలు, చమత్కారములు స్థలాభావమునలన ఇచ్చట వివరించు ప్రయత్నముచేయలేదు. 'ఆర్యాసప్తశతి' ఇప్పుడు దొరకు కావ్యము. అందు కవి స్వీయ వ్యాఖ్యానము చూడదగును.

ఇందు మొదటిపద్యమున 'అభినందజననహేతుః' అనుటలో బాణుని కుమారునికి "అభినందుడు" అను పేరున్నట్లు వ్యాఖ్యానమున కలదు.

3. దండీత్యుపస్థితే సద్యః కవీనాం కంపతాం మనః ।
ప్రవిష్టేత్వంతరం బాణే కంఠే వాగేవ రుద్ధ్యతే ॥
('సూక్తిముక్తావళీ' అనుసంకలనమున)

1. 2. 21. త్రిలోచనుడు (కాలము తెలియదు)

'(గద్యరవి) బాణుడు అనుశరము గుండెలో దూరగానే కవులు అను జింకలు ఇంకను మెల్లగనయినను అడుగులు వేయుట కేవలము (కవితా) చాపల్యము చేతనే.'[1]

బాణునితరువాత కవులు వ్రాయుట నిరర్థకమని భావము.

1. 2. 22. చంద్రదేవుడు (కాలము తెలియదు)

'శ్లేషలో కొందరు, పదగుంఫనమున కొందరు, రసమున కొందరు, అలంకారములందు మంచియర్థమునను కొందరు, ఇతరులు కథావర్ణనమునను (కవులు అతిశయించువారుండగా) అహో, ధీరగంభీరకవిత అను వింధ్యాటవిలో సర్వత్ర (విరామంకముగా) అతినైపుణ్యముతో (లేక నాలుగుకాళ్లతో) సంచరించుచు, కవులు అను ఏనుగులకుంభస్థలములను పగులగొట్టు సింహము బాణుడు.'[2]

1. 2. 23. ఇంద్రసూరి (కాలము తెలియదు. ప్రాకృతకవి)

ఈ ప్రాకృతపద్యమును[3] శ్లేషచే మూడువిధములుగ అర్థము చేయవచ్చును.

(క) 'చంద్రాపీడ (కథా) శ్రవణమున బాణుని కాదంబరి (కథానాయిక) లావణ్యవదనసుభగయు, సువర్ణరదనోజ్జ్వలయును అయ్యెను.'

---

1. హృది లగ్నేన బాణేన, యన్మందోఽపి పదక్రమః ।
భవేత్ కవికురంగాణాం, చాపలం తత్ర కారణమ్ ॥
('శార్ఙ్గధరపద్ధతిః' అను సంకలనమున)

2. శ్లేషే కేచన, శబ్దగుంఫవిషయే కేచిద్, రసే చాపరే,
ఽలంకారే కతిచిత్, సదర్థవిషయే చాన్యే కథావర్ణనే ।
ఆః, సర్వత్రగభీరధీరకవితా వింధ్యాటవీచాతురీ -
సంచారీ కవికుంభికుంభభిదురో బాణస్తు పంచాననః ॥
(చాటువు. శ్రీ M. కృష్ణమాచారిగారి ఉద్ధారము)

3. లావణ్ణవయణసుహయా సువణ్ణరయణోజ్జలా అ బాణస్స ।
చందావీణస్సవణే జాయా కాదంబరీ జస్స ॥
(ప్రాకృతము. 'కువలయమాలా' అను కావ్యమునుండి R. సక్సేనాపండితుని ఉద్ధృతి.)

(గ) 'బాణుని కాదంబరి (కథానాయికమాటలు) చంద్రాపీడుని చెవికి లావణ్యవచనసుభగము, సువర్ణరచనోజ్జ్వలమును అయ్యెను.'

(చ) 'బాణుని కాదంబరి (కావ్యము) చంద్రాపీడ (కథా) శ్రవణమున లావణ్యవచనసుభగము, సువర్ణరచనోజ్జ్వలమును అయ్యెను.'

1. 2. 24. లక్ష్యరుచుడు (కాలము తెలియదు)

బాణుడు (అను శరము) గుండెలో గ్రుచ్చుకొనగా శ్వాసవాయు వెలుపలికి రాక ఆగినది; ఇక గొప్పపదబంధములతో వాక్కు (కావ్యము) సంగతి ఏల?[1]

1. 2. 25. అజ్ఞాతకర్తృకములగు చాటువులు

(క) 'వందల భారముల బంగారు, లేక మదపుటేనుగులగుంపులు బాణునకి శ్రీహర్షుడు సమర్పించినవి — అవి ఇప్పుడు ఏవి? (కాని) బాణుడు తన సూక్తి సమూహములచేత (హర్షచరితమున) స్థాపించిన శ్రీహర్షునికీర్తులమాత్రము కల్పాంత ప్రళయమునకూడ కొద్దియైనను మందగింపవు.'[2]

---

1. నిశ్వాసోఽపి న నిర్యాతి బాణే హృదయవర్తిని।
కింపునః వికటాటోపపదబంధా సరస్వతీ॥
('సూక్తావలీ' అను సంకలనమునుండి P. పీటర్సనుపండితుని ఉద్ధృతి.)

2. హేమ్నో భారశతాని వా మదముచాం వృందాని వా దంతినాం,
శ్రీహర్షేణ సమర్పితాని కవయే బాణాయ కుత్రాద్య తే।
యా బాణేన తు తస్య సూక్తినికరైరుట్టంకితాః కీర్తయః,
తాః కల్పప్రళయేఽపి యాంతి న మనాఙ్మన్యే పరిమ్లానతామ్॥

(మమ్మటుని కావ్యప్రకాశపు సారసముచ్చయము అను వ్యాఖ్యానమునుండి P. V. కాణేపండితుని ఉద్ధృతి.)

భారః = 2000 పలములు ఒక భారప్రమాణము. ఇప్పుడు 70 కిలో గ్రాములగును.

(గ) 'కాదంబరి అను మధురసము గ్రోలినవారికి ఆహారముకూడ రుచింపదు; కాదంబరీకావ్యరసము గ్రోలినవారికి ఆహారముకూడ రుచింపదు.'[1]

(చ) 'సుభాషితరత్నభాండాగారమ్' అను (నిర్ణయసాగర - వారి) ఆధునిక సంకలన గ్రంథములో ఒకపద్యములో[2] తమ కృతులచే లోకానందము కలిగించిన మహాకవులజాబితా ఉన్నది. అందు 15 వ పేరు బాణునిది.

(జ) బాణుడు అను సంస్కృతభాషాప్రియుడు విధివలన దీర్ఘనిద్రలో పరుండ జేయబడగా — కావ్యప్రపంచములోని గొప్ప మేరుపర్వతము ధ్వంసమయినది; కవుల యంగడిలోని గొప్ప రత్నరాశి నశించినది. పదముల ప్రవాహములచేత ఏర్పడిన సముద్రము ఎండిపోయినది; వాక్యములు అను మాణిక్యముల కోశము రూపుమాసినది; దివ్యోక్తుల నిధి నశించినది; అయ్యో! దివ్యవాణి హతమయినది.[3]

(ట) 'జగమంతయు బాణోచ్ఛిష్టము'[4] అను లోకోక్తి ప్రసిద్ధము. దీనికి మరియొక రూపము 'బాణోచ్ఛిష్టము జగత్త్రయము' అని కేతన పద్యమున[5] కలదు.

---

1. కాదంబరీరసజ్ఞానా మాహారోఽపి న రోచతే ।
   కాదంబరీరసజ్ఞానా మాహారోఽపి న రోచతే ॥

2. మాఘశ్చోరో మయూరో మురరిపురపరో భారవిః సారవిద్యః,
   శ్రీహర్షః కాళిదాసః కవిరథ భవభూత్యాహ్వయో భోజరాజః ।
   శ్రీదండీ డిండిమాఖ్యః శ్రుతిముకుట గురుర్భల్లటో భట్టబాణః,
   ఖ్యాతాశ్చాన్యే సుబంధ్వాదయ ఇహ కృతిభిర్విశ్వమాహ్లాదయంతి ॥

3. ధ్వస్తః కావ్యైకమేరుః; కవివిపణిమహారత్నరాశిర్వినష్టః;
   శుష్కః శబ్దౌఘసింధుః; ప్రళయముపగతో వాక్యమాణిక్యకోశః ।
   దివ్యోక్తీనాం నిధానం నిధనముపగతం; హా! హతా దివ్యవాణీ;
   బాణే గీర్వాణవాణీప్రణయిని విధినా శాయితే దీర్ఘనిద్రామ్ ॥

   [మరి యెక్కడను కనపడని ఈ చాటువును దయతో నాకు చెప్పినవారు శ్రీ చివుకుల వేంకటరమణయ్యగారు, రిటైర్డు ఆంధ్రాధ్యాపకులు, ఇందుకూరుపేట పోస్టు, నెల్లూరు తాలూకా.]

4. "బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్"

5. చూ. 1. 2. 16.

ఇంక జగత్తనగా రసాలంకారభరితమగు కావ్యజగత్తు. 'ఉచ్ఛిష్టము' అనగా 'వదలివేసినది, నిస్సారమయినది' అని యర్థము. బాణుడు కావ్యజగత్తులోని సారమంతయు గ్రహించి తన కావ్యములలో నింపగా ఇతరకవులకు పిప్పిమాత్రము మిగిలినదని ఈ వాక్యభావము. బాణుడు సాధింపని ఉత్తమకావ్యతంత్ర మేదియులేదని అత్యుక్తి.

1. 2. 26. ఇటీవలి ప్రశంసలు

(క) శ్రీకాశీ కృష్ణాచార్యులవారు —

పల్లె పూర్ణప్రజ్ఞాచార్యుల 'ఆంధ్రకాదంబరి' అను పద్యకావ్యమునకు కృతిభర్తగా సభలో చదివిన పద్యము —

సీ. కాదంబరీరసాస్వాదంబు లేకున్నఁ
గవియౌనె వాఁడు కాకపియె గాని;
కాదంబరీరసామోదహీనుఁడు పండి -
తుండౌనె యొకబండి తుండె గాని;
కాదంబరిని గ్రోలక సుధోక్తిబలరాముఁ
డౌనె సాహిత్రాముఁ డౌను గాని;

గీ. కాన కాదంబరీకృతిఁగాంచుటెంతొ
కవికి కృతిభర్తకును గీర్తికరమటంచుఁ
దలచి శిష్యార్పితాంధ్ర కాదంబరీసు
కృతికిఁబతినౌట కంగీకరించినాఁడ.[1]

(గ) ఆ సందర్భముననే సభాధ్యక్షులు శ్రీ చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రులు —

శా. పూర్ణప్రజ్ఞుఁడు మున్నుబాణుఁడు జగత్పూజ్యస్వభావుండు, వి
ద్యార్ణోరాశి రచించెఁ గావ్యమును గద్యస్ఫూర్తి, నీనాఁడు మా
పూర్ణప్రజ్ఞుఁడు పద్యకావ్యముగ నింపుల్ మీఱఁగామార్చి వి
ద్యార్ణోరాశికిఁ గృష్ణతీర్థునకుఁదా నర్పించె భక్త్యున్నతిన్ ॥[2]

---

1, 2. ఆంధ్ర కాదంబరి పీఠికలో ముద్రితములు.

(చ) పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు —

కం. వాణీపుంరూపంబని
బాణుని వచింత్రు దదీయ భావంబులు గీ
ర్వాణ స్తుత్యము లంత
ర్వాణులఁ జేయింపవే శిరఃకంపములన్ ॥[1]

(జ) శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు —

కం. బాణుడు నవరసతంత్రధు
రీణుడు చతురప్రసన్నరీతికలాపా
రీణుడు శుకకేలాముఖ
రీణముఁ గాదంబరిన్వరించెను కృతికిన్ ॥[2]

కం. తరళాతితరళపదములు
సరళాధికసరళపంక్తిసంధులు విరళా
విరళరసోదయవాచా
చరణయుగళంధుగళలు అతని సంస్కృతశయ్యల్ ॥[3]

(ట) ఉమర్ ఆలీషా —

కం. బాణుని కాదంబరి పో
రాణికము మహాప్రబంధరాజముమఱి గీ
ర్వాణమునకలంకారము
తూణీరము వాణి సర్వతోముఖమవుటన్ ॥[4]

(డ) వట్టిపల్లి మల్లినాథశర్మగారు —

పురా కవ్యభిసంశప్తాం క్షుద్రకాదంబరీం పునః ।
కవిస్తుత్యాం చ యశ్చక్రే బాణం నౌమి సుధాపణమ్ ॥[5]

---

1. ఆంధ్ర కాదంబరి.

2, 3. అడ్డేపల్లి నాగగోపాలరావు గారి 'పద్యకాదంబరి'కి అభిప్రాయములు.

4. 'ఆంధ్రకాదంబరి' పీఠిక.

5. 'మధురస్మృతి'. సంస్కృత కావ్యము. అముద్రితము.

గమనిక :— 1930, ఏప్రిలు, భారతిలో శ్రీ యణారయుండి వేంకటవీరరాఘవా

1. 3. ఇన్నిపొగడ్తలను, ఇట్టిపొగడ్తలను ఇన్నిశతాబ్దములుగా ఇందరు కవులు, పండితులవలన పొందుచున్న మహాకవి బాణుడు. ఇంతకాలమువరకును పఠనపాఠనములలో వర్తించునవి అతనికావ్యములు. అట్లు అతని 'కాదంబరి' లోకోత్తరగుణవిధానమగుట సిద్ధమయినను ఆధునికపద్ధతులలో తద్గుణవిశ్లేషణము, తద్వైశిష్ట్యమార్గణమును సాహిత్యప్రయోజకమగుట నిర్వివాదము.

---

(మిగులు) చార్యులుగారు అనేక బాణప్రశంసలను ఉద్ధరించియున్నారు. తెలుగు కవుల బాణప్రశంసలను రమారమి అన్నింటిని చూపియున్నారు.

పైన లెక్కకురాని రెండు సంస్కృతపద్యములు వారు ఉద్ధరించినవి ఇచ్చట అనుసంధేయములు.

1. రాజచూడామణిదీక్షితులు : రుక్మిణీకల్యాణమ్ (వ్రాతప్రతి)
బాణోధురీణః కవిపుంగవేషు, ప్రకాశతాం భవ్యఫలోదయశ్రీః
అముంచమానోఽపి గుణం పరేషాం, విన్యాధమర్మాణి విశేషతోయః ॥
ఇందు 'గుణం' అను పదముమీద మామూలు శ్లేష.

2. విద్యామాధవకవి : పార్వతీరుక్మిణీయమ్.
బాణః సుబంధుః కవిరాజసంజ్ఞో విద్యామహామాధవపండితశ్చ ।
వక్రోక్తిదక్షాః కవయః పృథివ్యాం, చత్వార ఏతే న హి
పంచమోఽస్తి ॥
ఇది కవిరాజు పద్యమునకు అనుకరణ. చూ. 1. 2. 13.



# 2. బాణుని కాలము, రచనలు, జీవితము

2. 1. ప్రాయికముగ సంస్కృతకవుల దేశకాలాదినిర్ణయము దుర్ఘటము. వాల్మీకి, కాళిదాసులవంటి మహాకవులును తమ జీవితవిశేషములను ఎచ్చటను గ్రంథస్థము చేయనికారణమున చారిత్రకపరిశోధకులు వారి కాలనిర్ణయము కచ్చితముగ చేయలేక పోయిరి. ఒక్క కాళిదాసు విషయముననే వివిధములైన ఊహలు కలవు. క్రీస్తుకు పూర్వము మొదటిశతాబ్దిమొదలు క్రీస్తువెనుక పదునొకండవశతాబ్దివరకు ఒక్కొక్క పరిశోధకుడు కాళిదాసును ఒక్కొక్కశతాబ్దములో ప్రతిష్ఠించియున్నాడు. భారవి, భట్టి, విశాఖదత్తుడు, శూద్రకుడు, మాఘుడు మొదలగువారికిని ఇట్లే. అన్యకవిప్రశంసా పరంపరలను అనుసరించి ఒకానొకకవి కాలమునకు పశ్చిమావధిని[1] మాత్రము నిర్ణయింపవచ్చును.

ఇట్టి పరిస్థితిలో బాణుడు కవితారలలో ధ్రువతారగా చారిత్రకగగనమున నిలిచి తన పూర్వకవిస్తుతివలన కొందరు ఇతరకవుల కాలనిర్ణయమునకు ఒక నిశ్చల పశ్చిమావధిగ ఉండుట ఎంతయు ముదావహము. ఈ భాగ్యమునకు కారణము అతడు రచించిన 'హర్షచరితము'. హర్షుడు బాణునికి సమకాలికుడు, మిత్రుడు, పోషకుడును అని తెలిసినందున హర్షుని కాలనిర్ణయమే బాణునికిని అగును.

2. 2. మనపురాణములందు, కావ్యాదులందును, అనేకహర్షులు ఉండుటలో బాణుని హర్షుడు ఏహర్షుడో అను విచికిత్స తప్పదు. ప్రాచీనహిందురాజుల కాలనిర్ణయము కవుల కాలనిర్ణయమునకన్న ఏవిధముగను సుకరము కాకపోగా హర్షచరితపు కథా నాయకునివిషయములో మనభాగ్యవశమున దేశాంతరవాసిసాక్ష్యము లభించినది. హ్యూఇఐసాంగ్, ఇత్సింగ్ అను చీనాదేశమునుండివచ్చిన బౌద్ధయాత్రికులవ్రాతల వలన శీలాదిత్యుడు అనుబిరుదుకల ఒకహర్షుడు, కాన్యకుబ్జమును పాలించిన నృపతి, బౌద్ధమతమును స్వీకరించిన హిందురాజు[2] బాణుని హర్షుడు కాదగునని ఏర్పడినది.

---

1. Terminus ad quem.

2. బాణుని హర్షచరితములో హర్షుని జీవితపు పూర్వభాగము మాత్రమే వర్ణితము కాన ఈ మతాంతరస్వీకారము లేదు.

ఆహర్షుని జీవితములోని కొన్ని అంశములు, వ్యక్తులు, సంఘటనలు క్రమముగా బాణుని హర్షచరితములోని అంశములు, వ్యక్తులు, సంఘటనలకు సరిపోవుటవలన బాణునిహర్షుడు చీనాయాత్రికులహర్షుడును ఒకడే అని స్థిరపడినది.

## 2. 3. హర్షునికాలము

2. 3. 1. హ్యూఇణ్‌సాంగ్ హర్షుని సమకాలికుడు. అతడు క్రీ. శ. 629 నుండి 645 వరకు భారతదేశములో సంచరించినట్లు అతని వ్రాతలవలన తెలియుచున్నది. తన భారతదేశపర్యటనను విపులముగ వర్ణించుటలో అతడు అనాడు కాన్యకుబ్జమును పాలించు రాజుపేరును తన మాతృభాషయయిన చీనాభాషావిశేషములో

హొ ల చ ఫ త న ( - ఫ త్తన ? )

అని పేర్కొనెను. ఇది 'పాలి' అను బౌద్ధప్రాకృతమున

'హరిసవద్దన' లేక 'హరిషవత్తన'

అనుటకు దగ్గరగనుండుటయు, అది సంస్కృతమున

'హర్షవర్ధన'

అను నామమే అగుటయు సులభము.

2. 3. 2. ఇత్‌సింగ్ క్రీ. శ. 671 లో భారతదేశమునకు వచ్చి నలందావిశ్వవిద్యాలయమున పదిసంవత్సరములు విద్యనేర్చెను. అతడు వ్రాసిన ఒక బౌద్ధగ్రంథములో[1] —

'శీలాదిత్యమహారాజు, జీమూతవాహనుడు అను బోధిసత్త్వుడు ఒకనాగుని కొరకు దేహత్యాగముచేసిన కథను, కావ్యము చేసెను. దానికి సంగీతముజోడించి నృత్యనటనములతో ఆడించి మిక్కిలి ప్రాచుర్యము కలిగించెను'

అని ఉన్నందున ఆ కావ్యము (లేక నాటకము) హర్షుని 'నాగానందము' అని రూఢియగుచున్నది. ఈ 'శీలాదిత్యుడు' అను పేరు హర్షుని బిరుదుగ హ్యూఇణ్‌సాంగ్ కూడ పేర్కొనుటవలన బాణునిహర్షుడు, హ్యూఇణ్‌సాంగ్ హర్షుడు, రత్నావళ్యాది నాటకకర్తయు ఒకడే అని నిస్సంశయముగ చెప్పవీలగుచున్నది.

1. 'Records of the Buddhist Religion' అను ఆంగ్లానువాదము ఉపలభ్యము (Translated by Takakusu, Oxford. 1896.)

2. 3. 3. చారిత్రకమార్గణులు పలు ఆధారములను పరిశీలించి శీలాదిత్యహర్షుడు అను కాన్యకుబ్జరాజుకాలమును క్రీ. శ. 606 నుండి 647 వరకు అని నిర్ణయించిరి. క్రీ. శ. 606 లో హర్షుడు రాజయ్యెను. 'హర్షచరితము' ప్రకారము అతనికి అప్పటికి ఇరువదియేడులుకూడ నిండలేదు. అతని జననము క్రీ. శ. 590 ప్రాంతమున కావచ్చును. హర్షచరితమునుండియే బాణహర్షులకు వయస్సులో ఎక్కువ భేదము ఉండదని తెలియుచున్నది. కావున బాణుని జననకాలమును ఇంచుమించుగా ఊహింప వచ్చును.

2. 3. 4. బాణునికాలమునకు సమీపమున ఒకపశ్చిమావధిని నిర్ణయించుటకు ఇతర కవుల, లాక్షణికుల ప్రశంసలును ఉపకరించును. అవియన్నియు విమర్శనాత్మకముగ ప్రథమమున, క్రమముగ వివరించినకీర్తి శ్రీ P. V. కాణేపండితునిది.[1]

2. 3. 5. వామనుడు అను ఆలంకారికుడు తన 'కావ్యాలంకారసూత్రవృత్తి' లోని శబ్దశుద్ధినిరూపణప్రకరణమున (5.2-43) 'అనుకరోతి భగవతో నారాయణస్య'[2] అను వాక్యమును అజ్ఞాతకర్తృకముగ ఉదాహరించినాడు. ఈ వాక్యము కాదంబరిలో శూద్రక వర్ణనమున ఉన్నది. కావున బాణుడు వామనునికి పూర్వుడగును. వామనునికాలమును శ్రీ కాణేపండితుడు ఇట్లు నిర్ణయించెను —

(క) ఆనందవర్ధనుని 'ధ్వన్యాలోకము' నకు 'లోచన' అను ప్రసిద్ధవ్యాఖ్యలో అభినవగుప్తుడు,

---

1. వారి కాదంబరీపీఠిక (ఆంగ్లము) అవశ్యము చదువదగినది.

2. సంస్కృతభాషలో వర్తమానకాలపు (లట్) ప్రథమపురుషైకవచన ధాతురూపమునకు 'స్మ' అను ఏకాక్షరపదమును కలిపిన అది భూతకాలపు అర్థమును ఇచ్చును. ఉదా:- భవతి స్మ = (అభవత్) అయ్యెను, కరోతి స్మ = (అకరోత్) చేసెను, ఇత్యాది. బాణుని వాక్యమున సందర్భముప్రకారము భూతకాలము చెప్ప వలెను. కాని 'అనుకరోతి' అని వర్తమానకాలము ఉన్నది. ఇది తప్పు. 'అనుక రోతి స్మ' అని బాణుడు వ్రాయగా లిపికరప్రమాదమున 'స్మ' పోయి యుండ వచ్చునని వామనుని అభిప్రాయము (మన్యే స్మ-శబ్దః కవినాప్రయుక్తో లేఖకైస్తు ప్రమాదాన్నలిఖితః — వామనః).

'ఇది వామనాభిప్రాయమున ఆక్షేపాలంకారము, భామహాభిప్రాయమున సమాసోక్తి, అను ఆశయమును మనసున ఉంచుకొని సమాసోక్తి - ఆక్షేపములకు గ్రంథకర్త (ఆనందవర్ధనుడు) ఒకే ఉదాహరణమును చూపెను.'[1]

అని చెప్పుటలో అతడు వామనుని ఆనందవర్ధనునికి పూర్వునిగా గ్రహించెనని స్పష్టము. ఆనందవర్ధనుడు క్రీ. శ. 9_వ శతాబ్దపు ఉత్తరభాగమున నుండెనని ఇతరత్ర నిరూపితము. కావున వామనుడు తత్పూర్వుడు అగును.

(గ) వామనుడు భవభూతి 'ఉత్తరరామచరితము' నుండి ఒకపద్యమును ఉదాహరించుటవలన[2] భవభూతికి తరువాతివా డగును. భండార్కారుపండితుని మతమున (ఇదియే సర్వజనీనము) భవభూతి క్రీ. శ. 700 ప్రాంతమున ఉండెను. ఇది వామనుని కాలమునకు పూర్వావధి.[3]

(చ) వామనుడు కశ్మీరదేశస్థుడు. కల్హణుడు తన 'రాజతరంగిణి' లో జయాపీడుడు అను కశ్మీరరాజునకు వామనుడు అను మంత్రి ఉన్నట్లు చెప్పియున్నాడు. కశ్మీరపండిత సంప్రదాయమున ఆ వామనుడే ఆలంకారికవామనుడు అను దృఢవిశ్వాసము కలదు. జయాపీడుడు కల్హణునిప్రకారము క్రీ. వె. 745 నుండి 776 వరకు రాజ్యము చేసెను. కావున వామనునికాలమును రమారమి అదియే అని ఊహించుట సత్యదూరము కాదు.

---

1. వామనాభిప్రాయే ణాయమాక్షేపః; భామహాభిప్రాయేణ తు సమాసోక్తి రిత్యముమాశయం హృదయేగృహీత్వా సమాసోక్త్యాక్షేపయో రిద మేక మేవోదాహరణం వ్యతర ద్గ్రంథకృత్ — అనిలోచన.

2. యథా (ఉత్తరరామచరితమ్, 1_39)

ఇయం గేహే లక్ష్మీ రియమమృతవర్తి ర్నయనయోః,
అసావస్యాః స్పర్శో వపుషి బహుల శ్చందనరసః ।
అయం కంఠే బాహుః శిశిరమసృణో మౌక్తికసరః
కిమస్యా న ప్రేయో యది పర మసహ్యస్తు విరహః ॥

(కావ్యాలంకారసూత్రవృత్తి, 4_3_2)

3. Terminus a quo.

(ఙ) వామనుడు కవిపేరుచెప్పక ఒక చిన్నవాక్యమును కాదంబరినుండి ఉదాహరించుటలో ఆనాటికి కాదంబరి పండితలోకమున సుపరిచితగ్రంథము అని తెలియుచున్నది. దోషప్రకరణమున ప్రామాణ్యముకొరకు మహాకవులతప్పులనే ఉదాహరించుట ఆలంకారికుల వాడుక. కాదంబరికి అంతప్రసిద్ధి లభించుటకు కనీసము ఒకశతాబ్దమైనను గడచియుండుననుట సంభావ్యము. ఇది బాణునికాలమునకు సరిపోవును.

2. 3. 6. బాణుని ప్రసిద్ధి కాలక్రమమున వృద్ధిచెందుచునే ఉండెననుటకు వామనుని తరువాత అనేకాలంకారికులు బాణుని కావ్యములనుండి ఉదాహరించుచునే ఉండుట నిదర్శనము. అందు ముఖ్యులు —

(క) ధ్వన్యాలోకకారుడు ఆనందవర్ధనుడు (క్రీ. వె. 9-వ శతాబ్దము) బాణుని రెండు గద్యకావ్యములను పేరిడి పలికియున్నాడు —

"హర్షచరితములో,

'పరస్పరవిరోధమున్న పదార్థముల సమవాయము' వలె

సింహనాదవాక్యములలో 'అవరించిన ఈ మహాప్రళయములో'",

"కాదంబరిలో,

'కాదంబరీదర్శనసమయములో'"[1],

ఇత్యాది. ఇవికాక మరియును కలవు.

(గ) దశరూపకకారుడు, ధనంజయుడు (క్రీ వె. 1000 ప్రాంతము) భోజుని పితృవ్యుడైన ముంజుని ఆస్థానకవి. అతడు బాణుని ప్రస్తావించియున్నాడు. దశరూపకములో[2] —

1. యథాహర్షచరితే 'సమవాయ ఇవ విరోధపదార్థానామ్'
యథా హర్షచరితే సింహనాదవాక్యేషు 'వృత్తేఽస్మిన్ మహాప్రలయే'
యథా కాదంబర్యాం 'కాదంబరీ దర్శనావసరే' (ధ్వన్యాలోకము)

2. యథా హి 'మహాశ్వేతావర్ణనావసరే భట్టబాణస్య ......'
'కాదంబర్యాం వైశంపాయనస్య' (దశరూపకము)

'మహాశ్వేతను వర్ణించుటలో భట్టబాణుని ... ' అని,

'కాదంబరిలో వైశంపాయనుని ... ' అనియు ప్రస్తావన కలదు.

(చ) భోజుడు (క్రీ. వె. 11-వ శతాబ్దము) తన 'సరస్వతీకంఠాభరణము' అను అలంకారగ్రంథములో ఒకచోట,

'గద్యవిధానములో బాణుడు ఎట్టివాడో పద్యబంధములో అట్టివాడు కాడు'[1] అనిచెప్పి మరియొకచోట,

'హరునివలె జితమన్మథుడు; గుహునివలె అప్రతిహతశక్తికలవాడు'[2] అను కాదంబరిలోని వాక్యములను ఉదాహరించెను.

(జ) రుద్రటుని కావ్యాలంకారపు వ్యాఖ్యాత నమిసాధువు కాదంబరిని, హర్ష చరితమును కథ, ఆఖ్యాయికలకు ఉదాహరణములుగ పేర్కొనెను. నమిసాధువు వ్యాఖ్యను క్రీ. వె. 1069 లో వ్రాసినట్లు అతడుచెప్పిన తేదీప్రకారము తెలియుచున్నది.

(ట) బహుగ్రంథకర్త, క్షేమేంద్రుడు (క్రీ. వె. 11-వ శతాబ్దము) బాణుని పలుమార్లు ప్రస్తావించియున్నాడు. అతని 'ఔచిత్యవిచారచర్చ' లో కాదంబరిలోని 'స్తనయుగ మశ్రుస్నాతం ... ' అను శ్లోకమును ఉదాహరించుట గుర్తింపదగినది.

(డ) రుయ్యకుడు (క్రీ. వె. 12-వ శతాబ్దము) తన 'అలంకారసర్వస్వము' లో బాణుని తరచు ప్రస్తావించియున్నాడు. మరియు తాను 'హర్షచరితవార్తికము'[3] అను వ్యాఖ్యానమును రచించినట్లు చెప్పియున్నాడు.

---

1. 'యాదృక్ - గద్యవిధౌ బాణః పద్యబంధే న తాదృశః'

2. "హర ఇవ జితమన్మథః, గుహ ఇవ అప్రతిహతశక్తిః ..." ఈ వాక్యములు కాదంబరిలో శూద్రకవర్ణనమున కలవు.

3. 'ఏషా ఉత్ప్రేక్షా చ సమస్తోపమాప్రతిపాదకవిషయే ఽపి హర్షచరిత వార్తికే, సాహిత్యమీమాంసాయాం చ తేషు తేషు ప్రదేశేషూదాహృతా (మయా)' — రుయ్యకుని అలంకారసర్వస్వము.

ఇట్లు అనేక ప్రసిద్ధాలంకారికులకు లక్ష్యములగుటచే బాణకావ్యముల ప్రాచుర్యము సువిదితము.

## 2. 3. 7. బాణుని పూర్వకవిస్తుతి

సామాన్యముగ సంస్కృతకవులు కావ్యమును వస్తునిర్దేశముతోనే మొదలిడుట పూర్వాచారము. ఇదియే తరువాత భారవి, మాఘుడు, శ్రీహర్షుడు మొదలగువారు పాటించిరి. కాళిదాసుమాత్రము మాళవికాగ్నిమిత్రనాటకమున[1] పూర్వనాటకకర్తలగు భాసాదులను స్మరించెను. రఘువంశకావ్యమున 'పూర్వసూరిభిః' అని వాల్మీక్యాదులను ప్రస్తావించియున్నాడు. కాని రాముని కథను అంతయు వాల్మీకినుండి గ్రహించి వాల్మీకి పేరు చెప్పకుండుట విస్మయకరము. సంస్కృతకవులకు పూర్వకవిస్తుతిమీద ప్రత్యయము ఉన్నట్లు తోచదు.

అయినను, తెలుగుప్రబంధకవులు చేసినట్లు విస్తారమయిన పూర్వకవిస్తుతికి 'మానా' పెట్టిన కీర్తి సంస్కృతగద్యకవియైన బాణభట్టుదే.[2] పూర్వకవిస్తుతులు కవుల పూర్వాపరత్వనిర్ణయమునకు ఎంతయో ఉపకరించును. బాణునికాలము నిశ్చయముగ తెలిసినందున అతడు స్తుతించిన పూర్వకవులు క్రీ. వె. 7-వ శతాబ్దమునకు పూర్వులు అని చెప్పుటకు వీలగుచున్నది.

బాణుని పూర్వకవిస్తుతి హర్షచరితారంభమున కలదు. కాదంబర్యారంభమున లేదు. కాదంబరి హర్షచరితమునకు తరువాతవాపినది అగుటచేత చర్వితచర్వణమగునని మానియుండవచ్చును.

బాణుడు వరుసగా భారతకారుడు, వ్యాసుడు, కుకవులు, ఆఖ్యాయికాకారులు, వాసవదత్త (కావ్యము), భట్టారహరిచంద్రుడు అను గద్యకవి, శాతవాహనుడు (హాలుడు), ప్రవరసేనుడు, భాసుడు, కాళిదాసు, బృహత్కథ (కావ్యము), ఆఢ్యరాజు అను పేర్లను, కావ్యముల ప్రశస్తియు లిఖితము కావించెను.

---

1. ప్రథితయశసాం భాససౌమిల్ల కవి పుత్రాదీనాం ప్రబంధాన్ ('మాళవిక' ప్రస్తావన).

2. ఇదియును బాణుని వైశిష్ట్యమే.

ఇందు ఆఖ్యాయికాకారుడు ఎవరో మనకు తెలియదు. పలువు రుండిరనిమాత్రము ఇతరత్ర తెలియుచున్నది. భట్టారహరిచంద్రుడు అను జైనకవి ఉండెనట. వాక్పతిరాజు (బప్పఇరాఅ) తన 'గౌడవహో (గౌడవధ)' అను కావ్యములో ఒక భట్టారహరి చంద్రుని గద్యబంధమును ఉల్లేఖించుట చూడగా అదియే బాణుడు చెప్పిన భట్టారహరి చంద్రుని గద్యబంధము కావచ్చునని తోచును. ఎట్లయినను ఆకావ్యము ఇప్పుడు లభ్యముకాదు. హాలశాతవాహనుని 'గాహాసత్తసఈ (గాథాసప్తశతీ)' అను ప్రాకృత శృంగారముక్తకసంకలనము జగద్విదితము. ప్రవరసేనుడు 'సేతుబంధ' కర్తయని 'సేతునా (సేతువుచేత)' అను పదముచేత తెలియుచున్నది.[1] భాసుడు, కాళిదాసు సుప్రసిద్ధులు. ఆఢ్యరాజు ఎవరో తెలియదు. పిషెలు పండితుడు 'అఢ్యరాజు' అనునది వ్యక్తినామముగ (Proper noun) కాక విశేషణముగ గ్రహించి అది హర్షవర్ధనుని స్తుతియని వాదించెను.

ఈ పూర్వకవిస్తుతిలో కవిపేరు చెప్పక కావ్యప్రశంసమాత్రము రెండుమారులు జరిగినది. ఒకటి 'బృహత్కథ'. ఇది మిక్కిలి ప్రసిద్ధము, ఆపేరుతో ఏకైకకావ్యమును. అది పైశాచీప్రాకృతమున గుణాఢ్యుడు రచించెననుటను శంకింపవలసినదిలేదు. అది ఇప్పుడు దొరకకున్నను సంస్కృతానువాదములు, సంగ్రహములును లభ్యములు. ఒక ప్రాచీన తమిళానువాదము (పెరుంగదై) కూడ కలదు.

రెండవది, 'వాసవదత్త' మిక్కిలి వివాదములకు గురియయినది. ఆ కావ్యపు వృత్తము, దాని కర్తృత్వమును గురించి పలు ఊహలు కలవు. నేడు సుబంధువు అను కవి వ్రాసిన 'వాసవదత్త' అను గద్యకావ్యము లభ్యము. అదియే బాణుడు చెప్పినది అని ఒక పండితవర్గము. అదికాదని మరియొకవర్గము. ఈమతమున సుబంధువు బాణునికి తరువాతివాడు. బాణసుబంధుల పూర్వాపరత్వము బాణుని గద్య ప్రాభవపరిశీలనమునకు అత్యంతావశ్యకము.

---

1. సేతుబంధ కావ్యమునకు 'రావణవహో (రావణవధ)' అని మరియొక పేరు. దీనిని ప్రవరసేనుడు వ్రాయలేదనియు, కాళిదాసు వ్రాసి ప్రవరసేనుడు అను రాజు పేర ప్రచురించెననియు రామదాసు అను వ్యాఖ్యాత చెప్పియున్నాడు. కాళిదాసు నకు కాలములో దగ్గరివాడైన బాణునికి తెలియని ఈ రహస్యము బాణుని తరువాత సుమారు వేయిసంవత్సరములకు ఈ వ్యాఖ్యాతకు ఎట్లు తెలిసెనో విచార్యము.

## 2. 3. 8. సుబంధువు - బాణుడు

(క) సుబంధుబాణులలో ఎవడు పూర్వుడు అను నిర్ణయమునకు పూర్వము ఈ 'వాసవదత్త' అను పేరునుగూర్చి కొంత తెలిసికొనవలెను.

1. ప్రసిద్ధమయిన 'బృహత్కథ'లో వాసవదత్త ఉదయనుని భార్య. వారి పెండ్లిసంగతియే భాసునిదనబడు 'ప్రతిజ్ఞాయౌగంధరాయణము' అను నాటకపు ఇతివృత్తము. ఆమె 'స్వప్నవాసవదత్తము' లోను కలదు. ఈమెకథ తొలుత 'బృహత్కథ'లో కలదు కావున ఆమెను బృహత్కథావాసవదత్త అని వ్యవహరింతము.

2. 'వాసవదత్త అను పేరునకు మిక్కిలి ప్రాచీనమైన ఉల్లేఖము పతంజలి 'మహాభాష్యము'న కలదు. పతంజలి ఒకసందర్భమున ఆఖ్యాయికకు ఉదాహరణముగ 'వాసవదత్తా, సుమనోత్తరా' అను వానిని చెప్పిన కారణమున వాసవదత్త అను నాయికకథ అప్పటికే ప్రసిద్ధిని పొందియున్నది. పతంజలి క్రీ. పూ. 3-వ శతాబ్దపు వాడని చరిత్రకారులమతము.

3. పాణినివ్యాకరణమునకు వ్యాఖ్య అయిన 'కాశిక'లోను భట్టోజీదీక్షితుని 'సిద్ధాంతకౌముది'లోను పతంజలి యుల్లేఖమునే చిలుకపలుకుగా పునశ్చరణచేయబడినది.

4. కాళిదాసు మేఘసందేశకావ్యములో ఒకచోట[1] 'ఉదయనకథాకోవిదగ్రామవృద్ధాన్' అని, మరియొకచోట[2] 'ప్రద్యోతస్యప్రియదుహితరం వత్సరాజోఽత్రజహ్రే' అనియు, ఆ పద్యములలోనే ప్రద్యోతునికి ఇంద్రుడు ఇచ్చిన 'నళగిరి' అనుఏనుగు ప్రస్తావన ఉండుటయు, కాళిదాసునకు గుణాఢ్యుని బృహత్కథ తెలియును అని నిరూపించుచున్నవి.

(గ) పతంజలి - వాసవదత్త ఎవరు? ఆమె బృహత్కథావాసవదత్తయా? బృహత్కథలోని వాసవదత్తకథనే ఎవరో ఆఖ్యాయికగా చేయగా దానినే పతంజలి

---

1. చూ. 'మేఘసందేశము' పద్యము 31 వేదమువారి ముద్రణము.

2. అందే పద్యము 34.

ఉదాహరించెనా ? అట్లైన పతంజలినుండి బాణునివరకు సుమారు వేయిసంవత్సరములు ప్రసిద్ధమైన 'వాసవదత్త' అను ఆఖ్యాయిక బాణునితరువాత నష్టమైపోయెనా ? ఈ ప్రశ్నలకు సమాధానములు కేవలము ఊహలే.

(చ) బాణుడు ఒకశ్లోకములో ఆఖ్యాయికాకారులను పొగడి వారి కావ్యముల పేర్లను చెప్పక, దాని తరువాతిశ్లోకమున 'వాసవదత్త' అను కావ్యమును పొగడును. ఇచ్చట 'వాసవదత్తా' అని స్త్రీలింగాంతనామము చెప్పెనే కాని అది ఎట్టి కావ్యమో చెప్పలేదు. గద్యమని కూడ అనలేదు. బాణుని మతమున అది ఆఖ్యాయికయా, కథయా, పద్యకావ్యమా, నాటకమా ?

(జ) 1. సంస్కృతవాఙ్మయమున సుబంధువునకు మిక్కిలి ప్రసిద్ధి కలదు. వాక్పతిరాజు, కవిరాజు, మంఖుడు మొదలగు పలువురు కవులు సుబంధువును స్తుతించియున్నారు. అతిశయోక్తులతో అతని ప్రతిభను ఉగ్గడించియున్నారు.

2. సుబంధువు 'వాసవదత్త' చిన్నదైనను 'కాదంబరి' వంటి గద్యకథాకావ్యము. ఇందలి కథానాయికకు బృహత్కథలోని వాసవదత్తకును నామసామ్యము తప్ప వేరు పోలికలులేవు. పూర్వప్రసిద్ధవృత్తము లేని కారణమున సుబంధువు 'వాసవదత్త' 'కేవల కల్పనాకథ' అగును. ఆఖ్యాయికకాదు[1].

## 2. 3. 9. వాసవదత్త - బాణకావ్యములు

బాణుని 'కాదంబరి' ఎత్తుగడయు, శైలియు సుబంధుని 'వాసవదత్త' ఎత్తుగడయు, శైలియు ఒకేవిధముగ ఉండుటయు అనేకవాక్యములు, వాక్యసముచ్చయములు సుబంధుకావ్యములోను బాణునికావ్యములలోను పరస్పరసంవాదములుగ ఉండుటయు పాఠకునికి వీరిలో ఎవరో ఒకరు మరియొకరిని అనుకరించిరను అభిప్రాయమును తప్పక కల్గించును. ఆ సంవాదములు కొన్ని క్రింద చూపబడినవి.

(క) కాదంబరి ఎత్తుగడ :— బాణుడు 'ఆసీత్ - రాజా - శూద్రకోనామ' అను మొదటివాక్యములో 'ఆసీత్ (ఉండెను)' అను క్రియకు తరువాత శూద్రకునికి

---

1. చూ. 4. గద్యకావ్యరూపములు.

విశేషణములు, ఉపమలు చెప్పి, విరోధాభాసాలంకారములు కుప్పించి 'రాజా శూద్రకో నామ' అని ముగించును. తరువాత విస్తారముగ శూద్రకగుణవర్ణనము, రాజ్యవర్ణనము కలవు.

వాసవదత్త ఎత్తుగడ :— 'అభూత్ - రాజా - చింతామణిర్నామ' అను మొదటివాక్యములో 'అభూత్ (ఉండెను)' అను క్రియకు తరువాత చింతామణికి విశేషణములు, ఉపమలు, విరోధాభాసములు గడచి 'రాజా చింతామణిర్నామ' అని ముగియును. తరువాత విస్తారముగ చింతామణి గుణవర్ణనము, రాజ్యవర్ణనము ఇత్యాది.

(గ) (కాదంబరి) అహో! విధాతు రస్థానే రూపనిష్పాదనప్రయత్నః ...... మన్యేచ ...... ఉత్పాదితా ప్రజాపతినా ; అన్యథా కథమియ మక్లిష్టతాలావణ్యస్య.[1] (ఇది చండాలకన్యకను చూచి శూద్రకుని విస్మయము)

(వాసవదత్త) అహో! ప్రజాపతే రూపనిర్మాణకౌశలమ్ ...... మన్యే ...... వేధసా విరచితః ...... అన్యథా కథమి వాస్య కాంతివిశేషః.[2] (ఇది కలలో కందర్పకేతువును చూచిన వాసవదత్త విస్మయము)

(చ) (హర్షచరితమ్) 'ప్రవికసిత కేసరరజోవిసర బధ్యమాన వాసర ధూసరిమాణః ...... పరాగపింజరమంజరీరజ్యమాన మధుపమంజుశింజాజనిత జనముదః, మదమలనమేచకిత ముచుకుందస్కంధకాండకథ్యమాన నిశ్శంక కరికరట కండూతయః, ...... కతిపయదివసప్రసూత కుక్కుటీకుటీకృత కుటజకోటరాః, చటకాసంచార్యమాణ పటరవవాచాట చారువాటకైర క్రియమాణ చాటవః, సహచరీసహచరణ చంచురచకోర చంచవః, శైలేయసుకుమారశిలాతలసుఖశయితశశశిశవః, శేఫాలికాః శిఫావివరవిస్రబ్ధ వర్ధమాన గౌధేరకరాశయః, నిరాతంకకరంకవః, నిరాకులనకులకేలయః, కలకోకిల కులకవల కలకలాకలిత కలికోద్గమాః, సహకారారామరోమంథాయమాన చమూరు యూథాః, ...... శ్రవణహారిసనీడగిరిసితంబనిర్ఝర నినాద నిద్రానందమందాయమాన

---

1. కా శే ప్రతి, పుట. 25 ; వావిళ్ల, 13.

2. చౌఖం బా ప్రతి, పుట 137.

కరికుల కర్ణతాలదుందుభయః, సమాసన్న కిన్నరగీతరవ రమమాణరురవః, ...... గుంజాగుంజ గుంజజ్ఞాహకాః, దశనకుపితకపిపోతతపేట కపాటితపాటలకీటపుటకాః,[1] ........1. (అష్టమోచ్ఛ్వాసము)

దీనిని 'వాసవదత్త' లోని క్రింది వర్ణనతో సరిచూచునది.

(వాసవదత్త) ప్ర(తి)వికసిత కుసుమకేసరరజోవిసరధూసరిత పరిసరేణ, పరాగ పుంజపింజరసిందువారమంజరీరజ్యమాన మధుకరమంజుశింజితజనితజనముదా,...... ఘదజలమేచకితగండకాషముచుకుందకాండకథ్యమాననిశ్శంక కరికరటనికటకండూతినా, కతిపయదివసప్రసూత కుక్కుటీకుటీకృత కుటజకోటరేణ, చటకసంచార్యమాణ చటుల వాచాటచాటకై రక్రియమాణచాటునా, సహచరీసహచరణచంచురచకోరచుంచునా, శైలేయసుగంధితశిలాతలసుఖశయిత శశశిశురాశినా, శేఫాలికాశిఫావివరవిస్రబ్ధవివర్తమాన గౌధేరరాశినా, నిరాతంకరంకునికరేణ, నిరాకులనకులకులకేలినా, కలకోకిలకులకవలిత సహకారకలికోద్గమేన, సహకారారామరోమంథాయమానచమరీయూథేన, శ్రవణహారి సనీడగిరినితంబనిర్ఝరనినాదశ్రవణనిద్రానందమందాయమాన కరికులకర్ణతాల దుందుభిధ్వనినా, సమాసన్నకిన్నరీగీతశ్రవణరమమాణరురువిసరేణ, ...... గుంజాపుంజగుంజజ్జాలకజాలేన, దంశదశనకుపిత కపిపోతిపేటక చపేటకపాటిత పాటలీపుటకీటసంకటేన[2] ......1.

(ఙ) (హర్షచరితమ్) ......కులశశిఖరఖరనఖరప్రచయప్రచండచపేటాపాటిత మత్తమాతంగకుంభస్థలగళన్మదచ్ఛటాచ్ఛురితచారుకేసరభారభాసురముఖేకేసరిణి.[3] .... 1.

(వాసవదత్తా) ...... కులశశిఖరఖరనఖర ప్రచయప్రచండచపేటాపాటిత మత్తమాతంగమదచ్ఛటాచ్ఛురితచారుకేసరభరభాసుర కేసరికదంబేన. ......1.

(ఛ) (హర్షచరితమ్) అతిరోమంథమంథరకురంగ కుటుంబకాధ్యాస్యమానప్రమదిష్ఠగోష్ఠీనపృష్ఠాసు అరణ్యస్థలీషు, ...... నిద్రావిద్రాణద్రోణ కులకలిలకులాయేషు కాపేయవికలకపికులేషు ఆరామతరుషు, నిర్జిగమిషతి జరత్తరుకోటరకుటీకుటుంబిని

1. చౌఖంబాప్రతి, పుటలు. 418, 19, 20, 21.

2. చౌఖంబాప్రతి, పుటలు. 231, 32, 33, 34.

3. చౌఖంబాప్రతి, పుట. 320.

4. చౌఖంబాప్రతి, పుట. 234.

కౌశికకులే, ...... తిమిరతర్జననిర్గతాసు దహనప్రవిష్టదినకరకరశాఖాస్వివ స్ఫురంతీషు దీపలేఖాసు, ...... ముఖరితవితతజ్యధనుషి వర్షతి శరనికరమనవరతమశేషసంసార శేముషీముషి మకరధ్వజే, రతాకల్పారంభశోభిని శంభలీభాషితభాజి భజతి భూషాం భుజిష్యాజనే, సైరంధ్రీబధ్యమానరశనాజాలజల్పాకజఘనాసు జనీషు,[1] ......1

(వాసవదత్తా) రోమంథమంథరకురంగకుటుంబకాధ్యాస్యమానప్రమదిష్ఠ గోష్ఠీన వృష్ఠాసు, అరణ్యస్థలీషు, నిద్రావిద్రాణ (ద్రోణ) కాకకులకలితకులాయేషుగ్రామతరునిచయేషు, కాపేయవికలకపికులకలిలేషు ఆరామతరుషు, నిర్జిగమిషతి జగత్తరుకోటరకుటీర కుటుంబిని కౌశికకులే, తిమిరతర్జనీనిర్గతాసు దహనప్రవిష్టదినకరకరశాఖాస్వివ ప్రస్ఫురంతీషు దీపలేఖాసు, ముఖరితధనుషి వర్షతి శరనికరమశేషసాంసారికశేముషీముషి మకరధ్వజే, సురతారంభకల్పశోభిని శంభలీభాషితభాజి భజతి భూషాం భుజిష్యాజనే, సైరంధ్రీబధ్యమానరశనాకలాపజల్పాకజఘనస్థలాసు జనీషు.[2]......1.

(డ) (హర్షచరితమ్) తాత, బాణ, ద్విజానాం రాజా గురుదారగ్రహణమకార్షీత్; పురూరవా బ్రాహ్మణద్రవిణతృష్ణయా దయితేనాయుషా వ్యయుజ్యత; నహుషః పరకలత్రాభిలాషీ మహాభుజంగ ఏవాభవత్. యయాతి రాహితబ్రాహ్మణీపాణిగ్రహణః పపాత; సుద్యుమ్నః స్త్రీమయ ఏవాభవత్; సోమకస్య ప్రఖ్యాతా జగతి జంతువధనిర్ఘృణతా; ...... పురుకుత్సః కుత్సితం కర్మ తపస్యన్నపి మేఖలకన్యకాయామకరోత్; కువలయాశ్వో భుజంగలోకపరిగ్రహో దశ్వతరకన్యకామపి న పరిజహార; ...... నృగస్య కృకలాసభావేఽపి వర్ణసంకరః సముదృశ్యత; ...... నల మవశాక్షహృదయం కలిరభిభూతవాన్; సంవరణో మిత్రదుహితరి విక్లవతామగాత్; దశరథ ఇష్టరామోన్మాదేన మృత్యుమవాప; కార్తవీర్యో గోబ్రాహ్మణాతిపీడనేన నిధనమయాసీత్; ...... శంతను రతివ్యసనా దేకాకీ వియుక్తో వాహిన్యా విపినే విలలాప; ...... యుధిష్ఠిరో గురుభయవిషణ్ణహృదయః సమరశిరసి సత్యముత్సృష్టవాన్, ఇత్థం నాస్తి రాజత్వమపగత కలంకమ్.[3]......1.

(వాసవదత్తా) గురుదారహరణం ద్విజరాజోఽకరోత్; పురూరవా బ్రాహ్మణ ధనతృష్ణయా వినినాశ; నహుషః పరకలత్రద్రోహధీ భుజంగతామయాసీత్; యయాతి

---

1. చౌఖంబాప్రతి, పుటలు. 137, 38, 39.

2. చౌఖంబాప్రతి, పుటలు 155, 56, 57

3. చౌఖంబాప్రతి, పుటలు, 149, 50, 51, 52, 53.

ర్వహితబ్రాహ్మణీపాణిగ్రహణః పపాత; సుద్యుమ్నః స్త్రీమయ ఏవాఽభవత్; సోమకస్య ప్రఖ్యాతా జగతి జంతువధనిర్ఘృణతా; పురుకుత్సః కుత్సిత ఏవాభవత్; కువలయాశ్వోఽశ్వతరకన్యామపిజగామ; నృగః కృకలాసతామగమత్; నలః కలినాభిభూతః; సంవరణో మిత్రదుహితరి విక్లవతామగాత్; దశరథోఽపీష్టరామోన్మాదేన మృత్యుమవాప; కార్త వీర్యో గోబ్రాహ్మణపీడయా పంచత్వమయాసీత్; శంతను రతివ్యసనా ద్విలలాప; యుధిష్ఠిరః సమరశిరసి సత్యముత్ససర్జ; తదిత్థం నాస్త్యేవ జగత్యకలంకః కోఽపి.[1]...1.

(త) ఇవికాక వర్ణనలయందు బాణకావ్యములలోని చిన్నచిన్నవాక్యములు, పదసముదాయములు, ఉపమలు అనేకములు 'వాసవదత్త' లో మార్పులేకయు, కొలది మార్పులతోను కనబడుచున్నవి. కాదంబరి, వాసవదత్తలలో అట్టి సంవాదములు కొన్ని క్రింది అనుక్రమణికలో[2] చూడనగును.

| కాదంబరిలో | వాసవదత్తలో |
|---|---|
| దక్షిణాశావధూముఖవిశేషకస్య | అగస్త్యఇవ దక్షిణాశాప్రసాధకః |
| పశుపతిరివ మహాసేనానుయాతః | హరి ఇవ మహాసేనానుగతః |
| హరఇవ జితమన్మథః | హరఇవ నిఖర్త్రితమారశ్చ |
| జరాసంధ ఇవ ఘటితసంధి విగ్రహః | జరాసంధఇవ ఘటిత సంధి విగ్రహః |
| దశరథ ఇవ సుమిత్రోపేతః | దశరథఇవ సుమిత్రోపేతః |
| వైనతేయ ఇవ వినతానంద జనన | తార్క్ష్యఇవ వినతానందకరః |
| రణితమణీనాం మణినూపురాణామ్. | రణితనూపురమణీనాం రమణీనామ్. |
| మేఖలాదామ్నా పరిగతజఘనస్థలామ్ | మేఖలాదామ్నా పరికలిత జఘనస్థలామ్. |
| చక్రధర ఇవ కరకమలోపలక్ష్యమాణ శంఖచక్ర లాంఛనః | విష్ణురివ చక్రధరః. |
| పచ్యంతఇవ మే అంగాని | పచ్యంతఇవ మే అంగాని. |
| పిండాలక్తక రసరాగపల్లవిత పాద పంకజామ్ | పిండాలక్తకరాగపల్లవితపాదపంక్తిః |
| క్రుద్ధయేవ కృతభ్రూభంగయా | క్రుద్ధయేవ దర్శితముఖ భంగయా |

1. చౌఖంబాప్రతి, పుటలు. 239, 40, 41, 42.

2. ఈపట్టి అమరనాథపాండేయు "బాణభట్ట కీ ఆదాన్ ప్రదాన్" అను గ్రంథములో నుండి గృహీతము.

| కాదంబరిలో | వాసవదత్తలో |
|---|---|
| మత్తయేవ - ఆకలితగమనయా | మత్తయేవ స్ఖలద్గత్యా |
| క్వచిన్విరాటనగరీవ కీచకశతావృతా | విరాటలక్ష్మ్యేవ ఆనందిత కీచకశతయా |
| ఆత్మనా చ మధుపభుక్త శేషముకరో దశనమ్ | స్వయమపి తదుపభుక్తశేషమకరోద్దశనమ్. |
| అతివికచ ధవల కుసుమనికర మాత్యుచ్ఛ్రతయా తారాగణమివ శిఖరదేశలగ్నముద్వహద్భిః | శిఖరావలగ్నం తారాగణమివ కుసుమనికర ముద్వహద్భిః. |
| చతురుదధిమాలామేఖలాయా భువో భర్తా | చతురంబుధిమేఖలాం శాసతి వసుమతీమ్. |
| గ్రహాణాం తులారోహణం | గ్రహాణాం తులారోహణమ్. |
| కరిణాం దానవిచ్ఛిత్తిః. | దానచ్ఛేదః కరిషు పోలేషు. |
| కేశనఖానామాయాతి భంగః | కర్తనమలకేషు. |
| సకలాంతఃపుర ప్రధానభూతా | సర్వాంతఃపుర ప్రధానభూతా. |

(ద) భాషయేగాక కథయందు కొన్నిసంఘటనలుకూడ సమానములుగ కనబడుచున్నవి.

| కాదంబరి | వాసవదత్త |
|---|---|
| కపింజలుడు కామార్తుడైన పుండరీకుని ఉపాలంభము చేయుట. | మకరందుడు కామార్తుడైన కందర్పకేతువును ఉపాలంభము చేయుట. |
| అచ్చట పుండరీకుని జవాబు | కందర్పకేతువు జవాబు |
| దివ్యవాణి మహాశ్వేతను ఆత్మహత్యా ప్రయత్నము నుండి మాన్పుట. | దివ్యవాణి కందర్పకేతువును ఆత్మహత్యా ప్రయత్నము నుండి మాన్పుట. |
| శుకశారికాకలహము 1 | శుకశారికాకలహము. |
| ఇంద్రాయుధము అశ్వముపేరు 2 | మనోజవము అను అశ్వమునకు 'ఇంద్రాయుధముచంటి' అని విశేషణము. |

1. చూ. పరిశిష్టము. 1. (ట) (ఈ గ్రంథములో)

2. సుబంధువు మనోజవవర్ణనమున ఇంద్రాయుధమును అశ్వమునకు విశేషణముగ వాడుటయు 'కాదంబరి'లో అశ్వమే 'ఇంద్రాయుధము' అగుటయు

ఇటువంటివి ఇంకను కలవు.

2. 3. 10. బాణసుబంధుల భాషాభావఘటనాసంవాదములు యాదృచ్ఛికములు కాజాలవని పై యుదాహరణములు చూపుచున్నవి. కావున ఒకరు మరియొకరిని అనుకరించిరనుట స్పష్టము. కాని ప్రకృతి ఎవరిది? అనుకృతి ఎవరిది? అనుటలో పండితలోకము రెండుచీలికలై ఏకాభిప్రాయము లేకున్నది. బాణుడు పూర్వుడు, సుబంధువు తరువాత, బాణుని సుబంధువు 'కాపీ' కొట్టెను అను వాదమును సువిస్తరముగ శ్రీ A. B. గజేంద్రగడ్కర్ పండితుడు 'హర్షచరితము'నకు రచించిన ఆంగ్లపీఠికలో చర్చించియున్నాడు. అది సంగ్రహముగ —

(క) ఇపుడు లభ్యమగు సుబంధుని 'వాసవదత్త' 'దుర్గ్రాహకములు, అల్పములు, అనుచితములు అగు శ్లేషలతోనిండి[1] కథానైపుణ్యములేని నికృష్టకావ్యము. దీనిని బాణునివంటి మహాకవి పొగడియుండడు.'

(గ) సుబంధువు అమితముగ పదములను వాక్యములను భావములను కాళిదాసాదులనుండి స్వీకరించియున్నాడు. స్వోపజ్ఞకలవాడు ఇట్లు చేయడు. అట్టివానిని బాణుడు మెచ్చునా?

---

(మిగులు) ఉల్లేఖించి కొందరు పండితులు సుబంధువు బాణుని అనుకరించెనని తీర్మానించిరి. కాని సామ్యము పూర్వాపరనిర్ణయహేతువెట్లగును? బాణుడే సుబంధుని విశేషణమును తెచ్చి అశ్వనామముగ చేసియుండరాదా? చూ. 'వాసవదత్త' చౌఖంబాప్రతి, పుట 213 —

'శక్రేణేవ ఇంద్రాయుధేన మనోజవనామ్నా తురంగేణ ...'

ఇచ్చట శ్లేషోపమ. ఇంద్రాయుధము = 1. ఇంద్రుని ఆయుధము (వజ్రము). 2. అని తాక్షి అయిన గుఱ్ఱము. 'మల్లికాక్షస్సితైర్నేత్రైః కృష్ణై రింద్రాయుధో హయః' అని వైజయంతీ నిఘంటువు.

ఇంద్రాయుధనామ చర్చకు చూ. 15_2_9 (ఈగ్రంథమున).

1. 'వానరసేనేవ సుగ్రీవాంగద శోభితా' అని నాయికావర్ణనమున కోతుల ప్రశంస, మహిషీసంభవోఽపి వృషోత్పాదకః' అని రాజును వర్ణించుచు రాజమాతతో 'గేదె'ను ధ్వనింపజేయుట; శృంగారవిలాసములో 'ఆసన్న మరణాస్వివ జీవితేశ పురాభిముఖీషు' అని చావును, యమపురిని ప్రస్తావించుట, 'శ్విత్రీవ వియదశోభత' అని ఆకాశమును తెల్లకుష్టు మచ్చల మనిషికి పోల్చుట, ఇత్యాది.

మరియు, బాణుడు, హర్షచరితారంభమున —

'అన్యకవుల అక్షరములను ఇటునటుచేసి కావ్యములుఅనురూపమున మోస పుచ్చుకవి 'దొంగ' అని పండితులమధ్య అపకీర్తిపాలగును'[1] అని కవిచోరులను నిందించి అట్టివాడైన సుబంధువుకావ్యమునుండి తాను 'కాపీ' చేయునా? చేయడు.

(చ) సందర్భమునుబట్టి, అనగా ఆఖ్యాయికాకారుల ప్రశంస వెనువెంటనే 'వాసవదత్త'ను కీర్తించుటవలన, 'వాసవదత్త' ఆఖ్యాయిక అగును. సుబంధుని 'వాసవదత్త' కథ. కావున అది బాణుడు చెప్పిన 'వాసవదత్త' కాదు.

2. 3. 11. 'కాదంబరి'ని విస్తారమయిన ఆంగ్లపీఠికావాఖ్యానములతో ముద్రింపించిన P. పీటర్సను పండితుడు సుబంధునికి బాణుడు పూర్వుడు అనినమ్మి కొంత కాలమునకు మరియొక సందర్భములో మనసుమార్చుకొని సుబంధువే పూర్వుడని అంగీకరించెను.[2]

2. 3. 12. సుబంధువే పూర్వుడు అని గట్టిగ వాదించిన పండితులలో హాలు, మెక్‌డోనలు, గ్రే అను పాశ్చాత్యులు. విష్ణుశాస్త్రిచిప్లూంకరు, P. V. కాణే అను భారతీయులును ముఖ్యులు. వీరివాదము సంగ్రహముగ[3] —

(ఖ) నేడు లభ్యమైన సుబంధుని 'వాసవదత్త' నికృష్టకావ్యము కాదు. అనౌచిత్యములు ఉన్నను శ్లేషలలో, విరోధాభాసములలో, పరిసంఖ్యలలో సుబంధుని కావ్యము బాణునికి ప్రేరకమును, మార్గదర్శియు కాదగినది. సుబంధువును మెచ్చిన కవులమాటలన్నియు శుష్కములగునా?

(ఘ) వాల్మీకిని, కాళిదాసును బాణుడు ఎంతయు అనుకరించియుండగా[4] సుబంధువు అట్లు చేయుట ఎట్లు తప్పు అగును? బాణుడు తానే గ్రంథచోరుడై

---

1. అన్యవర్ణపరావృత్త్యా బంధచిహ్న నిగూహనైః।
అనాఖ్యాతః సతాంమధ్యే కవిశ్చోరో విభావ్యతే॥
(హర్ష చరితము 1-6)

2. చూ. P. V. కాణే పండితుని ఆంగ్లపీఠిక, కాదంబరి (1921), పుట. 12.

3. ఇచ్చట 'ఖ, ఘ, ఛ' అని మహాప్రాణాక్షరములతో చూపిన వాదలేశములు 2. 3. 10. లోని 'క, గ, చ'లకు క్రమముగా ప్రతివాదములు అగును.

4. అమరనాథపాండేయ 'బాణభట్ట కీ ఆదాన్‌ప్రదాన్' అను గ్రంథములో వాల్మీకిని, కాళిదాసును బాణుడు అనుకరించిన ఉదాహరణల పట్టీలు విపులమైనవి

కవిచోరుని నిందించియున్నాడు. ఎట్టి అనుకరణమును బాణుడు చౌర్యముగా గణించెనో మనకు తెలియదు. తాను సుబంధువును అనుకరించిన విధము అతనిమతమున చౌర్యము కాకపోయియుండవచ్చును.

(ఛ) బాణుడు చెప్పిన 'వాసవదత్త' 'ఆఖ్యాయిక' అని అనుమితమే కాని బాణోక్తము కాదు. బాణునినాటికి ఆఖ్యాయికాకథాలక్షణములు నిర్దిష్టములు కావేమో?[1] కొన్ని వ్రాతప్రతులలో 'వాసవదత్త' 'ఆఖ్యాయిక' అనియు, ఒక వ్రాతప్రతిలో కాదంబరి 'చంపువు' అనియు ఉన్నది.

2. 3. 13. (క) హేతువులు ఇరువాగుల నీరసములైనను ఈవాదప్రతివాదములు విజృంభించి అనిర్ధారితముగ నిలిచినవి. ఈ సంకటమున సుబంధువు కాల నిర్ణయము బాణకాల నిరపేక్షముగ చేయగలిగిన మిక్కిలి తోడ్పడును. సుబంధువు కాలనిర్ణయమును L. H. గ్రే పండితుడు తన వాసవదత్తాంగ్లభాషాంతరీకరణ పీఠిక యందు చర్చించియు అందు బాణుని వాసవదత్తా ప్రశంసను ఒక హేతువుగ గ్రహించుటచే అతని వాదమును అందరును ఒప్పరు.

(గ) వాక్పతిరాజు (బప్పఇరాఅ) అను ప్రాకృతకవి తన తన 'గౌడవహో' అను కావ్యమున సుబంధువును కాళిదాసాదులతో స్మరించి బాణుని విస్మరించుట గుర్తింపదగిన విషయము—

'అగ్నికి మిత్రుడైన (అగ్నిసముడైన) భాసునియందు, కాంతిదేవుడైన (అతిలోకసుందరుడైన) రఘువంశకారుని (కాళిదాసుని)యందు, సుబంధువు బంధము (కావ్యము)లో, హరిచంద్రుని (కావ్యము)లోను (నాకు) ఆనందము'[2]

---

(మిగులు) కలవు. అట్లే కాళిదాసుకూడ 'శివపురాణము' నుండి 'దొంగిలించి' 'కుమారసంభవము'న వాడుకొన్న వాక్యముల పెనుపట్టీ నిర్ణయసాగరవారి 'కుమారసంభవం (1946)'న పరిశిష్టములో నారాయణరాం ఆచార్యులు సమకూర్చినది కలదు. దానిబట్టి కాళిదాసో లేక వ్యాసుడో గ్రంథచోరుడగును. ఇది ఎట్లు నిర్ణయించినను గొంతులో వెలగకాయయే. కావున గ్రంథచౌర్యము సంస్కృత సాహిత్యములో పెద్దదోషము కాదు అని విరమింతము.

1. ఈ లాక్షణిక భేదములు బాణ కావ్యములవలననే ఏర్పడినవని కొందరి వాదము.

2. భాసమ్మి జలణమిత్తే కాంతిదేవే అ జస్స రహుఆరే।
సోబంధవే అ బంధమ్మి హారిఅందే అ ఆణందో॥ (గౌడవహో 5-800)

ఇందు భాసరాశివాసులకు చెప్పిన విశేషణములను తత్తత్ - కావ్యగుణము లుగ గ్రహింపవలెను. దీనిపై కాణే పండితుని యభిప్రాయము సంగ్రహముగ[1] —

'వాసవదత్త' సుబంధునిది ఒక్కటే మనకు తెలియును. దానినే వాక్పతిరాజు ప్రశంసించెను. వాక్పతిరాజు కాన్యకుబ్జమున యశోవర్మ ఆస్థానకవి కావున అతడు తన కావ్యమును క్రీ. శ. 700 - 725 మధ్య వ్రాసియుండునని చారిత్రకాధారములమీద నిర్ణయమగును. అనగా బాణునికి తరువాత ఒకశతాబ్దము లోపలివాడు వాక్పతిరాజు.

అతడు బాణుని చెప్పక సుబంధువును చెప్పుట ఎట్లు? ఆనాటికి సుబంధువు కావ్యము మిక్కిలి ప్రసిద్ధమయియుండగా బాణుని కావ్యముల కీర్తి ఇంకను వ్యాపింప లేదేమో. అట్లైన సుబంధువు బాణునికి పూర్వుడైయుండి తగు ప్రసిద్ధిని కాలక్రమ మున పొందియుండును, ఇంతకన్న వేరు అనుమానము వీలులేదు.—

కొందరు ఈవాదమును అంగీకరింపరు. వీరి మతమున బాణుని ఉపేక్షించుట తత్ కీర్త్యభావ నిరూపణముకాదు. పూర్వకవులలో బాణుడు వ్యాసునిచెప్పి వాల్మీకిని చెప్పలేదు. అంతమాత్రమున బాణునినాటికి వాల్మీకి అప్రసిద్ధుడగునా? కాదంబరి నిండుగ రామాయణ ప్రభావము కనబడుచున్నది కదా?

2 3. 14. ఇట్టియెడ సామాన్యపాఠకుని నిర్ణయమెట్లు. పండితుల తగవును తీర్చు వారెవరు?. బాణోక్తమైన 'వాసవదత్త'యే నేడు ఉన్న సుబంధుని 'వాసవదత్త' అనుకొనుటకు తర్కపాండిత్యము అనావశ్యము. లోకరూఢియు దానినే బలపరచు చున్నది. బహుప్రయాసతో సమర్థించినను సందేహాస్పదమగు వాదముకన్న సమర్థింపు లేకయే ఆదరణీయమగు వాదము సామాన్యపాఠకునికి గ్రాహ్యమగును. ప్రతిభా వ్యుత్పత్తులలో తనయంతటివాడు కాకపోయినను గద్యకావ్యమునకు మార్గదర్శకు డయినందున బాణుడు సుబంధువును ఔదార్యముతో కీర్తించియుండును. కొన్నిచోట్ల అనుకరించియు ఉండును. ఆదరముచేత చిన్నకవిని పెద్దచేయుట సహజమేకదా. బాణుడు అంతగా పొగడిన భట్టారహరిచంద్రుడు ఎంతమాత్రపు కవియో మనకు తెలియదు. అతనికావ్య మొకటియు నిలువలేదు.

సుబంధువు బాణునకు పూర్వుడు అను సులభమైన తీర్మానముతో గ్రంథ విస్తరభీతిచే ఈయంశము ఇంతటితో అవసితము

---

1. చూ. కాణే ఆంగ్లపీఠిక, కాదంబరి (1921).

2. 3. 5. బాణసుబంధువుల భాషాభావాది సంవాదములు ఒకరు ఇంకొకరిని అనుకరించుటకాక ఇరువురును మరియొకరిని అనుకరించుటవలనకూడ సంభవించియుండదగును. అనేకవాక్యములు గద్యకారుల 'ఉమ్మడియాస్తిగ' నుండినవేమో. పూర్వపు గద్యకావ్యములేవియు దొరకనందున మనము సుబంధు బాణుల కావ్యములే తొలివి అను నభిప్రాయమును అవిమర్శితముగ స్వీకరించియుండదగును. కావున ఈ సంవాదముల సంగతి అంతముఖ్యాంశము కాదనియు తలపవచ్చును.

## 2. 4. బాణుని సమకాలికకవులు

2. 4. 1. కవిప్రశంసలలో బాణునితో మయూరకవిని, ఒక మాతంగకవి, దివాకరుడు అనువానిని జోడించి చెప్పియున్నారు.

'సూక్తిముక్తావళీ' అను సంకలన గ్రంథములో తత్కర్త జల్హణుడు రాజశేఖరునిది అని ఒక శ్లోకమును చేర్చియున్నాడు—

'ఆహా, వాగ్దేవీప్రభావము! మాతంగకవి దివాకరుడును బాణ మయూరులతో సమానుడుగ హర్షుని ఆస్థానములో సభ్యుడయ్యెను కదా?[1]'

ఈ మాతంగ దివాకరుని గురించి మరియేమియు తెలియదు. ఒక, రాజశేఖరునిది అనబడు, చాటువులోని[2] కవుల జాబితాలోకూడ ఇతనిపేరు కలదు. 'మాతంగ' అనునది నేడు హరిజనులలో 'మాదిగ' అను వర్గనామమునకు ప్రకృతిరూపమని ప్రసిద్ధము. నేటి జాషువావలె ఆనాడు దివాకరుడు అను హరిజనకవి అసమాన ప్రతిభాశాలి ఉండియుండును. అతడు మాతంగుడయ్యు ప్రతిభచేత గొప్ప బ్రాహ్మణకవుల సరసను కూర్చుండు అర్హతను పొందెననుటలో హర్షుని కవిప్రీతియు, ఔదార్యమును తెలియుచున్నది. హర్షుని బౌద్ధమతాభిమానము[3] మాతంగకవిని దగ్గరతీయుటకు దోహదమై యుండును. బౌద్ధమతమున అస్పృశ్యత లేదు.[4]

---

1. అహో, ప్రభావో వాగ్దేవ్యా యన్మాతంగదివాకరః ।
శ్రీహర్షస్యాభవత్ సభ్యః సమో బాణమయూరయోః ॥

2. చూ. బాణప్రశస్తి 1. 2. 4. (గ).

3. చూ. 16. 3. (జ).

4. కావుననే అంబేద్కారు మహాశయుడు హరిజనులను బౌద్ధమత స్వీకారము చేయుడని ఉద్బోధించుట.

దివాకరుని కావ్యము ఏదియు నిలువలేదు.

2. 4. 2. మయూరుని సూర్యశతకము నేడును ప్రసిద్ధము. దీనికి బహువ్యాఖ్యలు ఉండుట, దీనినుండి ఆలంకారికులు తరచు ఉదాహరించుట, ముఖ్యముగ మమ్మటుడును, అభినవగుప్తుడును పేర్కొనుట మయూరుని ప్రసిద్ధికి తార్కాణములు.

సూర్యశతకవ్యాఖ్యాతలలో ముఖ్యుడు మధుసూదనుడు. అతడు ఇట్లు చెప్పియున్నాడు —

'శ్రీహర్షుని (ఆస్థానములో) సభ్యులైన మహాకవులగు బాణమయూరులు ఉండిరి. వారిలో మయూరుడు (పిల్లనిచ్చిన) మామ, కాదంబరీకర్త బాణుడు అల్లుడు.[1]'

దీనివలన బాణమయూరులు సమకాలికులు, బంధువులును అని తెలియుచున్నది.

మరియు, మేరుతుంగకవి 'ప్రబంధచింతామణి' లో బాణుడు మయూరుని సోదరికి భర్త[2] అని చెప్పెను. పద్మగుప్తుని పద్యములో[3] బాణమయూరుల జోడింపు కలదు. కావున వారి బంధుత్వము ఎట్లున్నను వారిరువురును సమకాలికులు అనుటలో ఏకాభిప్రాయము కలదు.

2. 4. 3. బాణమయూరులనుగురించి ఒక చిత్రమైనకథ కలదు —

ఒకనాడు వేకువనే మయూరుడు బాణుని ఇంటిమీదుగ నడచిపోవుచుండగా, ఇంటిలో బాణుడు భార్యతో కలహించుట విని వాకిట నిలిచెను. అప్పుడు బాణుడు భార్యను అనునయించుటకు ఆశువుగ ఒకపద్యమును మొదలుపెట్టి మొదటి మూడు పాదములు ఇట్లు చదివెను.

గతప్రాయా రాత్రిః కృశతను, శశీ శీర్యత ఇవ,
ప్రదీపోఽయం నిద్రావశముపగతో ఘూర్ణిత ఇవ ।

---

1. 'శ్రీహర్షస్య సభ్యౌ మహాకవీ పౌరస్త్యౌ బాణమయూరా వాస్తామ్. తయోర్మధ్యే మయూరభట్టః శ్వశురః, బాణభట్టః, కాదంబరీ గ్రంథకర్తా తస్య జామాతా.' (శ్రీ A. B. గజేంద్ర గడ్కరు పండితుని హర్షచరితపు ఆంగ్లపీఠికనుండి ఉద్ధృతి

2. చూ. అందే అధోజ్ఞాపిక పుట XVI.

3. చూ. బాణప్రశస్తి. 1. 2. 6.

ప్రణామాంతో మాన స్త్యజసి న తథాపి, క్రుధ మహో !

.......................................... ॥

(ఓ శుభాంగి, రాత్రికి ముదిమి వచ్చినది; చంద్రుడు మందగించుచున్న ట్లున్నాడు; ఈ దీపము నిద్రాపశమై తొట్రుపడుచున్నట్లున్నది; ప్రియుని ప్రణామముతో వీడదగినదెకదా అభిమానము. అట్లు చేసినను క్రోధము వీడకున్నావు ఆహా ...... )

భోజుడు చెప్పినట్లు[1] పద్యకవిత్వములో బాణునికి పసతక్కువేమో, పద్యము నాలుగవపాదము కుదురక ఆగిపోయెనట. వాకిటనే వినుచున్న మయూరుడు కవితా చాపలము పట్టలేక ఆపాదమును ఇట్లు పూరించెను.

'కుచప్రత్యాసత్త్యా హృదయమపి తే చండి, కఠినమ్' ॥

(ఓ చండీ, కఠినకుచసామీప్యమువలన నీ హృదయమును కఠినము.)

ఈ పూరణము బాణునికి ఆహ్లాదకారణముకాగా, అతనిభార్యకు కోపహేతువు అయినది; చీకటిలో తండ్రినిగుర్తింపక, ఎవరో పరపురుషుడు తమ ప్రణయకలహమున జోక్యముకలుగజేసికొన్నందుకు 'నీవు కుష్ఠరోగివి కమ్ము' అని మయూరుని శపించెను. ఆమె పాతివ్రత్యమహిమవలన అతడు అట్లే అయ్యెను. తరువాత సూర్యునిగూర్చి తపస్సుచేసి వ్యాధినివారణముచేసికొని 'సూర్యశతకము' వ్రాసెను.[2]

ఈకథ కొద్ది భేదముగను లభ్యము.

2. 4. 4. మయూరుని సూర్యశతకపు ప్రసిద్ధిని ఓర్వలేక బాణుడు తన కాలుసేతులను స్వయముగా తెగవేయించుకొని, చండీదేవినిగురించి తపముచేసి, కాలుసేతులను మరలపొంది, 'చండీశతకము'ను రచించెననికూడ ఒకకథ కలదు.

ఈకథలు కేవలము కల్పనలు అని త్రోసివేసినను బాణమయూరుల సమకాలికత్వనిరూపణమునకు కొంత ఉపకరించును.

---

1. చూ. 2. 3. 6 (చ).

2. మయూరునిగురించి ఇంకను వివరములు కోరువారు శ్రీ చదలువాడ జయరామశాస్త్రిగారి సూర్యశతక వ్యాఖ్యానగ్రంథ పీఠికను చూడనగును.

## 2. 5. బాణుని రచనలు

జగత్ప్రసిద్ధమయిన కాదంబరియు కించిదూనప్రసిద్ధమయిన హర్షచరితమును కాక బాణునివి అనబడు మరికొన్నిరచనలు కలవు. అందు రెండులభ్యములు. మిగిలినవి ఇతరగ్రంథములలో ఉల్లేఖింపబడి నామమాత్రావశిష్టములు.

(క) చండీశతకము : లభ్యము. కొంతప్రాచుర్యముకల రచనయే. చండీదేవికి 102 శార్దూలవిక్రీడితములలో స్తుతి. ఈ పద్యములను వాగ్భట మమ్మట భోజాద్యాలంకారికులు ఉదాహరించియున్నారు. ఈ సందర్భముననే భోజుడు బాణునికి పద్యరచనలో ప్రతిభతక్కువ అని నుడివినది. కాదంబరిలో చండికావర్ణనము[1], హర్షచరితములో శుష్కనిష్పత్రమైన చండికాయతనవనవర్ణనము[2], ఆయాచోట్ల భక్తితో చండికను స్మరించుటయు బాణుని చండీశతకకర్తృత్వమును నిస్సంశయము చేయుచున్నవి.

కాని బూలర్ అను ఒక పాశ్చాత్యపండితుడు తానుచూచిన ఒక చండీశతకపు వ్రాతప్రతిలోమాత్రము కవిపేరు 'శ్రావణభట్టు' అని ఉన్నట్లు చెప్పి అది లేఖకప్రమాదమున ఏర్పడినరూపము కాదగును అని నిర్ధారణ చేసెను.

మయూరుని సూర్యశతకములోవలె బాణుని చండీశతకములోను 102 పద్యములే ఉండుట మయూరబాణులమధ్య స్పర్ధకు సూచనగా గ్రహింపదగును. ఎట్లైనను సూర్యశతకమునకున్న గౌరవము చండీశతకమునకు లభింపలేదు.

(గ) శివశతకము : కొన్ని సంకలనగ్రంథములందు బాణునివి అని కొన్ని శివస్తోత్రపద్యములు కనపడుటచేత, వానిక్రింద 'శివస్తుతి' అని లిఖించియుండుటచేతను కొందరు బాణుడు శివశతకమో శివస్తుతియో రచించియుండునని ఊహించిరి. కాని అట్టి సంపూర్ణగ్రంథము దొరకలేదు.

(చ) ముకుటతాడితము : నాటకము. దానిని బాణుడు రచించినట్లు అందుండి, త్రివిక్రముని 'నలచంపువు'ను వ్యాఖ్యానించిన గుణవిజయగణి, ఒక

---

1. కాశీప్రతి పుటలు 334, 35, 36, 37. వావిళ్ల 215, 16, 17.

2. చౌఖంబాప్రతి. పుట. 97, 98.

పద్యమును[1] ఉదాహరించుటవలన తెలియుచున్నది. అదియే భోజుని 'శృంగారప్రకాశ' లోను కలదు. ఆనాటకపు ఇతివృత్తము భీమదుర్యోధనుల గదాయుద్ధము. ఈ నాటకమును వేరెవ్వరును చెప్పలేదు.

(జ) శారదచంద్రిక : నాటకము. 'దశరూపకము' నను 'శారదాతనయుని' 'భావప్రకాశము' నను రెండు పద్యములు[2] ఆ నాటకమును ప్రస్తావించునవి కలవు. ఆ నాటకము నష్టమైపోయినది.

(ట) పార్వతీపరిణయము : నాటకము. ముద్రితము. దీని కర్తృత్వమును గురించి కొంత వివాదము కలదు.

---

1. యదాహ ముకుటతాడితనాటకే బాణః,

> ఆశాః ప్రోషితదిగ్గజాఇవ, గుహాః ప్రధ్వస్తసింహాఇవ,
> ద్రోణ్యః కృత్తమహాద్రుమాఇవ, భువః ప్రోత్ఖాతశైలాఇవ ।
> బిభ్రాణాః క్షయకాలరిక్తసకలత్రైలోక్యకష్టాం దశాం
> జాతాః క్షీణమహారథాః కురుపతేర్దేవస్య శూన్యాస్సభాః ॥

[ M. కృష్ణమాచారియరు "History of Classical Sanskrit Literature" 457 క్రింద అధోజ్ఞాపిక ].

2. దశరూపకమున 'ఉత్సృష్టికాంకము' అను నాటకవిశేషమునకు ఉదాహరణముగ 'శారద చంద్రిక' పేర్కొనబడినది.

> చంద్రాపీడస్య మరణం యత్ ప్రత్యుజ్జీవనాంతిమమ్ ।
> కల్పితం భట్టబాణేన యథా శారదచంద్రికా ॥

భావప్రకాశలో,

> కల్పితం భట్టబాణేన యథా శారదచంద్రికా ।
> దివ్యేన మర్త్యస్య వధః కావ్యస్యావశ్యభావతః ॥

దీనిని శారదాతనయుడు దశరూపకమునుండియే గ్రహించి కొద్దిగ మార్చినట్లు స్పష్టము.

దీని ప్రస్తావనలో నాటకకర్త వత్సాన్వయుడైన బాణుడు అని, అతనికి కవిసార్వభౌమబిరుదమును చెప్పబడియున్నది[1]. ఈబాణుడు కాదంబరీబాణుడనియే పలువురమతము. కాని, నాటకము గొప్పగలేకుండుటచేత, ఇది మరియొక బాణునిది అని కొందరి అభిప్రాయము. అభినవభట్టబాణ బిరుదాంకితులు శ్రీ R. V. కృష్ణమాచారియర్ విపులమయిన చర్చచేసి[2] ఈనాటకము 15-వ శతాబ్దమున ఆంధ్రదేశమున నున్న విద్యారణ్య శిష్యుడు, 'వేమభూపాలచరితమ్' అను ఆఖ్యాయికాకారుడును అగు వామనభట్టబాణుడు అను ఆంధ్రుడు వ్రాసినది అని తీర్మానించిరి. నాటకమును ముద్రింపించునపుడు వామనుని పేరునే అందుపై వేసిరి. (సాహసము కదా ?)

పార్వతీపరిణయకర్త కాదంబరీబాణుడు కాడనుటకు వారు చెప్పిన కారణములు సంగ్రహముగ —

1. ఈ నాటకమునుండి ఒక్కపద్యమైనను ఆలంకారికులు ఎవ్వరును ఉదాహరింపలేదు. సంకలనగ్రంథములలోను కానరాదు.

2. దీనికథయు భాషయు పూర్తిగా కాళిదాసు 'కుమారసంభవము'నకు అనుకరణ. కవిచోరుని నిందించిన బాణుడు అట్లు కాళిదాసు భావములను, భాషను దొంగిలింపడు.

3. అసలు, ఈనాటకము అల్పమైనది. కాదంబరీబాణునివంటి మహాకవి ఇంత 'చచ్చు' నాటకమును వ్రాయడు.

ఇవి వ్యక్తిగతాభిప్రాయములేకాని సరియైనకారణములు కావని అనేకులు పై వాదమును అంగీకరింపరు. వారిలో శ్రీ P. V. కాణేపండితులు ముఖ్యులు[3] వారు ఈ నాటకము కాదంబరీబాణుని ప్రథమప్రయత్నము కాదగును అని అభిప్రాయపడిరి.

---

1. అస్తి కవిసార్వభౌమో వత్సాన్వయజలధిసంభవో బాణః
నృత్యతి యద్రసనాయాం వేధోముఖలాసికా వాణీ ॥
(పార్వతీపరిణయము 1-4)

2. చూ. వాణీవిలాసప్రచురణ "పార్వతీపరిణయమ్", పీఠిక.

3. తెలుగున విపులచర్చయు, కాదంబరీ బాణ పక్షమున తీర్మానమును, శ్రీ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రుల 'ఆంధ్ర పార్వతీ పరిణయము'నకు శ్రీ పోలూరి హనుమజ్జానకీరామ శర్మగారి పీఠికను చూడదగును.

(డ) రత్నావళి(?) : నాటకము. శ్రీ (శీలాదిత్య)హర్షునిది అని ప్రస్తావన లోను, అనేకాలంకారికుల ఉల్లేఖములవలనను ప్రసిద్ధమైన ఈ నాటకమును హర్షుడు వ్రాయలేదనియు బాణుడు వ్రాసి ధనమునకై హర్షునిపేరు పెట్టెననియు ఒక శుష్క వాదము బహుకాలముగ మన ప్రాచీనపండితులచే ఆదరింపబడియుండినది. దీనికి కారణము మమ్మటుని 'కావ్యప్రకాశ' కశ్మీరదేశపు వ్రాతప్రతులలో కావ్యము ధనము కొరకు వ్రాయుదురు అను సందర్భమున.[1]

'శ్రీహర్షాదులవలన బాణాదులకు ధనములభించినట్లు.[2]'

అనియుండుట. మరికొన్ని ప్రతులలో 'బాణాదులకు' మారుగ 'ధావకాదులకు' అనియు కలదు. వైద్యనాథుడు అను వ్యాఖ్యాత 'హర్షుడు అనురాజుపేర రత్నావళి అను నాటకము వ్రాసి ధావకుడు అను కవి చాల ధనమును పొందెను[3]' అని వ్రాసి యున్నాడు.

కాని ఈ వాదమును ఇప్పుడు ఎవరును అంగీకరింపరు.[4]

## 2. 6. బాణుని స్వీయచరిత్రము

2. 6. 1. బాణుని 'హర్షచరితము' హర్షవర్ధనశీలాదిత్యుని జీవితచరిత్రమైనను అందు మొదటి రెండు ఉచ్ఛ్వాసములు పూర్తిగ బాణుని స్వీయచరిత్రమే.[5] మూడవ ఉచ్ఛ్వాసమున 'హర్షచరిత్ర'ను రచించుసందర్భమును చెప్పిన తరువాత హర్షుని చరిత్ర మొదలగును.

---

1. 'కావ్యం యశసే అర్థకృతే ... ...' ఇత్యాది.

2. 'హర్షాదేః బాణాదీనామివ ధనః' ( – ధావకాదీనాం – )

3. 'శ్రీహర్షాఖ్యస్య రాజ్ఞో నామ్నా రత్నావళీం నాటికాం కృత్వా ధావకాఖ్యః కవి ర్బహుధనం లేభే'

4. పాశ్చాత్యపండితులలో ఈవాదమును మొదట బయటలాగినది వాసవదత్తా ప్రథమముద్రణ సంపాదకుడు F. హాలు పండితుడు.

5. ఇది ఆఖ్యాయికాలక్షణములలో ఒకటి చూ. 4 – 11.

బాణుడు తన వంశప్రాశస్త్యమును పౌరాణికపద్ధతిలో వివరించి, తన జీవితపు ప్రథమదశను మాత్రము వర్ణించును. ఇందు జీవితవిశేషములు చారిత్రకదృష్టిలో ఎక్కువలేకున్నను మరి యే ఇతరసంస్కృతకవియు ఈమాత్రముకూడ చెప్పనికారణమున ఇది సంస్కృతసాహిత్యములో విశేషప్రక్రియగా గణింపవలెను.

2. 6. 2. బాణుని చరిత్రకు వేరు ఆధారములు లేనందున హర్షచరితారంభమునకల బాణసంబంధకథనము సంగ్రహముగ ఇచ్చట చూడనగును.

### 2. 6. 3. బాణుని వంశము (హర్షచరితము ప్రథమోచ్ఛ్వాసమునుండి)

ఒకపరి బ్రహ్మ సత్యలోకమున పేరోలగమున నుండగా దూర్వాసమునికిని ఉపమన్యమునికిని వేదార్థసంబంధమయిన వివాదము ఏర్పడెను. ముక్కోపి అయిన దూర్వాసుడు, (వివాదమువలనికోపముచే గొంతు వడకగా) సామగానమున స్వరము తప్పు పలికెను. ఇదివినగనే 'ఇతడు ముక్కోపి, శపించును' అని భయపడి అందరును ఊరకుండిరి. బ్రహ్మయు వారి దృష్టిని వేరొక విషయముపైకి మరల్చుటకు యత్నించుచుండెను. కాని, కౌమారదశలోని బాలభావముచేత, సరస్వతీదేవి దూర్వాసుని పొరపాటునకు నవ్వెను. అదిచూచి మండిపడి, దూర్వాసుడు సరస్వతిని 'పాపకారిణీ, దుర్వినీతా, మర్త్యలోకమున పడుము' అని శపించెను. బ్రహ్మ దూర్వాసుని మందలించి, 'భూలోకములో పుత్రుని కని అతనిముఖము చూడగానే నీకు శాపవిమోచనము కాగలదు' అని సరస్వతిని అనుగ్రహించెను.

సరస్వతియు, ఆమెచెలి సావిత్రి వెంటరాగా ఆకాశగంగాప్రవాహమున భూలోకమునకు వచ్చి 'శోణ'[1] నదీతీరమును చేరెను. ఇరువురును అచ్చట ఒక లతామండపమున నివసించుచుండిరి. అట్లు కొంతకాలముగడచెను.

ఒకదినము ఉదయము, వారికి గుఱ్ఱపుడెక్కల గొప్ప శబ్దము వినిపించెను. సరస్వతి కుతూహలముచేత పొదరింటివెలుపలికి వచ్చి, వేగముగా సమీపించుచున్న

---

1. సంస్కృతమున నదుల పేర్లన్నియు స్త్రీలింగమున 'గంగా' వలె ఆకారాంతమో, 'తపతీ' వలె ఈకారాంతమో 'సరయూ' వలె ఊకారాంతమో. కాగా 'శోణః' అని ఇదిమాత్రము పుంలింగమున వ్యవహృతము.

పెద్ద గుఱ్ఱపుదండును, కాల్బలమును చూచెను. ఆయాశ్వికులలో సుమారు పదునెనిమిది వత్సరముల ఈడుగల సుందరయువకుడు ఒకడు ఉండెను. అతనితో మధ్యవయస్కుడును ఒకడు ఉండెను. దండును దూరముగ నిలిపి ఆయువకుడు, పెద్దవాడు తోడు రాగా, సరస్వతీసావిత్రులను సమీపించెను. అతిథిసత్కారములుచేసి, సావిత్రి ఆపెద్దవానిని ఆ చిన్నవానివృత్తాంతము అడిగెను. అతడు ఇట్లు చెప్పసాగెను.

'ఈ యువకుడు చ్యవనుని పుత్రుడు, దధీచుడు. ఇతనితల్లి శర్యాతచక్రవర్తి కుమారిత సుకన్య. దౌహిత్రునిమీది వాత్సల్యముచేత శర్యాతుడు పిల్లవానిని తనదగ్గరనే ఉంచుకొని విద్యాబుద్ధులుగరపెను. ఇప్పుడు తండ్రిని చూచిరమ్ము అని నాతో పంపెను. నేను శర్యాతుని భృత్యుడను, వికుక్షి అనువాడను. శోణకు ఆవలియొడ్డున చ్యవనాశ్రమము కలదు. అచ్చటికి పోవుచున్నాము.'

తమసంగతి చెప్పి, వికుక్షి సావిత్రీసరస్వతులను మీరెవరు అని అడిగెను. సావిత్రి ఇట్లు చెప్పెను, 'అయ్యా మేము ఇచ్చట బహుకాలము వసింపవలసి ఏర్పడినది. (వివరములు) క్రమముగ మీకే తెలియును.'

దధీచుడును వికుక్షియు గుఱ్ఱములెక్కి వెడలిరి. దధీచుడు పోయినదిమొదలు సరస్వతి అతనినే తలచుకొనుచుండెను. కొంతకాలమునకు దధీచుడు మరలి శర్యాతుని యొద్దకు పోవు సందర్భమున, వికుక్షి ముందుగా సరస్వతీసావిత్రులకు కనిపించెను. దధీచునిదగ్గరనుండి వారియొద్దకు మాలతి అను దూతి వచ్చునని ఎచ్చరించి వికుక్షి వెడలెను. తదుపరి అశ్వారూఢయై మాలతి వచ్చి కొంతసేపు ఉండి దధీచుని తీసికొని వచ్చెదను అని చ్యవనాశ్రమమునకు పోయెను. వెనువెంటనే దధీచునితో తిరిగివచ్చెను. దధీచుడు సరస్వతిని ప్రేమించి ఆమె ఇయ్యకొనగా ఆమెతో ఒక ఏడాది కాపురము చేసెను. ఆమెయు గర్భముధరించి ఒకపుత్రుని కనెను. చదువులతల్లి పుత్రుడగుట అతనికి పుట్టుకతోనే సకలవిద్యలును లభించెను. పుత్రముఖసందర్శనముతో శాపము తీరగా ఆబిడ్డను తండ్రిచేతనిడి సరస్వతి బ్రహ్మలోకము చేరెను.

దధీచుడు శిశువును భార్గవవంశస్థుడును భ్రాతృవ్యుడును అగు ఒకబ్రాహ్మణుని భార్య అక్షమాల అనునామెకు ఒప్పగించి తాను తపస్సుకొరకు అడవికి పోయెను. అక్షమాలకును ఆసమయమున ఒకపుత్రుడు కలిగియుండెను. సమవయస్కులగు ఇరువురిని ఆమె పెంచి పెద్దచేసెను. సరస్వతీపుత్రునకు సారస్వతుడు అనియు అక్షమాలపుత్రునకు వత్సుడు అనియు పేర్లు కలిగెను.

వారు ఇరువురును సొంతయన్నదమ్ములవలె మెలగుచుండిరి. సారస్వతుడు గొప్ప పండితుడు అయ్యెను. అతడు వత్సునికూడ తనయంతటివానినిగా చేసి అతనికి పెండ్లిచేసి శోణతీరమున ప్రీతికూటము[1] అను గ్రామమున నిలిపి తాను తండ్రి దధీచుని అన్వేషించుచు అడవులకు పోయెను.

ఆ వత్సుడే బాణవంశమునకు కూటస్థుడు.

ఈ కథను 'పిట్టకథ', 'పుక్కిటిపురాణము' ఇత్యాదినామములతో ఆధునికులు వర్ణించుట న్యాయమే అయినను ఇందు వత్సుని వంశవిషయములో అభూతకల్పనలు ఏవియు లేవు. సారస్వతుని చరిత్రము సత్యముగ వత్సునికి సంబంధము లేదు.

ఇచ్చట బాణుని వంశావతరణము వంశవృక్షముగ పొందుపరుపబడినది.

## 2. 6. 4. బాణుని వంశవృక్షము (హర్షచరితానుసారముగ)




1. ఇప్పుడు శోణమీద, ఆనాటి ప్రీతికూట గ్రామసమీపమున కట్టు ఆనకట్ట వలన ఏర్పడు జలాశయమునకు బాణుని జ్ఞాపకార్థము 'బాణసాగర్' అని పేరు పెట్టుటకు గవర్నమెంటువారు నిశ్చయించిరని వార్తాపత్రికలలో ఇటీవల వచ్చిన కబురు సంస్కృత సాహిత్యాభిలాషులకు ఎంతయు పరితోషకము.

1. భృగువు, 2. హంసుడు, 3. శుచి, 4. కవి, 5, మహీదత్తుడు, 6. ధర్ముడు, 7. జాతవేదసుడు, 8. చిత్రభానుడు, 9. త్ర్యక్షుడు, 10. అహిదత్తుడు, 11. విశ్వరూపుడు.

కాదంబరిలోని పీఠికప్రకారము కుబేరునికుమారుడు అర్థపతి. అందు ఒకతరము పూర్తిగ, పాశుపతుడు అతనిసోదరులు విస్మరింపబడిరి. శ్లోకమేదైనను వ్రాతప్రతిలో ఆదిలోనే ప్రమాదవశాత్తు రాలిపోయెనేమో అని కాణేపండితుని అనుమానము. బాణుడుకాని తత్పుత్రుడుకాని పాశుపతుని ఎట్లు విస్మరింపగలరు ?

## 2. 6. 5. బాణుని బాల్యము (హర్షచరితప్రథమోచ్ఛ్వాసమునుండి)

వాత్స్యాయనవంశస్థుడు చిత్రభానునికిని రాజదేవికిని బాణుడు జన్మించెను. అతని శైశవముననే తల్లిచనిపోగా పసివానికి చిత్రభానుడు తానే తండ్రియు తల్లియునై అతిగారాబముగ[1] పెంచెను. బాణుడు పదునాలుగేండ్లప్రాయముననే అన్నివిద్యలు నేర్చి గురువునొద్దనుండి ఇంటికి వచ్చిన కొలదికాలమునకే పూర్ణకాముడేమో తండ్రి మరణించెను. ఆ దుఃఖమున క్రుంగి బాణుడు ఇంటనే కొంతకాలము గడపెను. కాలవశమున శోకము మరచెను. అతనికి సమవయస్కులగు పలుతెరగుల మిత్రులు (బంధువులును) ఉండిరి. వారిని (ఇతరులు కొందరిని) వెంటదీసికొని అతడు దేశాటనమునకై ఇల్లువెడలెను.

2. 6. 6. బాణుని పరివారములోని మనుష్యులు, వారివృత్తులు ఆనాటిసమాజమునకు ఒక 'నమూనా' గా కనపడుటవలన వారి జాబితా వివరముగ ఇట చేర్పబడినది.

### బాణుని పరివారము (హర్షచరితమునుండి[2])

| | |
|---|---|
| 1. చంద్రసేనుడు<br>2. మాతృషేణుడు | బాణుని పారశవసోదరులు (బాణుని తండ్రికిని ఒక శూద్ర భార్యకును పుట్టినవారు) |
| 3. ఈశానుడు | —భాషాకవి (అపభ్రంశభాషలలోకవి) పరమమిత్రుడు. |

1. బాణుడు తనతండ్రిని ప్రేమతో తలచుకొనియే కాదంబరిలో వైశంపాయనశుకపు తండ్రియైన వృద్ధశుకపాత్రను పోషించెనని విమర్శకుల అభిప్రాయము.

2. మా. చౌఖంబా (1964) ప్రతి, పుటలు 74, 75.

| | | |
|---|---|---|
| 4. | రుద్రుడు | —అంతరంగికమిత్రులు. |
| 5. | నారాయణుడు | |
| 6. | వారబాణుడు | —విద్వాంసులు. |
| 7. | వాసబాణుడు[1] | |
| 8. | వేణీభరతుడు | —వర్ణకవి (జానపదగేయములు వ్రాయువాడు) |
| 9. | వాయువికారుడు | —కులీనుడు, ప్రాకృతకవి. |
| 10. | అనంగబాణుడు | —వందిద్వయము. |
| 11. | సూచీబాణుడు | |
| 12. | చక్రవాకిక | —వయసుమళ్లిన ఒకవిధమైన సన్యాసిని. |
| 13. | మయూరకుడు[2] | —జాంగలికుడు (గారుడి అను విషవైద్యము తెలిసినవాడు) |
| 14. | చండకుడు | —తాంబూలదాయకుడు (భృత్యుడు) |
| 15. | మందారకుడు | —భిషక్పుత్రుడు.[3] |
| 16. | సుదృష్టి | —పుస్తకవాచకుడు[4] (పౌరాణికుడు) |
| 17. | చామీకరుడు | —కలాదుడు (కంసాలి) |
| 18. | సింధుషేణుడు | —హైరికుడు[5] (వజ్రవ్యాపారి) |

1. 'వాసధారుడు' అని పాఠాంతరము.

2. ఇతడే సూర్యశతకకర్త మయూరుడు అని కొందరి అభిప్రాయము. అట్లయిన బాణుడు అతనిని కవి అనక 'జాంగలికుడు' అనుట ఏల? మయూరకుడు అని క-ప్రత్యయముతో ఎవరును మయూరుని ఉల్లేఖింపలేదు.

3. బాణుని ఇంటివైద్యుని కుమారుడు సమవయస్కుడు మిత్రుడు అని ఊహింపవలెను. పూర్వము వైద్యము కులవిద్య కావున ఇతడును వైద్యుడు కావచ్చును. కాని 'భిషక్పుత్రః' అనగా 'పిల్లవైద్యుడు' అని అర్థము కొందరు వ్యాఖ్యాతలు చేయుట అనావశ్యకము. 'డాక్టరుగారబ్బాయి' అనుట మేలు.

4. 'హర్షచరితము'లోనే బాణునియింట వాయుపురాణపఠన ప్రస్తావన స్మర్తవ్యము. పురాణశ్రవణము దినచర్య కానోపును.

5. 'హీరః, హీరం' అనగా వజ్రము. 'హీరకః' అనియు. దీనిపై తద్ధితవృత్తి చేత ఏర్పడిన 'హైరికః' అనువాడు వజ్రసంబంధిగ నుండవలెను. వజ్రములను సానబెట్టుటయో, వానికి విలువకట్టుటయో, లేక వజ్రవ్యాపారియో కాదగును. ఈ పదము అమరకోశమున, విశ్వకోశ, నానార్థ రత్నమాలా వైజయంతులలోను లేదు. ఆప్టే నిఘంటువులో 'దొంగ (Thief)' అని ఉన్నది.

19. గోవిందకుడు —లేఖకుడు (గుమాస్తా)
20. వీరవర్మ —చిత్రకారుడు.
21. కుమారదత్తుడు —పుస్తకృత్[1] (పుస్తకారుడు = మట్టితో బొమ్మలుచేయువాడు)
22. జీమూతుడు —మార్దంగికుడు (మృదంగము వాయించువాడు)
23. సోమిలుడు
24. గ్రహాదిత్యుడు } —గాయనులు (గాయకులు)
25. కురంగిక —సైరంధ్రి (అలంకరణములో నిపుణ)
26. మధుకరుడు
27. పారావతుడు } —వాంశికులు (వేణువు వాయించువారు)
28. దర్దురకుడు —గాంధర్వోపాధ్యాయుడు (సంగీతం 'మేష్టారు')
29. కేరలిక[2] —సంవాహిక (తలయంటి 'ఒళ్లుపట్టు' పరిచారిక)
30. తాండవికుడు —లాసకయువకుడు (నర్తకుడు)
31. ఆఖండలుడు —ఆక్షికుడు (అక్షవిద్యానిపుణుడు. పాచికలువేయుటలో నేర్పరి.)
32. భీమకుడు —కితవుడు[3] (జూదరి)
33. శిఖండకుడు —శైలాలి యువకుడు (నటుడు)
34. హరిణిక —నర్తకి.
35. సుమతి —పారాశరి. (భిక్షువు, సన్న్యాసి)
36. వీరదేవుడు —క్షపణకుడు (జైన (బౌద్ధ ?) సన్న్యాసి)
37. జయసేనుడు —కథకుడు (పురాణములలో సూతునివంటివాడు)
38. వక్రఘోణుడు —శైవుడు (శివభక్తుడు)
39. కరాలుడు —మంత్రసాధకుడు (మంత్రవేత్త)

---

1. పుస్తం = మట్టి (Clay) - ఆప్టే.

2. 'కేరలిక' అనునది దేశనామస్ఫోరకము. కేరళదేశప్రజలు నిరంతరాభ్యంగస్నానవీరులు అనుట ప్రసిద్ధము.

3. కితవుడు : 'ధూర్తోఽక్షదేవీ, కితవోఽక్షధూర్తో ద్యూతకృత్ సమాః' (అమరము) పైన ఆక్షికునికి ఈ కితవునికి వృత్తిభేదమేమో ?

40. లోహితాక్షుడు — అసురవివరవ్యసని.[1]
41. విహంగముడు — ధాతువాదవిదుడు (Metallurgist) (లేక రసవాది).
42. దామోదరుడు — దార్దురికుడు.[2]
43. చకోరాక్షుడు — ఐంద్రజాలికుడు (Magician)
44. తామ్రచూడుడు — మస్కరి (ఒకవిధమైన సన్యాసి).

వీరేకాక ఇతరులుకూడ బాణునితో యాత్రికులుగ చేరియుండిరి. వీరందరును బాణుని పరివారమనియే గ్రహింపరాదు. అతని గ్రామములోనివారు అనేకులు తోడు దొరకినదని యాత్రలకు బయలుదేరియుందురు.

2. 6. 7. ఈ దేశాటనసందర్భముగ బాణుడు కొంత వ్యసనములకులోనై సజ్జనుల కోపమునకు గురియయ్యెను. అయినను ఈ దేశాటనము అతనికి మేలుకూడ చేసినది. బహుకాలము అనేకరాజాస్థానములు దర్శించి, పలు గురుకులములు చూచి, పండితగోష్ఠులలో పాల్గొని, వివేకవంతుల చెలిమి సంపాదించి, బాణుడు బుద్ధిపరిపాకముపొంది, లోకమెరిగి, కులోచితమనఃప్రవృత్తికలవాడై గృహోన్ముఖు డయ్యెను.

అతని రాకకు బంధుమిత్రులెల్ల ఆనందించి, ఆదినమును పర్వదినముగా భావించి, చుట్టరికములు కలియవేయుచు, చిరదర్శనమున అభినవీభూతమయిన ప్రేమను పలుతెరగుల ప్రకటించిరి. అతడును అయినవారిమధ్య మాన్యుడై హాయిగ కాలము గడపుచుండెను.

## 2. 6. 8. రాజసభకు పోవుట (హర్షచరితము, ద్వితీయోచ్ఛ్వాసము)

బంధుసల్లాపములతోడను వైదికక్రియలతోడను సుఖముగ కాలముగడపుచుండువేసవిలో ఒకనాడు భోజనానంతరము కూర్చొనియుండగా చంద్రసేనుడు అను పారశవభ్రాత వచ్చి బాణునితో చెప్పెను.

---

1. 'అసురవివరము' అనగా పాతాళము. ఇచ్చట గనియో నిధినిక్షేపము లుండు స్థలములో ఉద్దిష్టము. అట్టివానియందు వ్యసని అనగా ఎప్పుడును లంకెబిందెలకొరకు వెదకువాడో! లేక గనుల నిపుణుడో (Mining Engineer)!

2. 'దర్దురము' ఒకతరహా వాద్యము. దానిని వాయించువాడు అని అర్థము సుగమము, ఉచితము. కాని 'కప్ప' అను అర్థమును కొందరు వ్యాఖ్యాతలు చెప్పియున్నారు. ఎరుకలు వానకై పల్లెములో కప్పనిడి 'మొఱ్ఱో వానదేవుడా' అని పాడుదురు. అట్టివాడేమో?

'రాజాధిరాజు శ్రీహర్షభూపతి తమ్ముడు కృష్ణునియొద్దనుండి సందేశహరు డొకడు వచ్చి మీ దర్శనమునకై కనిపట్టుకొని ద్వారముకడ ఉన్నాడు'

బాణుడు: ఆలసింపక ప్రవేశపెట్టుము.

ప్రవేశించిన వార్తాహరుని దూరమునుండియే బాణుడు

'నిష్కారణలోకబంధువు కృష్ణులకు కుశలమేనా' అని అడిగెను.

అతడును 'కుశలమే' అని బాణునికి నాతిదూరముగ కూర్చుండి ఒక లేఖను అందించెను.

ఆలేఖయంతయు గౌరవవాచకములతోను కుశలప్రశ్నలతోను నిండియుండెను. కాని 'విషయమును మేఖలకుని (వార్తాహరుని)వలన తెలిసికొనిన ధీమంతుడు కాల యాపనచేయడు' అను వాక్యములోని అంతరార్థమును గుర్తించి, బాణుడు, పరివార మును విసర్జించి, ఏకాంతమున మేఖలకుని 'అసలుసందేశము చెప్పుము' అనెను. అతడు ఇట్లు నివేదించెను.

"మాస్వామి మీతో చెప్పుమన్నారు —

నీమీది (అకారణ) ప్రేమచేత నిన్ను ఎచ్చరించుచున్నాను. నీవు దేశాటనము చేయుకాలములో నిన్నుగిట్టనివారు ఎవరో హర్షమహీపతితో నీమీద చాడీలు చెప్పినారు. నీవు చపలుడవు అన్నమాట ఆనోట ఆనోట ప్రాకి చక్రవర్తికి అందినది. నీ హితుల మైన మేము కొందరము నీవు అటువంటివాడవు కావు అని, ఒకవేళ పొరపాటు ఉన్నచో అందు యౌవనమే అపరాధి అనియు విన్నవింపగా రాజును 'అట్లేకదా' అని మన్నించెను. కావున నీవు వెంటనే రాజదర్శనమునకు రావలెను. నీగ్రామముననే యుండి జీవితమును నిష్ఫలము చేసికొనవలదు. రాజసేవాక్లేశమునకు జడియవలదు. ఈరాజు అందరురాజులవలెకాక నిరహంకారుడు, మృదుభాషి, సర్వదా పరహితాభి లాషియు అయిన సత్కీర్తికాముడు" అని.

అదివిని బాణుడు చంద్రసేనుని పిలిచి మేఖలకునికి భోజనాదికములు చూడుము అని చెప్పెను.

ఆరాత్రి పరుండి బాణుడు ఇట్లు చింతించెను — 'కర్తవ్యమేమి? నన్ను రాజు అపార్థము చేసికొనెనుకదా. కృష్ణుడు చెప్పినట్లు చేయుదునన్న రాజసేవ బహుక్లేశకారి; రాజసభ బహువిపత్కరము. నాపూర్వులెవ్వరును రాజాశ్రయము కోరలేదు. ఐనను నేను పోకతప్పదు.'

మరునాడు వేకువనే లేచి, బాణుడు స్నానాదికములు నిర్వహించి, శుచియై, వేదమంత్రములు జపించుచు, విరూపాక్షవిగ్రహమునకు క్షీరాభిషేకము చేసి, ధూపదీప నైవేద్యములతో పూజించి, హోమము పూర్తిచేసి, బ్రాహ్మణులను సత్కరించి, పూర్వముఖమైన గోవునకు ప్రదక్షిణముచేసి, పెద్దల యాశీర్వాదముతో, అనుమతితో, శకునములు అనుకూలింపగా, శుభముహూర్తమున, కుడిపాదముసాచి గ్రామమునుండి బయలుదేరెను.

మొదటిదినము చండిదేవాలయపు ఎండుమ్రోడులతోటను దాటి మల్లకూటము అను గ్రామమును చేరెను. అచ్చట తన సోదరుడును జగత్పతి అను మిత్రుడును ఆదరింప సుఖముండి మరునాడు భాగీరథిని దాటి యష్టిగృహకము అను అడవిపల్లెలో రాత్రిగడపెను. ఉదయమున బయలుదేరి మణిపురసమీపమున విడిసియున్న హర్షుని దండుబిడారమును చేరి అందు రాజావాసమునకు సమీపమున ఆగెను.

స్నానముచేసి, భుజించి, విశ్రమించి, పగటి తుదిజామున మేఖలకునితో రాజ దర్శనమునకు పోయెను. అచ్చట బహుకాలముగ వేచియుండు సామంతులెందరో అట్లే ఉండగా, ద్వారపాలకులు తన్ను గుర్తించి ఆహ్వానింపగా, మేఖలకుడు బాణునితో 'పుణ్యభాగీ క్షణమాత్రము ఇచ్చటనే ఉండుము' అనిచెప్పి నిరాఘాటముగ చని, కొలదిసేపటిలోనే దౌవారికపతి పారియాత్రుడు అనువానిని వెంటనిడుకొని తిరిగి వచ్చెను. అతడును బాణుని 'రండు. రాజుగారు ప్రసన్నులై ఉన్నారు' అని ఆహ్వానించెను.

'ధన్యోఽస్మి, అనుగృహీతుడను' అని బాణుడు పారియాత్రుడు దారిచూపగా పోయి అభ్యంతరమందిరమును చొచ్చెను. అచ్చట అశ్వశాలనుదాటి, గజశాలను గడచి, మరిమూడు ప్రాంగణములు అధిగమించి, ఆప్తకోటిచే పరివృతుడు, దీప్తవిగ్రహుడు, దేవతుల్యుడు, పుణ్యదర్శనుడును అగు హర్షసమ్రాట్టును చూచి 'ఇతడేనా ఆసుజన్ముడు' అని దిగ్భ్రమతో నిలిచెను. అంతలో తేరుకొని, రాజును సమీపించి కుడిచేయిని ఎత్తి[1] స్వస్తివాక్యము పలికెను.

---

1. కాదంబరిలో వైశంపాయనశుకము శూద్రకుని ఆశీర్వదించునపుడు దక్షిణ పాదము ఎత్తుటను కవి వర్ణించుటలో అతని సూక్ష్మదృష్టియు సంప్రదాయలేశము పై గురుభావమును తెలియుచున్నది.

ఆక్షణమే గజాధిరోహియయిన గజపరిచారకుడు ఒకడు గజపర్యాయముగ ఒకశ్లోకమును శ్రావ్యముగ చదివెను —

'ఓ కుఱ్ఱయేనుగా, చంచలత్వమును వీడుము. వినయమువహించి, తలవంచి నడువుము. సింహపుగోటివలె వాడికలదియు, వంగినదియు అగు ఘనాంకుశము నీపై ఓర్పువహింపదు.'[1]

ఈ శ్లోకమును విని, రాజు బాణుని చూచి, గంభీరమయిన కంఠముతో 'ఇతడేనా బాణుడు?' అని అడుగగా, దౌవారికుడు 'మీమాట సత్యము. ఇతడే' అని చెప్పెను.

'అకృతప్రసాదుని[2] ఇతనిని నేను ఇప్పుడు చూడను' అని, రాజు సమీపమున ఉన్న మాలవరాజకుమారునితో 'ఇతడొక గొప్ప దురాచారి'[3] అనెను.

ఈ వాక్యాశయమును సరిగ గ్రహింపలేక పరివారమంతయు ఊరకుండిరి. ఒక్కక్షణము తానును ఊరకుండి, బాణుడు రాజుతో ఇట్లనెను —

'దేవా, నిజమెఱుగనట్లు, నన్ను నమ్మనట్లు, పరవశబుద్ధివలె, అలౌకికునివలె ఏల ఇట్లు సెలవిచ్చెదవు. లోకులస్వభావములు స్వచ్ఛందానుసారములు; లోకప్రవాదములు విచిత్రములు. మహాత్ములు యథార్థదర్శులు కావలెను. నన్ను పనికిమాలినవానినిగా తలపవలదు. వాత్స్యాయనులు అను సోమయాజుల వంశమున పుట్టితిని. బ్రాహ్మణుడను, యథాకాలమున ఉపనయనాదిసంస్కారములన్నియు నాకు అయినవి. వేదములను సాంగముగ పఠించితిని. యథాశక్తి శాస్త్రములను నేర్చితిని. గృహస్థధర్మమును ఆచరించుచుంటిని. ఏది నా దురాచారము?

---

1. కరికలభ, విముంచ లోలతాం, చర వినయవ్రతమానతాననః।
మృగపతినఖకోటిభంగురో గురురుపరి క్షమతే న తేఽంకుశః॥
(హర్షచరితము, ద్వితీయాశ్వాసము)

2. అకృతప్రసాదః - ఇచ్చట అర్థము స్పష్టముగ లేదు. 'రాజప్రసాదమును పొందని' అని గ్రహించిన బాణుడు తనదగ్గరకు పూర్వమే రాలేదను కోపము వ్యక్తమగును.

3. 'మహానయం భుజంగః' (హర్షచరితము, ద్వితీయాశ్వాసము)

బాల్యచాపలమున చేసిన తప్పులు ఇహపరములందును క్షంతవ్యములు. పశ్చాత్తప్తుడను. బుద్ధునివలె ప్రశాంతహృదయుడవయ్యు యమునివలె చండశాసనుడ వగు నీ రాజ్యమున ఎవడును ఔచిత్యమర్యాదలను అతిక్రమింపడు మనుష్యులేకారు, నీ భయమున భ్రమరములు మధుపానముచేయుటకు శంకించుచున్నవి. చక్రవాకము చక్రవాకీవశమగుటలేదు. మర్కటములు జాతిచేష్టలను విస్మరించినవి. క్రూరమృగ ములు ఆహారార్థము చంపినను క్రూరత్వములేక ఇతరమృగములపట్ల సానుక్రోశముగ ఉన్నవి.

నన్నుగురించిననిజము తమకు నిలుకడమీద తెలియును. ప్రజ్ఞావంతులమనస్సులు ఎల్లపుడును పెడతిరుగవు.'

అంత రాజు 'మేము అట్లే వింటిమి' అనిపలికి ఊరకుండెను. కాని అతని కండ్లలో స్నేహభావమే కనిపించెను. ఇంతలో సంధ్యాకాలము సమీపింపగా రాజు సభ చాలించి లోపలికి ఏగెను.

బాణుడును రాజభవనమువదలి తన 'మజిలీ' కి వెడలుచు 'హర్షుడు కరుణా మయుడు. చెప్పుడుమాటలచే నాపై కినుకవహించెనేకాని నిజముగ నాపై ప్రేమ కలవాడే. అతనికోపము సత్యమయిన నాకు దర్శనమే ఇచ్చియుండడు. నేను సదాచార సంపన్నుడనుగ ఉండుటయే అతని ఆశయము' అని తలపోసెను.

మరునాడు స్కంధావారమునువీడి బంధుమిత్రులను దర్శించుచు, ఒక్కొక్కరి యింట కొంతకాలము గడుపుచుండగా తుదకు రాజును ప్రసన్నుడయ్యెను. అప్పుడు మరల రాజసభకు పోగా హర్షుడు మిక్కిలి ఆదరాభిమానములు చూపెను. ఆనాటి నుండి బాణుడు హర్షునియాప్తవర్గములో ఒకడుగ కృతార్థుడయ్యెను.

2. 6. 9. ఇంతకుమించి బాణుని జీవితచరిత్రము మనకు తెలియదు. హర్షచరితపు మూడవ ఉచ్ఛ్వాసము మొదట శ్యామలుడు అను బాలభ్రాతృవ్యుని ప్రేరణమున హర్ష చరితమును బంధువులకు కథగా చెప్పినట్లు బాణుడు వర్ణించుటవలన తత్కావ్యరచనా రంభప్రశంస అయినది. అతని ఇతర రచనలు ఏవో అతడు ఎక్కడను చెప్పలేదు. కాదంబరి తటాలున వాక్యార్థమున ఆగిపోవుటవలన అది అతని కడపటి కృతి అనిమా త్రము ఊహింపదగును.



# 3. గీర్వాణగద్యవికాసము

3. 1. సుబంధువును బాణుడును సంస్కృతమున గొప్ప గద్యకావ్యములను నిర్మించుటకు పూర్వమే సంస్కృతగద్యకావ్యరీతి ఏర్పడియుండెనని ప్రాచీనశిలాలేఖలవలనను తామ్రపత్రలేఖలవలనను నిశ్చయముగ చెప్పుటకు వీలగుచున్నది. క్రీ. వె. రెండవశతాబ్దములోనిదని చారిత్రకులు విశ్వసించు రుద్రదామక్షత్రపప్రశస్తి శిలాలేఖ ఈ గద్యకావ్యరీతికి పూర్వస్వరూపపు ప్రాచీనతమనిదర్శనము. అట్లే క్రీ. వె. 4-వ శతాబ్దమునాటిది హరిషేణుని సముద్రగుప్తప్రశస్తి శిలాలేఖ పరిణతమైన చిన్న కావ్యమే అగును. ఇట్టివి మరికొన్ని కలవు.[1]

బాణాదులకుపూర్వమే గద్యరచన అంత పరిపక్వమగుటకు క్రీస్తుశకమునకు పూర్వమే గద్యప్రక్రియలు ఉండియుండవలెను. క్రీస్తుశకపు మొదటి అయిదుశతాబ్దములలో ఎన్ని గద్యకావ్యములు వ్రాయబడి తరువాత నష్టమైపోయినవో మనము చెప్పలేము. అశ్వఘోషునికి పూర్వపు మహాకావ్యములు[2] ఏవియు మిగులనట్లు సుబంధుబాణులకు పూర్వపు గద్యకావ్యము లేవియు ఇప్పుడు లేవు. అప్పుడు ఉండినవని మాత్రము ఇతర గ్రంథములందలి ప్రశంసలవలన తెలియుచున్నది.

---

1. ఇచ్చట బాణునికి సమకాలికమగు శాసనాదులను, ముఖ్యముగ హర్షుని శాసనములను గణింపలేదు. సుబంధుబాణుల గద్యరీతివిచారమున తత్పూర్వ ప్రయోగములే ప్రామాణికములగును. పద్య శాసనములు, శాసనపద్యములు ఎంత ప్రాచీనములయినను ఇచట అప్రస్తుతము.

2. సంస్కృతమున 'మహాకావ్యము' అనుపదమునకు అర్థము లాక్షణికులు చెప్పిన రఘువంశ, కుమారసంభవ, కిరాతార్జునీయాదులవంటివి అని. రామాయణము పెద్దకావ్యము, ఆదికావ్యము అగునేకాని మహాకావ్యము కాదు. భారతము ఇతిహాసము. లాక్షణిక నిర్వచనము ప్రకారము అశ్వఘోషుని 'బుద్ధచరితము, సౌందరనందము' మహాకావ్యములే. చారిత్రకులమతమున అశ్వఘోషుడు క్రీ. శ. 1వ శతాబ్దిలోనివాడు.

ఈ శిలాశాసనాదులుమాత్రము సంస్కృతగద్యకవితాసరణికి మైలురాళ్లుగ (Milestones)[1] నిలిచియున్నవి.

3. 2. గీర్వాణగద్యము[2] ప్రథమమున వేదములందు కనబడుచున్నది. వైదికవాఙ్మయమున గద్యము కేవలము భావప్రకటనమునకు విస్తారముగ ప్రయోగింపబడినది. అర్థైకప్రధానములయ్యును వైదికవచనభాగములలో అప్పుడప్పుడు రసాత్మకరామణీయకతలు గోచరించి వానికి కావ్యత్వమును[3] కలిగించుటయు కలదు. తార్కాణములు లేకున్నను, ఆ వైదికగద్యరీతులే అవిచ్ఛిన్నముగ కొనసాగి లౌకికప్రయోజనమున క్రమేణ కావ్యగుణములను వృద్ధిచేసికొని కావ్యగద్యమై సుబంధు బాణుల గ్రంథములలో పరాకాష్ఠను అందుకొనినవనుట సత్యదూరముకాదు.

3. 3. అనేక విదేశసాహిత్యములవలెనే గీర్వాణసాహిత్యమును పద్యరూపముగనే అవతరించినది. అతిప్రాచీనమయిన (క్రీ. పూ. 1500 నాటిది ?) ఋగ్వేదమంత్రభాగము పూర్తిగ పద్యములే. 'పద్యము' అనగా పాదాక్షరనియమములుకల వాక్కు. ఈ నియమములకే 'ఛందః' (పద్ధతి, సరణి, బాణి) అని పేరు. కావుననే వేదములన్నిటికిని, పద్యములు కలవి అగుటచేత, స్థూలముగ 'ఛందస్సు' అని పేరు కలిగినది. 'ఛాందసుడు'[4] అనగా వేదపారగుడు అని అర్థము. అట్లే పద్యరచనావిధులశాస్త్రము ఛందశ్శాస్త్రము అయినది.

---

1. ఇప్పుడు 'కిలోమీటరు రాళ్లు' అనవలెనేమో ?

2. 'గీర్వాణము' అనుటలో వైదిక లౌకిక సాహిత్యములు రెండును ఉద్దిష్టములు. కొన్ని పదములు, వ్యాకరణరూపములు తప్ప వేదభాషకు సంస్కృతమునకు పెద్ద భేదము లేదు.

3. 'వాక్యం రసాత్మకం కావ్యమ్', 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' అని ప్రసిద్ధము కావున.

4. 'ఛాందసుడు' దినమంతయు 'పన్నాలు' వల్లించుచు కాలము గడుపుటవలన లౌకికజ్ఞానముతగ్గి లోకవ్యవహారములలో మూఢుడుగ తోచుటవలన 'ఛాందసుము' అను పదమునకు 'మూర్ఖము' అను లక్షణార్థము ఏర్పడినది. వాడుకలో తెనుగున ఇది 'చాదస్తము' అయినది.

3. 4. 'గద్యము' అనుపదము ఇప్పుడు పద్యముకానిది అను అర్థమున రూఢి యయినది. సుబంధ్వాదులకుపూర్వమే గద్యము పద్యేతరకావ్యమునకు నియతమయి నట్లు గ్రహింపవచ్చును. కాని 'గద్యము' అనుపదము 'గద్ = చెప్పుట' అను ధాతువునుండి ఉత్పన్నము కావున దానికి 'చెప్పునది, చెప్పినది' అను అర్థము తప్ప వేరులేదు. అట్లే గద్యపర్యాయముగ వాడబడు 'వచనము (వచ్ = చెప్పుట), భాష ణము (భాష్ = చెప్పుట)' అనుపదములకును నిజముగ విశేషార్థములేదు. కాని బహుకాలముగ నియతమగు వాడుకచేత ఈ పదములకు పద్యేతరభావము ఏర్పడగా 'గద్యము' అను పదమును ఆ యర్థములో లాక్షణికులు స్వీకరించిరి.

3. 5. (క) వైదికవాఙ్మయమున తత్సమకాలికులు పద్యపద్యేతరభాగములను వేరు పేర్లతో వ్యవహరించినట్లు లేదు. 'ఋక్' అనునది పద్యమే అయినను అది పద్య సామాన్యవాచకముగను, 'యజుస్' అనునది పద్యేతరమయినను అది పద్యేతర సామాన్యవాచకముగను వ్యవహారము లేదు. ఈ భేదమును మొదట లాక్షిణికదృష్టితో గుర్తించి వానికి సార్థకములగు భిన్ననామములను సృష్టించినవాడు, వేదాంగమయిన 'నిరుక్తము'ను రచించిన యాస్కముని. ఇతడు పాణినికి ఒకింత పూర్వుడో సమకాలికుడో లేక ఒకింత అర్వాచీనుడో నిశ్చయముగ తెలియుట లేదు. ఇతని రచనలో పాణినీయవ్యాకరణపరిభాష[1] ఎక్కువ కనపడుటలేదు. కావున పూర్వుడే కావచ్చును. ఇతడు క్రీ. పూ. 7, 5 శతాబ్దముల మధ్యనుండెనని కొందరి అభిప్రాయము.

(గ) యాస్కుడు 'నిరుక్తము'లో పద్యమును 'మితాక్షరము' అనియు తద్భిన్నమును 'అమితాక్షరము' అనియు నిర్వచించియున్నాడు. 'మిత' అనుపదము 'మా = కొలుచు, ఎంచు' అను ధాతువునుండి కృద్రూపము. 'కొలిచిన, ఎంచిన'

---

1. పాణినీయ వ్యాకరణము ధాతుపాఠోపజీవి. ధాతువులను 'కృ - గం - భూ' మొదలగు అతిసంక్షిప్త రూపములలో వర్గీకరించిన ధాతు పాఠములోని ధాతు రూపములను పాణిని ఎక్కువగా ఉల్లేఖించును. యాస్కుడు క్రమముగా 'కరోతి - గచ్ఛతి - భవతి' అను ప్రథమపురుషైక వచనమైన 'లట్' రూపములనే చెప్పును. మరియు 'ధాతువు' అను పదమునకు బదులు యాస్కుడు 'ఆఖ్యాతము' అనును.

అని అర్థము. కావున 'మితాక్షరము' ఎంచిన యక్షరములు లేక కొలిచిన పాదములు కలది అగును. వేదములలోని పద్యములన్నియు అక్షరఛందములే[1] అగుటచేత యాస్కుని పరిభాష సార్థకము,

అట్లే 'అమిత' అనగా 'సంఖ్యానియమములేని' అని అర్థము. అక్షరములు, పాదనియమము - అక్షరనియమము లేక, యథేచ్ఛగ విస్తరించు వాక్యము లేక వాక్యములసముదాయము 'అమితాక్షరము.'

ఈ రెండు పదములు ఇంత అర్థవంతములై విలక్షణముగ కుదిరియుండగా మన లాక్షణికులు ఎందులకో వానిని విస్మరించి వానిస్థానములందు వరుసగా 'పద్యము, గద్యము' అనుపదములను రూఢిచేసిరి. యాస్కుని పరిభాష మనము గ్రహించి ప్రాచుర్యము కల్పింపదగినది.

## 3. 6. వైదికసాహిత్యమున అమితాక్షరస్వరూపము

యజుర్వేదమంత్రభాగమున ప్రథమముగ 'యజుస్సులు' అను అమితాక్షర మంత్రములు కనబడుచున్నవి. అట్లే అథర్వణవేదముకోను. నాలుగువేదములకును సంబంధించిన బ్రాహ్మణములలోను, ఆరణ్యకములలోను, ఆరణ్యకములలోని ఉపనిషత్తులలోను విస్తారముగ అమితాక్షరభాగములు కలవు. వానిలోని భాష ప్రాచీనుల వాడుకభాషయయిన గీర్వాణము[2] కాదగును. అది సరళముగ ఇరువురు మాటలాడు కొనునపుడు సంభవించు భాషవలె ఉండును. ఆ భాషలోని విశేషలక్షణములు —

1. వాక్యములు చిన్నవి.
2. ప్రతివాక్యమునకు ధాతురూపమయిన క్రియ ఉండును.

---

1. వేదములలో సప్తవిధముల ఛందస్సులుమాత్రమే కలవు. అందు (1) గాయత్రీ - 3 పాదములు, పాదమునకు 8 అక్షరములు, (2) ఉష్ణిక్ - 4 పా. పాదమునకు 8 అ. (3) అనుష్టుప్ - 4 పా. పాదమునకు 8 అ. (4) బృహతీ - 4 పా. పాదమునకు 9 అ. (5) పంక్తిః - 4 పా. పాదమునకు 10 అ. (6) త్రిష్టుప్ - 4 పా. పాదమునకు 11 అ. (7) జగతీ - 4 పా. పాదమునకు 12 అ. గురు లఘు భేదము లేదు.

2. పాణినికి లక్ష్యము అదియే అని కొందరిమతము.

3. 'మిత్రావరుణౌ' వంటి ద్వంద్వసమాసములు, లేక రెండేపదములుగల రాజపురుష, ఇంద్రశత్రు వంటి సమాసములు మాత్రమే కనబడును. రెండుపదము లకు మించిన సమాసములు కనబడవు. అట్లు కనబడిన అవి నిశ్చయముగ అర్వాచీన ప్రతిక్షేపములని చెప్పవచ్చును.

4. ఉ, ను, వై, హ(హి) అను ఏకాక్షరపదములు తరచు నిరర్థకముగ ప్రయో గించినట్లు తోచును. అవి నిరర్థకములు కావచ్చునేమోకాని నిరుపయోగములు కావు. వేద భాషయంతయు 'శ్రుతి', అనగా గురుముఖమున విని, కూడ ఉచ్చరించి నేర్చుకొను నది కావున, పఠించునపుడు (పద్యభాగములో పాదాక్షరనియమములచేత విరామస్థాన ములు సులభముగ తెలియగా) అమితాక్షరమున ఈ చిన్న పదములు వాక్యాంశములను విడదీసి విశదపరచుచు, ఉచ్చారణసౌలభ్యము కల్గించుచు, నేటి లిఖితముద్రితభాషలలో పాశ్చాత్యసంప్రదాయపు విరామసంజ్ఞల (Punctuation marks) వలె ఒకవిధమైన శ్రుతివిరామసంజ్ఞలుగ వర్తించును. కొన్నియెడల అవి సార్థకములును అగును.

5. భావములను స్ఫుటముచేయుటకై ప్రాథమికాలంకారములగు రూపకోత్ప్రే క్షోపమలు అచ్చటచ్చట కాననగును. అవి సామాన్యుల భాషావ్యవహారమునను కన బడునవేకదా.

## 3. 7. వైదికభాషలో అమితాక్షరోదాహరణములు

పై లక్షణములకు లక్ష్యభూతమయినభాషకు కొన్ని ఉదాహరణములు క్రింద ఈయబడినవి.

(క) ఐతరేయబ్రాహ్మణమునుండి[1] ఒక 'ఆఖ్యాయిక'[2] —

తే వై దేవా విజితినోమన్యమానా యజ్ఞమతన్వత. తమేషామసురా అభ్యాయన్, 'యజ్ఞవేశసమేషాం కరిష్యామ' ఇతి. తాన్ సమంతమేవోదారాన్ పరిత్యక్తా సుద

1. ఈ బ్రాహ్మణము ఋగ్వేదములోనిది. దీనికి 'ఆశ్వలాయన బ్రాహ్మణము' అనియు పేరు.

2. వేదములలోని దేవాసురులకథలను ఆఖ్యాయికలు అనుట సంప్రదాయము. సాయణుడు భాష్యములో ఈ కథలను 'ఆఖ్యాయిక' అనియే ప్రస్తావించి యున్నాడు, ఆఖ్యాయికాపదపు అర్థము బహువ్యాప్తి కలదిగ కనబడుచున్నది.

పశ్యం స్తేఽబ్రువన్, 'సంస్థాపయామేమం యజ్ఞమ్. యజ్ఞంనోఽసురామాపదిషు' ఇతి. తథేతి తూష్ణీంశంసే సంస్థాపయన్ ॥

ఇందు ప్రతివాక్యమునకును లకారరూపక్రియాపదము[1] కలదు.

(గ) గోపథబ్రాహ్మణమునుండి[2] కొన్ని క్లిష్టసంధానవాక్యములు —

అథయత్ప్రాయణీయ మతిరాత్ర ముపయ న్త్యహోరాత్రావేవ. తద్దేవౌ దేవతే యజతోఽహోరాత్రౌ దేవౌ దేవతే భవతోఽహోరాత్రయోర్దేవయోః సాయుజ్యం సలోకతాం యన్తి యఏతదుపయన్తి. అథయయచ్చతుర్వింశమహరుపయ న్త్యర్ధమాసానేవ తద్దేవం దేవతాం యజన్తేఽర్ధమాసా దేవా దేవతా భవన్త్యర్ధమాసానాం దేవానాం సాయుజ్యం యన్తి యఏతదుపయన్తి[3] ॥

ఇందు యత్ - తత్ సంవిధానము ఎక్కువ. 'అర్ధమాస, అహోరాత్రౌ' అనునవి సమాసములు. ఇందలి అన్వయకాఠిన్యము దీని అర్వాచీనత్వమువలన అని కొందరి యభిప్రాయము.

(చ) తైత్తిరీయోపనిషత్తు నుండి —

భృగుర్వై వారుణిః వరుణం పితర ముపససార, 'అధీహి భగవో బ్రహ్మే' తి, తస్మా ఏతత్ప్రోవాచ, 'యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి. యత్ప్రత్యయ న్త్యభిసంవిశన్తి, త ద్విజిజ్ఞాసస్వ, తద్ బ్రహ్మే' తి.

స తపోఽతప్యత. సతపస్తప్త్వా — అన్నం బ్రహ్మేతి వ్యజానాత్. అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, అన్నేన జాతాని జీవన్తి, అన్నం ప్రయన్త్యభిసంవిశన్తీతి. తద్విజ్ఞాయ పునరేవ వరుణం పితర ముపససార, 'అధీహి భగవో బ్రహ్మే' తి. త(గ్)ం హోవాచ, 'తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ' ... ఇత్యాది.

---

1. పోనుపోను ఈక్రియల వాడుక తగ్గి క్రియకు మారుగ కృదంత విశేషణము లను క్రియాపదముగ వాడుట ఎక్కువయినది. 'రామః అగచ్ఛత్' అనక 'రామః గతః' అనుట, 'సీతా అగచ్ఛత్' అనక సీతాగతా' అనుట, 'ఫలం అపతత్' అనక 'ఫలం పతితమ్' అనుట, తరువాతికాలములో కవులకు సాధారణమయినది.

2. ఇది అథర్వణవేదములోనిది. ఈవేదమే అర్వాచీనమని చారిత్రకుల మతము. శిష్ట వైదికసంప్రదాయమున 'త్రయి' అని మూడింటినే చెప్పుదురు.

3. ఇది శ్రీమతి సీతాశర్మ ఉద్ధృతి.

ఇది ఐతరేయబ్రాహ్మణములోని భాషవంటిదే. చిన్నచిన్నవాక్యములు, ప్రతివాక్యమునకు లకారరూపక్రియయు కలవు.

(ఙ) బృహదారణ్యకోపనిషత్తు నుండి —

అథాధ్యాత్మ మిదమేవ మూర్తం. యదన్యత్ ప్రాణాచ్చ, యశ్చాయమంతరాత్మన్నాకాశ, ఏతన్మర్త్య మేతత్స్థిత మేతత్సత్ తస్యైతస్య భూతస్యైతస్య మర్త్యస్యైతస్య స్థితస్యైతస్య సత ఏష రసోయ చ్చక్షుః సతోహ్యేషరసః ।

ఇందు లకారరూపధాతువులు లేవు. కారకము కొంత 'గజిబిజి' గ నున్నది. కాని పెద్దసమాసములు కానరావు.

(ట) యాస్కనిరుక్తము నుండి —

తద్యాని చత్వారి పదజాతాని నామాఖ్యాతే చోపసర్గనిపాతాశ్చ, తానీమాని భవన్తి. తత్రైతన్నామాఖ్యాతయో ర్లక్షణం ప్రదిశన్తి । భావప్రధానమాఖ్యాతమ్; సత్వప్రధానాని నామాని; తద్యత్రోభే భావప్రధానే భవతః, పూర్వాపరీభూతం భావమాఖ్యాతేనాచష్టే, వ్రజతి పచతీతి.

తత్ర నామాన్యాఖ్యాతజానీతి శాకటాయనో నైరుక్తసమయశ్చ. న సర్వాణీతి గార్గ్యో వైయాకరణానాంచైకే. తద్యత్ర స్వరసంస్కారౌ సమర్థౌ ప్రాదేశికేన వికారేణాన్వితౌ స్యాతామ్. సంవిజ్ఞాతాని తాని యథా గౌరశ్వః పురుషో హస్తీతి.

ఈ భాషయు వైదికబ్రాహ్మణముల భాషకంటె భిన్నముకాదు. యాస్కుని భాషలో ప్రసన్నగుణ మధికము.

3. 8. పురాణేతిహాసములలోని గద్యమునకు ఉదాహరణములు.

(క) విష్ణుపురాణము నుండి —

పరాశర ఉవాచ. యావచ్చ బ్రహ్మలోకాత్ కకుద్మీ రైవతోనాభ్యేతి తావత్ పుణ్యజనసంజ్ఞా రాక్షసాస్తామస్యపురీం కుశస్థలీం జఘ్నుః. తావచ్చాస్యభ్రాతృశతం పుణ్యజనత్రాసాద్ దిశోభేజే. తదన్వయాశ్చ క్షత్రియాః సర్వదిక్షు అభవన్. ధృష్టస్యాపి ధార్ష్టకం క్షత్రం సమభవత్. న భాగస్యాత్మజో నాభాగః. తస్యాంబరీషః, అంబరీషస్యాపి విరూపోఽభవత్. విరూపాత్ పృషదశ్వో జజ్ఞే. తతశ్చ రథీతరః. తత్రాయం శ్లోకః.

(గ) భారతము నుండి —

సంయమనః, 'భగవన్ యదాఖలు అగ్నిర్దారుశతసహస్రకోటీష్వవతిష్ఠమానస్తత్ స్థత్వాన్నిత్యం సహధర్మీ స్యాత్. ఏవం ఖల్వయం క్షేత్రసహస్రకోటీష్వవతిష్ఠమానస్తత్ స్థత్వాన్నిత్యం సహధర్మః స్యాత్. యస్యావిష్టం క్షేత్రం సహధర్మిత్వం స్యాత్ నాయమిష్టానిష్టే ప్రవర్తమానః ప్రకృతిమనువర్తేత, గుణసర్గాయ గుణసర్గమ్. (శాంతిపర్వః)

ఈ పౌరాణికగద్యములలో ఆర్షపదములు తగ్గినను శైలిమాత్రము బ్రాహ్మణోపనిషద్వచనములకు దగ్గరగ నుండును. దీర్ఘసమాసములింకను వాడుకలోనికి రాలేదు.

## 3. 9. సూత్రవాఙ్మయము - దీర్ఘసమాసములు

వైదికవాఙ్మయకాలమునకును పురాణేతిహాసకాలమునకును నడుమ సూత్రకాలమొకటి కలదు. ఈకాలమున సర్వశాస్త్రములు ఆనాటికి సమగ్రములై ధారణకు అనుకూలముగ సూత్రములరూపమున రచింపబడినవి. పాణినివ్యాకరణసూత్రములు, వ్యాసునివనబడు బ్రహ్మసూత్రములు ఈ వర్గమునకు చెందినవి. ఇట్లే అన్నిశాస్త్రములకును. ఒక్కొక్కశాస్త్రము విస్తరించి విపులమైనపుడు దానిని సూత్రీకరించుట క్రీస్తుశకములోకూడ జరుగుచునే యుండినది. వామనుని కావ్యాలంకారసూత్రములు క్రీ. శ. 8వ శతాబ్దివి.

సూత్రము అనగా దారము. ఒకదారములో పూసలుగ్రుచ్చినట్లు వాక్యములను లేక వాక్యాంశములను అతిసంక్షిప్తరూపమున రచించుట సూత్రీకరించుట యగును. వాక్యములోని పదములను సాధ్యమైనంతవరకు సమాసముచేసి, కొన్ని సులభముగా ఊహింపదగిన పదములను వదలివేసి సూత్రము చేయబడును. ఇట్టి సూత్రములు కొన్నిచేరి ఒకశాస్త్రపు సమగ్రస్వరూపమును వ్యక్తము చేయును. పాణిని సుమారు 4000 సూత్రములలో అత్యద్భుతముగ, అనన్యసామాన్యముగ సంస్కృతభాషాస్వరూపమును పూర్తిగ నిర్వహించెను.

ఈ సూత్రవాఙ్మయమునకు సారభూతమయిన భాషాప్రక్రియ సమాసము. సమాసములో విభక్తిప్రత్యయములు లేని కారణముగ పదములు అతిసంక్షిప్తములయి ఒకదానితోనొకటి కలిసిపోవును. ఉదాహరణము —

1. పరమతస్సేతూన్మానసంబంధభేదవ్యపదేశేభ్యః (బ్రహ్మసూత్రములు 3-2-31) దీనిని విడదీసిన 'పరమతః సేతువ్యపదేశాత్, ఉన్మానవ్యపదేశాత్, సంబంధవ్యపదేశాత్, భేదవ్యపదేశాత్ - చ' అనియగును.

ఈ సూత్రరచన భాషలో దీర్ఘసమాస రచనకు దారితీసినది. వైదికపురాణభాషలలో రెండు లేక మూడుపదములకు మించని సమాసములు, కావ్యభాషలో మిక్కిలి పొడవై, అనేకపదసమూహములైనవి. ముఖ్యముగా సంస్కృతమున గద్యరచయితలు ఈ సమాసపు సులువును గ్రహించి గద్యకావ్యములలోని వర్ణనలలో విస్తారముగ ప్రయోగించిరి. వీరిచేత సమాసము వందలయక్షరముల పొడవైనది. ఇట్టి ఒకసమాసమును విశదముచేసిన అనేకపద్యముల భావమునకు సరిపోవును. గద్యకావ్యములలో వర్ణనలకు సమాసము మూలాధారప్రక్రియ అయినది.

## 3. 10. గద్యకథావాఙ్మయము

హిందూపురాణములలోను జైనప్రాకృతపురాణములలోను బౌద్ధపాలీవాఙ్మయములోను కథావాఙ్మయము మిక్కిలి ప్రజాదరము పొందినది. వీనిలో సాధారణముగా పద్యగద్యములు కలిపియే యుండును. ఈ పద్ధతిలోనే సరళమయినభాషలో, రమ్యమయినభావములతో, అచ్చటచ్చట నీతిపద్యములతో ఒకవిధమైన నీతిశాస్త్రోదాహరణముగ కథావాఙ్మయము ఒకదిశలో కొనసాగినది. అందులో 'పంచతంత్రము' ముఖ్యము. ఈ 'బాణీ' లోనే తరువాతికాలములో 'విక్రమార్కచరితము' 'బేతాళపంచవింశతిక' మొదలగు కథాకావ్యములు రచింపబడినవి.

'పంచతంత్రము[1]' లో రెండవవాక్యము గద్యకావ్యములలోని రాజవర్ణనములకు మార్గదర్శకమయి బీజప్రాయముగ నున్నది —

---

1. దీనికి పూర్వస్వరూపముగ కనిపించు 'తంత్రాఖ్యాయిక' బౌద్ధుల రచనయో లేక వారి ప్రభావమునకు గురియయిన గ్రంథమో అగునని కొందరు పాశ్చాత్య పండితుల మతము. తరువాతికాలములో కొంతమార్పబడి హిందూ సంప్రదాయములో చేరినదని వారు చెప్పుచున్నారు. సాధారణముగ ప్రాచీనసంస్కృత వాఙ్మయములో బ్రాహ్మణుని పాత్రను ఉదాత్తముగ చెప్పుట వాడుకకాగా పంచతంత్రములోని కథలలోని బ్రాహ్మణులు మూర్ఖులుగనే వర్ణింపబడుట గుర్తింపదగును. కథాముఖమున విష్ణుశర్మ అను పరమ వైదిక బ్రాహ్మణుడు ఈకథలను చెప్పినటున్నది. అట్టి

'తత్ర సకలార్థికల్పద్రుమః ప్రవరనృప ముకుటమణిమరీచిమంజరీచయ చర్చిత చరణయుగలః, సకలకలాపారంగతః, అమరశక్తిర్నామ రాజా బభూవ.'

అట్లే 'విక్రమార్క-చరితము' లో —

'తత్ర సమస్తసామన్తసీమన్తినీసీమన్తసిన్దూరారుణచరణకమలయుగళో భర్తృహరిర్నామ రాజాసీత్.'

సుబంధువు చింతామణివర్ణనలోను బాణుడు శూద్రకతారాపీడుల వర్ణనములలోను ఈ వాక్యమునే అనుకరించి విస్తరించిరని స్పష్టము.

కాని 'పంచతంత్రము' మొదలగు, కథయేముఖ్యాంగమయిన రచనలలో భాష సరళముగ చిన్నచిన్నవాక్యములతో సాగును.

3. 11. మరియొకదిశలో సుబంధ్వాదుల శైలి పరిణతిపొందుచు వచ్చినది. పూర్వగద్య కావ్యములేవియు ఇప్పుడులేకున్నను, మనభాగ్యవశమున కొన్నిశిలాలేఖలు, తామ్రపత్ర లేఖలు రాజప్రశస్తులతో మిగిలినవి. దీర్ఘసమాసములు, అల్పాక్షరములతో అధికార్థము నిచ్చు గుణముచేత, ఎక్కువప్రచారము పొందినట్లు ఈ రాజప్రశస్తులు ఋజువుచేయు చున్నవి. ఈ ప్రశస్తివాఙ్మయములో, దొరకినవానిలో, ప్రాచీనతమము రుద్రదామ క్షత్రపుని ప్రశస్తి. దీని రచనాకాలమును చారిత్రకులు క్రీ. శ. 150 — 170 ల మధ్య అని నిర్ణయించిరి. ఇదియే అన్నిట మొదటి సంస్కృతశిలాలేఖ.

రుద్రదాముడు మహాక్షత్రపుడు. అతడు 'సుదర్శనము' అను మహాతటాకమును నిర్మించినపుడు (పునర్నిర్మించినపుడు అని కొందరు) చెక్కబడిన శిలాశాసనము గిర్నారులో కలదు. ఇందలిగద్యము మనకు లభించిన కావ్యగద్య సరణులకు అతి ప్రాచీనమయిన నమూనా. ఇది సుబంధ్వాదులకు కనీసము 4 శతాబ్దముల ముందుది. అచ్చటచ్చట అక్షరములు చెరిగిపోయినను ఇది వాఙ్మయచరిత్రకారులకు అమూల్యమయిన నిదర్శనము. దీనిని కొంతవిశ్లేషించి పరిశీలింపదగును.

---

(మిగులు) విష్ణుశర్మ కడియముకొరకు పులివాతబడిన బ్రాహ్మణుడు, నలుగురు దొంగల చేత మోసపోయిన బ్రాహ్మణుడు' ఇట్టి కథలనే చెప్పి తనకులమునే కించపరచునా అని విమర్శకుల వాదము. ఇవన్నియు బౌద్ధులు చేసిన బ్రాహ్మణ విమర్శకావచ్చును. 'పంచతంత్రము' క్రీ. శ. 4వ శతాబ్దపు రచన అని చారిత్రకులు.

(క) ఇందలి సమాసములు మచ్చుకు —

1. గిరినగరాత్ (2 పదములు)

2. మృత్తికోపలవిస్తారాయాం (3 పదములు)

3. పర్వతపాదప్రతిస్పర్ధిసుశ్లిష్టబంధం (5 పదములు)

4. గిరిశిఖరతరుతటాట్టాలకోపతల్పద్వారశరణోచ్ఛ్రియవిధ్వంసినా (10 పదములు)

5. పూర్వాపరాకరావంత్యనూప నీవృదానర్త సురాష్ట్రశ్వభ(మ)రుకచ్ఛసింధుసౌవీరకుకురాపరాంతనిషాదీనాం (15 పదములు)

ఈ సమాసములోని రకారప్రాచుర్యమును శబ్దాలంకారముగ గ్రహింపనగును.

(గ) 1. గురుభిరభ్యస్తనామ్నో రుద్రదామ్నో

2. జాతోత్సేకవిధేయానాం యౌధేయానాం

3. గాంధర్వన్యాయాద్యానాం విద్యానాం

ఇవిమూడును విభక్త్యంతముచేత ఏర్పడు శబ్దాలంకారము.

(చ) ఉపమలు, తత్తుల్యములు.

1. పర్వతపాదప్రతిస్పర్ధిసుశ్లిష్టబంధ.

2. ఏకార్ణవభూతాయామివపృథివ్యాం.

(జ) ఇక రుద్రదామునివర్ణనము శ్లేషలు లేకున్నను సుబంధ్వాదుల రాజవర్ణనములను స్ఫురింపజేయును.

ఇందు రుద్రదాముడు 'స్ఫుటలఘుమధురచిత్రకాంతసమయోదారాలంకృతగద్యపద్య …… ప్రమాణమానోన్మాన స్వరగతి వర్ణసార సత్వాదిభిః, పరమలక్షణ వ్యంజనైరుపేతకాంతమూర్తినా' అని వర్ణింపబడుటవలన అతడు కావ్యసంగీతప్రియుడును, కవిగాయకపోషకుడును అని తెలియుచున్నది. 'అలంకృత', 'లక్షణవ్యంజన' అను పదములు అలంకారశాస్త్రజ్ఞానమును తెలుపుచున్నవి.

(ట) మంత్రి పహ్లావుని వర్ణనమున —

'పౌరజానపదజనానుగ్రహార్థం పార్థివేన, కృత్స్నానామానర్తసురాష్ట్రాణాం పాలనార్థం నియుక్తేన పహ్లవేన, కులైపపుత్రేణామాత్యేన, సువిశాఖేన, యథావదర్థ ధర్మవ్యవహారదర్శనైరనురాగమభివర్ధయతా, శక్తేన, దాంతేనాచపలేనావిస్మితేనార్యేణా హార్యేణ స్వధిష్ఠితా ధర్మకీర్తియశాంసి భర్తురభివర్ధయతానుతిష్ఠితమితి.

ఇది బాణుడే లేక సుబంధువే వ్రాసినాడనిన నమ్మవచ్చును. అనేకపర్యాయపద ములతో బహుగుణవాచకములతో ఒకవ్యక్తిని ఒకేవాక్యములో వర్ణించుట ఇందు బీజ మాత్రముగ కనిపించుచున్నది.

(డ) ఈ శిలాలేఖలో 3 అపాణినీయప్రయోగములు కలవు.

1. పతినా (సరిరూపము - పత్యా)

2. వీశత్ ( ,, - వింశత్)

3. ఏకార్ణవభూతాయాం ( ,, - ఏకార్ణవీభూతాయాం)

ఈ అపాణినీయములు వ్యవహారబలముచేత దొర్లియుండును.

3. 12. రుద్రదామప్రశస్తికి తరువాత, చారిత్రకులమతమున సుమారు క్రీ. శ. 360 నాటి, సముద్రగుప్తప్రశస్తి సాహిత్యదృష్టిలో ముఖ్యము. ఇది అలహాబాదు సమీప మున కలదు. రుద్రదాముని వర్ణనము కావ్యరీతిలో ఉండగా ఇది చిన్న గద్యకావ్యమే అగును. దీనిరచయిత హరిషేణుడని అందే ఉన్నది. ఇతనిమహాకావ్యరీతి, గద్యరూప మున విలసితము. ఈప్రశస్తి అంతమున 'ఏతత్ - చ - కావ్యం' అనుటచేత ఇట్టి ప్రశస్తిని ఒకకావ్యప్రక్రియగ ఆనాడు గ్రహించిరని తోచును. పద్యప్రశస్తికి కావ్యము అను పేరు ఏర్పడగా పద్యగద్యమిశ్రమును 'బిరుదము' అను కావ్యభేదముగా తరువాతికాలములో గ్రహించిరని సాహిత్యదర్పణములోని బిరుదనిర్వచనము[1] వలన తెలియుచున్నది. ఆనిర్వచనముప్రకారము హరిషేణుని సముద్రగుప్తప్రశస్తి 'బిరు దము' అగును.

హరిషేణుని కావ్యమేదియు మనకు లభింపకపోయినను ఈసముద్రగుప్తప్రశస్తి లోనే ఇతడు మహాకవి అని తేటపడుచున్నది. ఇతని గద్యము పాండిత్యప్రదర్శకము,

---

1. గద్యపద్యమయీ రాజస్తుతిర్బిరుదముచ్యతే. (సాహిత్యదర్పణము 6-337)

అలంకారభూషితము రసనిష్యందమును. దీనిని అంగాంగవిమర్శచేయుటకన్న ఇందలి గద్యభాగమును ఒకపరి సాంతముగచదివిన బాణాదుల గద్యప్రౌఢిమకు ఇది ఏమాత్రమును తగ్గదని ఎరుకపడును.

## 3. 13. హారిషేణుని సముద్రగుప్త వర్ణనగద్యము

తస్య (సముద్రగుప్తస్య)

వివిధసమరశతావతరణదక్షస్య, స్వభుజబలపరాక్రమైకబంధోః, పరాక్రమాంకస్య, పరశు శర శంకు శక్తి ప్రాసాసి తోమర భిందిపాల నారాచ వైతస్తికా ద్యనేక ప్రహరణ విరూఢాకులవ్రణశతాంకశోభాసముదయోపచితకాంతతర వర్ష్మణః, కౌసలక మహేంద్ర మాహాకాంతారకవ్యాఘ్రరాజ కైరలకమంటరాజపైష్టపురకమహేంద్రగిరి కౌట్టూరక స్వామిదత్తైరండ పల్లకదమన కాంచేయక విష్ణుగోపావముక్తక నీల రాజ వైంగేయక హస్తివర్మపాలక్కకోగ్రసేన దైవరాష్ట్రికకుబేర కౌస్థలపురక ధనంజయ ప్రభృతిసర్వదక్షిణాపథ రాజగ్రహణ మోక్షానుగ్రహజనితప్రతాపోన్మిశ్రమాహాభాగ్యస్య[1], రుద్రదేవ మతిల నాగదత్త చంద్రవర్మ గణపతినాగ నాగసేనాచ్యుతనంది బలవర్మా ద్యనేకార్యావర్త రాజప్రసభోద్వృత్తప్రభావమహతః, పరిచారకీకృతసర్వాటవికరాజస్య, సమతటడవాక కామరూప నేపాల కర్తృపురాది ప్రత్యయంతనృపతిభి ర్మాలవార్జునాయనయౌధేయమాద్రకాభీరప్రార్జునసనకానీకకాకఖరపరికాదిభిశ్చ, సర్వకరదానాజ్ఞాకరణప్రణామాగమనపరితోషిత ప్రచండశాసనస్య, అనేకభ్రష్టరాజ్యోత్పన్నరాజ వంశప్రతిష్ఠాపనోద్భూత నిఖిలభువన విచారణ శాంతయశసః, దైవపుత్రశాహి శాహానుశాహి శకమురుండైః సైంహలకాదిభిశ్చ సర్వద్వీపవాసిభిః, ఆత్మనివేదనకన్యోపాయన దానగరుత్మదంక స్వవిషయభుక్తి శాసనయాచనాద్యుపాయసేవాకృత బాహువీర్యప్రసర ధరణిబంధస్య, పృథివ్యామప్రతిరథస్య, సుచరితశతాలంకృతానేక గుణగణోత్సిక్తిభిశ్చరణతలమృష్టాన్యనరపతికీర్తేః, సాధ్వసాధూదయప్రలయహేతుపురుషస్యాచింత్యస్య, భక్త్యవనతిమాత్రగ్రాహ్యమృదుహృదయస్య, అనుకంపావతః, అనేకగోశతసహస్ర ప్రదాయినః, కృపణదీనానాథాతురజనోద్ధరణమంత్రదీక్షాద్యుపగతమనసః, సమిద్ధస్య,

1. ఈ సమాసమున సుమారు 125 అక్షరములు కలవు.

విగ్రహావతో లోకానుగ్రహస్య, ధనదవరుణేంద్రాంతకసమస్య, స్వభుజబలవిజితానేక నరపతివిభవప్రత్యర్పణానిత్యవ్యాపృతాయుక్తపురుషస్య, నిశితవిదగ్ధమతిగాంధర్వలలితైర్వ్రీడిత త్రిదశపతిగురుతుంబురునారదాదే ర్విద్వజ్జనోపజీవ్యానేక కావ్యక్రియాభిః ప్రతిష్ఠితకవిరాజశబ్దస్య, సుచిరస్తోతవ్యానేకాద్భుతోదార చరితస్య, లోకసమయక్రియాను విధానమాత్రమానుషస్య, లోకధామ్నో దేవస్య, మహారాజశ్రీగుప్తప్రపౌత్రస్య, మహారాజశ్రీఘటోత్కచపౌత్రస్య, మహారాజాధిరాజశ్రీచంద్రగుప్తపుత్రస్య, లిచ్ఛవిదౌహిత్రస్య, మహాదేవ్యాంకుమారదేవ్యాముత్పన్నస్య, మహారాజాధిరాజశ్రీసముద్రగుప్తస్య, సర్వపృథివీజయజనితోదయవ్యాప్త నిఖిలావనితలాం కీర్తిమితస్త్రిదశపతిభవనగమనావాప్త లలితసుఖవిచరణామాచక్షణ ఇవ భువోబాహురయముచ్ఛ్రితః స్తంభః, యస్య—

............................ (పద్యము)

ఏతచ్చ కావ్యమేషామేవ భట్టారకపాదపానాం దాసస్య, సమీపపరిసర్పణానుగ్రహోన్మీలితమతేః, ఖాద్యటపాకికస్య, మహానాయకధ్రువభూతిపుత్రస్య, సాంధివిగ్రహికకుమారామాత్య మహాదండనాయక హరిషేణస్య, సర్వభూతసుఖాయాస్తు. అనుష్ఠితంచ పరమభట్టారకపాదానుధ్యాతేన మహాదండనాయక తిలకభట్టకేన.

3. 14. దీనిని గురించి శ్రీ H. కృష్ణశాస్త్రిపండితుడు[1] —

"హరిషేణుని 'ప్రశస్తి' ఉత్తమమయిన చిన్న కావ్యము. అది ప్రతి అంశమునను కవితాశిల్పసుగ్రమై, కర్తయైన హరిషేణుని కాళిదాసదండ్యాచార్యుల శ్రేణిలో చేర్చుచున్నది. ఈ రచనలోని అలంకారములు కొన్ని బాణసుబంధులను స్మరింప జేయుచున్నవి." అనియు

A. B. కీతుపండితుడు[2] —

(ఈ ప్రశస్తి) రచనావిధానము సుబంధు బాణుల గద్యకావ్యములలో అనుసరించిన రాజవర్ణనమును పోలియున్నది ........ ఈ రీతి విలక్షణముగ నిస్సంశయముగ దాక్షిణాత్యవైదర్భి ........ (ఇందు) శబ్దాలంకారము, అనుప్రాసము స్వల్పముగను,

1. H. Krishnasastri, Government Epigraphist, in his preface to Diskalkar's 'Select Sanskrit Inscriptions'.

2. 'History of Sanskrit Literature' pp. 77 & 78.

అర్థాలంకారములలో రూపకము హెచ్చుగను, శ్లేష ఒకచోటను[1] వాడబడినది ...... ఇతని దీర్ఘసమాసములతరువాత చిన్నమాటలు పాఠకునికి ఊపిరిపీల్చుకొనుటకును, శ్రోతకు అర్థము గమనించుటకును విరామస్థానములుగ మిక్కిలి నేర్పుతో కల్పింపబడినవి ...... నిపుణమయిన పదములపొందిక గణబద్ధ లయ విశ్రాంతిని కల్గించును ......"

ప్రతివిమర్శకుడును హరిషేణునిరీతిని సుబంధుబాణుల రీతితో పోల్చియున్నాడు. సామాన్యపాఠకునికిని ఆ సాదృశ్యభావము తప్పక కలుగును. సుబంధుని అపరిమిత శ్లేషప్రియత్వము, బాణుని పరిమితశ్లేషానురక్తియు, హరిషేణుని ఏకైకశ్లేషప్రయోగముతో భేదించుచున్నవి.

3. 15. ఇట్లే నాసికులోని శ్రీపులుమాయి ప్రాకృతశాసనము, ధారసేనుని (వలభీ) తామ్రశాసనమును కావ్యభణితిని నిరూపించుచున్నవి. ఇవన్నియు[2] బాణునికన్న పూర్వములే. కావున రీతివిషయమున సుబంధువుకాని బాణుడుకాని చేసిన ప్రక్రియ అభూతపూర్వముకాదనియు, ధారావాహికముగ అనేకశతాబ్దములుగ ప్రవహించు గద్యప్రసరములకు మరింత విస్తారమును ఉత్కృష్టమును అగు ప్రయోగముచే అనియు బోధపడుచున్నది.



1. 'సాధ్వసాధూదయ ప్రలయహేతు పురుషస్యా చింత్యస్య - ఒక అర్థము రాజుపరముగ - సాధూదయ + అసాధుప్రలయ + హేతుపురుషస్య = మంచిని నెలకొల్పుటకును చెడును నిర్మూలించుటకును కారణభూతుడైన ఊహాకందని సామర్థ్యముకల పురుషుని.

రెండవ అర్థము సృష్టికారక పురుషుని పరముగ - సాధ్వసాధు + ఉదయప్రలయ + హేతు పురుషస్య - అచింత్యస్య = (సృష్టిలో) మంచిచెడు అనుభావములు ఉనికికిని లయమునకును కారకుడైన ఊహింపరాని పురుషుని (కీతు).

2. ఈ శాసనముల కాలములనుగురించి కొంత భేదాభిప్రాయములకలవు.

# 4. గద్యకావ్యరూపములు - ఆలంకారిక నిర్వచనములు

4\. 1. సుబంధుబాణుల కావ్యములకుపూర్వమే గద్యకావ్యరీతి పరిణతిని పొందినదని పూర్వోక్తములయిన ఉద్ధృతులవలన స్పష్టము. బాణునికి తరువాత ఆలంకారికులు బాణుని 'హర్షచరితము'ను ఆఖ్యాయిక అనియు 'కాదంబరి'ని కథ అనియు నిశ్శంకముగ చెప్పియున్నారు. ఈ ఆఖ్యాయికా - కథా భేదము బాణునికి పూర్వమే ఏర్పడియుండవలెను. 'ఆఖ్యాయిక' అను పేరు ఏదోఒక కావ్యప్రక్రియకు నిర్దిష్టమని, ఆ నిర్దేశము అతిప్రాచీనమనియు సూచనలు పూర్వవాఙ్మయమున కలవు. కాని 'హర్షచరితము'న కన్న ప్రాచీనమయిన ఆఖ్యాయిక ఏదియు మనకు దక్కలేదు. 'కథ' అను ప్రాచీనప్రక్రియకు లక్ష్యమయిన పైశాచీభాషలోని బృహత్కథయు మూలరూపమున ఇప్పుడు లేదు. ఈ ఆఖ్యాయిక - కథ అను కావ్యస్వరూపములు విచారింపదగినవి.

4\. 2. పాణినివ్యాకరణసూత్రములకు వార్తికములు వ్రాసిన కాత్యాయనుడు "ఆఖ్యాన - ఆఖ్యాయికా - ఇతిహాస పురాణములకు 'ఠక్ - ప్రత్యయమును' చెప్పవలెను"[1] అని ఒకసూత్రముక్రింద గుర్తుచేయుటవలన అతనినాటికి ఆఖ్యానము,

---

1\. కాత్యాయనుడు సుమారు క్రీ. పె 4-వ శతాబ్దమునకు పూర్వుడు అని చారిత్రకుల మతము. పాణిని సూత్రము (4-2-60) —

'క్రతూక్థాది సూత్రాంతాట్ఠక్' = (చదివినవాడు, తెలిసినవాడు అను అర్థమిచ్చుపదము ఏర్పడుటకు) క్రతు, ఉక్థ మొదలగు పదములకును 'సూత్ర' అని అంతముకల పదములకును ఠక్ - ప్రత్యయమును చేర్పవలెను. ఈ సూత్రమువలన నైయాయిక (న్యాయ) యాజ్ఞిక (యజ్ఞ) నైమిత్తిక (నిమిత్త) మొదలగు పదములు ఏర్పడును.

ఆఖ్యాయిక అనునవి వేరువేరు ప్రక్రియలని తెలియుచున్నది. ఆ వార్త్తికమునే వివరించుచు పతంజలి[1] 'వాసవదత్త' అను ఆఖ్యాయికను ప్రస్తావించియున్నాడు.

పతంజలి ప్రస్తావించిన 'వాసవదత్త' మొదలగు ఆఖ్యాయికలు ఎట్టివో మనకు తెలియదు. కాని గద్యముతో పద్యములను, పద్యములతో గద్యమును చేర్చు వాడుక వైదికబ్రాహ్మణములనుండి ఉపనిషత్తులవరకును ఆర్యవాఙ్మయమున[2] సువిదితము. తరువాతి కాలములోని ఆఖ్యాయికలు, కథలు గద్యకావ్యములైనను వానిలో మధ్యమధ్య పద్యములుండుట సాంప్రదాయికమే కావచ్చును. ప్రాచీన శిలాలేఖలలోను తామ్రపత్ర లేఖలలోను గద్యపద్యమిశ్రము కనపడుచున్నది. ఆఖ్యాయికలలోను కథలలోను పద్యములు చాలతక్కువగ ఉండుటచేత వానికి గద్యకావ్యములు అని ప్రసిద్ధివచ్చినది. పద్యగద్యములు సమానముగ ఉన్న కావ్యప్రక్రియకు 'చంపువు' అను పేరు స్థిరపడినది. సంస్కృతనాటకములు ఒకవిధమైన చంపువులే.

4. 3. అయినను, కుమారసంభవాదిమహాకావ్యములకు ప్రతిస్పర్థిగ అల్పకథాంశమును భూరివర్ణనలతోనింపిన రసోపేతమయిన గద్యకావ్యనిర్మాణము ప్రథమముగా, మనకు నిలిచిన గ్రంథములలో, సుబంధుని 'వాసవదత్త'లో కనపడుచున్నది. అందు కొన్ని పద్యములును కలవు. తరువాత బాణుని 'హర్షచరితము' 'కాదంబరి'యు ప్రసిద్ధములు. వాసవదత్తను, కాదంబరిని కథలుగను హర్షచరితమును ఆఖ్యాయికగను తరువాతికాలములో లాక్షణికులు గుర్తించియున్నారు.

---

(మిగులు) ఈ సూత్రమునకు కాత్యాయనుడు అయిదు వార్త్తికములు చేర్చెను. అందు మూడవది ఆఖ్యాన - ఆఖ్యాయికా - ఇతిహాస - పురాణములకును ఠక్ప్రత్యయమును విధించును. కావున 'పౌరాణిక, ఐతిహాసిక' వంటిపదములు సాధ్యములు. కాని 'ఆఖ్యాయికిక' అనిమాత్రము ప్రయోగము కనపడదు.

1. పతంజలి 'వాసవదత్తిక' వంటి పదములును సాధింపవచ్చునని. చూ. 2. 3. 8. (క) 2.

2. పాలీ భాషలోని బౌద్ధజాతకములలోను పద్యములు, గాథలు అనునవి, కలవు. బ్రాహ్మణములలోను గాథలు కలవు. ప్రాచీన పార్సీమతగ్రంథమయిన 'జెండవెస్తా' లోను గాథలున్నవి.

4. 4. ఈ ఆఖ్యాయికా కథాస్వరూపములు, వానిసామ్యములు భేదములు — వీనిని విడమర్చి చర్చించిన లాక్షణికులలో ప్రథములు భామహుడు, దండి. భామహుడు[1] తన 'కావ్యాలంకారము'న ఆఖ్యాయికాకథాలక్షణములు చెప్పియున్నాడు. ఈ లక్షణములను వరుసబెట్టి దండి తన 'కావ్యాదర్శము'లో ఖండించుట చూడగా ఈ లక్షణములనుగూర్చి లాక్షణికులలో ఏకాభిప్రాయము మొదట లేదని తెలియుచున్నది.

4. 5. ఈనాడు మనకు దొరకని గద్యప్రబంధములు[2] ఎన్నియో భామహాదులకు తెలిసియుండవచ్చును. గద్యకావ్యమును పద్యకావ్యముతోసమానముగ ఆదరింపబడెననుటకు దండి 'కావ్యాదర్శము'న '(కావ్యము) పద్యము, గద్యము, మిశ్రము అని మూడువిధములుగనే ఏర్పడియున్నది.[3]' అని నిర్వచించుటయే నిదర్శనము.

4. 6. భామహుడు తన 'కావ్యాలంకారము'న గద్యకావ్యముల లక్షణములను ఈ క్రిందివిధముగా వివరించియున్నాడు.

అందు ఆఖ్యాయిక —

(క) "సంస్కృతభాషలో, ఉచ్చావచములు లేక, శ్రావ్యములు, అర్థవంతము

---

1. భామహుడు పూర్వుడా? దండి పూర్వుడా? వీరిరువురును బాణునికి పూర్వులా లేక వెనుకటివారా? అనువిషయముపై చారిత్రకులకు ఏకాభిప్రాయము లేదు. ఇచ్చట బాణునితో సంబంధములేక భామహుని తరువాత దండి అను అభిప్రాయము స్వీకృతము. దండి భామహాభిప్రాయములను సూటిగ ఖండించినట్లు వ్యతిరేకించుట ఈ పూర్వాపరనిర్ణయమునకు కొంత బలము.

2. ధనపాలుడు తన 'తిలకమంజరి'లో పూర్వకవిస్తుతి చేయుచు వరరుచి కావ్యము 'చారుమతి', శ్రీపాలితునిది 'తరంగవతి' అను గద్యకథలను పేర్కొనియున్నాడు. భోజుడు 'శృంగారప్రకాశ'లో రామిలసోమిలులు అను జంటకవుల 'శూద్రక కథ'ను 'మనోవతి' 'శతకర్ణిహరణము' అను కథలను ప్రశంసించుటయు గుర్తింపదగినది. అవి నష్టమైపోయినవి.

3. 'పద్యం గద్యం చ మిశ్రం చ తత్ త్రిధైవ వ్యవస్థితమ్'
(దండి, కావ్యాదర్శము, 1_10)

లును అగుపదములు కలిగి, ఉదాత్తమయిన భావములతో, ఉచ్ఛ్వాసములుగ (విభజింప బడి) ఉండు గద్య (కావ్య) రూపమును 'ఆఖ్యాయిక' అందురు.[1]"

(గ) "అందు నాయకుడు తనవృత్తాంతమును తానే (కథగా) చెప్పును. వక్త్రము, అపరవక్త్రము అను (ఛందస్సులలో) భవిష్యత్సూచకములగు పద్యములు తగుచోటులలో ఉండును.[2]"

(చ) "కవి యభిప్రాయమును తెలుపు కొన్ని ఉక్తులు ఆఖ్యాయికకు విశేషాంశము. మరియు అది కన్యాహరణము, యుద్ధము, విప్రలంభము, పురోగతి అనువానితో కూడియుండును.[3]"

తదుపరి కథ —

(జ) "మరియు, 'కథ' (అను గద్యవిశేషము)లో వక్త్రాపరవక్త్రములు ఉండవు. ఉచ్ఛ్వాసములు (అను విభాగములు) ఉండవు. కథావిషయము సంస్కృత ములోనో లేక ప్రాకృతములోనో లేక అపభ్రంశభాషలోనో ఉండవచ్చును[4]"

(ట) "అందు (కథలో) నాయకుని వృత్తాంతమును ఇతరులు చెప్పుదురు.

---

1. సంస్కృతానాకుల శ్రవ్య శబ్దార్థపదవృత్తినా ।
గద్యేన యుక్తోదాత్తార్థా సోచ్ఛ్వాసాఽఽఖ్యాయికా మతా ॥
(భామహుని కావ్యాలంకారము, 1-25)

2. వృత్తమాఖ్యాయతే తస్యాం నాయకేన స్వచేష్టితమ్ ।
వక్త్రం చాపరవక్త్రం చ కాలే భావ్యర్థశంసిచ ॥ (అందే, 1-26)

3. కవేరభిప్రాయకృతైః కథనైః కైశ్చిదంకితా ।
కన్యాహరణ సంగ్రామ విప్రలంభోదయాన్వితా ॥ (అందే, 1-27)

4. న వక్త్రాపరవక్త్రాభ్యాం యుక్తా నోచ్ఛ్వాసవత్యపి ।
సంస్కృతాఽసంస్కృతా చేష్టా కథాపభ్రంశభాక్ తథా ॥
(అందే, 1-28)

(ఆఖ్యాయికలోవలె) తాను చెప్పడు. ఉత్తమకులజుడైనవాడు (నాయకుడు) స్వగుణ ప్రశంసన ఎట్లుచేయును ?[1] ”

4. 7. ఈవిధముగా ఆఖ్యాయికను తద్భేదముగ కథను నిర్వచించుటకు భామహునికి పూర్వలాక్షణికమార్గమును, లక్ష్యకావ్యములను ఉపకరించియుండును. అతనికి 'హర్ష చరితము' కాని 'కాదంబరి' కాని తెలిసినట్లు లేదు. 'హర్షచరితము' భామహుని ఆఖ్యాయికా లక్షణములకు సరిపోదు.[2] 'కాదంబరి' మాత్రము అతని కథాలక్షణము లకు రమారమి సరిపోవును.

భామహుడు చెప్పిన ఆఖ్యాయికాలక్షణములు, ఆఖ్యాయికాకథాభేదములును ఆకాలమున సర్వలాక్షణికామోదము పొందలేదనుటకు దండి తన 'కావ్యాదర్శము' న ఆలక్షణములను ఎత్తిచూపి[3] ఖండించుట తార్కాణము.

4. 8. దండిమతమున —

(క) “(ఆఖ్యాయికలో) నాయకుడే (కథను) చెప్పవలెను, మరియొకదానిలో

---

1. అన్యైః స్వచరితం తస్యాం నాయకేన తు నోచ్యతే ।
స్వగుణావిష్కృతిం కుర్యా దభిజాతః కథం జనః ॥
(భామహుని కావ్యాలంకారము, 1-29)

ఆఖ్యాయికలో మాత్రము స్వగుణావిష్కృతిదోషము లేదా ?

2. 'హర్షచరితము' ఆఖ్యాయిక. అయినను అందు 1. నాయకుడు తన కథను తాను చెప్పడు; కవియే చెప్పును. 2. కన్యాహరణము లేదు. 3. విప్రలంభము లేదు. 4. యుద్ధముల ప్రస్తావన పలుచోట్ల కలదు కాని ప్రత్యక్షవర్ణనము లేదు. 5. 'ఉదయము' అనుట 'పురోగతి' అని అర్థము. కాని 'చంద్రసూర్యోదయములు' కూడ కావ్యములో వర్ణనీయములుగ లాక్షణిక సంప్రదాయము కలదు. హర్షచరితములో చంద్రోదయవర్ణనము కలదు. 6. వక్త్రాపరవక్త్రములు కలవు కాని అవి భవిష్యదర్థసూచకములు కావు.

3. భామహుని మాటలను కొన్నింటిని దండి అట్లే ఉల్లేఖించి ఖండించుట గుర్తింపదగును.

(కథలో) నాయకుడు లేక ఇతరుడు చెప్పవచ్చును. జరిగిన వృత్తాంతమును చెప్పువానికి స్వగుణప్రకటనదోషములేదు.[1] ”

(గ) “(ఆఖ్యాయికలలో) ఇతరులు (నాయకుని) కథను చెప్పుట కనపడుట వలన అట్టి నియమము లేదు. వక్త తానా లేక మరియొకడా అనునది ఏమి భేద కారణము.[2] ”

(చ) వక్త్రాపరవక్త్రములు, ఉచ్ఛ్వాసములును ఉండుట, ఆఖ్యాయికకు భేద కారణమైన విశేషచిహ్నము అయినచో అది ప్రాసంగికముగ కథాకావ్యములకును చెల్లును.[3]

(జ) (కథలలో) ఆర్యాదివృత్తముల ప్రవేశమువలెనే వక్త్రాపరవక్త్రములు ఏల పనికిరావు ? లంభములు, ఉచ్ఛ్వాసములు (అను కావ్యవిభాగములు) ఉండనిమ్ము. అయిననేమి ?[4]

(ట) కావున, కథ. ఆఖ్యాయిక అనునవి రెండుపేర్లుకల ఒకేజాతి (కావ్యవిశేషము). మిగిలిన అన్నికథాభేదములును అందులోనే ఇముడును.[5]

---

1. నాయకేనైవ వాచ్యాఽన్యా నాయకేనేతరేణ వా ।
స్వగుణావిష్క్రియా దోషో నాత్ర భూతార్థశంసినః ॥
(దండి, కావ్యాదర్శము, 1-24)

2. అపిత్వనియమో దృష్టస్తత్రాప్యన్యైరుదీరణాత్ ।
అన్యో వక్తా స్వయం వేతి కీదృగ్వా భేదకారణమ్ ॥ (అందే, 1-25)

3. వక్త్రం చాపరవక్త్రం చ సోచ్ఛ్వాసత్వం చ భేదకమ్ ।
చిహ్నమాఖ్యాయికాయాశ్చేత్ ప్రసంగేన కథాస్వపి ॥ (అందే, 1-26)

4. ఆర్యాదివత్ ప్రవేశః కిం న వక్త్రాపరవక్త్రయోః ।
భేదశ్చ దృష్టో లంభాదిరుచ్ఛ్వాసో వాస్తు కిం తతః ॥ (అందే, 1-27)

5. తత్ కథాఖ్యాయికేత్యేకా జాతిః సంజ్ఞాద్వయాంకితా ।
అత్రైవాంతర్భవిష్యంతి శేషాశ్చాఖ్యానజాతయః ॥ (అందే, 1-28)

(డ) కన్యాహరణ, సంగ్రామ, విప్రలంభోదయాదులు (అను కథాంశములు) సర్గబంధములకును (పదకావ్యములకును) సామాన్యగుణములే. వేనికిని అవి విశేషములు కావు.[1]

(త) కవిభావోక్తులు అను చిహ్నము కథలోను దోషము కాదు.[2]

4. 9. ఇట్లు ఆఖ్యాయికాకథలకు ప్రక్రియాభేదము లేదని దండి ఎంతగట్టిగ వాదించినను, అట్టి భేదము కలదు అనువారే అధికులని తోచుచున్నది. ఈ వాదము అతితీవ్రముగను అపరిష్కృతముగను ఉండుటచే క్రీ. వె. 8-వ శతాబ్దములో వామనుడు —

'వాని (కథాఖ్యాయికల) లక్షణము ఎక్కువ హృదయంగమము కాదు; కావున వదలివేయుచున్నాను; ఇతరపుస్తకములనుండి గ్రహింపదగును.[3]' అని విరమించి అందుపై తనవిసుగును సూచించినాడు.

బాణుడు ఆఖ్యాయికను కథను ఎక్కువలేకున్నను ఒకింత భేదముగల ప్రక్రియలుగనే గ్రహించెననుట స్పష్టము. అతని రెండు కావ్యములే లేకున్న కథాఖ్యాయికాభేదములు ఈనాడు కేవలము లాక్షణికవచనావశిష్టములై నేలవిడిచినసాముగ ఉండెడివి.

4. 10. తదుపరి రుద్రటుడు (క్రీ. వె. 9-వ శతాబ్దము) తన 'కావ్యాలంకారము' లో ఆఖ్యాయికాకథాభేదములను విస్తరించి చెప్పెను. కాని ఇతడును, ఇతనికి తరువాతివారును బాణకావ్యములను చూచియే తమకు తోచినట్లు నిర్వచనములు చేసిరని తోచును. విశ్వనాథుడు (క్రీ. వె. 14-వ శతాబ్దము) 'సాహిత్యదర్పణము' లో చెప్పినవన్నియు అట్టివే. దండిమతమును ఇతరలాక్షణికులెవరును ఒప్పుకొన్నట్లు లేదు.[4]

---

1. కన్యాహరణసంగ్రామ విప్రలంభోదయాః ।
సర్గబంధసమా ఏవ న తే వైశేషికా గుణాః ॥
(దండి, కావ్యాదర్శము, 1-29)

2. కవిభావకృతం చిహ్న మన్యత్రాపి న దుష్యతి ।
(అందే 1-30 శ్లోకార్ధము)

3. తల్లక్షణం చ నాతిహృదయంగమమిత్యుపేక్షితమస్మాభిః । తదన్యతో గ్రాహ్యమ్ ॥
(కావ్యాలంకారసూత్రవృత్తి 1-3-32)

4. దండి భామహుని ఆఖ్యాయికాలక్షణములను ఖండించుటయే కాక తల్లక్షణవిపరీతలక్ష్యముగ 'దశకుమారచరితము' ను నిర్మించినట్లు తోచును. అది 'కథ'

**4. 11.** లక్షణగ్రంథములలో నిలిచిపోయిన[1] ఆఖ్యాయికాకథాలక్షణములను వాని భేదములను సంగ్రహముగ ఈ క్రింది అనుక్రమణికలో[2] చూడనగును.

| ఆఖ్యాయిక | కథ |
|---|---|
| 1. నాయకుడు తనకథను తానే చెప్పును; నాయకుని మరియొకరు వర్ణింతురు. | నాయకేతరుడే నాయకుని వృత్తాంతమును చెప్పును. |
| 2. కావ్యము ఉచ్ఛ్వాసములుగ (లేక ఆశ్వాసములుగ) విభజింపబడి యుండును. | అట్టి నియమము లేదు. కాని కొన్నింట లంభములు అను విభాగములు కనబడును. |
| 3. వక్త్రము, అపరవక్త్రము అను ఛందస్సులలో పద్యములు ఉండును. | వానికి బదులు ఆర్యలు ఉండును. |
| 4. కన్యాహరణము, యుద్ధము, విప్రలంభము, ఉదయము అను విషయములు కథాంశములుగ ఉండును. | అట్టి నియమము లేదు. |
| 5. కవిభావకృత చిహ్నములు కలవు. | ఉండవు. |
| 6. కవివంశవర్ణనము సుదీర్ఘముగ గద్యమున నుండును. | సంగ్రహముగ పద్యమున నుండును. |

(మిగులు) అయినను ఉచ్ఛ్వాసవిభజన కలదు. కథకులు అనేకులు, కాని ఒక్కొక్కడును తనకథనుమాత్రమే చెప్పును. అట్లే 'అవంతిసుందరీకథ' లో కథాలక్షణవిరుద్ధముగ కవిజీవితవర్ణనము కలదు.

1. అగ్నిపురాణములో సువిస్తరమయిన ఆఖ్యాయికాలక్షణములు కలవు. కాని ఆ పురాణములోని అలంకారశాస్త్రసంగ్రహము ప్రాచీనము కాదనియు తరువాతికాలములో పలు అలంకారశాస్త్రములనుండి గ్రహించి అందు ప్రతిక్షేపించిరనియు చారిత్రకమార్గణుల విశ్వాసము.

2. ఈపట్టి శ్రీకర్మకారపండితుని 'బాణుడు' అను ఆంగ్లవిమర్శకగ్రంథము నుండి గృహీతము.

4. 12. ఆఖ్యాయికకును కథకును లాక్షణికులు చెప్పు భేదములుకాని వాని విశేష గుణములుకాని నిరర్థకములని గ్రహించి మరియొకవిధముగా వాని భేదసారద్యోతకము గను, అతిసంక్షిప్తముగను, బాణకావ్యములకు సరిపోవునట్లును[1] 'అమరకోశము' లో 'ఆఖ్యాయిక ప్రసిద్ధమయిన వృత్తము కలది; కథ (కవి) కల్పించినది'[2] అను నిర్వచనములు కలవు.

4. 13. 'కథ' అను సామాన్యార్థముకల పెక్కుపదములు సాహిత్యమునందును అలంకారశాస్త్రములలోను కనబడుచున్నవి. అగ్నిపురాణములో 'ఆఖ్యాయికా, కథా, ఖండకథా, పరికథా, కథానికా' అని అయిదు రకముల గద్యకావ్యముల ప్రస్తావన కలదు. ఇవికాక ఆఖ్యానము, ఆఖ్యానకము, ఉపాఖ్యానము, అవదానము (బౌద్ధము), వృత్తము, ఇతివృత్తము (నాటకమున) మొదలగునవి ఎన్నో. ఇట్లుకాక కథ అను అర్థములో 'భాగవతము, రామాయణము, భారతము' అనుపేర్లును కలవు. ఈ పద జాలమునకు లాక్షణికులు ఎంత విశేషనిర్వచనములు చేసినను కవిప్రయోగమున అవి నిర్విశేషములై పర్యాయపదములైనవి.

4. 14. జగద్విఖ్యాతములును, లాక్షణికదృష్టిగోచరములును, అగు ఆఖ్యాయికను, కథను రచించిన బాణునికి ఆఖ్యాయికాకథాకావ్యస్వరూపములనుగురించి లక్షణజ్ఞానము కొంత కలదని అతని మాటలలోనే తెలియుచున్నది.

బాణుడు హర్షచరితారంభమున,

'ఉచ్ఛ్వాసాంతమున' భిన్నులుకాక 'వక్త్రములో' సరస్వతిని కలిగిన కవీశ్వరులగు ఆఖ్యాయికాకారులు ఏల వంద్యులు కారు ?[3]

---

1. ఈ యభిప్రాయము అమరుడు బాణునికి తరువాత అను భావము మీద ఆధారపడినది. కాని ఇతరహేతువులు అమరుని పూర్వతను ప్రతిపాదించునవియు కలవు. ఉదాహరణమునకు, అమరుడు నాటకములసంగతి చెప్పకవిడుచుట. అమరుడు బాణునికి పూర్వుడైన ఆఖ్యాయికాలక్షణము అర్వాచీనప్రతిక్షేపము కావచ్చును. ఏమైనను అమరకోశపు నిర్వచనములు బాణకావ్యములను చూచి చేసినవను విశ్వాసమునకు బలమున్నది.

2. ఆఖ్యాయికోపలబ్ధార్థా ప్రబంధకల్పనా కథా

3. ఉచ్ఛ్వాసాంతేఽప్యఖిన్నాస్తే యేషాం వక్త్రే సరస్వతీ ।
కథమాఖ్యాయికాకారా న తే వంద్యాః కవీశ్వరాః ॥

అని ఆఖ్యాయికాలక్షణములగు ఉచ్ఛ్వాసవిభాగము, 'వక్త్రములు' అను పద్యవిశేషప్రయోగము సూచించెను.

అట్లే 'కాదంబరి' ఆరంభమున,

"తీయనిమాటలవిన్యాసముతో ప్రకాశించుచు (శృంగార)రసముచే తానే 'శయ్యను' చేరు నవవధువు వరునకు ఎట్లో అట్లే (కథా)కావ్యము మృదుపదవిన్యాసముతో రసోచితమైన శయ్య (పదగుంఫనము, రీతి.) తానే కుదురగా (పాఠక) జనునికి మనస్సులో కౌతుకము వృద్ధిచేసి రక్తిని కల్గించును.[1]"

మరియు,

'క్రొత్తగా కోసితెచ్చిన, ప్రకాశవంతములయిన దీపకళికలనుబోలిన (మాల్య) ద్రవ్యములగు సంపెంగమొగ్గలతో కలిపి కట్టిన, దట్టమయినకూర్పుచేత ఘనమయిన, జాతిపువ్వుల గొప్పదండవలె —

---

(మిగిలు) ఇందు శ్లేష కలదు :— ఉచ్ఛ్వాసాంతే = 1. ఒక్కొక్క ఉచ్ఛ్వాసము అను ఆఖ్యాయికా గ్రంథవిభాగము రచించిన పిమ్మట 2. అలుపువలన పెద్దయూపిరి పీల్చిన వెనుక. అఖిన్నాః = 1. ఉత్సాహము తగ్గనివారు 2. శక్తి తగ్గనివారు. వక్త్రే = 1. వక్త్రము అను పద్యవిశేషములో 2. నోటిలో. సరస్వతీ = 1. సరస్వతీదేవి 2. భాష. గమనిక : 'ఏలవంద్యులుకారు? (కథం న వంద్యాః?)' అనుటలో గద్యకవులను పండితులు ఆనాటివరకు కొంత చిన్నచూపు చూచుచుండిరని ధ్వనించుచున్నది. చూ. బాణప్రశస్తి 1. 2. 2.

1. స్ఫురత్ కలాలాపవిలాసకోమలా కరోతి రాగం హృది కౌతుకాధికం ।
రసేన శయ్యాం స్వయమభ్యుపాగతా కథా జనస్యాభినవా వధూరివ ॥
(కాదంబరి. 8)

ఇందు శ్లేష :— కలాలాప = 1. తీయని పలుకుల 2. తీయని పదముల శయ్యాం = 1. పడకను 2. శైలిని. మొత్తము శ్లోకము పాఠకునికి నవవధూపరముగను, కథాకావ్యపరముగను ద్వ్యర్థి అగును.

క్రొత్తగా కల్పింపబడిన (కథా) వస్తువులతో, ప్రస్ఫుటములయిన దీపకము, ఉపమ అను అలంకారములతో, ప్రతిపదశ్లేషచేత అర్థబాహుళ్యముకలిగి, జాతులు (అను ఛందస్సులలో మంచి పద్యములు) కలిగి నిర్మింపబడిన కథాకావ్యములు ఎవరి మనస్సులను హరింపవు ?'[1]

—

1. హరంతి కం నోజ్జ్వలదీపకోపమైర్ నవైః పదార్థైరుపపాదితాః కథాః ।
నిరంతరశ్లేషఘనాః సుజాతయో మహాస్రజశ్చంపకకుడ్మలైరివ ॥
(కాదంబరి. 9)

ఇందు శ్లేష :— దీపకోపమైః = 1. దీపకళికలను పోలిన వానిచేత 2. దీపకములు, ఉపమలు అను అలంకారములతో; పదార్థైః = 1. మూల్యద్రవ్యములు, అనగా పూలచేత 2. కథావస్తువులచేత ; నిరంతర = 1. సందులేక దట్టముగ 2. ఎల్లెడల ; ఎల్లపుడు. శ్లేష = 1. జోడింపు 2. రెండు అర్థములు కల. సుజాతయః = 1. మంచి. జాతిపువ్వులు కలిగినవి 2. మంచి జాతి - ఛందస్సులలో పద్యములు కలిగినవి.

బాణునిమతమున కథాకావ్యము అలంకారోజ్జ్వలము, నవ్యవస్తుప్రకాశకము, శ్లేషయుతము, ఆర్యాదివృత్తసమేతమును అని బోధపడుచున్నది.

చంపకపు మొగ్గలు పసుపువర్ణముకలిగి దీపశిఖలవలె ఉండుటచేత 'దీపకోపమైః' అనుటలో సాదృశ్యము పూర్తిగ వ్యక్తము.

కాని, 'కాదంబరి' లో దీపకాలంకారప్రాచుర్యము అంతగా కనపడదు. చూ. 12, 67.

# 5. గీర్వాణగద్యరీతులు - ఆలంకారిక నిర్వచనములు

5. 1. ప్రాచీనశిలాలేఖాదులలో సంస్కృతగద్యవిధానము పరిణతిచెందియుండుటయు, గద్యకావ్యములు ఎక్కువగా రచింపబడుటయు, అవి జనాదరమును పొందుటయును లాక్షణికులదృష్టిని గద్యకావ్యలక్షణములమీదికి మరల్చినవి. గద్యకావ్యస్వరూపము, విషయము మొదలగువానిమీద ఆఖ్యాయికాది నిర్వచనములు, వానిమీద మతభేదములు ఏర్పడినట్లే గద్యకావ్యపు శైలినిగురించికూడ పరిభాషలు పలునిర్వచనములు సంభవించినవి. వామనుని కాలమునకు (క్రీ. వె. 8-వ శతాబ్దము) గద్యకావ్యము మిక్కిలి గౌరవప్రతిష్ఠలు పొందెనని

'గద్యము కవుల(ప్రతిభ)కు ఒరగల్లు'[1]

అని వామనుడు ఉల్లేఖించిన లోకోక్తియే నిదర్శనము. అప్పటికి గద్యభాష అసమాన ప్రతిభాద్యోతకము, క్లిష్టశ్లిష్టసంవిధానచతురము, మహాకవిసాధ్యమును అను నభిప్రాయము స్థిరపడియుండవలెను.

5. 2. కాని గద్యకావ్యభాషనుగురించి చెప్పిన లక్షణములు పద్యకావ్యభాషకు మొదట చెప్పబడి తరువాత గద్యకావ్యభాషకును అన్వయింపబడినవని గుర్తింపవలెను.

సంస్కృతకావ్యభాషను చర్చించునపుడు 'శయ్య, రీతి, శైలి' అనుపదములు తరచు ఉపయోగింపబడుచున్నవి. ఈ పదములన్నియు పదగుంఫనార్థకములే. ఇందు

---

1. 'గద్యం కవీనాం నికషం వదన్తి'
(వామనుని కావ్యాలంకారసూత్రవృత్తిలో 1-3.21 క్రింద వృత్తి)

ఈ లోకోక్తిని మొదట గ్రంథస్థము చేసినది వామనుడు.

లాక్షణికులు ఎక్కువగా 'రీతి' లేక 'శయ్య' అను పదములను వాడియున్నారు. 'శైలి'[1] అను పదము ఇటీవల ఎక్కువ ప్రాచుర్యమును పొందినది.

5. 3. 1. రీతిభేదముల ప్రశంసను మొదటచేసిన ఆలంకారికుడు భామహుడు. అతడు గౌడీయము, వైదర్భము అను రెండురీతులను, అప్పటికి ఎక్కువ ప్రచారమున ఉన్న వానిని, పేర్కొని వానికి నిజముగా పెద్దభేదము లేదని, 'మూర్ఖపండితులు గతానుగతికముగ భేదము చెప్పుదురు'[2] అనియు నుడివెను.

యథాపూర్వము[3] దండి భామహాభిప్రాయమునకు విపరీతముగా గౌడీయ వైదర్భములను విశ్లేషించి, విశేషించి లక్షణచర్చ చేసియున్నాడు —

(క) 'సూక్ష్మభేదములతో అనేకభాషామార్గములు కలవు. అందు ప్రస్ఫుటమయిన భేదముకల గౌడీయవైదర్భములు ఇచ్చట చెప్పబడును.'[4]

---

1. 'శైలి' అను పదమును సంస్కృతలాక్షణికులు ఎవరును ప్రయోగింపలేదు. ఇది హిందీలోను తెలుగులోను ఈ శతాబ్దమున ఎక్కువ వాడుకలోనికి వచ్చినది. ఆప్టే నిఘంటువులోకూడ ఈ పదపు అర్థములలో 'Style' అని స్పష్టముగ చెప్పలేదు. 'శీలం' అనుపదము స్వభావము, ఆచారము, మంచిరూపము అను అర్థములలో ప్రయోగింపబడుటచేత దానికి తద్ధితరూపమయిన 'శైల' అనుపదము రీత్యర్థమును పొంది స్త్రీలింగరూపమున 'శైలీ' అయినట్లు భావింపదగును.

2. గౌడీయమిదమేతత్తు వైదర్భమితి కిం పృథక్ ।
గతానుగతిక న్యాయాన్నానాఖ్యేయమమేధసామ్ ॥
(భామహుని కావ్యాలంకారము, 1-32)

న + అనాఖ్యేయం + అమేధసామ్ = మూర్ఖులు అనకుండ ఉండరు.

3. భామహుడు ఆఖ్యాయికకును కథకును భేదము చెప్పగా దండిభేదము లేదనుట, భామహుడు రీతిభేదములు లేవనగా దండి అవి కలవని విజృంభించి, విస్తరించి చెప్పుటయు చూడగా వీరిరువురును రెండు భిన్నలాక్షణిక సంప్రదాయములకు చెందినవారని తోచును.

4. అస్త్యనేకో గిరాంమార్గః సూక్ష్మభేదః పరస్పరమ్ ।
తత్ర వైదర్భగౌడీయౌ వర్ణ్యేతే ప్రస్ఫుటాంతరౌ ॥
(దండి, కావ్యాదర్శము, 1-40)

(గ) 'వైదర్భమార్గమునకు ప్రాణములనదగినవి పదిగుణములు చెప్పుదురు. అవి శ్లేష, ప్రసాదము, సమత, మాధుర్యము, సుకుమారత, అర్థవ్యక్తి, ఉదారత్వము, ఓజస్సు, కాంతి, సమాధి అనునవి. వీని విపర్యయములు గౌడీయమార్గమున తరచు కనపడును.'[1]

దండియు రెండే రీతులను చెప్పుటయు, లాక్షణికసంప్రదాయమున ఇంకను ఎన్నోకలవని సూచించుటయు, గుర్తింపదగును. 'శైలి' అను అర్థములో దండి 'మార్గము' అనుట స్మర్తవ్యము.

5. 3. 2. దండి విస్తారముగచేసిన గుణనిర్వచనములు వానిమూలముగ వైదర్భ గౌడీయరీతినిరూపణమును సంక్షిప్తముగ క్రింది పట్టికలో[2] పొందుపరుపబడినవి.

| గుణములు - నిర్వచనములు | వైదర్భిలో | గౌడీయలో |
|---|---|---|
| 1. శ్లేష = (అశైథిల్యము) చిక్కనితనము | ముఖ్యము | అనావశ్యము |
| 2. ప్రసాదము = (సుగమార్థము) తేటతనము | ,, | ,, |
| 3. సమత = (అవైషమ్యము) ఒకేవిధముగ ఉండుట | ,, | ,, |
| 4. మాధుర్యము = (శబ్దసౌందర్యము) చెవికి ఇంపు | ,, | ,, |
| 5. సుకుమారము = (శబ్దమార్దవము) మృదుత్వము | ,, | ,, |
| 6. అర్థవ్యక్తి = (అసందిగ్ధార్థము) | ముఖ్యము | ముఖ్యము |
| 7. ఉదారత్వము = (ఉత్కృష్టగుణవర్ణనము) | ,, | ,, |
| 8. ఓజస్సు = (సమాసభూయస్త్వము) | | |
| గద్యములో | ,, | ,, |
| పద్యములో | వర్జ్యము | ముఖ్యము |

1. శ్లేషః ప్రసాదః సమతా మాధుర్యం సుకుమారతా ।
అర్థవ్యక్తి రుదారత్వ మోజః కాంతి సమాధయః ॥
ఇతి వైదర్భమార్గస్య ప్రాణా దశగుణాః స్మృతాః ।
ఏషాం విపర్యయః ప్రాయో దృశ్యతే గౌడవర్త్మని ॥
(అంజే, 1-41, 42)

2. ఈ పట్టిక శ్రీ ౦. శంకరరామశాస్త్రిగారి కావ్యాదర్శాంధ్ర వ్యాఖ్యానములో నుండి అనుకృతము.

| గుణములు - నిర్వచనములు | వైదర్భిలో | గౌడీయలో |
|---|---|---|
| 9. కాంతి = (లౌకికవర్ణనము) | ముఖ్యము | అనావశ్యము |
| = (అత్యుక్తి) | అనావశ్యము | ముఖ్యము |
| 10. సమాధి = ఒకదానియందు వేరొకదాని ధర్మమును ఆరోపించుట | ముఖ్యము | ముఖ్యము |

ఇందు దండిమతమున గద్యమునకు ఓజస్సు[1] ప్రధానగుణము.

5. 4. వామనుడు (క్రీ. వె. 8-వ శతాబ్దము),

'కావ్యమునకు రీతి ఆయువుపట్టు; రీతి అనగా విశిష్టమయిన పదరచనము; అది మూడువిధములు, వైదర్భి, గౌడీయ, పాంచాలి'[2] అని రీతులను మూడుగ చేసెను.

వామనుని ప్రకారము 'వైదర్భి సమగ్రగుణోపేతము, గౌడీయ ఓజఃకాంతి గుణములు ముఖ్యముగా కలది, పాంచాలి మాధుర్యసౌకుమార్యములు కలది. గుణ సాకల్యముచేత మొదటిది (వైదర్భి) గ్రహింపదగినది.[3]

1. ఓజః సమాసభూయస్త్వమేతద్గద్యస్య జీవితమ్
(దండి, కావ్యాదర్శము, 1-80)

ఇందు వింతయేమన బాణాదుల గద్యకావ్యములు నిజముగనే ఓజః ప్రధానముగ ఉండగా దండి 'దశకుమారచరితము'లో ఓజస్సు తక్కువ. 'కావ్యాదర్శము' 'దశకుమారచరితము' ఏకకర్తృకములు కావను వాదమునకు ఇది ఒక నిదర్శనము.

2. రీతిరాత్మా కావ్యస్య (వామనుని కావ్యాలంకారసూత్రములు, 1-2-6); విశిష్టా పదరచనా రీతిః (అందే 1-2-7); సా త్రిధా, వైదర్భీ గౌడీయా పాంచాలీ చేతి (అందే 1-2-9).

3. సమగ్రగుణోపేతా వైదర్భీ (అందే 1-2-11) ఓజః కాంతిమతీ గౌడీయా (1-2-12) మాధుర్య సౌకుమార్యోపపన్నా పాంచాలీ (1-2-13) తాసాం పూర్వా గ్రాహ్యా గుణసాకల్యాత్ (1-2.13).

5. 5. పోను పోను ఆలంకారికులు ఈరీతిభేదములను విస్తరింపజేయుచు క్రొత్త పేర్లిడుచు[1] వచ్చిరి. విశ్వనాథుడు సాహిత్యదర్పణమున 'లాటి' అని ఒక క్రొత్త రీతిని, భోజుడు 'సరస్వతీకంఠాభరణము'న 'ఆవంతీ, మాగధీ' అని మరి రెండును చెప్పియున్నారు. ఇవన్నియు ఎడపెడగ ఉన్న వైదర్భీ గౌడీయరీతుల అవాంతర భేదములే అగుట భామహుడు ఆ రెంటినే 'స్ఫుటాంతరములు' అనెను.

5. 6. ఈరీతిభేదములు కావ్యమున అందందు కనపడునేకాని ఏకరీతిగనుండు కావ్యము లేదు. ఒకకావ్యమున ఒకానొక రీతిప్రాబల్యమును చూచి ఆ కావ్యమును అంతను ఆరీతిచే ఉపలక్షించుట స్థూలనిర్వచనమేకాని యథార్థము కాదు. ప్రతికవియు కావ్యములో రసావశ్యకతను అనుసరించి ఆయారీతులను ప్రయోగించుట లక్ష్యజ్ఞానముచే స్పష్టము.

5. 7. గద్యరీతిలో మరియొక విశేషమును వామనుడు చెప్పియున్నాడు. పద్యముల గణవిధానమును గద్యములో అక్కడక్కడ ప్రయోగించిన ఆయాచోట్ల గద్యమును 'వృత్తగంధి'[2] యనియు, సహజములు, లలితములును అగుపదములుపొందికను

1. రీతుల పేర్లన్నియు దేశనామములనుండి ఏర్పడినవి. ఆ యా మండలములలోని ప్రసిద్ధకవుల వాడుకలు కాలక్రమమున కవులకు లక్ష్యములై ఎల్లెడల వ్యాపించియుండును. వామనుడు వైదర్భ్యాదిరీతులను 'విదర్భాదిషు దృష్టత్వాత్' అనుచున్నాడు. కావున వైదర్భి విదర్భదేశరీతి; గౌడీయ గౌడదేశరీతి; పాంచాలి పాంచాలదేశరీతి, ఇత్యాది ఊహింపవలెను.

2. 'గద్యం వృత్తిగంధి, చూర్ణ ముత్కలికాప్రాయంచ'

(కావ్యాలంకారసూత్రములు, 1. 3. 22)

అంటే 'పద్యభాగవద్వృత్తగంధి' (1. 3 23)

గద్యకవులు పద్యపాదములను ఉద్దేశపూర్వకముగ గద్యమున ఇమిడ్చెదరనుట సత్యాభాసమే కాని వాస్తవము కాదు. గద్యకవులును పద్యములు వ్రాయువారే అగుట, ఇతరకవుల పద్యకావ్యములను బాగుగ చదివినవారే అగుటయు, వారి వచనరచనలో అప్రయత్నముగ అచ్చటచ్చట పద్యపాదములు దొరలక తప్పవు. ఈనాడు ఏ తెలుగు దినపత్రికలోనైనను వార్తావాక్యములను, సంపాదకీయములను పరీక్షించిన కొన్ని ఆటవెలది పాదములో తేటగీతులో కనపడక పోవు. అంతమాత్రమున విలేకరులు వృత్తగంధివిన్యాసకులు కారు. ఈ కారణమున ఈ వ్యాసములో బాణుని కాదంబరిలోని వృత్తగంధులను ఏరు పని పెట్టుకొనలేదు.

'చూర్ణము[1] (చూర్ణిక)' అనియు వీనికి విపరీతమయిన గద్యమును 'ఉత్కలిక'[2] అనియు వామననిర్వచనము.

5. 8. బాణుడు అన్నిరీతులకును గుణములకును సర్వాధికారి. కాదంబరిలోలేని రీతి లేదు. ఓజోగుణభూయిష్ఠమయినరీతిని వర్ణనలందును, చూర్ణికవాక్యములను పాత్రల తలపోతలలోను సంభాషణములందును, అటునిటుగ ఇతరస్థలములలోను ప్రయోగించి బాణుడు కాదంబరిలో అద్వితీయమైన రీతివైదగ్ధ్యము, రీతివైవిధ్యమును చూపియున్నాడు.

రాజశేఖరుడు బాణునిది పాంచాలీరీతి[3] అనినట్లు ఒక చాటువుకలదు.

వాస్తవముగ బాణుని భాష రసానుసారి. అతనికి 'శయ్య' తనకుతానే కుదురును



1. 2. అనావిద్ధలలితపదం చూర్ణమ్; విపరీతముత్కలికాప్రాయం చ.
(కావ్యాలంకారసూత్రములు 1. 3. 24, 25)

3. చూడు. బాణప్రశస్తి 1. 2. 4 (చ).

4. చూడు. 4. 14. 'స్ఫురత్ కలాలాప ...' అను పద్యమున 'శయ్యాం స్వయమభ్యుపాగతా' అనుటను బాణునికే అన్వయింపదగును.

# 6. కాదంబరీకావ్యముద్రణములు

6. 1. పాశ్చాత్యపండితులు భారతీయసంస్కృతికి చేసిన మహోపకారము, ఆకుల మీదను బెరడులమీదను వ్రాయబడి శిథిలమైపోవుచున్న, సంస్కృతగ్రంథములను ఇతరభాషాగ్రంథములను ముద్రింపించి ప్రచారము కల్గించుట. పుస్తకమును ప్రచురించునపుడు పలువ్రాతప్రతులను సేకరించి, పోల్చిచూచి, పాఠభేదములను గుర్తించి, పరిష్కర్తకుతోచిన సాధుపాఠమును కావ్యమునగ్రహించి, ఇతరపాఠములను పుట యడుగుననో లేక గ్రంథాంతమున అనుబంధముగానో ప్రచురించి పుస్తకమునకు ఒక విమర్శనాత్మకమైన పీఠికను చేర్చుట పాశ్చాత్య పరిష్కర్తలు మనకు నేర్పిన ఉత్కృష్ట ముద్రణవిధానము. అట్లు సుదీర్ఘమయిన ఆంగ్లపీఠికయు, పాఠనిర్ణయసామగ్రియు, ఆంగ్లటీకయు కలిగి నిర్దుష్టముగ దేవనాగరిలిపిలో ముఖ్యమయిన కాదంబరీముద్రణము P. పీటర్సను పండితునిది. అది క్రీ. శ. 1871 లో జరిగినది.

6. 2. 1. కాని పీటర్సను పీఠికలో తాను రెండు కలకత్తాముద్రణములను కూడ వ్రాతప్రతులతో సరిపోల్చినట్లు చెప్పుటవలన మొదటిముద్రణము కలకత్తానగరమున జరిగెనని స్పష్టము.

కలకత్తాముద్రణము 1849 లో జరిగినట్లును దానికే పునర్ముద్రణము 1872 లో కలిగినట్లును పీటర్సను తన కాదంబరి మూడవముద్రణ పీఠికలో చెప్పియుండుట తప్ప వానినిగురించి వివరములు తెలియవు.[1]

---

1. అనగా ఈ వ్యాసకర్తకు తెలియవు అని. కలకత్తా జాతీయగ్రంథాలయములో ఈ ప్రతులు ఉండదగును అని ఆ గ్రంథాలయాధికారికి జాబు వ్రాయగా జవాబు లేదు. అమెరికా, ఇంగ్లండు, జర్మనీ మొదలగు దేశములలోని గొప్పగ్రంథాలయములకు జాబువ్రాసిన మనమేమో వారికి మహోపకారముచేసినట్లు ఎంతో ఆదరముతో జవాబువచ్చును. కాని కలకత్తా నేషనల్ లైబ్రరీనుండి రాదు. ఈ విషయమును మిత్రుడు బండి గోపాలరెడ్డి (బంగోరే)తో ప్రస్తావింపగా అతడు తన అనుభవమును అంతే అని, తాను విధిలేక స్వయముగా కలకత్తాకు పోయి తన పనిని సాధించుకొన్నట్లు చెప్పినాడు. అతడు కార్యశూరుడు, శ్రమయు విసుగును తెలియని అన్వేషకుడు.

6. 2. 2. 1876 లో లండనులో ముద్రింపబడిన బ్రిటిషు మ్యూజియం లైబ్రరీ కేటలాగులో (సంపాదకుడు : డా. ఎర్నెస్టు హేసు పండితుడు) కాదంబరినిగురించి ఈ క్రింది వివరము కలదు.[1]

1. **Kadambari:** A romance in prose and verse by Vana Bhatta[2] and Completed by his son, edited by Madanamohana Sarman, 1849, A. D., Calcutta. (లిపి?)

2. **Kadambari:** Edited with a Commentary by Taranatha Tarkavachaspati, Calcutta. Devanagari Script (Date?)

3. **Kadambari:** Edited by Madhura Subba Sastri, Madras, 1862, A. D., Telugu characters.

ఈ వివరము ప్రకారము కాదంబరికి కలకత్తాలో రెండు ముద్రణములయినవని తెలియుచున్నది. ఇవియే కాదంబరికి ప్రథమ ముద్రణములు; రెండును భారతీయ సంపాదకులవి. వానిలో ఒకదాని సంపాదకుడు (వ్యాఖ్యాత ?) అయిన శ్రీ తారానాథ తర్కవాచస్పతి పీటర్సను సంస్కరణమునకు సహాయపడినట్లు శ్రీ పీటర్సను కాదంబరి (1899) పునర్ముద్రణ పీఠికలో కృతజ్ఞత తెలుపుకొనియున్నాడు.

ఇందు ఆంధ్రులకు గర్వకారణము, 1862 లోనే తెలుగులిపిలో కాదంబరి వెలువడుట. దీనిని ముద్రించినది ఎవరో తెలియదు.[3]

---

1. ఈ వివరమును చూచి ఎత్తివ్రాసి ఓపికతో నాకుపంపినది శ్రీ బండి గోపాలరెడ్డి. ఆ కేటలాగులో కొన్ని పునర్ముద్రణములుకూడ గుర్తింపబడియున్నవి.

2. బంగ్లాభాషలో వ - బ (V - B)ల ఉచ్చారణము తారుమారై పశ్చిమ, దక్షిణభారతీయుల ఉచ్చారణమునకు విపరీతముగ ఉండుట అందరికిని తెలిసినదే. కలకత్తాలో బాణభట్టు వాణభట్టు అగును. ఇది పీటర్సను చెప్పిన కలకత్తా ముద్రణము కావచ్చును.

3. క్రీ. శ. 1862 వ సం॥ ఏప్రిలు 19వ తేదిన శ్రీ మధుర సుబ్బాశాస్త్రి చేత పరిష్కరింపబడిన సుబంధుని 'వాసవదత్త' మద్రాసులో జ్ఞానసూర్యోదయ ముద్రాక్షరశాలలో తెలుగులిపిలో ముద్రింపబడి వెలువడినది. కావున ఆ ముద్రాక్షరశాలలోనే ఆ సం॥ లోనే కాదంబరిని మధుర సుబ్బాశాస్త్రిగారే పరిష్కరించి ముద్రింపించియుండునను సంభావ్యమే.

6. 2. 3. P. పీటర్సను పండితుని ముద్రణము ఇప్పటికిని ప్రామాణికము. కాని ప్రతులు దొరకవు. దానిలోని బాణభాగము మూలము మాత్రము నాగరిలిపిలోనే 150 పుటలను రెండు సమభాగములుగ (1-75; 76-150) బొంబాయి విశ్వవిద్యాలయము వారు ముద్రింపించి చౌకగ విద్యార్థులకు అందజేసియున్నారు. ఈ ప్రతులు లభ్యములే.

6. 2. 4. పీటర్సను సంస్కరణమునకు తరువాత బొంబాయి నిర్ణయసాగరము ముద్రాక్షరశాలవారి సంస్కరణము గొప్పది. దీని సంపాదకుడు శ్రీ కాశీనాథ పాండురంగ పరబ్. ఇందు సంస్కృతములో పీఠికయు భానుచంద్రుని పూర్వకాదంబరీవ్యాఖ్యానమును, అతని శిష్యుడు సిద్ధచంద్రుని ఉత్తరకాదంబరీవ్యాఖ్యానమును[1] కలవు. ఆంగ్ల వ్యాఖ్యానమును ఉపయోగింపలేనివారికి ఇది అమూల్యమయిన ప్రతి. దీనికి ఆఖరు పునర్ముద్రణము 1940. ఇప్పుడు ప్రతులు దొరకవు.

6. 2. 5. పై రెండింటికిని తరువాత చెప్పతగినది శ్రీ M R. కాళేపండితుని సంస్కరణము (1914). ఇందు పాఠనిర్ణయమునకు మరికొన్ని వ్రాతప్రతులు పరిశీలింపబడినవి. ఆంగ్లపీఠిక, సంక్షిప్త సంస్కృతవ్యాఖ్యానము, ఆంగ్లటీక, ప్రతి పదాంగ్లానువాదమును కలవు. ఆంగ్లభాష తెలిసిన విద్యార్థులకు ఇది మహోపకారి. ఇప్పటికి నాలుగు ముద్రణము లయినవి. ఆఖరుది 1968 లో. ప్రతులు లభ్యములు.

కాని ఇది పూర్వభాగము మాత్రమే.

6. 2. 6. పీటర్సను సంస్కరణపు మూలము, పూర్వభాగమునకు మిక్కిలి విమర్శ నాత్మకపు ఆంగ్లపీఠికయు, ఆంగ్లవ్యాఖ్యానమును జోడించిన శ్రీ P. V. కాణే పండితుని కాదంబరీసంస్కరణము విమర్శకుల దృష్టిలో ముఖ్యమైనది. శ్రీ కాణే పీటర్సను పండితుని పొరపాట్లకు సర్దుబాటులు చేసియున్నారు. పూర్వభాగమే రెండు సంపుటములుగ ఉన్నది. అందు పీటర్సను మూలము పేజీ 76 నుండి 150 వరకు కాణే వ్యాఖ్యానము పాతప్రతులు మోతీలాల్ బనారసీదాస్ (ఢిల్లీ) కంపెనీవారివద్ద కలవు.

6. 2. 7. ఇంతలో మద్రాసు, మైసూరు, మొదలగుచోట్లలో నిర్విశేషముద్రణములు జరిగినవి. వావిళ్లవారు తెలుగులిపిలో పూర్తికాదంబరిని మూలము మాత్రము ప్రకటించిరి. ఈ తెలుగుప్రతియు, కాళేప్రతియు ఈ వ్యాసమునకు లక్ష్యములు.

---

1. చూడు. 7. 1.

6. 2. 8. పీటర్సను మూలమునకు సంపూర్ణాంగ్లానువాదము మాత్రము శ్రీమతి C. M. రిడింగ్ విదుషీమణిది ఇటీవల పునర్ముద్రణము జరిగి ప్రతులు లభ్యములు.

6. 2. 9. 'చంద్రకలా' అను సంస్కృతవ్యాఖ్యతో, 'విద్యోతినీ' అను హిందీ అనువాదముతోను కాదంబరి పూర్వభాగము మాత్రము శ్రీ కృష్ణమోహనశాస్త్రి పండితుని సంస్కరణము చౌఖంబావారి కాశీసంస్కృతగ్రంథమాలలో లభ్యము. ఇది విద్యార్థులకు చాల సుగమముగ నున్నది. మూలమును బాగుగ విడదీసి పేరాగ్రాపులుగ ముద్రించుటయు, సమాసములలో సంధిలేనిచోటుల ప్రాతిపదికలను అడ్డుగీతల (hyphens)చే వేరుచేయుటయు ఇందు విశేషములు. నిర్ణయసాగరవారిప్రతులు దొరకవుకావున ఆంగ్లము తెలియని సంస్కృత విద్యార్థులకు ఈ సంస్కరణమే శరణ్యము.

ఇంతకుపైన చెప్పదగినవి లేవు.



# 7. కాదంబరీవ్యాఖ్యానములు

7. 1. భానుచంద్రుని సంస్కృతవ్యాఖ్య ఇప్పుడున్న పూర్వభాగ వ్యాఖ్యలన్నిటిలో ప్రాచీనమును, సంపూర్ణమును. ఇతడు 'అక్బరు పృథివీపతిచేత గౌరవింపబడిన'[2] అని చెప్పుకొన్నందువలన అక్బరు ఆస్థానములోనివాడనియు, జినదేవస్తుతి చేసినందున జైనుడనియు తెలియుచున్నది. ఇతనికాలము అక్బరుకాలమే క్రీ. వె. 16-వ శతాబ్దము అగును. వ్యాఖ్యాంతమున తనకు అక్బరుపాదుషా 'ఉపాధ్యాయ'[3] అని బిరుదిచ్చి నట్లు చెప్పుకొనెను. మరియు

'సిద్ధచంద్రుడని నాశిష్యుడు కలడు. ఈ కాదంబరీవృత్తి అతని హృదయాహ్లాదమునకై నాచేత రచింపబడుచున్నది'[4]

అని పీఠికలో చెప్పుటవలన భానుచంద్ర సిద్ధచంద్రుల సంబంధము స్పష్టము. ఆ సిద్ధచంద్రుడే ఉత్తరభాగ వ్యాఖ్యాత.

కాణేపండితుని యభిప్రాయమున వీరి వ్యాఖ్యానములలో గుణదోషములు రెండును కలవు. ప్రతిపదవ్యాఖ్యలగుటవలన మూలపాఠము నిర్దిష్టమగుట, పాఠకునికి కావ్యము సులభముగ అర్థమగుటయు గుణములు. కాని వ్యాఖ్యానము కొన్నిచోట్ల క్లిష్టముగను అక్కడక్కడ తప్పుగను ఉండుట దోషములు.

---

1. ఈ అధ్యాయములోని విషయమెక్కువగ కాణేపండితుని ఆంగ్ల పీఠిక లోనిది.

2. 'అక్బర క్ష్మాపతిదత్తమానః' (భానుచంద్రవ్యాఖ్యానపీఠిక. శ్లో. 12)

3. '... పాతశాహశ్రీ అక్బరప్రదాపితోపాధ్యాయపదధారక'

4. '... శ్రీ సిద్ధచంద్రోస్తి మదీయశిష్యః। కాదంబరీవృత్తిరియం తదీయ మనోముదే తేన మయా ప్రతన్యతే॥ (అందే, 13-వ శ్లోకము.)

7. 2. పీటర్సను పండితుడు ఆంగ్లవ్యాఖ్యకొరకై చూచిన సంస్కృతవ్యాఖ్యలు (వ్రాతప్రతులు) ముఖ్యమైనవి మూడు —

1. శివరామ త్రిపాఠి వ్రాసిన 'చషకము' అనువ్యాఖ్య, పూర్వభాగమునకు మాత్రమే.

2. పూర్వభాగమునకే బాలకృష్ణుని వ్యాఖ్య.

3. సుధాకరుని పూర్వభాగపు వ్యాఖ్య.

ఇవి యేవియు అచ్చయినట్లు లేవు, ఆ వ్రాత ప్రతు లేమయినవో తెలియదు.

7. 3. కొన్ని గ్రంథాలయముల వ్రాతప్రతుల 'కేటలాగు' లలో

1. వైద్యనాథుని 'విషమపదవృత్తి' అను పూర్వభాగపు లఘుటీకయు

2. మహాదేవుడను పండితుని వ్యాఖ్యయు

3. శూరచంద్రుడను పండితుని వ్యాఖ్యయు

నామమాత్రావశిష్టములు కలవు.

7. 4. మళయాళదేశములో మళయాళలిపిలోని రెండు సంస్కృతవ్యాఖ్యలను నాగర లిపిలోనికిమార్చి వ్రాయించి శ్రీ T గణపతిశాస్త్రిగారు కాణేపండితునికి పంపిరి.

అందు ఒకటి 'ఆమోదము' అనునది పద్యవ్యాఖ్యానము. దానికర్త అష్టమూర్తి. అందు పాండిత్యప్రకర్ష ఎక్కువ. పూర్వభాగమున సంక్షిప్తము, ఉత్తర భాగమున స్వల్పము. కాని ఈ వ్యాఖ్యాత పాఠభేదములను కొంత చర్చించియుండుట చేత కాణేపండితునికి ఉపకరించెను.

రెండవది 'కాదంబరీ పదార్థదర్పణము.' ఇది అజ్ఞాతకర్తృకము. ఇందు కొన్ని పదములకు ద్రవిడభాషార్థములు కలవు. మిక్కిలి సంక్షిప్తవ్యాఖ్య.

కాణేమతమున 'దర్పణము' ముందు, 'ఆమోదము' వెనుక. ఈ వ్యాఖ్యాతల కాలనిర్ణయము దుష్కరము. క్షేమేంద్రుని ప్రస్తావము ఉండుటచేత అష్టమూర్తి 12-వ శతాబ్దికి తరువాత అనవచ్చును. భానుచంద్రునికి పూర్వుడు కావచ్చును.

7. 5. బెంగుళూరువాసి శ్రీ M. G. ఆనందాళ్వారు అధీనమున ఒక కాదంబర్యుత్తర భాగవ్యాఖ్య ఉండగా శ్రీ కాణే దాని నకలును సంపాదించెను. అది వ్రాసినది ఒక

అజ్ఞనపండితుడు. అదికొంత విమర్శనాత్మకము. దానిపాఠములు కలకత్తా సంస్కరణమునకు దగ్గరగనున్నవని కాణే అభిప్రాయము.

కాణే సంక్షిప్త సంస్కృతవ్యాఖ్యానమును, కృష్ణమోహనశాస్త్రి విపులవ్యాఖ్యానమును పూర్వోక్తములు.[1]

కాణే ఆంగ్లవ్యాఖ్యానము బహువ్యాఖ్యలసార మగుటవలన పాఠకునికి చాల ముఖ్యము.



1. చూడు. 6. 2. 4, 6. 2. 7.

# 8. కాదంబరీకావ్యవిపర్యయములు

8. 1. బహుకాలముగ పద్యకావ్యము అను సంప్రదాయము ప్రబలమైయుండగా దానినుల్లంఘించి సుబంధుబాణదండులు[1] గొప్ప గద్యకావ్యములు నిర్మించి గద్యకావ్యములకు ఎనలేని ప్రతిష్ఠను సమకూర్చినను సామాన్యకవులు పద్యకావ్యవ్యామోహము వీడలేక, స్వయముగ 'ప్రబంధకల్పన' చేయుప్రతిభలేక, క్రొత్తకావ్యములు వ్రాయ జడిసి, లబ్ధప్రతిష్ఠములైన గద్యకావ్యములను, నాటకములను పద్యకావ్యములుగచేయు విపరీతప్రక్రియలో ఒకవిధమయిన పరితోషమును పొందిరి. ఇట్టి విపర్యయములు కాదంబరికిని సంభవించినవి.[2]

8. 2. ఆ రూపాంతరములలో పద్యరూపమున ముఖ్యమైనవి మూడు.

1. కాదంబరీకథాసారము — దీనిని రచించినది అభినందుడు (క్రీ. వె. ౯-వ శతాబ్దము). ఇది ఎనిమిది సర్గల కావ్యము.

2. కాదంబరీకథాసారము — కర్త త్రివిక్రముడు లేక విక్రమదేవుడు.

3. పద్యకాదంబరి — క్షేమేంద్రుడు.

8. 3. 1. ఇవికాక కొన్ని అప్రసిద్ధములు, నామమాత్రావశిష్టములు కలవు.

1. కల్పితకాదంబరి — అజ్ఞాతకర్తృకము

2. కాదంబరీకథాసారము — త్ర్యంబకుడు

3. కాదంబర్యర్థసారము — మణిరాముడు

---

1. సుబంధుని 'వాసవదత్త'ను గత శతాబ్దమున శ్రీ వట్టిపల్లి నరకంఠీరవ శాస్త్రిగారు 'అభినవవాసవదత్త' అని పద్యకావ్యముచేసిరి. దండికి స్వీయమే 'అవంతిసుందరీకథ' కలదు.

2. ఇంకను వివరములకు చూ. History of Sanskrit Literature M. Krishnamachari., 456.

4. సంక్షిప్త కాదంబరి — కాశీనాథుడు

8. 3. 2. చంపువుగ.

కాదంబరీచంపువు — శ్రీకంఠాభినవశాస్త్రి

8. 3. 3. నాటకముగ.

కాదంబరీకల్యాణము — నరసింహుడు

8. 4. ఆధునికగద్యసంగ్రహములు.

1. కాదంబరీసంగ్రహము — R. V. కృష్ణమాచార్య.

2. చంద్రాపీడచరితము — V. అనంతాచార్య.

8. 5. భాషాంతరీకరణములు ఇచ్చట అప్రస్తుతమైనను తెలుగు భాషాంతరీకరణముల ప్రశంస అనివార్యము. క్రీ. శ. 11-వ శతాబ్దములో, అనగా నన్నయ తెలుగుభారతమును మొదలుపెట్టిన కాలమునకు సమీపమున, దుర్గసింహుడు అను కవి కాదంబరిని కన్నడభాషలో పద్యకావ్యముగ అనువదించెను. అంతప్రాచీనమయిన అనువాదము మరి యేభారతీయభాషలోను కనబడదు. కొంతప్రాచీనమయిన అనువాదము తెలుగులో పూర్వముండి ఇప్పుడు నష్టమైపోయెనని ఒకప్రతీతికలదు. కాని తెలుగులో ముఖ్యమైన అనువాదములు ఇంచుమించు ఈ యిరువదవ శతాబ్దిలోనే జరిగినవని చెప్పవచ్చును.

8. 5. 1. అందు ప్రామాణికమైన తెలుగువచనములో కాదంబరి యనువాదము 1915 ప్రాంతమున వెలువడినట్లున్నది. దానికర్త శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు. దీనిని ఆనాడు విద్యార్థిదశలో చదివిన నెల్లూరునందలి సుప్రసిద్ధన్యాయవాదులు శ్రీ వాదారి కల్యాణసుందరముగారు, అది అత్యుత్తమమును మనోహరమును అగు అనువాదమని నుడివిరి. అట్లే నెల్లూరులోని మహాపండితులు, కవులు అగు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారును చెప్పిరి. కాని ఇప్పుడు ఆప్రతులు దొరకవు. ఆ యనువాదము పూర్వార్ధమునకు మాత్రమే.

8. 5. 2. తరువాత చెప్పదగినది శ్రీ చింతలపల్లి నరసింహశాస్త్రిగారి 'శృంగార కాదంబరి.' ఇది కాదంబరికి పూర్ణమైన ఆంధ్రపద్యానువాదము. 1925 వ సం॥ పూర్తి చేయబడి వేంకటగిరిసంస్థానమువారి సహాయమున 1926 లో సుందరమయినరూపమున

అచ్చుపడి వెలుగు చూచినది. ఇది ప్రాచీనసంప్రదాయ కవిత్వము. ఆంధ్రీకరణము, అచ్చటచ్చట కొంత స్వేచ్ఛగ కవిత్రయమువారి పద్ధతిలో నడచినను, మొత్తముమీద మూలానుబోధము, రసవంతము, ప్రామాణికము. ప్రతులు వెలకు దొరకవుకాని వేంకటగిరి సంస్థానపు లైబ్రరీలో క్రిమికీటకాదులకు ఆస్వాద్యముగ పడియున్నవని ఒక 'రూమరు'.

8. 5. 3. మరియొకటి శ్రీ చిలకపాటి రామానుజశర్మగారి 'అచ్చతెనుగు కాదంబరి'. ఇదియును 1915కు ముందే వ్రాయబడినట్లున్నది. కాని అముద్రితము. పూర్వార్ధము మాత్రమే. వ్రాతప్రతి శిథిలావస్థలో రచయితపౌత్రుని యధీనములో మద్రాసులో ఉన్నది. దీనిని పరిశీలించిన కవిపండితులు శ్రీ ముదివర్తి కొండమాచార్యులు 'అది యొక అద్భుతప్రక్రియ' అని చెప్పినారు.

8. 5. 4. ఇటీవల జనరంజకములును కథాప్రధానములును అగు పద్యగద్యానువాదములు పెక్కులు వచ్చినవి, కాని అవి యథామూలములు కావు.



# 9. కాదంబరి - కథ

## 9. 1. కవికథనము (బాణునిది)

పూర్వము వేత్రవతీనదీతీరముననున్న విదిశ అను నగరము రాజధానిగా శూద్రకుడు అను రాజు పాలించుచుండెను. అతడు బుద్ధిమంతులగు మంత్రులచేత పరివృతుడై, సమవయస్కులగు రాజపుత్రులతో క్రీడించుచు బహుకాలము సుఖముగ గడిపెను. రాజు పుత్రవంతుడు కావలెనని మంత్రులు ఎంత కోరినను, అతడు స్త్రీ సుఖద్వేషిగ నుండెను. అందగత్తెలగు భార్యలున్నను అతడు సంగీతము, వేట, కావ్యరచనము, శాస్త్రచర్చ, పురాణశ్రవణము, చిత్రలేఖనము, మునిజన శుశ్రూష, చిత్రకవిత్వము మొదలగు వ్యాసంగములతో వనితాసుఖవిముఖుడుగ, మిత్రులతో చేరి దినరాత్రములు గడుపుచుండెను.

ఒకనాడు లేతప్రొద్దున ఆస్థానమండపముననున్న రాజును సమీపించి ప్రతీహారి ఇట్లనియెను.

“దేవా, దక్షిణాపథమునుండి ఒక చండాలకన్యక చిలుకతోడి పంజరమును తీసికొనివచ్చి విన్నవించుకొనుచున్నది—

ఈపక్షి ఆశ్చర్యకరమైనది. దీనిని కైకొని రాజదర్శనముకొరకు వచ్చియున్నాను—అని.

దేవరవారి ఇష్టము.”

కుతూహలముచేత రాజు “అందు దోషమేమి? తోడ్కొనిరమ్ము” అని ఆనతిచ్చెను.

ప్రతీహారియు అట్లే చేయగా మాతంగకుమారి ప్రవేశించి హరివలె వెలుగొందు రాజును చూచెను. రాజుదృష్టిని ఆకర్షించుటకై వెదురుకఱ్ఱతో నేలపై ఒక మారు కొట్టెను. రాజును ఆమెమనోహరాకృతిని కన్నార్పక చూచెను. ఆమెవెంట తలనెరపిన ఒక పురుషుడును, గిరజాలజుట్టుతో పంజరమును మోయుచున్న ఒక బాలుడును ఉండిరి.

అచ్చెరువుతో రాజు ఇట్లు తలపోసెను. "ఆహా! తగనిచోట బ్రహ్మదేవుని లావణ్యసృష్టి. ఇంత అందగత్తె ఆ క్రూరజాతిలో పుట్టుట నామనస్సును కలచు చున్నది."

ఆలోచనలోనున్న రాజునకు ఆమె నమస్కరించి మణులు పొదిగిన నేలపై కూర్చుండెను. ఆవృద్ధుడు పంజరమును తెచ్చి, రాజును సమీపించి,—

"దేవా, సర్వశాస్త్రములు తెలిసిన రత్నమువంటి చిలుక ఇది. వైశంపాయనుడు అను పేరు కలది. సముద్రునివలె రాజును సర్వరత్నములకు స్థానము కావున ఈశుకరత్నమును తీసికొని మాదొరకూతురు మీపాదముల యొద్దకు వచ్చినది. దీనిని గైకొనుడు."

అని పలికి రాజుముందు ఆచిలుకను ఉంచి వెనుకకు పోయెను.

అపుడు ఆచిలుక రాజువైపు తిరిగి, కుడికాలు ఎత్తి "జయము మహారాజునకు" అని పలికి రాజపరముగ ఒక స్తుతిపద్యమును చెప్పెను.—

"ఓ రాజా, నీశత్రుభార్యల చనుగవలు కన్నీట స్నానమాడినవి; ఎదచిచ్చు దరిని ఉన్నవి; విముక్తాహారములై వ్రతము పూనినట్లున్నవి[1]".

రాజు విని విస్మయముపొంది ఆనందముతో ప్రక్కనున్న కుమారపాలితుడు అను ముఖ్యమంత్రితో ఇట్లనియెను.—

"మీరును విన్నారుకదా తీయని, స్ఫుటమైన ఈ చిలుక పలుకులు? తిర్యగ్జంతువయ్యు సంస్కారపరుడగు మనుష్యునివలె ఉద్దిష్టార్థప్రకాశనశక్తి కలిగినది. ఇది గొప్ప చిత్రము."

కుమారపాలితుడు మందహాసముతో "రాజా, ఇందేమి చిత్రము? శుకశారికాదులు విన్నమాటలను పలుకగలవనుట తెలిసినదేకదా? మరియు, పూర్వము వీనికిని మనుష్యవాక్కు ఉండి అగ్నిశాపమున పోయినది." అని ఇంకను చెప్పుచుండగా మధ్యాహ్న శంఖధ్వని వినవచ్చెను.

---

1. స్తనయుగమశ్రుస్నాతం, సమీపతరవర్తి హృదయశోకాగ్నేః।
చరతి విముక్తాహారం వ్రతమివ భవతో రిపుస్త్రీణామ్॥

విముక్తాహారం: (శ్లేష) 1. విముక్త + ఆహారం, 2. వి + ముక్తాహారం.

రాజును స్నానవేళ అయినదని సభవాలించి లేచెను. చండాలకన్యకతో "విశ్రమింపుము" అని చెప్పి రాజు కొందరు ఆప్తమిత్రులతో అభ్యంతరమందిరమును బొచ్చెను.

భూషణాదులను తీసివేసి, లఘువుగ వ్యాయామముచేసి, క్రమముగ స్నానము ముగించెను. వలిపములు ధరించి, సంధ్యవార్చి, దేవగృహమున ప్రవేశించెను. శివపూజచేసి, అగ్నికార్యము పూర్తికావించి, చందనము అలదికొని, వస్త్రములు మార్చుకొని, రత్న కర్ణపూరములు మాత్రము ధరించి, మిత్రులతో భుజించి, తాంబూలము వేసికొని, మరల ఆస్థానమండపమునకు వచ్చెను. అచ్చట శయనతలమున కూర్చుండి కబుర్లుచెప్పుకొనుచు ప్రతీహారిని పిలిచి "వైశంపాయనశుకమును తెమ్ము" అని ఆజ్ఞాపించెను.

కొద్దిసేపటిలో ప్రతీహారి, చిలుకపంజరముతో కంచుకి వెంటరాగా వచ్చిచేరెను. కంచుకి రాజుతో —

"రాజా, రాణులు ఈ చిలుకకు స్నానపానాహారాదికములైనవని మీతో చెప్పుమన్నారు." అని చెప్పి వెడలెను.

రాజు చిలుకను అడిగెను — "మీకు ఇష్టాహారము దొరకినదా?"

చిలుక — "ఇష్టమేమి ప్రభూ? రాణులచేతులతోనిచ్చిన ఆహారమేదైనను అమృతము కదా?"

రాజు — "నా కుతూహలమును పోగొట్టవలెను. మీ జీవితవృత్తాంతమును జననముమొదలు ఇప్పటివరకు సవిస్తరముగ చెప్పుడు."

వైశంపాయనశుకము సాదరముగ "రాజా, నాకథ చాలపెద్దది. ఇచ్చగింతురేని వినుడు" అని చెప్పసాగెను.

## 9. 2. వైశంపాయన కథనము (< కవికథనము)

కలదు మధ్యదేశమున వింధ్యాటవి. అందు, దండకారణ్యమున, గోదావరియొడ్డున అగస్త్యాశ్రమము కలదు. దానికి దగ్గరగ అపరసముద్రమోయన పంపాసరస్సు ఉన్నది. ఆ సరస్సు పడమటియొడ్డున, చెట్లకు రాజుగా ఒకగొప్ప శాల్మలీవృక్షము కలదు. దాని కొమ్మలలో గూళ్లుకట్టుకొని అనేకశుకములు ఉండెడివి. ప్రతిదినమును

ఆహారసంపాదనమునకై వెడలి, కడుపులు నింపుకొని, గూళ్లలోని పిల్లలకు ముక్కులతో ఫలాదులను కరచితెచ్చి ఇచ్చి ప్రేమతో రాత్రులను గడపుచుండెడివి.

అచ్చట ఒక జీర్ణకోటరములో ఒక ముసలిచిలుక భార్యతో కాపురముండెను. నేను ఆయనకు పుట్టిన కొడుకును. నేను పుట్టగానే నాతల్లి చనిపోయినది. పుత్ర వాత్సల్యముచేత జాయామరణదుఃఖమును ఎట్లో దిగమ్రింగి, నా తండ్రియే నన్ను పెంచుచుండెను. తిరుగలేనివాడై, వేరుగూళ్లనుండి జారిపడిన గింజలను, పండ్ల ముక్కలను ఏరితెచ్చి నాకు తినిపించి తానును తినుచు కాలము పుచ్చుచుండెను.

ఒకనాడు ప్రాతఃకాలమున అడవియంతయు అదరునట్లు గొప్ప వేటకోలాహలము వినవచ్చెను. భయపడిన నన్ను నాతండ్రి రెక్కలలో దాచియుంచెను. కొంతసేపటికి వేటగోల తగ్గగా నేను గూటియంచుకు వచ్చి చూచితిని. మా చెట్టు వైపునకు వచ్చుచున్న బేతాళసమూహమువంటి గొప్ప కోయగుంపు కనపడినది. అందు అతికర్కశుడయిన శబరసేనాపతి యుండెను. అతడు వచ్చి మా చెట్టుక్రింద విశ్రమింప కూర్చుండెను. ఒక శబరుడు అతనికి తామరాకుదొన్నెలో చల్లనినీరు తెచ్చియిచ్చెను. కొంతతడవున కందరును నీరుత్రాగి సేదదేరి వెంటరాగా సేనాపతి ఇచ్చవచ్చినదెసకు వెడలెను.

వారిలో ఒక ముసలిబోయ, వేటచిక్కమి చెట్టుక్రిందనే ఆగి, పక్షిమాంసము కోరి, చెట్టెక్కి, గూళ్లలోని రెక్కలురాని చిలుకకూనలను పట్టి, మెడనులిమి చంపి, చెట్టుక్రిందకు వేయ మొదలుపెట్టెను. నాతండ్రి ఏమిచేయుటకును తోచక వడకు పుట్టగా నన్ను రెక్కలలోదాచి గూటిలోనే ఒదిగియుండెను. కడకు ఆ బోయ మా గూటికివి వచ్చి నా తండ్రిని పట్టి, చంపి, క్రిందవేసెను. రెక్కలలోనున్న నన్ను అతడు ఎట్లో చూడలేదు. తండ్రి దేహముతో నేను భాగ్యవశమున పెద్ద ఎండుటాకుల కుప్పపైన పడి, బ్రతికియుంటిని. అతడు దిగివచ్చులోపల నేను తండ్రిదేహమును వదలి, పడుచు లేచుచు, దొరలుచు దగరనున్న తమాలవృక్షపు చీకటిగుబురులలో దాగితిని.

బోయయు దిగి పడియున్న శుకశిశుకళేబరములను జవిరి, ఆకులలోకట్టితీసికొని శబరసేన్యము పోయిన దిక్కుననే పోయెను. నేను మిక్కిలి దప్పిగొని సరస్సు దగరకు పోవుటకు ప్రయత్నించితిని. ముందునకు ప్రక్కకు పడుచు దొప్పుచున్న నాకు ఇట్లు తోచినది —

“ప్రాణికి బ్రతుకుకన్న మఱియొకటి ప్రియముకాదు. తండ్రి చావగా, ఇంకను బ్రతికియున్నాను. ఛీ, అసువులు అతినీచములు. నన్ను అంతగారాబముగ పెంచిన తండ్రితో పోవనైతిని. ఇప్పుడు ఈ తుచ్ఛపు జలాభిలాష. ఇది నాలోని నిర్దయమే కాని వేఱుకాదు.”

ఇట్లు తలపోయుచుండగా జాబాలియాశ్రమమునుండి హారీతుడు అను జాబాలి మహర్షికుమారుడు, మఱికొందఱు మునిబాలురతో సరస్సులో స్నానముచేయుటకు వచ్చి, నన్నుచూచి దయగొని వయస్యునితో —

“రెక్కలురానిచిలుక ఈ చెట్టుపైనుండిపడి అల్పాయుస్సుతో నున్నది. నీటి దగ్గరకు తెమ్ము” అని చెప్పెను.

సరస్తీరమున అతడు స్వయముగ నానోటిలో కొన్నిబొట్లు నీరుపోసి తామరాకు నీడలో నుంచెను. స్నానాదికములు నిర్వర్తించి నన్నుతీసికొని మునికుమారులతో అతి రమణీయమయిన జాబాలియాశ్రమమునకు పోయెను.

అచట మధ్యనున్న రక్తాశోకచ్ఛాయలో కూర్చుండియున్న జాబాలిమహర్షిని చూచితిని. నన్ను ఆ చెట్టుక్రిందనే ఉంచి తండ్రిపాదములకు మ్రొక్కి దర్భాసనమున కూర్చుండిన హారీతుని మునులందఱును —

“ఈ శుకశిశువును ఎచ్చట సంపాదించితివి” అని యడిగిరి.

అతడు ఇట్లు బదులుచెప్పెను. “స్నానమునకు పోయినప్పుడు సరస్తీరమున పైనుండిపడి అల్లలాడుచు, ఎండకువాడి ప్రాణావశిష్టముగ ఇది నాకు కనపడినది. ఇచ్చట ఏదోయొక చెట్టుతొఱ్ఱలోపెట్టి మునికుమారులు పెంచగా బ్రతుకునుగాక. మనవంటివారికి అనాథసంరక్షణము పరమధర్మము కదా?”

ఇట్లు నన్నుగుఱించి వారు మాటలాడుట విని జాబాలి కొంచెముతిరిగి నన్ను తేరిచూచి “తన అవినీతిఫలమును అనుభవించుచున్నది” అనియెను.

ఆయన తపఃప్రభావమున దివ్యదృష్టితో సర్వమును చూడగలడు. కావున తాపసులందరును “ఇది ఎట్టి అవినయము చేసినది, ఎందులకు, ఎచ్చట? జన్మాంతరమున ఇది ఎవరు?” అని జాబాలిని ప్రశ్నించిరి.

జాబాలి ఇట్లనియెను, "చెప్పవలసినది అత్యాశ్చర్యకరము, అతిదీర్ఘమును. నాకు స్నానసమయము అయినది. మీకును దేవతార్చనవేళ అతిక్రమించుచున్నది కావున లేచెదము గాక. సాయంకాలము అంతయు చెప్పెదను."

అదినముగడచి చంద్రోదయము అయినది. హారీతుడు నాకు ఆహారమిచ్చి మునులతోకలసి జాబాలిని సమీపించి ఇట్లనియెను, "నాయనా వీరందరును చిలుక యద్భుతవృత్తాంతమును వినగోరి వేచియున్నారు. ఈ చిలుకయు శ్రమదీరియున్నది. కావున ఇది పూర్వజన్మమున ఎవరో, ఏమిచేసెనో, మీరు చెప్పవలెను."

జాబాలియు ముందున్న నన్ను చూచి సర్వమును గ్రహించి మెల్లగ నిట్లు చెప్పసాగెను :

9. 3. జాబాలికథనము (< వైశంపాయనక. < కవిక.)

కలను ముల్లోకములలో ముఖ్యమయినది అవంతిదేశమున ఉజ్జయిని అను నగరము. అందు తారాపీడుడు అను రాజు ఉండెను. అతనికి శుకనాసుడు అను మిక్కిలిసమర్థుడగు మంత్రి యుండెను. ఆరాజు చిరుతప్రాయముననే భూమియంతయు జయించి, మంత్రిచేతిలో పాలనభారమునుంచి, హాయిగ కాలము గడుపుచుండెను. మంత్రియు ప్రజ్ఞాబలమువలన రాజ్యమును మోయుచుండెను. అట్లు ఆరాజు సర్వ సుఖములను పొందెను గాని పుత్రముఖదర్శనసుఖమును మాత్రము పొందలేదు.

అతని దేవేరి విలాసవతి. ఒకనాడు రాజు అంతఃపురమునకు పోయినప్పుడు, తల్పముపై కూర్చుండి ఏడ్చుచున్న ఆమెను చూచెను. దుఃఖకారణము ఎఱుగక రాజు ఆమెను అడిగెను, "దేవీ ఏల ఇట్లు ఏడ్చుచున్నావు ? కారణము చెప్పుము." ఆమె జవాబు చెప్పకయుండగా రాజు పరిజనమును అడిగెను. వారిలో తాంబూలకరంక వాహిని. మకరిక అనునది, ఇట్లు చెప్పెను.

"దేవా, సంతానము లేదని బహుకాలముగ దేవి చింతిల్లుచునే ఉండగా ఈ దినము శివాలయములో ఒక పౌరాణికుడు మహాభారతము చెప్పుచు 'పుత్రులు లేనివారికి పుణ్యగతి లేదు. పుత్తు అను నరకమునుండి తప్పించువాడు అగుటచే పుత్త్రుడు అందురు' అని చదివెను. అది విన్నదిమొదలు ఈమె అన్నము తినదు, భూషణములు ఒల్లదు, మాటాడదు. ఊరక ఏడ్చుచున్నది. మీ ఇష్టము."

రాజు ఒకక్షణము ఊరకయుండి, నిట్టూర్చి విలాసవతితో ఇట్లనియెను, "దేవీ, విధి ఇట్లుండ మన మేమిచేయగలము. ఏడువవద్దు. దేవునియనుగ్రహము మనకు లేదు. మనుష్యుడు పూర్వజన్మలో చేసిన కర్మఫలమును ఇప్పుడు అనుభవించును. దీనిని మార్చుటకు ఎవరితరము ను కాదు. మనుష్యప్రయత్నముమాత్రము లోపము కారాదు. పూజలు, మునిశుశ్రూషలు ఎక్కువగా చేయుచుందుము. ఈ అపుత్రత్వము నామనస్సునుకూడ దహించుచునే యున్నది. ఏమిచేయుదును. ధర్మములు చేయువారికి మేలు కలుగును."

ఆనాటినుండి విలాసవతియు అతిశ్రద్ధతో ధర్మకార్యములు చేయుచుండెను. దేవతారాధనలు, బ్రాహ్మణసత్కారములు, గురుపూజలు విరివిగ జరుపుచుండెను. కొంతకాలము గడువగా ఒకనాడు వేకువజామున రాజునకు, మేడమీద నిలిచియున్న విలాసవతినోట చంద్రబింబము ప్రవేశించినట్లు, కలవచ్చెను. తక్షణమే శుకనాసుని పిలిచి ఫలమడుగగా అతడు సంతోషముతో నిట్లనెను —

"రాజా, కొద్దికాలములో తమకు పుత్రముఖదర్శనలాభము కలుగును. ఈనాడు నాకును ఒక కల వచ్చినది, ఒక దివ్యబ్రాహ్మణుడు నాభార్య మనోరమయొడిలో తెల్లదామరపూవు (పుండరీకము)ను పెట్టినట్లు. కడజాము కలలు కల్లలుకావు. లోకానందకరుడగు కుమారుని దేవి కనును. మీవంశము వర్ధిల్లును."

రాజు సంతసించి శుకనాసునితో అంతఃపురమునకు పోయి ఆకలలసంగతిని విలాసవతికి చెప్పగా ఆమెయు మిక్కిలి ఆనందించెను.

కొన్నిదినములతరువాత విలాసవతి గర్భముదాల్చెను. కులవర్ధన అను దాపి ప్రదోషసమయములో ఈ శుభవార్తను రాజునకు రహస్యముగా చెప్పెను. ఆమాట చెవికి అమృతవర్షముకాగా రాజు ఆనందబాష్పములతో శుకనాసుని చూచెను. సంగతి తెలియకపోయినను సందర్భమును చూచి, ఊహించి శుకనాసుడు రాజును మెల్లగ ఇట్లు అడిగెను —

"రాజా, ఆ కల ఫలించినదా ఏమి? ఈ దాపికళ్లు వికసించినవి. తమకళ్లలో ఆనందబాష్పములు చెప్పుచునే ఉన్నవి, ఏదో గొప్ప హర్షకారణమున్నదని. కుతూహలము నన్ను బాధించుచున్నది. చెప్పవలెను."

రాజు నవ్వి, "ఇది చెప్పినది నిజమయిన, కల నిజమయినట్లే. కాని నాకు నమ్మకము కుదురుటలేదు. నాకింత భాగ్యమా? రెమ్మా, మనమేపోయి తెలిసి కొందము" అని తన భూషణములతో కులవర్ధనను బహూకరించి, అంతఃపురమునకు పోయెను.

అచట శయ్యమీద చూలాలిలాంఛనములుగల విలాసవతిని చూచి రాజు ఆ శయ్యమీదనే కూర్చుండి ఇట్లనియెను, "దేవీ, శుకనాసుడు అడుగుచున్నాడు, కులవర్ధన చెప్పినది నిజమా, అని"

ఆమె సిగ్గుతో మోమువంచుకొనగా రాజు మరలమరల అడిగెను.

"నన్నెందులకు ఇట్లు సిగ్గుపరచెదవు? నాకేమియు తెలియదు" అని ఆమె రాజువంక అలుకతో చూచెను.

మనసున నవ్వుకొని, శుకనాసుడు రాజుతో "దేవా, ఏల దేవిని ఆయాస పెట్టెదవు. కులవర్ధన చెప్పినది నమ్మకుము" అని చెప్పి, ఇట్టి నర్మోక్తులతో కొంత కాలముగడపి తనయింటికి పోయెను.

కాలక్రమమున పుణ్యదినములో శుభముహూర్తమున విలాసవతి కొడుకును కనెను. మహాపురుషలక్షణములుగల ఆ శిశువును చూచి రాజు సంతోషించి జన్మ కృతార్థమయ్యెనని తలచెను.

అప్పుడు శుకనాసుడు రాజుతో, "రాజా, ఇవిగో ఈ చక్రవర్తి చిహ్నములను చూడుము" ఇత్యాది చెప్పుచుండగా మంగళకుడు అను సేవకుడు వచ్చి రాజునకు విజ్ఞాపించెను, "రాజా మీ ఆనందము అతిశయించుచున్నది. శుకనాసులవారి పెద్దభార్య మనోరమకును ఒక కొడుకు పుట్టినాడు," అని.

ఈ వచనమును వీనులకు విందుకాగా నరపతి "ఆహా, శుభముల పరంపర! విపత్తును విపత్తు, శుభమును శుభము అనుగమించును అను జనవాక్యము సత్యము," అని చెప్పి శుకనాసుని ఆలింగనముచేసికొని అతనియుత్తరీయమును వేడుకతో కానుకగా తానే గ్రహించెను. మంగళకునకు తగిన పారితోషికమిచ్చి రాజు శుకనాసునితో అతనియింటికి వెడలి శిశువును చూచి గొప్పవేడుకలు చేయించెను.

స్వప్నానురూపముగ రాజు తనయునికి చంద్రాపీడుడు అని పేరు పెట్టెను. మరుసటినాడు శుకనాసుడును తన కొడుకునకు వైశంపాయనుడు అను విప్రజనోచిత మయిన నామకరణము చేసెను. క్రమముగా చంద్రాపీడుడు, బాల్యముగడచి, ఊరి వెలుపల తండ్రి ప్రత్యేకముగ కట్టించిన విద్యామందిరమున చదువబోయెను. అచ్చట గొప్పప్రయత్నముతో రాజు సర్వవిద్యలకును ఎచ్చెచ్చటినుండియో గొప్ప ఆచార్యులను రప్పించియుండెను. చంద్రాపీడవైశంపాయనులు మంచిరోజున ఒజ్జలకు అర్పింపబడిరి.[1]

చంద్రాపీడుడు ఏకాగ్రచిత్తముతో కొలదికాలములోనే అన్నివిద్యలను నేర్చెను. పుట్టుకచేతనే చంద్రాపీడుడు అతిబలసంపన్నుడు. దేహబలమునతప్ప అన్నిటను వైశంపాయనుడు చంద్రాపీడుని అనుకరించెను. అతడు చంద్రాపీడునికి రెండవ హృదయమువంటి పరమమిత్రుడు అయ్యెను. వైశంపాయనుని విడిచి నిమేష మయినను చంద్రాపీడుడు ఏకాకిగ ఉండలేడు. వైశంపాయనుడును అట్లే.

అన్నివిద్యలను నేర్చిన చంద్రాపీడుని, ఆచార్యులు సెలవీయగా ఇంటికి రప్పించుటకు తారాపీడమహారాజు. వలాహకుడు అను సేనాధిపతిని పంపెను. అతడు పోయి చంద్రాపీడునితో ఇట్లనియెను, "కుమారా, మాకోరికలు తీరినవి. విద్యాగృహము వదలి తిరిగివచ్చుటకు గురువులయనుమతి అయినది. కావున ఇంటికివచ్చి రాజ్యసుఖములు అనుభవింపుము — అని మహారాజుగారు చెప్పిరి."

"మఱియు, ఇంద్రాయుధము అను మహాశ్వమును, పారశీకపురాజు కానుకగా పంపినదానిని, రాజుగారు మీకొఱకు పంపియున్నారు. వాకిట నున్నది. అది సముద్రము నుండి పుట్టిన అశ్వరూపరత్నము. దానిని మీరు అధిరోహించి మమ్ము అనుగ్రహింప వలెను."

వలాహకుడు అట్లు చెప్పగా, చంద్రాపీడుడు రాజాజ్ఞను శిరసావహించి, "దానిని లోనికి తెమ్ము" అని ఆదేశించెను. అనగనే ప్రవేశపెట్టబడిన అశ్వాతిశయమును చూచెను. ధీరుడయినను చంద్రాపీడుడు దానిరూపాతిశయమునకు విస్మయవశుడయ్యెను. అతడు ఇట్లు తలపోసెను —

---

1. ఇదియే 'ఉపనయనము' = గురువుదగ్గర వదలుట.

"అతితేజస్సుచేతను, బలిష్ఠతచేతను ఇది దేవతాత్మకముగ నున్నది. ఏదేవతయో శాపవశమున నిట్లు గుఱ్ఱమైయుండుననుట తథ్యము. నాయంతఃకరణమును అట్లే గ్రహించుచున్నది. కావున ఎక్కుట సరియా అను శంక పొడముచున్నది"

అని ఆలోచించి ఎట్లైనను ఎక్కగోరినవాడై అశ్వమును సమీపించి, "అశ్వరాజమా, నీవెవ్వడవో, నమస్కారము. నిన్ను అధిరోహించు నన్ను మన్నింపవలెను" అని అనుమతి కోరెను.

చంద్రాపీడుని మనస్సు తెలిసినదానివలె గుఱ్ఱమును ఆరోహణాహ్వానమువలె మనోహరముగ సకిలించెను. అదియే అనుజ్ఞగ భావించి చంద్రాపీడుడు ఇంద్రాయుధమును ఎక్కెను. వెలుపలికి రాగనే పారములేని సాగరమువలె అశ్వసైన్యము అగపడెను. రాజపుత్రయోధులు 'నేనుముందు, నేనుముందు' అని త్రోసికొనివచ్చి రాకుమారుని చుట్టుముట్టి మ్రొక్కిరి.

చంద్రాపీడుడు అందరిని గౌరవించి మరియొకగుఱ్ఱముమీద వైశంపాయనుడు వెంటరాగా నగరాభిముఖుడై బయలుదేరి క్రమముగా రాజద్వారముచేరి గుఱ్ఱము దిగెను. దిగి, వైశంపాయనునితో చేయిగలుపుకొని వలాహకుడు దారిచూపగా రాజకులమును చొచ్చెను. ప్రతీహారులు మార్గముచూపుచుండగా సప్తకక్ష్యలను దాటి అభ్యంతర మందిరములో శయనతలోపవిష్టుని తండ్రిని చూచెను. 'రా, రా' అని దూరము నుండియే తండ్రి చేతులుచాచి పిలిచి, వినయముచేతవంగిన కుమారుని ఆలింగనము చేసికొనెను. వదలగానే చంద్రాపీడుడు తండ్రిపాదములముందు నేలనే కూర్చుండెను. మంత్రిపుత్రుడు అను భేదములేక రాజు వైశంపాయనుని కౌగలింపగా అతడును ప్రక్కనున్న ఒకపీఠమున కూర్చుండెను.

ఒక్కక్షణముండి రాజు "కుమారా, పోయి నీతల్లికిమ్రొక్కి, సవతులనందరిని ఆనందింపజేయుము" అని చెప్పగా చంద్రాపీడుడు వినయముగ లేచి వైశంపాయనునితో తల్లిమందిరమునకు వెడలెను. ఆమెయు అతనిని కౌగలించి శిరమున మూర్కొని వైశంపాయనునికిని అట్లే చేసెను.

కుమారునితో ఆమె, "నీతండ్రి కఠినుడు సుమా. ఇంత దీర్ఘకాలము గురుజనసేవాక్లేశమును ఎట్లోర్చితివి?" అని మరల, "తండ్రిదయవలన అన్ని

విద్యలను నేర్పితివి. తొందరలోనే మంచిపిల్లను తెచ్చి పెండ్లిచేసి చూడవలయునని నాకోరిక '' అనియు చెప్పెను.

చంద్రాపీడుడు క్రమముగా తల్లులందరను దర్శించి వారికి ముదమొనరించెను. వెలికివచ్చి శుకనాసుని చూడబోయెను. వైశంపాయనునితో లోనికి వెడలి పితృవ్యుని వంటి శుకనాసునికి దూరమునుండియే శిరఃప్రణామము చేసెను.

శుకనాసుడు చంద్రాపీడవైశంపాయనులను చేర్చి ఒకేపరి గాఢాలింగనము చేసికొని ఇట్లనియెను, ''చంద్రాపీడా, మహారాజునకు ఈదినముకదా రాజ్యఫలము దొరకినది. ప్రజలు ధన్యులు. తండ్రితోకలసి రాజ్యభారమును వహింపుము.''

శుకనాసునివదలి లోనికిపోయి చంద్రాపీడుడు వైశంపాయనునితల్లి మనోరమను చూచి మరలి ఇంద్రాయుధమెక్కి మహారాజు తనకై వేరుగ కట్టించి యుంచిన యువరాజప్రాసాదమును చొచ్చెను. తన శయనాగారములోనే ఇంద్రాయుధమును కట్టివేసెను. ఆరోజు గడచెను. సాయంకాలము కాలినడకను రాజమందిరమునకు పోయి తల్లిదండ్రులను మరల దర్శించి మరలివచ్చి నిదురించెను.

తెల్లవారగానే లేచి తండ్రియనుమతితో ఇంద్రాయుధ మధిరోహించి, పెద్ద సైన్యము వెంటరాగా వేటకు పోయెను. అనేకమృగములను వధించి, కొన్నింటిని బంధించి తిరిగివచ్చెను.

మరునాడు ప్రభాతసమయమున కైలాసుడు అను కంచుకి ఒక రూపవతి యయిన నవయౌవనాంగిని వెంటబెట్టుకొని, చంద్రాపీడునియొద్దకు వచ్చి నమస్కరించి ఇట్లు విన్నవించెను,

''కుమారా, మహారాణియాజ్ఞ —

'ఈపత్రలేఖ అను కులూతేశ్వరుని కూతురు, నీకు తాంబూలకరంకవాహిని అని నిశ్చయించి పంపుచున్నాను. ఈమెను కేవలము పరిచారికగ చూడరాదు. గొప్పరాజవంశపు బిడ్డ. శిష్యురాలినివలె ప్రేమింపుము. నీకు శుశ్రూష చేయును' అని.''

''అమ్మ చెప్పినట్లే'' అని చంద్రాపీడుడు కంచుకిని పంపివేసెను. అది మొదలు పత్రలేఖ నీడవలె చంద్రాపీడుని వీడక యుండెను. అతనికిని ఆమెయందు గొప్ప ప్రీతి జనించెను.

కొన్నిదినములతరువాత మహారాజు చంద్రాపీడునికి యౌవరాజ్యాభిషేకము చేయువాడై ప్రతీహారులను దానికి కావలసిన ఏర్పాట్లను చేయుడని ఆజ్ఞాపించెను. ఆసందర్భమున శుకనాసుడు నీతిశాస్త్రమెల్లచదివిన చంద్రాపీడుని మరింత నీతిజ్ఞునిగ చేయుటకు దీర్ఘముగ నీతిబోధ[1] చేసెను.

మరికొన్నిరోజులకు మహారాజు తారాపీడుడు మంత్రజలములతో ఆనందబాష్పములు కలియుచుండ, స్వయముగ కుమారుని అభిషేకించెను. చంద్రాపీడుడు సింహాసనము నెక్కెను. ఇంతలో దిగ్విజయయాత్రకు దుందుభులు మ్రోగెను. చంద్రాపీడుడు పత్రలేఖతో గజమెక్కి, పురమువీడి తూర్పుదిశగా ప్రయాణముచేసి, అంతయు జయించి, ప్రదక్షిణముగ అన్నిదిశలను గెలిచి, భూపర్యటనము చేయుచు ఒకనాడు కైలాసపర్వతసమీపమున హేమజటులు అను కిరాతులస్థానమయిన సువర్ణపురమును పట్టెను. సేనకు విశ్రాంతియని కొన్నిరోజులు అచటనే యుండెను.

ఒకనాడు ఇంద్రాయుధమెక్కి వేటనెపమున అడవిలో తిరుగుచు ఒక కిన్నరమిథునమును చూచెను. వారియపూర్వరూపములు తన్ను ఆకర్షింపగా పట్టుకొనవలయునని దగ్గరకు పోయెను. ఆకిన్నరులు భయపడి పరుగెత్తిరి. చంద్రాపీడుడును గుఱ్ఱముమీద వారిని వెంబడించెను. వారు గొప్పపర్వతమునెక్కి కనబడకపోయిరి. దుష్కరమయిన మార్గమువలన ఇంద్రాయుధమును తానును చాల అలసిపోగా ఒకచోట ఆగి, నవ్వుకొని చంద్రాపీడుడు ఇట్లు తలపోసెను.

"అహా, నామూర్ఖత! ఇట్టి నిరర్థకప్రయత్నముతో ఉత్సాహము! ఈయశ్వముఖులను వెంబడించి ఏమిఫలము? సేనను వదలి ఎంతదూరము వచ్చితినో తెలియదు. వేగములో వచ్చినదారిని గుర్తుపెట్టుకొనలేదు. ఇదికదా కైలాసపర్వతము. సువర్ణపురము దీనికి దక్షిణముకాన ఆదిశలో పోయెదను."

ఇట్లు నిశ్చయించి, గుఱ్ఱమును మరలించెను. మరల ఇట్లు ఆలోచించెను.

"ఈ గుఱ్ఱము అలసియున్నది. ఏదైన వాగో, సరస్సో కనబడిన దీనికి నీరుపెట్టి, కడిగి శ్రమను పోగొట్టవలెను. నేనును దాహము తీర్చుకొని, కొంత విశ్రమించి తరువాత కదలెదను."

---

1. రాజకుమారునికి చెప్పదగిన నీతిసారమంతయు ఈ శుకనాసోపదేశమున కలదు. చూ. 15.2.4; 17.8.

జలాన్వేషణ చేయుచు ఒక దట్టమయిన తోపును చూచెను. ప్రవేశించి చూడగా మధ్యలో త్రిలోకలక్ష్మికి మహాదర్పణమువలె అచ్ఛోదము అను సరస్సు కనిపించెను. దాని దక్షిణతీరమునుచేరి చంద్రాపీడుడు గుఱ్ఱము దిగెను. దానికి నీరుత్రాగించి, ముంగాళ్లకు బంధమువేసి, దానిముందు కొంత గడ్డివేసి తాను నీటదిగెను. చాతక పక్షివలె జలముమాత్రము ఆహారముగగొని, లేచివచ్చి, ఒక బండమీద కూర్చుండెను. అట్లు కొంతసేపు సుఖముండగా, సరస్సు ఉత్తరతీరమునుండి తంత్రీలయసమన్విత మయిన దివ్యగీతము వినవచ్చెను. కౌతుకముచేత లేచి చంద్రాపీడుడు ఆదిశను చూపుసారించెను. ఏమియు కనపడలేదు. గుఱ్ఱమెక్కి ఆదిశలో పోవుచుండెను. కొంత దూరము పోగా అతనికి ఒక శివాలయము కనబడెను. అందు చతుర్ముఖుడయిన శివుని విగ్రహము ఉండెను. ఆ విగ్రహపు దక్షిణముఖమునకు ఎదురుగా కూర్చొని ఒక నిత్యయౌవనయగు దేవకాంత, పదునెనిమిదిఏండ్ల యువతిగ కనపడునది, తపస్వినివేషమున, తెల్లని దేహకాంతిని మించిన తెల్లని వస్త్రములతో, నల్లని జటలతో, వీణవాయించుచు మనోహరముగ పాడుచుండెను.

చంద్రాపీడుడు అశ్వముదిగి, దానిని చెట్టునకు కట్టివేసి దేవునిసమీపించి, భక్తితో మ్రొక్కి ఆమెను చూచుచు ఇట్లు తలపోసెను.

"ఆహా, ఘటనాచిత్రము! నిరర్థకముగ కిన్నరానుసరణము చేసితినికదా అని అనుకొనగా అతిమనోహరమయిన సరస్సు కనపడినది. దివ్యగానము వినబడినది. చతుర్ముఖశివదర్శనము ప్రాప్తించినది. ఈ దేవతను చూచితిని. ఈమె ఎవరో, పేరేమో అడిగెదను. ఆశ్చర్యకరమయిన వృత్తాంతము వినుటకు ఇది మహావకాశము."

అంతట చంద్రాపీడుడు ఆ మండపములోనే ఒక స్తంభమును ఆనుకొని కూర్చుండి పాట పూర్తియగువరకు వేచియుండెను. పాటముగియగానే ఆమె లేచి, దేవునికి ప్రదక్షిణముచేసి, నమస్కరించి, తిరిగి చంద్రాపీడుని చూచి "స్వాగతము, లేచిరండు, అతిథిసత్కారముగొనుడు" అని పిలిచెను.

అతడును లేచి, ఆమెకు నమస్కరించి, "భగవతీ, నీయాజ్ఞ," అని ఆమెను అనుసరించెను. దగ్గరనున్న గుహాద్వారమున కూర్చుండగా ఆమెయు అర్ఘ్యజలము తెచ్చెను.

"అమ్మా, ఇంతయాదరము వలదు. నీవును కూర్చొనుము" అని చంద్రాపీడుడు ఎంతచెప్పినను ఆమె వినకపోగా అతిథిసత్కారమును అంగీకరింపవలసి వచ్చెను.

ఆమె అడుగగా అతడు తన ఆగమనవృత్తాంతమును చెప్పెను. తదుపరి ఆమె భిక్షాకపాలమును తీసికొని దగ్గరనేయున్న ఫలవృక్షములక్రింద నడువగా అప్రయత్నముగ రాలిన ఫలములతో పాత్రము నిండెను. వానిని ఆమె చంద్రాపీడునికి పెట్టెను. అతడు ఆశ్చర్యముతో లేచి ఇంద్రాయుధమును దగ్గరకుతెచ్చి కట్టివేసి, ప్రక్కనున్న వాగులో స్నానముచేసివచ్చి ఫలములను భుజించి, జలము త్రాగి విశ్రమించెను. ఆమెయు భుజించి శిలాతలమున విశ్రమింపగా చంద్రాపీడుడు సవినయముగ ఇట్లనియెను.

"భగవతీ, మిమ్ము చూచినప్పటినుండి కౌతుకము కలిగినది. ఈ లేత వయస్సులో ఈ కఠోరవ్రతమేల? మీకు కష్టముకాకున్న చెప్పవలెను."

అదివిని ఆమె కన్నీరుపెట్టుకొని ఏడ్వనారంభించెను. చంద్రాపీడుడు తనవలన ఆమెకు దుఃఖముకలిగినదని భావించి నీరుతెచ్చియిచ్చి ఆమెను మొగము కడుగుకొనుటకు నియోగించెను. ఆమెయు అట్లేచేసి, కండ్లు వలిపముతో అద్దుకొని, గొప్ప నిట్టూర్పు విడిచి ఇట్లు చెప్పదొడగెను.

"రాజపుత్రా, నా పాపవృత్తాంతము నీకేల? అయినను కుతూహలము కలదేని వినుము —.

## § 4. మహాశ్వేతాకథనము (< జాబాలిక. < వైశంపాయనక.)

దేవలోకమున అప్సరసలు అను కన్యలు కలరు. వారు పదునాలుగు కులములవారు. దక్షుని ఇరువురు కూతులవలన రెండు కులములు ఏర్పడినవి. అందు దక్షుని కుమార్తె ముని యనునామెపుత్రుడు చిత్రరథుడు గంధర్వరాజు అయ్యెను. కింపురుషదేశమున హేమకూటపర్వతము అతని నివాసస్థానము. ఈ మనోహరమయిన అడవియు అతనిపేరుమీదనే చైత్రరథము అని పిలువబడుచున్నది. అతడు త్రవ్వించినదే అచ్ఛోదము అనునది ఈ సరస్సు. ఈ దేవాలయమును అతడు నిర్మించినదే.

దక్షునికూతురైన అరిష్టాదేవికుమారుడు హంసుడు అను గంధర్వుడు కలడు. చిత్రరథుడే ఇతనిని రెండవగంధర్వకులమునకు రాజునుచేసెను. అతడును హేమకూటముననే యుండును. చంద్రకిరణజన్యయయిన ఒక యప్సరకులమున పుట్టిన గౌరి అను తెల్లని దేహకాంతి గల కన్యను హంసుడు వివాహమాడెను.

ఆ హంస గౌరులకు ఇటువంటి దుఃఖముకొరకే అన్నట్లు నేను పుట్టితిని. నాకు మహాశ్వేత అని సార్థకముగ నాతండ్రి పేరుపెట్టెను. క్రమముగా నేను యౌవనవతిని అయితిని. ఒక వసంతదినమున నేను నాతల్లితో ఈ యచ్ఛోదసరస్సున స్నానమునకు వచ్చితిని. ఇచ్చట ప్రకృతిరామణీయకమును చూచుచు తిరుగుచుండగా ఒకచోట ఉన్నట్లుండి గాలిలో దివ్యమయిన కుసుమగంధము సోకినది. అపరిచితమైన ఆ సుగంధము ఎక్కడిదో అని కొంతదూరము పోయి చూడగా స్నానార్థమువచ్చిన మనోహరుడయిన మునికుమారుడు కనిపించెను. అతనితో దేవతార్చనకు పూవులు కోయుచు ఒక తాపసకుమారుడును ఉండెను.

ఆ మునికుమారుని చెవిలో ఒక పూలగుత్తి కనబడినది. "దీని పరిమళము కదా అది" అని నిశ్చయించుకొంటిని.

"ఓహో! ఏమి ఇతని రూపము! బ్రహ్మ మన్మథుని సృజించియు మరల అంతకన్నగొప్ప మునికుమారుని కల్పించెను. లేకున్న, కష్టజీవులయిన మునులలో ఇట్టి లావణ్యము ఎట్లు కలుగును" అని తలపోయుచున్ననేను తత్క్షణమే మదనవశనయితిని. నాకు ఇట్లుతోచినది,

"ఈ మునికుమారునిలో నా మనస్సునువేసి మదనుడు అనుచితము చేసినాడు. తెలివియుండగానే ఇచ్చటినుండి తప్పుకొనుట మేలు. ఇతడు కోపించిన శపించును. మునిజనులకు కోపము సులభముకదా?"

అతనికి ప్రణామము చేసితిని. అప్పటికే నామనోవికారమును గుర్తించి ఆ మునికుమారుడును చలించెను. అవకాశముచూచి నేను ఆ రెండవమునికుమారునికి నమస్కరించి ప్రథమునిసంగతియు ఆ పూలగుత్తిసంగతియు అడిగితిని. అతడు నవ్వి,

"బాలా, ఈ యూసు నీకేల? అయినను అడిగితివికాన చెప్పెదను" అని ఇట్లు చెప్పసాగెను.

"దివ్యలోకవాసియగు శ్వేతకేతువు అను మహాముని, గొప్పరూపవంతుడు, ఒకనాడు దేవతార్చనకు పద్మములుకోయుటకై ఆకాశగంగలో దిగెను. అచ్చట పుండరీకమున కూర్చొనియున్న లక్ష్మి అతనిని చూచి మోహించెను. ఆమెకు సద్యోగర్భమయి అప్పుడే ఒక కుమారుడు కలిగెను. ఆబిడ్డను ఆమె "నీకొడుకు తీసికో" అని శ్వేతకేతువు చేత పెట్టెను. అతడును సంతోషముతో గ్రహించి పుండరీకమున పుట్టినవాడు కావున పుండరీకుడు అని పేరిడి, పెంచి, అన్నివిద్యలు నేర్పెను. ఆ పుండరీకుడే వీడు.

ఇతని చెవిలోనిది దేవపారిజాతకుసుమమంజరి. నందనవనదేవత ఇతనికి ఇచ్చినది."

అప్పుడు పుండరీకుడు నన్నుసమీపించి "ఈ పరిమళము నీకు నచ్చినట్లయిన దీనిని తీసికో" అని ఆ మంజరిని నా చెవిలో నుంచెను. నన్నుతాకిన స్పర్శసుఖమున వశముతప్పి అతడు తనచేతిలోని అక్షమాలను జారవిడిచెను. అది పడినది అతనికి తెలియలేదు. నేను ఆ మాలను నేలతాకకమునుపే లాఘవముగ పట్టుకొని నా మెడలో వేసికొంటిని.

ఆ సమయమున నా ఛత్రగ్రాహిణి వచ్చి, "ప్రభుపుత్రీ, అమ్మస్నానము అయినది, తిరిగిపోవుకాలము సమీపించినది. కావున వచ్చి స్నానము ముగింపుము" అని ఎచ్చరించినది.

అదివిని నేను ఎట్లో కష్టముమీద దృష్టిని అతనిమీదనుండి మరల్చుకొని స్నానమునకు వెడలితిని. 'నేనుపోవుట చూచి మునికుమారుడు పుండరీకునితో ఇట్లనియెను,

"సఖా, ఇది నీకు తగదు. ఏది నీధీరత? ఏమైనది నీ యింద్రియనిగ్రహము? నీ యక్షమాలను ఆమె తస్కరించుకొనిపోవుటనుకూడ గుర్తింపవే? ఏమి, తెలివియు తప్పెనా? అక్షమాల పోనేపోయెను. నీ మనస్సునుకూడ తీసికొనిపోకుండ నివారింపుము."

పుండరీకుడు లజ్జతో బదులు పలికెను, "సఖా, కపింజలా, నన్ను తప్పుగా భావింపకు. ఈమె చేసిన అపరాధమును ఓర్వను." అని నావైపు తిరిగి "చంచలా, అక్షమాలను ఈయక ఒక్క అడుగైనను వేయరాదు." అని మిథ్యాకోపముతో అనెను.

అదివిని నేను నా ముత్యాలహారమును మెడనుండి తీసి, "భగవానుడా ఇదిగో తీసికో నీ యక్షమాలను" అని అతని చేత పెట్టితిని. పరధ్యానముగ నా ముఖము చూచుచున్న పుండరీకుడు హారములమార్పును గమనింపడయ్యె. నేనును పోయి స్నానముచేసి అతనినే తలంచుచు తల్లితో ఎట్లో ఇల్లు చేరితిని. కన్యాంతఃపురమునకు పోయినదిమొదలు విరహముచేత నాకు దేనియందును మనస్సు నిలువలేదు. ఇది ఎవరికి చెప్పుదును? దీనికి విరుగుడేమి? అని తెలియలేదు. ప్రాసాదము పైనెక్కి—అతని అక్షమాల కంఠమునా, పారిజాతము చెవిలోను ఉండగా అతనిని చూచిన స్థలపుదిక్కునే చూచుచు కదలక నిలిచియుంటిని. నాతో సరస్సునకు వచ్చిన తాంబూల కరంకవాహిని తరలిక కొంతయాలస్యముగా వచ్చి చేరినది. ఆమె నాతో నిట్లు చెప్పినది,

"రాజపుత్రీ, ఆయిద్దరు తాపసకుమారులలో నీకు పారిజాతకుసుమము ఇచ్చిన వాడు నన్ను ఆపి నిన్నుగూర్చి అడిగెను. నేను, నీవు హంసుడు అను గంధర్వరాజు కుమారితవనియు, హేమకూటమునకు పోయితివనియు చెప్పితిని. అతడు ఒకక్షణ మూరకయుండి, 'నిన్ను కోరుచున్నాను, ఒక్కపని చేయుదువా?' అని అడిగెను.

నేను 'అవశ్యము చేయుదును. అనుగ్రహింపుడు,' అంటిని.

అపుడు అతడు తమాలపల్లవమును పిండి ఆరసముతో తనయుత్తరీయపు పేలికపై చిటికెనవ్రేలిగోరుతో జాబువ్రాసి, నీకు ఇమ్మని నాచేత ఉంచెను."

అట్లుచెప్పి తరలిక తాంబూలపేటికనుండి ఆజాబునుతీసి నాకు ఇచ్చినది. అందు ఈపద్యము ఉండినది,

'బిసతంతువువలె తెల్లని నీముత్యాలపేరువలన నా మానసహంస మోసపోయి, ఆశగొని, బహుదూరము పోయినది.

---

1. దూరం ముక్తాలతయా బిససితయా విప్రలోభ్యమానో మే
హంసఇవ దర్శితాశో మానసజన్మా త్వయా నీతః.

ఇందు దర్శితాశః, మానసజన్మా అను పదములశ్లేషచేత కోరిక, హంస అను రెండు అర్థములు వచ్చును.

అది చదువగానే నామనోవికారము మరింతయయినది. ఇంతలో ఛత్రగ్రాహిణి వచ్చి "భర్తృదారికా, ఒక మునికుమారుడు అక్షమాలకొరకు అని వచ్చి వాకిట నున్నాడు." అని చెప్పినది. నేను కంచుకిని పిలిచి, "ప్రవేశపెట్టుము" అని చెప్పితిని. అతడు పోయి కపింజలుడు అను మునికుమారుని, పుండరీకవయస్యుని తీసికొని వచ్చెను నేను అతనికి నమస్కరించి, కూర్చుండబెట్టి, కాళ్లుకడిగి తడియొత్తి, దగ్గరగ నేలపై కూర్చుంటిని. అతడు ఇట్లనెను,

"రాజపుత్రీ, ఏమిచెప్పుదును? వేరుగతి లేదు. వినుము. నీసమక్షముననే నేను కోపముతో పుండరీకుని నిష్ఠురములాడితిని. అతనిని వదలి మరియొకచోటికి పోయితిని. నీవు పోగనే, వీడు ఏకాకి, ఏమిచేయునో అని తిరిగినచ్చిచూడగా అతడు కనబడలేదు. 'ధీరత్వమును వదలినవాడు అనిష్టమేదైన చేయును కావున అతనిని ఒంటరిగ వదలరాదు' అని నిశ్చయించుకొని-వెదకనారంభించితిని. సరస్తీరములో ఒకపొదరింట రాతిమీదకూర్చొని మదనావస్థలో మనసెక్కడికోపోగా జడీకృతుడై బొమ్మవలె ఉన్న పుండరీకుని కంటిని. పోయి ప్రక్కన కూర్చొని 'సఖా, పుండరీకా, ఇదియేమి?' అని అడిగితిని.

అతడు నిట్టూర్చి సిగ్గుతో మాటలు తడబడగా, 'కపింజలా, అన్నియు తెలిసి ఏల నన్ను అడిగెదవు?' అని పలికెను.

అదివిని మిత్రుని అపమార్గమునుండి తప్పించుట మైత్రిలక్షణముకదా అని, 'పుండరీకా, నాకు తెలిసినదే. ఇంతవరకే అడుగుచున్నాను. ఈ నీ నడత తండ్రి శాసనమా, శాస్త్రనియమమా, లేక మోక్షోపాయమా? తెలివిమాలినవానివలె ఆ చచ్చిన మన్మథునిచేత చిక్కి మనస్సు ఎటుపోవుచున్నదో ఎరుగకున్నావు. చాంచల్యమును వీడి ఈ దురాచారమును మానుము' అని నేను పలుకుచుండగా, నన్నువారించి, నాచేతులుపట్టుకొని పుండరీకుడు ఇట్లనియెను,

'సఖా, వేయేల? మదనునికంటపడనివాడవు కావున బాగుగనే ఉన్నావు. ఇతరునికి ఉపదేశముచేయుట సుకరమే. బుద్ధియున్నవానికి కదా ఉపదేశము తగును? నేను అస్థితిని ఎప్పుడో దాటిపోయితిని. ప్రాణములుమాత్రము ఉన్నవి. మనస్సును కట్టలేను. కావున ఇది ఉపదేశమునకు కాలము కాదు. నా సంతాపమునకు ప్రతిక్రియను ఆలోచింపుము. దేహము దహించుకొనిపోవుచున్నది. తోచినట్లు చేయుము.

నేనను ఆలోచించితిని, 'ఇతడు చేయిదాటిపోయినాడు. ఇతనికి ప్రాణరక్షణో పాయమును చేయవలెను.' ఇట్లు నిశ్చయించి అతనికి శైత్యోపచారములు చేసితిని. కాని ఫలము లేదాయెను. 'ఏదో ఒక ఉపాయమున ఇతనిప్రాణములను కాపాడవలెను. ఆమెతో సమాగమముతప్ప వేరు దారిలేదు. తానుగా ఇతడు పోలేడు. కావున చేయ కూడనిదైనను చేయవలసివచ్చినది. ఆమెయొద్దకే పోయెదగాక.'

అని వచ్చితిని. నీకుతోచినట్లు చేయుము."

అతడు విరమింపగా ఆనందసాగరమున మునిగినట్లు భావించి, నేను, "నా భాగ్యముచేత మదనుడు అతనినికూడ తాకెను. ఇప్పుడు ఏమిచేయుదును. ఏమి చెప్పుదును," అని ఆలోచించుచుండగా ప్రతీహారి వచ్చి,

"రాజకుమారీ, నీవు అస్వస్థముగా ఉన్నదని విని మీతల్లి చూడవచ్చియున్నది" అని చెప్పినది.

అదివిని కపింజలుడు తొందరపాటుతో లేచి, "రాజపుత్రీ, చాల ఆలస్యమైనది. పోవుచున్నాను. నాకు మిత్రభిక్షపెట్టుమని అంజలిఘటించుచున్నాను. ఇంతకుమించి నేనేమి చేయగలను?" అని వెడలిపోయెను.

నాతల్లి వచ్చి, కొంతకాలము నాతోఉండి, మరలిపోయినది."

చీకటిపడగా తరలికను అడిగితిని, "తరలికా, నాహృదయక్షోభ నీకుతెలియదా? నాకు కర్తవ్యము నిర్ణయించుశక్తి లేదు. ఇప్పుడు ఏమిచేయవలెనో చెప్పుము. కులధర్మమునువదలి, తల్లిదండ్రులకు తెలియక, సిగ్గువిడిచి, పోయి అతనిని చేపట్టితినా గొప్ప తప్పగును. లేనిపక్షమున నాప్రాణములే నిలువవు. ఆశాభంగముతో అతడు మరణించెనా మునివధపాతకముకూడ నాకు సంభవించును" అని యనుచుండగా చంద్రోదయమయ్యెను.

చంద్రికాజనితమదనానలజ్వాలనముచేత కుందుచు "ఈపాపి చంద్రుని భరింప జాలను" అని తలచుచునే కొంతసేపు మూర్ఛకు లోనైతిని. మరల తెలివివచ్చి చూడగా తరలికయు ఏడ్చుచుండెను. ఆమె నాకు దండముపెట్టి, "రాకుమారీ, సిగ్గుతో ఏమిపని? తల్లిదండ్రులమాట వలదు. నన్ను దూతికగా పంపుము. నీప్రియుని తోడితెచ్చెదను. లేదా లెమ్ము, అచటికే పోవుదము" అని వేడుకొన్నది.

నేనును "వెన్నెల ప్రియునిదగ్గరకుపోవుటకు మార్గదర్శి. లేదా విరహానలో ద్దీపకమై నాకు ప్రాణాంతకము. ఎట్లైననేమి?" అని తరలికతో చెప్పి లేచితిని. అప్పుడే నాకు కుడికన్ను అదరినది. విధి ఇంకను ఏమి కీడు కల్గించునో అని శంక పొడమినది. గత్యంతరములేక ప్రాసాదమునుండి దిగి ప్రమదావనపు దిడ్డివాకిలిగుండ బయలువెడలి తరలిక వెంటరాగా అభిసారికాలాంఛనములతో అతనికడకు నడువ నారంభించితిని. అతడు కూర్చొనియున్న ప్రదేశము సమీపించితిని. సరస్సున కాళ్లు కడుగుకొని వచ్చులోపల దూరముగ అస్పష్టమయిన పురుషకంఠపు రోదనము విని పించినది. కుడికన్నదరి, మొదలేభయపడుచున్న నామనస్సు మరియు కూలిపోయినది.

"తరలికా, ఇదియేమి" అనుచు దేహము వడకుచుండ ఆమెను డాసితిని. అప్పుడు నిశానిశ్శబ్దమున ఆ యార్తనాదము స్పష్టపదములతో వినబడినది.

"హా, హతోస్మి. ఇదియేమి సంభవించినది! దురాత్మా, మదనపిశాచమా, క్రూరుడా, చేయరానిపని ఏలచేసితివి. ఓసీ, మహాశ్వేతా, నీకితడేమియపకారముచేసెనే! ఓరీ, చంద్రచండాలుడా, తృప్తియయినదా నీకు? దక్షిణపుగాలీ, నీకోరిక తీరినదా?

హా, సఖా, పుండరీకా, నాకొరకు వేచియుండుము. నేనును నిన్ను అనుసరించె దను. నీవులేక క్షణమైనను ఏకాకిగ నిలువలేను."

ఇట్లు ఏవేవో మాటలతో ఏడ్చుచున్న కపింజలునిగొంతు మాకు శ్రవణగోచర మయినది.

అదివినగనే ప్రాణముయు ఎగసిపోగా పెద్దకేకతో పడుచు లేచుచు ఒక పొదరింటి లోనికి పోయి శయ్యమీద ప్రాణవిహీనుడుగ పడియున్న పుండరీకుని కంటిని. అతని కంఠమున నాముత్యాలపేరు అట్లేయుండినది. కపింజలుడు అతనిని కౌగలించుకొని ఏడ్చుచుండెను. పాపిని అట్టి దృశ్యమును చూచితిని.

నాకు మూర్ఛవచ్చినట్లు అయినది. ఏమిచేసితినో నాకే తెలియదు. తెలివివచ్చి శయ్యమువట్టినదానివలె ఏడ్చితిని. "పుండరీకా, కఠినహృదయుడా, ఏడ్చుచున్న నన్ను కావవేల?" అనుచు అతని మృతదేహమును కట్టుకొని రోదించితిని. "మహానుభావా, దయచేసి ఇతనిని బ్రతికింపుము." అని మరల మరల కపింజలుని పాదములమీద బడుచుంటిని.

ఇట్లు మహాశ్వేత తనవృత్తాంతమును చెప్పుచు దుఃఖాతిశయముచేత మూర్ఛిల్లెను. ఒరగి పడిపోవుచున్న ఆమెను చంద్రాపీడుడు పట్టుకొని ఉత్తరీయపుకొనతో మెల్లగ వీచుచు తెలివొందునట్లు చేసెను. కరుణతో ఆమెకు ఇట్లు చెప్పెను,

"పవిత్రురాలా, నేను పాపిని. నీకీకష్టము కల్గించితిని. ఇక చెప్పినది చాలును. నేనును భరింపలేకున్నాను."

ఆమెయు నిర్వేదముతో నిట్లనియెను, "పిడుగువంటి ఈవార్తనుమించి చెప్పుటకుగాని వినుటకుగాని కష్టతరమేమియు నాకథలో నికలేదు. తరువాత జరిగిన అద్భుతమునుమాత్రము చెప్పెదను. ఆశయను ఎండమావి నా యీ మృతసమానదేహమును ఎట్లు నిలిపెనో వినుము —

అట్లు మిక్కిలి విలపించి అగ్నిప్రవేశముచేయ నిశ్చయించి, ఏడ్చుచున్న తరలికతో 'ఎందులకేడ్చెదవు, లెమ్ము, కట్టెలుతెచ్చి చితిపేర్చి రగుల్చుము. నాజీవితేశ్వరుని అనుసరింతును' అని నేను చెప్పుచుండగా తటాలున చంద్రమండలమునుండి శ్వేతదీర్ఘకాయుడగు మహాపురుషుడొకడు దిగివచ్చి పుండరీకుని మృతదేహమును చేతులతో ఎత్తుకొని, గంభీరమయిన స్వరముతో 'బిడ్డా, మహాశ్వేతా, నీవు ప్రాణత్యాగము చేయరాదు. ఇతనితో నీకు మరల సమాగమము కలుగును,' అని ఆదరముతోనుడివి. త్రుటిలో ఆకసమునకెగసి అదృశ్యుడయ్యెను.

అందుపై నేను విస్మయముతో కపింజలుని 'ఇదియేమి' అని అడిగితిని. అతడును సంరంభముతో,

'దురాత్మా, నామిత్రుని తీసికొని ఎటకేగెదవు' అని పైకి చూచుచు కోపముతో ఉన్నపాటున లేచి ఆకసమునకెగసి తారాగణములో లీనమయ్యెను.

కపింజలుడు పోవుటవలన నా దుఃఖము రెట్టించి గుండెపగులునట్లయినది. ఏమిచేయుటకును తోచక, తరలికను, 'ఇదియేమో నీకు తెలియునా' అని యడిగితిని.

ఆమెయు దుఃఖముతో నిట్లు చెప్పెను, 'రాజపుత్రీ, పాపిని నాకేమియు తెలియుటలేదు. కాని ఇది ఆశ్చర్యము. అతడు దివ్యపురుషుడు. తండ్రివలె నిన్ను ఓదార్చి పోయినాడు. కావున ఈ ప్రాణపరిత్యాగయత్నము మానుట యుక్తము. కపింజలుడు వచ్చువరకు బ్రతికియుండుట నీ విధి.' అని నా కాళ్లమీదపడి ఏడ్చినది. నేనును కపింజలుని ఆగమనమును ఎదురుచూచుచు ఈ పాడుజీవితమును నిలిపియున్నాను. ఆశవలన మానవులు ఏమిచేయరు ?

ఆరాత్రి ఎంతకును తెల్లవారకపోగా సరస్తీరమున ఎట్లో తరలికతో గడపితిని. మరునాడు ప్రొద్దుననే సరస్సులో స్నానముచేసి, మనస్సును గట్టిచేసికొని, పుండరీకుని కమండలువు, వల్కలములు, అచట పడియున్నవానిని గ్రహించి, బ్రహ్మచారిణినై, శివుని ఆశ్రయించి ప్రార్థించుచుంటిని. మరునాడు ఎట్లో సంగతితెలిసి నాతల్లిదండ్రులు, బంధువులు వచ్చి నాస్థితికి వగచి, నన్ను ఇంటికి తీసికొనిపోవుటకు ప్రయత్నించిరి. నన్ను ఈతాపసదీక్షనుండి మరలింపలేక కొంతకాలము నాతోవసించి ఇండ్లకుపోయిరి. వారుపోయినదిమొదలు, వన్యఫలమూలములతో, ప్రస్రవణజలముతోడను ప్రాణములు నిలుపుకొనుచు, మూడుపూటలు ఈసరస్సున స్నానముచేయుచు. శివుని పూజించుచు ఈగుహలోనే తరలికతో తెగనిదుఃఖమును ఓర్చుచు బ్రతికియున్నాను.

అట్టి పాపిని నన్ను నీవు చూచినను ప్రశ్నించినను ఒరగునదేమియు లేదు." అని చీరకొంగుతో మొగముకప్పుకొని మహాశ్వేత ఏడువసాగెను.

(మహాశ్వేత స్వకీయకథ సమాప్తము)

## 9. 5. జాబాలికథనము (< వైశంపాయనకథనము)

చంద్రాపీడుడు ఆమె రూపవినయములచేత, కఠోరదీక్షచేతను ఆమెయందు మిక్కిలి గౌరవముకలవాడై ఇట్లు చెప్పెను,

"అమ్మా, ప్రేమను చేతలలో చూపలేనివారు నిష్ఫలమయిన కన్నీటితో తమ యోశక్తతను ప్రకటింతురు. నీవు ఈకఠోరవ్రతముచేతనే నీహృదయమును వ్యక్తపరచుచున్నావు. నీప్రియునికి నీవు చేయదగినది మరేదియు లేదు.

బంధువులను వదలితివి. భోగములను మరచితివి, బ్రహ్మచర్యమును పూనితివి, ఆడువారికి దుష్కరమగు అటవీవాస మంగీకరించితివి. ఇకరోదనమేల ? వలదు.

సహగమనమందువా, అది నిష్ఫలము, మూర్ఖము ప్రాణములు తామే బోనప్పుడు వానిని త్యజింపరాదు. ఈ సహగమనము శోకముభరింపలేక తప్పించుకొను ఉపాయమేకాని గొప్పత్యాగము కాదు. ఇందు స్వార్థమే కనపడుచున్నది. దీనివలన మృతునికి లాభములేదు. దీనివలన అతడు బ్రతికిరాడు. ఇరువురికిని మరియొకచోట సమాగము కలుగుట జరుగబోదు. ఏలయన అపోయినవాడు తన కర్మవిశేషమువలన

ఏదోలోకమునకు పోవును. ఈ సహగంత్రి తన కర్మవిశేషమునకు సరిపోవు లోకాంతరమును పొందును. వారికి కలయిక దుర్లభము. బ్రతికియుండినవారు మృతునికి జలతర్పణాదులచే మేలుచేయవచ్చును. సహగమనముచేత ఇరువురికిని నష్టమే.

హరనయనదగ్ధుడగు భర్తనుచూచి రతి ఏమిచేసినది? పాండురాజు చనిపోగా కుంతి చావలేదు. అభిమన్యునితో ఉత్తర ప్రాణములు వదలలేదు. జయద్రథమరణానంతరము దుస్సలయు చావలేదు. ఎందరో భర్తృవిహీనలు జీవించియే యుండిరి.[1]

నీకు సమాగమవచనము లభించినది. భవిష్యత్తునుగురించి సందేహమేల? చనిపోయినవానితో సమాగమము ఎట్లు కలుగును? కావున అతడు బ్రతుకును. అందులకే అతని శరీరము కొనిపోబడినది. మహాత్ములశక్తి అచింత్యముకదా."

ఇట్లు చంద్రాపీడుడు ఓదార్పుమాటలతో ఆమెకు సమాధానముచెప్పి దుఃఖమును మానునట్లు చేసెను.

ఇంతలో ప్రొద్దు క్రుంకెను. మహాశ్వేత లేచి, పశ్చిమసంధ్యను పూజించి, నారచీరలశయ్యపై పరుండెను. చంద్రాపీడుడును సంధ్యావందనముచేసి ఒకరాతిపై చిగురుటాకుల శయ్యపై కూర్చుండి ఆమెను,

"భగవతీ, తరలిక ఎక్కడ?" అని యడిగెను. అప్పుడు ఆమె చెప్పసాగెను.

"మహాభాగా, అమృతసంభవాప్సరసకులమున మదిర అను కన్యను చిత్రరథుడు పరిణయమాడెను. వారికి కాదంబరి అను కుమారిత కలిగినది. ఆమె నాకు చిన్ననాటినుండి, ఒకేకంచము ఒకేమంచముగాపెరిగిన మిత్రము. నాకు ప్రాణసమాన. నాయీదుఃఖమును విని శోకముచేత, "మహాశ్వేతదుఃఖము తీరువరకు వివాహసుఖమును ఒల్లను" అని ప్రతిన పూనినది. "నాయిష్టములేక నావివాహమును నాయన తలపెట్టినచో నేను త్రాడో, విషమో చూచుకొందును" అనియు చెప్పినది.

అదివిని చిత్రరథుడు ఆమెను శాసింపలేకపోయెను. వేరు ఉపాయము లేమి, ఆమెకు పెండ్లియాడువచ్చుటచే మదిరాదేవితో ఆలోచించి, క్షీరోదుడు అను కంచుకి చేత నాకు చెప్పిపంపెను, "కుమారీ, మహాశ్వేతా, నీసంబంధమున మనసుచెడియున్న

1. ఈసందర్భమున దశరథునిభార్యల సంగతి బాణుడు మరచినట్లున్నది.

చంద్రాపీడుడు దగ్గరనేయున్న ఒకపీఠముపై కూర్చుండెను. కాదంబరి స్వయముగా మహాశ్వేతకాళ్లు కడిగి ఉత్తరీయముతో తడిచె త్తెను. కాదంబరిసఖి మదలేఖ చంద్రాపీడుని కాళ్లు కడిగెను.

మహాశ్వేత కాదంబరిని కుశలమడిగెను. మహాశ్వేత దుస్థితికి శోకముతో మహాశ్వేతముఖమునే చూచుచున్నను కాదంబరిక్రేగంటిచూపు చంద్రాపీడుని బాధించుటకో అన్నట్లు అతనివైపునకు పోవుచుండెను. ఆమె తాంబూలమును మహాశ్వేతకు ఈయబోగా మహాశ్వేత వారించి ఇట్లనియెను,

"సఖీ, క్రొత్తయతిథి, చంద్రాపీడుడు ప్రథమసత్కారార్హుడు. అతనికిమ్ము."

కాదంబరి లజ్జతో మోముత్రిప్పుకొని మెల్లగ "ప్రియసఖీ, నాకు సిగ్గుగ నున్నది. నీవే ఇమ్ము" అని చెప్పెను.

మరల మహాశ్వేత ఒత్తిడిచేయగా కాదంబరి, ముఖమును మహాశ్వేతవైపునకే త్రిప్పియుంచి ఒడలువడకుచుండగా తాంబూలపుచేతిని మాత్రము చంద్రాపీడునిదెస సారించెను. చంద్రాపీడుడు అందుకొనెను. తరువాత కాదంబరి మహాశ్వేతకును తాంబూలమిచ్చెను.

ఇంతలో క్షీరోదుడు (కంచుకి) వచ్చి మహాశ్వేతతో ఇట్లనియెను, "ఆయుష్మతీ, ప్రభువు చిత్రరథుడు, మహాదేవియు నిన్ను చూడవలయునని పిలుచుచున్నారు."

మహాశ్వేత పోవునదై, కాదంబరితో "సఖీ, చంద్రాపీడునికి వసతి ఎచ్చట?" అని యడిగెను.

"చూచినదిమొదలు నాసర్వస్వమునకు ప్రభువయిన ఈయన, నాభవనవిభవ పరిజనములకును కారా? ఎక్కడతోచిన అక్కడ ఉండవచ్చును" అని కాదంబరి ప్రత్యుత్తరమిచ్చెను.

అదివిని మహాశ్వేత, "క్రీడాపర్వతమున మణివేశ్మములో ఉండునుగాక" అని చెప్పి, గంధర్వరాజదర్శనమునకు పోయెను. చంద్రాపీడుడును బయలువెడలి కేయూరకుడు దారిచూపగా క్రీడాపర్వతమణిమందిరమునకు పోయెను. కాదంబరియు పరిమిత పరివారముతో ప్రాసాదముపైకిపోయి విజనశయ్యపై పడి ఆలోచింపసాగెను,

"మోహాంధనై తప్పు చేయుచుంటినా? ఇదివిన్న నాయన, అమ్మయు ఏమందురో? సాటిగంధర్వులు ఏమనితలంతురో? కఠవిధియో, మదనహతకుడో నాకు విప్రలంభము కల్గించుటకు ఈచంద్రాపీడుని తెచ్చెను. ఇట్టి చాపల్యము కూడదు."

అయినను ప్రేమావేశమున లేచి కిటికీలోనుండి క్రీడాపర్వతమునే మాటిమాటికి చూచుచుండెను.

చంద్రాపీడుడు మణిమందిరపర్యంకమున శయనించి కేయూరకుడు కాళ్లొత్తు చుండగా,

"ఈకాదంబరి సహజవిలాసములు మనోహరములై యుండగా అడుగకయే మదనుడు వానిని నాకై నియోగించినాడు. మనుష్యులకు స్వాభావికమైన నాలఘుత వలన అతడు నాకు మిథ్యాసంకల్పములను కలుగజేసి విప్రలంభములో పడవేయు చున్నాడో, ఏమో? ఈవృథాఖేదము కూడదు. ఆ ధవళేక్షణకు నాయందు మనసు కలదేని ఆమదనుడే త్వరలో దానిని ప్రకటింపజేయును" అని తలచి, మందిరము నుండి వెడలి పర్వతముపైకి ఎక్కెను.

కాదంబరియు మహాశ్వేతను ఎదురుచూచునెపముతో మిద్దెమీదికి ఎక్కగా కాదంబరీచంద్రాపీడులు దూరమునుండి ఒకరినొకరు చూచుకొనుచు చాలసేపు ఉండిరి. ఇంతలో ప్రతీహారివచ్చి కాదంబరికి మహాశ్వేతప్రత్యాగమనమును తెలిపెను. ఆమెయు దిగిపోయి మహాశ్వేతతో దినచర్యలు నలుపుకొనుచుండెను.

చంద్రాపీడుడును కొండదిగి స్నానము ముగించి, దినకర్మలు చేసెను. భోజన మైనపిదప క్రీడాపర్వతమున తూర్పువైపున ఒక మరకతశిలమీద కూర్చుండియుండగా తెల్లనివస్త్రములుధరించిన మదలేఖ (కాదంబరి చెలికత్తె) తరల, తమాలిక, తరలిక వెంటరాగా, ప్రతీహారి గంధపుగిన్నెయు, తాను ఒక గొప్పముత్యాలహారమును తీసికొని వచ్చుటను చూచెను.

చంద్రాపీడుడు దూరమునుండియే లేచి ఎదురేగి మదలేఖకు స్వాగతముచెప్పి ఆశిలమీదనే కూర్చుండజేసెను. ఒకింతకూర్చుండి లేచి మదలేఖ చంద్రాపీడునికి చందనమలది, ముత్యాలపేరును తీసికొని, "రాజకుమారా, దేవదానవులు కడలిని చిలికినప్పుడు పుట్టిన శేషహారము ఇది. నీయురమున శోభిల్లునని కాదంబరి పంపినది.

ప్రీతిపూర్వకమయిన ఈబహుమానమును గ్రహింపుము. మాటవరుసకైనను కాదంబరి ప్రథమప్రణయప్రవాహమునకు భంగము కల్పింపకుము,'' అని ఆ ముత్తెపుదండను అతనిమెడలో వేసెను.

చంద్రాపీడుడు విస్మయముతో ''మదలేఖా, ఏమనుచుంటివి? జాణవు, నాకు జవాబిచ్చువ్యవధి లేకుండ మాటనేర్పుతో పనిముగించితివి.'' అని నుడివి ఆమెకు సెలవిచ్చి పంపెను.

ఇంతలో చంద్రాపీడునిజూడ సౌధమెక్కిన కాదంబరి మరల అతనిమనసును హరించినది. సంజెవేళకు ఇరువురును దిగి తమతమ మందిరములలోనికి పోయిరి. మందిరములోని కలువకొలను ఒడ్డున చంద్రాపీడుడు కూర్చుండియుండగా కేయూరకుడు వచ్చి ''కాదంబరి మీదర్శనమునకు వచ్చినది'' అని చెప్పెను.

చంద్రాపీడుడు తొట్రుపడి లేచి, అల్పపరివారముతో ముత్తెపుసరముదక్క వేరునగలేక చేయి మదలేఖమీద ఊని నడచివచ్చుచున్న కాదంబరిని చూచెను. ఆమె వచ్చి ప్రీత్యతిశయముచేత నేలమీదనే కూర్చుండెను. చంద్రాపీడుడును అట్లే చేసెను. అందరును కూర్చున్నతరువాత చంద్రాపీడుడు,

''దేవీ, ఇంతదయ నాపై చూపుటకు ఎంతయాలోచించినను నాలో గుణలేశమయినను కనపడుటలేదే'' అనెను.

అప్పుడు మదలేఖ మందహాసముతో అనెను, ''రాజపుత్రా, నిజమేకావచ్చును. కాని మీ అతిమర్యాదలవలన దేవి సిగ్గుతో బాధపడుచున్నది. ఇట్లేల మాటలాడెదరు?'' అని కొంతయాగి మరల,

''తారాపీడమహారాజుగారు ఎట్లున్నారు? ఉజ్జయిని ఎట్టి నగరము? మర్త్యలోకము రమణీయమేనా?'' అని అనేకప్రశ్నలను వేయగా చంద్రాపీడుడు, వరుసగ జవాబులు చెప్పుచుండగా మాటలతోనే చాలకాలముగడచెను. కాదంబరి లేచి, కేయూరకుని చంద్రాపీడునికి తోడుగ పడుకొనుమని ఆదేశించి. తిరిగిపోయి తనభవనమున శయ్యపై మేనువాల్చెను. చంద్రాపీడుడును కాదంబరి నిష్కారణప్రేమను, మహాశ్వేత మంచిమనసును ఆలోచించుచు రాత్రిగడపెను.

అంతట సూర్యోదయముకాగా చంద్రాపీడుడు ప్రాతఃకర్మలు ముగించుకొని, తాంబూలమువేసికొని, కేయూరకునితో, ''పోయి చూచిరమ్ము కాదంబరి లేచెనా? ఎక్కడ ఉన్నది.'' అని చెప్పెను.

అతడు పోయివచ్చి, "దేవా మందరప్రాసాదము క్రింద ప్రాంగణమున అరుగుపై కాదంబరియు మహాశ్వేతయు కలరు." అని పలికెను.

అంత చంద్రాపీడుడు అచటికివెళ్లి కాదంబరీమహాశ్వేతలకు నమస్కరించి ఒకపీఠముపై కూర్చుండెను.

మహాశ్వేత కాదంబరితో ఇట్లనెను, "సఖీ నీగుణములచేత నీవాడై, చంద్రాపీడుడు చెప్పలేకయున్నాడు. తిరిగి పోవలెనని కోరుచున్నాడు. ఇతనిసంగతి తెలియక అనుచరులు దుఃఖింపుచుందురు. యువజనులప్రీతికి అంతములేదుకదా? అతనికి పోవ సెలవిమ్ము."

కాదంబరి, "మహాశ్వేతా, నాకును నా పరిజనమునకును చంద్రాపీడుడే అధిపతి. నా యనుమతి ఏల" అని గంధర్వ యువకులను పిలిచి, "ఈయనను స్వదేశమున వదలి రండు" అని ఆనతిచ్చెను.

చంద్రాపీడుడు లేచి మహాశ్వేతను కాదంబరికిని నమస్కరించి, కాదంబరి చూపులకు చిక్కి, "దేవీ, ఏమిచెప్పుదును? నన్ను నీ పరిచారకునిగ జ్ఞాపకముంచుకొనుము" అని వెడలెను.

కేయూరకుడు తెచ్చిన గుఱ్ఱమునెక్కి హేమకూటమువదలి, చంద్రాపీడుడు మహాశ్వేతాశ్రమము చేరి గంధర్వ పరివారమును వెనుకకు పంపివేసెను. అప్పటికి ఇంద్రాయుధపు డెక్కల గుర్తులను చూచుచు అతనిని వెదకికొనుచు వచ్చిన వైశంపాయనుడు, సేనయు అచ్చట నుండిరి. వారిని కలిసికొని చంద్రాపీడుడు వైశంపాయన పత్రలేఖాదులకు మహాశ్వేతా కాదంబరుల వృత్తాంతమును చెప్పుచు దినము గడిపెను.

మరునాడు పెందలకడనే ప్రతీహారితో వచ్చిన కేయూరకుని చంద్రాపీడుడు చూచి "రమ్ము, రమ్ము" అని ప్రీతితో ఎదురేగి, కౌగలించుకొని, కూర్చుండబెట్టి ఆదరముతో, "కేయూరకా, కాదంబరీ మహాశ్వేతలకు కుశలమే కదా" అని యడిగెను.

"మీరు ఎవరిని విచారించుచున్నారో, వారికి కుశలమే," అని కేయూరకుడు తామరతంతువుతో కట్టిన తామరాకు పొట్లమును చూపెను. దానిని విప్పి అందుండి కాదంబరిపంపిన తాంబూలద్రవ్యమును, విలేపనాదులను చూపి, "దేవా, మహాశ్వేత ఆదేశము —

'నీవెవరి కంటబడిన వారి కన్నులు ధన్యములు. నీవు పోగానే గంధర్వ నగరము మహోత్సవమునకు మరునటిరోజువలె ఉన్నది. నేను అన్నిటిని పరిత్యజించి నను నాచే నిన్ను చూడవలెనని ఉన్నది. ఇక కాదంబరి మిక్కిలి అస్వస్థగ ఉన్నది. నీవు మరల వచ్చి ఆమెను చూచిన ఆమెకు నిజగుణవిశ్వాసము ఏర్పడును. నీవు శయ్యపై మరచి వదలిన శేషహారమును పంపుచున్నాను' అని".

కేయూరకుడు ఉత్తరీయమున మూటకట్టి తెచ్చిన హారమును చామరగ్రాహిణి చేత ఉంచెను.

"కాదంబరి ఈ భృత్యుని స్మరించుట మహాశ్వేతారాధనఫలమే కాని వేరుకాదు. నాపై ఇంత ప్రసాదభారము నుంచినది కాదంబరి". అని చంద్రాపీడుడు ఆమె పంపిన వస్త్రపు లన్నియు తలదాల్చి, చందనము పూసికొని, తాంబూలము వేసికొని[1], హారము ధరించి, కేయూరకునితో పోయి అశ్వశాలను చొచ్చెను.

అచట, "కేయూరకా, నేను పోయిన తరువాత జరిగినదంతయు చెప్పుము" అని చంద్రాపీడుడు అడుగగా కేయూరకుడు చెప్పెను.

"దేవా, వినుడు. మీరు కదలిపోగానే కాదంబరి మేడపై నెక్కి మీదికనే చూచుచు నిలుచబడినది. మీరు కనుమరుగైన పిదప ఇష్టములేక దిగివచ్చి క్రీడాపర్వతమునకు పోయినది. అచట పరిజనులు "చంద్రాపీడుడు ఇచ్చట కూర్చొనెను, ఇచట భుజించెను, ఇచట నిదురించెను", అని స్థానచిహ్నములను చూపగా చూచుచు కాదంబరి దినమును ఎట్లోగడపెను. మహాశ్వేతబలాత్కారమువలన ఇష్టములేక కొంతభుజించెను. చంద్రోదయము కాగానే శిరోవేదనతో కన్నుమూసికొని శయన గృహమును ప్రవేశించెను. పడుకమీదపడి తలనొప్పితో, జ్వరముతో బాధపడుచు ఎట్లో రాత్రిని గడిపెను. తెల్లవారగానే నన్ను పిలిచి ఇచ్చటకు పంపించెను".

చంద్రాపీడుడు పోవనిచ్చగించి "అశ్వమశ్వ"మని పలికి, భవనమునుండి వెలికి వచ్చెను. త్వరత్వరగా జీనువమర్చి తెబడిన ఇంద్రాయుధమునెక్కి, పత్రలేఖను వెనుకనెక్కించుకొని, వైశంపాయనునికి సైన్యము నప్పగించి, మరియొక గుఱ్ఱము పైన కేయూరకుడు వెంటరాగా హేమకూటమునకు పోయెను. అచ్చట కాదంబరి

---

1. ఈ తాంబూల చర్వణమునకు కాలదేశమర్యాదలు ఉన్నట్లు లేదు.

క్రీడాపర్వతము క్రిందిహిమగృహమున ఉన్నదని తెలిసి కేయూరకుడు దారిచూపగా చంద్రాపీడుడు పత్రలేఖతో హిమగృహమునకు పోయెను. అక్కడ ఆ హిమగృహమున శైత్యోపచారములను పొందుచున్న కాదంబరిని చూచెను. సమీపించి ముందు మహా శ్వేతకును తదుపరి కాదంబరికిని ప్రణామము చేసెను. వారును ప్రతిప్రణామము చేసిరి. ప్రతీహారి తెచ్చిన సువర్ణాసనమును కాలితోనెట్టివేసి చంద్రాపీడుడు నేలనేకూర్చుండెను.

అప్పుడు కేయూరకుడు, "దేవీ, ఈమె చంద్రాపీడుని తాంబూలకరండ వాహిని, పత్రలేఖ," అని పత్రలేఖను కాదంబరికి పరిచయము చేసెను. పత్రలేఖ రూపమునకు కాదంబరి "ఆహా! మనుష్యస్త్రీయందు నిర్మాతయగు బ్రహ్మకు ఎంత పక్షపాతము" అని ఆశ్చర్యపడెను. పత్రలేఖ ప్రణమిల్లగా, "రమ్ము, రమ్ము," అని ఆదరముతో దగ్గర కూర్చుండబెట్టుకొనెను.

చంద్రాపీడుడు కాదంబర్యవస్థను చూచి ఇట్లు తలచెను, "ఈమెను ఇట్లు చూచియు నమ్మకము ఏర్పడకున్నది. నిపుణముగ అడిగి చూచెదగాక." ప్రకాశముగ ఇట్లనియెను.

"దేవీ, మనోవికారజనితమగు ఈవ్యాధి బహుసంతాపకరము. ఇది నిన్ను చాల బాధించుచున్నది. నా శరీరమును దానముచేసియైనను నీ కీస్థితి పోగొట్టెదను. నిన్నుజూడ జాలియగుచున్నది. అలంకారములను గ్రహింపుము. పూవులును తేంట్లును ఉన్నకదా లతకు శోభ".

కాదంబరి ముగ్ధయయ్యు మదనావిష్టగావున చంద్రాపీడుని మాటలలోని గూఢార్థ మును ఎరిగి చిరునవ్వు నవ్వెను. అప్పుడు మదలేఖ చంద్రాపీడునికి ప్రత్యుత్తర మిచ్చెను.

"రాజకుమారా, ఏమిచెప్పుదును. ఈ సంతాపము చెప్పరానిది. శీతకరము లన్నియు ఈమెకు ఉష్ణకరములయినవి. ఈమె ఇప్పుడు కేవలము మనోబలము చేతనే జీవించియున్నది".

ఈ యుత్తరము చంద్రాపీడునికి స్ఫుటముగ తోచలేదు. అట్లే ఆమాటయీ మాట చెప్పుకొనుచు చాలసేపుండి ఎట్లోలేచి తిరిగిపోవుటకు కాదంబరీ గృహమునుండి పత్రలేఖతో బయలువెడలి గుఱ్ఱమునెక్కబోవు చంద్రాపీడునితో కేయూరకుడు ఇట్లనెను,

"దేవా, మదలేఖ మీతో చెప్పుమన్నది — కాదంబరి ప్రీతిచేత పత్రలేఖను తనయొద్ద నిలుపుకొనగోరుచున్నది. ఆమె తరువాత వచ్చును — అని"

చంద్రాపీడుడు, "పత్రలేఖ ధన్య. దేవీప్రసాదమునకు పాత్రమయినది. అట్లే కానిమ్ము," అని పలికి, తన సైన్యస్కంధావారమునకు పోయెను. అప్పట తండ్రికడ నుండి వచ్చిన లేఖహారకుని చూచి,

"ఏమోయీ, నాయనగారు కుశలమేకదా? అమ్మ ఎట్లున్నది?" అని యడిగెను.

అతడు మ్రొక్కి రెండుజాబులను ఇచ్చెను. ఒకటి తారాపీడమహారాజు నుండి —

"నినుచూచి బహుకాలము అయినది. ఈజాబు చదువుకొనిన తక్షణమే రావలసినది", అని సారము.

రెండవజాబు శుకనాసునినుండి. అందును అదే సారాంశము. ఇంతలో వైశంపాయనుడు వచ్చి అదేసంగతి తనకును వచ్చిన రెండు జాబులను చూపించెను.

"నాయనగారి యాజ్ఞ" అని చంద్రాపీడుడు గుఱ్ఱముదిగక అట్లే ప్రయాణ సన్నాహము చేయించెను. ప్రక్కనున్న బలాహకసేనానిపుత్రుడగు మేఘనాదునితో "నీవును అశ్వసైన్యమును ఇచ్చటనేయుండి పత్రలేఖ వచ్చినతరువాత ఆమెను తీసికొని రావలయును. కేయూరకుడు ఆమెను ఇక్కడ దిగబెట్టి వెడలును. అతనితో నామాటగా కాదంబరికి ఇట్లు సందేశము పంపుము —

'తండ్రియాజ్ఞ దాటరానిది. నాదేహము ఉజ్జయినికి పోవుచున్నది. నా హృదయము మాత్రము హేమకూటమున నీపాదములకడనే ఉన్నది. అప్పుడప్పుడు ఈ పవికిమాలిన చంద్రాపీడుని తలచుకొనవలెను. ప్రాణములున్న చంద్రాపీడుడు తప్పక నీసన్నిధి చేరును. అందరిని అడిగినట్లు చెప్పుము' — అని".

ఇట్లాదేశించి, వైశంపాయనుని మెల్లగ సైన్యముతో రావలసినదని చెప్పి, తా నట్లే అశ్వికపరివారముతో ఉజ్జయినికి బయలుదేరెను. పోవుచు మార్గమధ్యమున దూరమునుండియే ఉన్నత రక్త చందన వృక్షముమీది రక్తవర్ణ ధ్వజమును చూచెను.

ఆవైపునకు ప్రయాణము చేసి ఒక చండికాయతనమును, అందు ఒక విరాధరూపుడగు ముసలి ద్రవిడధార్మికునిచేత పూజింపబడు భయంకరమైన కాళికా విగ్రహమును గాంచెను.

అచ్చట గుఱ్ఱముదిగి చండికకు ప్రణామము చేసి, ప్రదక్షిణ మొనరించి మరల మ్రొక్కి, కోపముగ కేకలు వేయుచున్న ద్రవిడధార్మికుని చూచి అతని వికారములకు తన వదనవికారమును మరచి నవ్వెను. తన సైనికులను అతనిని పీడింపవలదని వారించెను. అతనికి మంచిమాటలు చెప్పి, శాంతింపజేసి, అతని వృత్తాంతమడిగెను. అతడును స్వీయచరిత్రవర్ణనావాచాలతతో అందరికిని వినోదము కల్పించెను. పరిచయము వలన చంద్రాపీడుడు అతనికి తాంబూలమిప్పించెను. సూర్యుడు క్రుంకగా ఆరాత్రికి అక్కడనే విశ్రమించెను. విశ్రమించెనేకాని నిదుర రాలేదు. మనస్సు హేమకూటమున కాదంబరినే ధ్యానించుచుండెను. ఎట్లో తెల్లవారగా ద్రవిడ ధార్మికునికి వలసినంత బంగారమిచ్చి, బయలుదేరి క్రమముగా 'మణిశిల'యను ఉజ్జయిని చేరెను.

అతనిరాకకు అందరును సంతోషించిరి. తండ్రిని చూడగానే గుఱ్ఱముదిగి చంద్రాపీడుడు శిరఃప్రణామము చేసెను. తారాపీడుడు తనయుని కౌగలించి గమన మంగళాచారములన్నియు పూర్తికాగానే విలాసవతీ గృహమునకు తీసికొనిపోయెను. తల్లిని దర్శించిన తరువాత చంద్రాపీడుడు శుకనాసుని చూడబోయెను. వైశంపాయ నుని క్షేమసమాచారమును చెప్పి, వైశంపాయనుని తల్లిని దర్శించి, మరలి, తల్లి మేడకు వచ్చి స్నానాదికములు ముగించెను. పగటి మూడవజామునకు తన భవనము చేరి కాదంబరీధ్యానమున సకల నరలోకమును శూన్యముగ తలచెను. కాదంబరీ వృత్తాంతమును పత్రలేఖ వచ్చి చెప్పునను ఆసతో ఆమెరాకకు వేచియుండెను.

కొన్నిదినములకు మేఘనాదుడు పత్రలేఖతో వచ్చెను. ఆమెను చంద్రాపీడుడు ఆదరముతో కౌగిలించి[1] "పత్రలేఖా, కాదంబరీ మహాశ్వేతల కుశలమును చెప్పుము" అని అడిగెను.

ఆమె, "దేవా, అంతయు మంగళమే. కాదంబరి శిరోధృతాంజలితో మీకు మ్రొక్కుచున్నది," అనగనే చంద్రాపీడుడు ఆమెను ఏకాంతమునకు తీసికొనిపోయి, ఒక పత్రమండపమున కూర్చుండి,

---

1. ఇది సోదర్యభావ ప్రదర్శకము అనుకొన్నను మనకు అసభ్యమనిపించును.

"ఇప్పుడు చెప్పుము కాదంబరి ఎట్లున్నది?" అని యడిగెను. పత్రలేఖయు చెప్పసాగెను.

"దేవా, వినుము. కేయూరకునితో నేను మరల కాదంబరి సన్నిధికి పోయి ఆమె ప్రసాదమునకు పాత్రమైయుతిని. మధ్యాహ్నమునకు ఆమె లేచి నామీదనే చేతిని, పరిజనులను పంపివేసి, ఉద్యానవనమును చొచ్చి, వనవేదికమీద నున్న స్తంభము నానుకొని నిలుచున్నది. ఏదియో చెప్పవలెనన్నట్లు నావైపే చూచుచుండినది.

'ఆనతిండు' అని నేను వేడగా, తన రహస్యమును ఎవరైన వనదేవతలు విందురేమోయని ఇటునటు చూచుచు, చెప్పగోరియు సిగ్గున చెప్పలేకపోయెను. కంట నీరిడెను. నేను మరల అడుగగా, పలుకు పెదవులమీద ఆడగా, కొంతసేపు అట్లే యుండెను. తుదకు మనసును త్రిప్పుకొని ఇట్లు చెప్పెను.

'నిన్ను చూచినది మొదలు నాకు నీవే ముఖ్యమయితివి తల్లి దండ్రులు మహాశ్వేత అందరును వెలివారైరి. నా హృదయభావమును నీకు చెప్పి ఈ బ్రతుకును అంతమొందింప దలచితిని.

గొప్పకులమున పుట్టిన కన్య కులమునకు కళంకము ఎట్లు కల్గింపగలదు? లజ్జనెట్లు వీడును? అట్టి నేను నాయన కోరక, తల్లియియ్యక, గురువు లొప్పక ఈ వ్యవహారమును సాగింపదలపలేదు. నీ స్వామికి నేనేమియు సందేశము చెప్పను. అతడు నన్ను ఈస్థితికి తెచ్చెను. జన్మాంతరమున కలసికొందము. ప్రాణత్యాగముచే నాకన్యాత్వమును శుద్ధిచేసికొందును.'

అసలుసంగతి తెలియని నాకు ఆమెమాటలు అర్థముకాక దుఃఖముతో ఇట్లు చెప్పితివి.

'రాజకుమారీ, చంద్రాపీడుని యపరాధమేమో చెప్పవలెను. అతడు ఎట్లు మీ సుమకోమలమానసమును నొప్పించెను? అది వినిన నా ప్రాణములు పోవును. పిదప మీరు ప్రాణత్యాగము చేయవచ్చును.'

ఆమెయు చెప్పెను. "విను. ప్రతిరాత్రియు కలలో కనపడి చంద్రాపీడుడు నన్ను వేధించుచున్నాడు. అతనిని నేను నివారింపలేకున్నాను'.

అదివిని ఆనందముతో నవ్వి అంటిని, 'దేవీ, అట్టైన కోపము మానుము ప్రసన్నురాలవు కమ్ము. మదనుని యపరాధమునకు చంద్రాపీడుని దూషింపరాదు. ఇది కాముని వంచనయే కాని మహారాజుది కాదు'.

కాదంబరి కుతూహలముతో, 'ఎవ డా కాముడు? చెప్పుము. ఏది అతని రూపము? ఏవి అతనిచేష్టలు?' అని అడిగెను.

నేను, 'దేవీ, అతనికి రూపులేదు, రూపములేని నిప్పువంటివాడు. మంటలు లేకయే మండించును, పొగలేకయే కన్నీరు తెప్పించును. అతని బాణమునకు తిరుగు లేదు. పూవు బాణముతో ఎంత బలిష్ఠునైనను కొట్టును. అతని వశమయిన అబలలగతి దుర్గతియే' అని చెప్పితిని.

అంత కాదంబరి ఇట్లనియెను, 'పత్రలేఖా, నీవు చెప్పినట్లే చేయుచున్నాడు. సరి, ఇప్పుడు కర్తవ్యమును ఉపదేశింపుము. తల్లిదండ్రులకు చెప్పుటకు సిగ్గుచేత బ్రతుకుటకన్న చావే మేలని తోచుచున్నది'.

'దేవీ, ఈ యకారణ మరణానుబంధమును చాలింపుము. మదనుడు నీకు అడుగక వరమిచ్చెను. గురుజనులకు చెప్పవలసినదిలేదు. ధర్మశాస్త్రము స్వయంవరమును విధించుచున్నదికదా? నీకు కాముడే కన్యాదాత. కావున సందేశమిమ్ము. పోయి నీ ప్రియుని తోడితెత్తును' అని అనగా ఆమె మెల్లగ చెప్పసాగెను,

'ఏమి చెప్పుదును. సిగ్గగుచున్నది. నీవు నాకు చాల ప్రియము — అనిన పునరుక్తి దోషము. నీకు నేను ప్రియము — అనిన మూఢ వచనము. నీయందు ప్రేమ ఎక్కువ — అనిన వేశ్యాలాపము. నీవులేక బ్రతుకలేను — అనుట అబద్ధము. రమ్ము — అనుట సౌభాగ్యగర్వము. నేను వత్తును — అనుట స్త్రీ చాపలము. నిన్ను తప్ప మరియెవరిని ప్రేమింపని నీసేవికను — అనుట స్వభక్తి ప్రకటనము. తిరుగ గొట్టునేమో అని సందేశము పంపను — అనుట అతనికి ఉపాయము నేర్పుట. నా మరణమువలన నా ప్రేమను ఎరుగుదువు — అనుట అసంభావ్యము *......

[ఇచ్చట విధిహతుడైన బాణుని లేఖిని వాక్యార్థములో ఆగిపోయినది. ఇటుపై బాణుని కుమారుడగు భూషణుని [1]పూరణము]

---

1. పూర్వభాగ సంగ్రహము ప్రత్యేకముగ ఈ వ్యాసముకొరకు చేయ

*అట్లు పలువిధముల పలుకుచు మనసు నిలుకడలేక విరహావస్థలోనున్న కాదంబరిని పత్రలేఖ వర్ణించి చెప్పగా చంద్రాపీడుడును విరహావస్థను పొంది తాను మరల హేమకూటమునకు పోవుట ఎట్లని ఆలోచించుచుండెను. పోయిన ఇచ్చట తల్లి దుఃఖించును. పోకయున్న అచ్చట కాదంబరి స్థితి ఏమగునో యని డోలాయమాన హృదయముతో చంద్రాపీడుడు దినము గడిపెను.

ఇట్లుండ ఒకనాడు సాయంకాలము మనోవినోదము కొరకు చంద్రాపీడుడు నగరబహిర్భాగమున శిప్రానదీతీరమున విహరించుచుండగా, అవలిగట్టుమీద ఒక అశ్వికదళమును, అందు కేయూరకుడును కనపడెను. కేయూరకుడు వచ్చి చంద్రాపీడునితో ఏకాంతమున కాదంబరిదీనావస్థను హృదయవిదారకముగ వర్ణింపగా చంద్రాపీడుడు భరింపలేక మూర్ఛిల్లెను. ఇంతలో తెప్పరిల్లి ఇట్లనియెను

"దేవి నన్నేల పిలిపింపలేదు. నాప్రాణముతొడ్డియైన ఆమె బాధను మాన్ప సిద్ధుడను."

కేయూరకుడు చంద్రాపీడుని వేగమే హేమకూటమునకు రావలయునని ఎచ్చరించెను.

ఆరాత్రి చంద్రాపీడుడు,

"తల్లిదండ్రులకు తెలియక నేను పోవుట అనుచితము. ఇప్పుడే దిగ్విజయయాత్రనుండి వచ్చి మరలపోవుట ఏమియని వారు అనుమతిని ఇత్తురాయనుట సందేహము. వైశంపాయనుడును ఇచ్చట లేడు. ఇప్పుడు నాకు సహాయుడెవరు" అని చింతించెను.

తెల్లవారగానే సైన్యము దశపురమువరకు వచ్చియున్నవార్త చంద్రాపీడునికి తెలిసెను. వైశంపాయనుడు రాగానే అతనితో మరల హేమకూటమునకు పోవుదును గాక అని అతడు సంతోషించెను.

---

(మిగులం) బడినది. ఈ యుత్తరభాగము అతిసంక్షిప్తము. ఇది నిర్ణయసాగరవారి పీఠికలోని సంస్కృత సంగ్రహము, P. V. కాణే ఆంగ్ల కథాసంగ్రహమును ఆధారముగ కేవలము కథాపూరణమునకు చేయబడినది.

"నేను ముందు పోయి కాదంబరీదేవికి మీరాకను చెప్పుదును" అని కేయూరకుడు సెలవు కోరగా చంద్రాపీడుడు తనయాగమనప్రత్యయము కొరకు పత్రలేఖను కేయూరకునితో జోడించి, మేఘనాదునితో వారిద్దరిని మహాశ్వేతాశ్రమమువొద్ద దిగబెట్టి రమ్మని చెప్పెను.

చంద్రాపీడుడు తాను వైశంపాయనునికి ఎదురుపోవలెనని తండ్రియానతి కొరకు పోగా అచ్చట చంద్రాపీడ వివాహ ప్రస్తావన అయినది. కాదంబరీ దర్శనోత్సుకునికి ఇది ఒక వింతఅనుశ్రుతిగ తోచినది. అనుమతిగొని అతడు కొంత గుఱ్ఱపు దండును మాత్రము తోడుతీసికొని వైశంపాయనుని కలిసికొనుటకు దశపురమువంకి పయనించెను. మార్గములో ఎదురువచ్చుచున్న తనసైన్యము కనపడెను. సైన్యమును కలియగనే సేనాపతులు ఇట్లు చెప్పిరి,

"వైశంపాయనుడు అచ్ఛోదసరస్తీరమునకు రాగానే మనస్సు వికలమై స్నాన భోజనాదికములు మాని ఒక లతామండపమునే చూచుచు నిలువబడి మమ్ము తిరిగిపొండని ఆజ్ఞాపించెను. అతనిని రమ్మని మేము ప్రార్థింపగా,

'నేను రాలేను. నాకు స్వాధీనము తప్పినది. మీరు పొండు' అనెను. మూడు దినములుండి ఎంత ప్రార్థించినను లాభములేక తిరిగివచ్చుచున్నాము."

"ఇది ఏమి చిత్తవైకల్యము" అని చింతించుచు చంద్రాపీడుడు ఉజ్జయినికి మరలెను.

వార్తాహరులు వైశంపాయన వృత్తాంతమును తారాపీడ శుకనాసులకు తెల్పిరి. శుకనాసుని ఊరడించుచు తారాపీడుడు వైశంపాయన మనోవికారమునకు చంద్రాపీడుడే కారణమై యుండునని సూచింపగా శుకనాసుడు అట్టి దెప్పుడును జరుగదనెను. చంద్రాపీడుడు తాను వైశంపాయనుని తెచ్చెదనని పోవుటకు ఎట్లో తల్లియనుమతిని పొంది, శుకనాసుని సిఫారసుతో తండ్రియనుమతిని పొంది, జ్యోతిష్కులు వద్దన్నను వినక, ప్రయాణము సాగించెను.

సగముదూరము పోయిన పిదప పత్రలేఖను మహాశ్వేతాశ్రమమున వదలి తిరిగివచ్చుచున్న మేఘనాదుడు కనబడెను. చంద్రాపీడుడు "నీకెక్కడనయినను సరస్తీరమున వైశంపాయనుడు కనిపించెనా" అని ఉత్కంఠతో అడుగగా అతడు "నాకేమియు తెలియదు" అనెను.

కాదంబరి ఎంతబాధపడుచున్నదో అని వేయిభంగుల ఆలోచించుచు చంద్రాపీడుడు అచ్ఛోదసరస్సును చేరి, నాలుగువైపులను వెదకి, వైశంపాయనుని కానక, మహాశ్వేత కేమైన తెలియునేమో అని ఆమెయాశ్రమమునకు పోయెను. అచట గుండె నీరగునట్లు ఏడ్చుచున్న మహాశ్వేతను చూచెను. కాదంబరి కేమైన ముప్పు వాటిల్లె నేమో అని దిగులుతో ఆమెను దుఃఖకారణము అడిగెను ఆమె ఇట్లు చెప్పెను.

"మహాభాగుడా, హేమకూటమునుండి రాగానే నీకు తుల్యరూపుడైన బ్రాహ్మణుడు, ఏదో పోగొట్టుకొన్నట్లు వెదకుచున్నవాడు, నాకు ఇక్కడ కనపడెను. నన్ను చూడగానే కామప్రేరితుడై నామీదికి వచ్చెను. నేను తొలగిపోయి మరియొకచోట తల దాచుకొని తరలికతో అతనిని తరిమివేయుమని చెప్పితిని. కాని కొన్నిరోజులలో అతడు మరలవచ్చి ఒక వెన్నెలరాత్రి నన్ను బలాత్కరింపబోగా నేను కోపముతో 'పుండరీకుని చూచినపిమ్మట నేను పరపురుషుని అట్లు చూడనిది సత్యమైన, చిలుకవలె అవియే కామాలాపములు మరలమరల చేయు ఈ బ్రాహ్మణుడు చిలుకయే అగును' అని శపించితిని. తత్క్షణము అతడు మొదలు నరికినతరువువలె నేలగూలెను. తరువాత అతని యనుచరుల విలాపమువలన అతడు నీమిత్రుడు వైశంపాయనుడు అని గ్రహించితిని."

కాదంబరీ విరహమున క్రుంగుచున్న చంద్రాపీడుని హృదయము ఈ ప్రాణమిత్ర మరణవార్త వినగానే పగిలి అతడు నిర్జీవుడాయెను.

అందరును చంద్రాపీడునిశరీరమును చుట్టి ఏడ్చుచుండగా కాదంబరి మదలేఖా పత్రలేఖా కేయూరకులతో అచటికే వచ్చెను. మృతప్రియుని చూడగానే కాదంబరి మూర్ఛపడెను. పత్రలేఖయు సొమ్మసిల్లెను.

కాదంబరి తెప్పరిల్లి మదలేఖతో సహగమనమునకై చితిని పేర్చుమని ఆజ్ఞాపించెను. మహాశ్వేతను కౌగలించుకొని "సఖీ, నీకు ప్రియాగమనాశ ఉన్నది. నీవు జీవించుట భారమయ్యు సముచితము. నాకు వేరుగతి లేదు," అని చెప్పి కూర్చొని చంద్రాపీడుని చరణములను తన యొడిలో పెట్టుకొనుటకు తాకగనే అతని దేహము నుండి చంద్రజ్యోత్స్న వెలువడినది. అప్పుడు ఒక అశరీరవాణి "బిడ్డా, మహాశ్వేతా, నీ పుండరీకుని దేహము చంద్రలోకమున సురక్షితమై యున్నది. చంద్రాపీడుని మరణము శాపఫలితము. శాపాంతమున అతడు మరల జీవించును. అంతవరకు అతని దేహమును కాపాడుము," అని పలికెను.

ఆమాటలకు అందరును నిశ్చేష్టులుగ ఉండగా, పత్రలేఖ దిగ్గునలేచి ఏదో పూనినదానివలె పరుగెత్తి ఇంద్రాయుధమును పట్టుకొని "వాహనములేక స్వామి ఏకాకిగ ఎచ్చటికో పోయెను. నీవుండుట సరికాదు." అని ఆ గుఱ్ఱముతో అచ్ఛోద సరస్సున దుమికి మునిగిపోయెను. తక్షణమే ఆ సరస్సునుండి ఒక మునికుమారుడు లేచి పరుగున వచ్చెను. మహాశ్వేత అతనిని కపింజలునిగా గుర్తించెను. అతడు తన వృత్తాంతమును చెప్పసాగెను.

## 9. 6. కపింజలకథనము (< జాబాలిక. < వైశంపాయునకు)

"ఆ దివ్యపురుషునితో నేను చంద్రలోకమునకు పోయితిని. ఆ పురుషుడు చంద్రభగవానుడే. పుండరీకుని దేహమును ఒక శయ్యపై పరుండబెట్టి ఆయన నాతో ఇట్లనెను,

'కపింజలా, ఈ పుండరీకుడు విరహమున నాకాంతికి తాళలేక ప్రాణములు విడుచుచు నిష్కారణముగ నన్ను భూలోకమున పుట్టి మరల మరల తనవలెనే విరహమున చావుమని శపించెను. నేను కోపమున నాతో అతడును అట్లే అగునని శపించితిని. కాని కోపము తగ్గగానే ఇతడు నాయంశమున పుట్టిన మహాశ్వేత ప్రియుడుకాదా అని పశ్చాత్తాపము కలిగి, అతని దేహమును తెచ్చి ఇచట భద్రపరిచితిని. మేము ఇరువురము శాపములను చెల్లింపవలెను. కనీసము రెండు జన్మలైన కానిచో నాకు శాపావసానము కలుగదు. ఈసంగతి శ్వేతకేతువు (పుండరీకపిత)తో చెప్పుము. ఆయన తపోబలమున ఏదైన ఉపాయము చేయును'

అదివిని నేను వేగముగ శ్వేతకేతువుకొరకు పోవుచు బాష్పావరోధముచేత సరిగ చూడక దారిలో ఒక విమానముననున్న సిద్ధుని పైనుండి దాటి పోయితిని. అతడు క్రుద్ధుడై 'గుఱ్ఱమువలె నన్ను దాటిపోయి అవమానముచేసితివి, కావున నీవు మర్త్యలోకమున గుఱ్ఱమవై పుట్టుము' అని శపించెను.

నేను అతని పాదములమీదపడి వేడుకొనగా శాంతించి 'నీవు ఎవనికి వాహన మగుదువో అతని మరణముతో నీకు శాపము పోవును. స్నానము చేయగనే నిజ రూపము వచ్చును' అని అనుగ్రహించి, నేను మరియు ప్రార్థింపగా, 'చంద్రుడు

తారాపీడుని కుమారుడు చంద్రాపీడుడుగను, పుండరీకుడు శుకనాసకుమారుడు వైశంపాయనుడుగను పుట్టబోవుచున్నారు. నీవు చంద్రాపీడునికి వాహనమై ఉండుము,' అని మరియు అనుగ్రహించెను.

నేను నిలువుగ సముద్రమునబడి అశ్వమునై పూర్వజన్మ జ్ఞానముతో ఉంటిని. కావుననే నేను కిన్నరమిథునమును అనుసరించిన చంద్రాపీడుని ఇచ్చటికి తెచ్చితిని. ఈశాపమున చిలుక అయిన వైశంపాయనుడే నీ ప్రియుడు పుండరీకుడు."

## 9. 7. జాబాలికథనము (< వైశంపాయనశుకకథనము)

అదివిని మహాశ్వేత నేలగూలెను. కపింజలుడు ఆమెను ఆత్మనిందనుండి వారించి, ఈ కఠినపరీక్ష శీఘ్రమే సుఖాంతమగునని చెప్పి శ్వేతకేతువును వెదకుచు పోయెను.

కాదంబరియు, మహాశ్వేతయు అచ్చటనే యుండి శాపాంతమును ప్రతీక్షింప దలచిరి. దినములు గడచినను చంద్రాపీడుని దేహము చెడక కాంతి హెచ్చుచుండెను, కాదంబరికిని అందుపై విశ్వాసము కుదిరి మదలేఖచేత తన తల్లిదండ్రులకు కబురు పంపెను.

శుకనాసమనోరమలు, తారాపీడవిలాసవతులును వచ్చిరి. సతతప్రకాశవంతమగు చంద్రాపీడుని శరీరమును చూచి ఇతడు దివ్యుడని తెలిసి తారాపీడుడు అచ్చటనే ఒక పర్ణశాల వేసికొని విలాసవతితో వేచియుండెను. శుకనాసుడును సతీసమేతముగ అచ్చటనే ఉండెను. (జాబాలికథ సమాప్తము)

## 9. 8. వైశంపాయనశుకకథనము (< కవికథనము)

అట్లు చెప్పి జాబాలి, "నేను తలచినదానికన్న ఎక్కువయే చెప్పితిని. ఈ చిలుకయే పుండరీకుడు లేక వైశంపాయనుడు" అని విరమించెను.

అంతట నేను (వైశంపాయన శుకము) దేహముతప్ప పూర్తిగా వైశంపాయనత్వమును పొందితిని. "చంద్రాపీడుడు ఎక్కడ" అని జాబాలిమహర్షిని అడిగితిని. ఆయన నన్ను కొంతకాలము ఆశ్రమములోనే యుండి రెక్కలు వచ్చిన తరువాత పోదగునననెను.

అంతలోనే కపింజలుడు వచ్చి నన్నెత్తుకొని ఏడ్చెను. నాయునికిని ఆతడు శ్వేతకేతుమునివలన తెలిపికొనెను. "నీవు మేలుకలుగుటకు నీతల్లిదండ్రులు ఒక యజ్ఞము చేయుచున్నారు. అది పూర్తియగువరకు నీవు ఈ యాశ్రమముననే ఉండవలయునని వారియాజ్ఞ" అని చెప్పి కపింజలుడు వెడలెను.

కొంతకాలమునకు నాకు రెక్కలు వచ్చినవి. నేను హితులమాట నతిక్రమించి రహస్యముగా జాబాలి యాశ్రమమువీడి మహాశ్వేతాశ్రమము వైపు ఎగిరిపోవుచుంటిని. మార్గాయాసముచేత ఒకచెట్టుమీద విశ్రమించి నిదురించుచున్న నేను వేటకాని వలలో చిక్కితిని. నన్ను చంపునని భయపడి వేడుకొనగా. అతడు "నేను శబరుడను. ఊరక నిన్ను మాంసముకొరకు పట్టలేదు. మాదొరకూతురు జాబాలి యాశ్రమమునుండి తప్పించుకొనిపోయిన ఒకానొక చిలుకకొరకు వేటకాండ్లందరిని కనపడిన చిలుకలనెల్ల పట్టితెండని ఆనతిచ్చినది. నిన్ను ఆమెకిచ్చెదను. ఆమెయిష్టము." అని బదులు చెప్పెను.

ఇట్లు పవిత్ర బ్రాహ్మణుడనయ్యు చండాల సహవాసము తప్పలేదుకదా అని విధిని నిందించుచుండగా ఆశబరుడు నన్ను తన స్వామినికి అర్పించెను. ఆమెయే నన్నిటకు తెచ్చి నీకిచ్చినది. ఆమె ఎవరో నాకు తెలియదు. ఇది నా వృత్తాంతము.

(వైశంపాయనశుకకథనము సమాప్తము)

## 9. 9. కవికథనము (భూషణునిది)

శూద్రకుడు ఆచండాలికను పిలువనంప ఆమె వచ్చి,

"కాదంబరీలోచనానందా, చంద్రా, రోహిణీవల్లభా, ఈ దుర్మతి వృత్తాంతము వింటివికదా. నేను ఇతని తల్లిని, లక్ష్మిని, శ్వేతకేతువు చెప్పగా ఇతనిని బంధించియుంచితిని. కాలమాసన్నము కాగానే నీతో చేర్చితిని.

ఇక ఈమర్త్యదేహమును వదలి సుఖము పొందుము" అని ఆమె దివికెగసిపోయెను.

ఆక్షణమే శూద్రకుని హృదయమున కాదంబరీవిరహ ముత్పన్నమయ్యెను. అట్లు రెండవజన్మలో విరహబాధ కలుగగనే అతనికి శాపాంతము అయ్యెను. అతడు శూద్రక దేహమును వదలిపోయెను.

అదే క్షణమున కాదంబరి విరహమును భరింపలేక చంద్రాపీడుని మృతదేహ మును కౌగలింపగా చంద్రాపీడుడు సజీవుడై ఆమెను గట్టిగ ఉరమునకు హత్తుకొనెను.

అప్పుడే ఆకసమునుండి వైశంపాయనుడు పుండరీకరూపమున దిగెను. ఈ శుభవార్తను కాదంబరి మహాశ్వేతకు చెప్పినది. హంసచిత్రరథాదిగంధర్వగణ మంతయు కూడినది. కపింజలుడు శ్వేతకేతువునుండి సందేశము తెచ్చెను. పుండరీ కుడు శుకనాసపుత్రుడుగనే చంద్రాపీడునకు మంత్రిగ ఉండవలయునని శ్వేతకేతువు చెప్పెను. తారాపీడశుకనాసులు మిక్కిలి ఆనందించిరి. కాదంబరిపెండ్లికి అందరును పోగా మహాశ్వేతాశ్రమము నిర్జనమయ్యెను.

అంత మహాశ్వేతా పుండరీకులు, కాదంబరీ చంద్రాపీడులును సుఖముండిరి. ఒకనాడు కాదంబరి భర్తను పత్రలేఖ ఏమైనదని అడిగెను. అతడు ఆమె రోహిణి అని చెప్పెను.

[ ఇట్లు బాణపుత్రుడు భూషణుని ధర్మాన కాదంబరీకావ్యము సంపూర్ణము ].



# 10. కాదంబరీకథామూలవిచారము

## కథసప్రకారాది విశేషములు

10. 1. 'కాదంబరి' కథాకావ్యమని ప్రసిద్ధము. 'ప్రబంధకల్పనా కథా' అని అమరుడు కథాకావ్యమునకు వస్తువు కవికల్పితమగు ననెను. ఇతర లాక్షణికులును ఆమతమునే ధ్రువపరచిరి. ప్రసిద్ధమయిన కథను కావ్యముచేసిన అది లాక్షణికుల మతమున ఆఖ్యాయిక కావలెను[1].

10. 2. బాణుని కుమారుడు ఉత్తరకాదంబరీ పీఠికలో బాణుడే 'అనన్యశక్య'[2] యయిన కాదంబరీకథను సృష్టించెనని చెప్పియున్నాడు. కాదంబరీవ్యాఖ్యాతలెవరును దీనిని శంకించినట్లు లేదు. ఉత్తరభాగ వ్యాఖ్యాత సిద్ధచంద్రుడు భూషణుని శ్లోకము లోని 'అనన్యశక్యా' అను విశేషణమును వ్యాఖ్యానించుచు:

"పురాణేతిహాసాదులలో కనపడని ఈ కథ స్వయముగా (బాణునిచేత) నిర్మితము, నిబద్ధము అని భావము"[3]

అని చెప్పియున్నాడు.

10. 3. కాదంబరికి ఆధారమున్నట్లు బాణుడు తన పీఠికలో చెప్పలేదు. ఇది సంస్కృతకవుల పరిపాటి కావున అనిర్ధారకము. వ్యాసుడు భారతమున వాల్మీకిని స్మరింపకయే వనపర్వాంతర్గత రామాయణమును రచించెను. కాళిదాసు వ్యాసుని స్మరింపకయే శాకుంతలమును నిర్మించెను. ఇట్లు తమకథలకు మూలములను చెప్పుకొనుట మన వాడుక కాదు. బాణుడును కథను సూక్ష్మరూపమున కొండొకచో గ్రహించి విస్తరించి మూలప్రశంసను విస్మరించెనా అనునది విచార్యము.

---

1. చూడు. 4. 12.

2. చూడు. 1. 2. 1.

3. పురాణేతిహాసాదిష్వదృష్టాపీయం కథా స్వయం నిర్మితా నిబద్ధాచేతి భావః. (నిర్ణయసాగర ప్రతి. పుట. 485)

10. 4. పీటర్సను మొదలగు పాశ్చాత్యపండితులు వారి విమర్శనారీతిని అనుసరించి కాదంబరికథను బోలిన కథలు క్షేమేంద్రుని 'బృహత్కథామంజరి'లోను సోమదేవుని 'కథాసరిత్సాగరము' నను కనపడుటవలన వానికి మూలమైన గుణాఢ్యుని 'బృహత్కథ' బాణునికిని మూలమగునా అను ప్రశ్నను లేవదీసి ప్రసిద్ధికి తెచ్చిరి.

నిర్ణయసాగరప్రతిలోనే సిద్ధచంద్రుని పూర్వోక్త వ్యాఖ్యానమునకు శ్రీ మథురానాథశాస్త్రి టిప్పణిలో

"కాదంబరీకథ బృహత్కథామూలకము కావున 'పురాణేతిహాసాదులలో కనపడదు' అను (సిద్ధచంద్రుని) మాటలో స్వారస్యము లేదు"[1]

అని చెప్పి కాదంబరి-కథ కవికల్పనముకాదు అనుభావమును వెల్లడించి యున్నారు.

10. 5. క్షేమేంద్రసోమదేవులు ఇరువురును తాము పైశాచీ భాషలోని గుణాఢ్యకృత బృహత్కథనే అనువదించినట్లు చెప్పుటయు, అందులోను సోమదేవుడు తాను మూలమును కొద్దిగ సంక్షేపించుటయు భాషను మార్చుటయు తప్ప ఏమార్పులును చేయ లేదని[2] చెప్పుటయు, వారిరువురి కావ్యములలోను కాదంబరీ కథాతుల్యమగు కథ ఒకటి బీజప్రాయముగనైనను ఉండుటయు కాదంబరీ మూల చర్చను అపేక్షించు చున్నది.

10. 6. బాణుడు బృహత్కథలోనుండి ఈ కథను గ్రహించెను అని నిశ్చయముగ చెప్పుటయు కష్టము. బాణుని నాటికి బృహత్కథ ఏరూపములో ఉండెనో తెలియదు. కొందరు విమర్శకులు గుణాఢ్యుడు ఉపయున కథలను మాత్రము రచియింపగా తరువాతికాలములో అవి అనేకకవులచేత విస్తరింపబడెనని అందురు. అనగా అది

---

1. కాదంబరీ కథానకస్య, బృహత్కథామూలకత్వాత్, 'పురాణేతిహాసాసు ప్వదృష్టా' ఇతి కథనం న స్వారస్యావహమ్.

(నిర్ణయసాగరప్రతి పుట 4:5)

2. యథా మూలం తథైవైత న్మనాగ ప్యతిక్రమః।
గ్రంథవిస్తర సంక్షేపమాత్రం భాషా చ భిద్యతే॥

(సోమదేవుని కథాసరిత్సాగరము, శ్లోకము 10)

కథలకు ఆకరముకాక గమ్యస్థానమయినదను భావమునే సోమదేవుడు ‘కథాసరిత్సాగరము’ అను గ్రంథనామమున ఉపలక్షించెననుటయు సాధువాదమే. కథలు నదులు, బృహత్కథ సాగరము. ‘నదీనాం సాగరో గతిః’ అన్నట్లు ‘కథానాం బృహత్కథాగతిః’ అని ఏల కారాదు! అట్లైన హర్షనాటకముల కథలు, కాదంబరీ కథ ఇంకను ఎన్నో ప్రసిద్ధకథలు కాలక్రమమున బృహత్కథలో చేరి క్షేమేంద్రసోమదేవుల అనువాదములలో ప్రత్యక్షములైనవి అనియు భావింప దగును.[1]

10. 7. కాదంబరీకథవంటి కథ, క్షేమేంద్రుని ‘బృహత్కథామంజరి’లో శక్తియశోలంబకమున రమారమి 70 అనుష్టుప్పులలో చెప్పబడియున్నది. పాఠకుల పరిశీలనార్థము ఆకథ సంగ్రహముగ ఇచ్చట చెప్పబడుచున్నది.[2]

### 10. 7. 1 సుమానసునికథ (< కవికథనము)

కలడు కాంచనపురినేలు రాజు సుమానసుడు. ఒకనాడు అతడు సభలో నుండగా ప్రతీహారునివెంట ముక్తాలతయను శబరకన్యక చిలుకపంజరముతో ప్రవేశించి రాజునకు నమస్కరించి,

“ఓరాజా, విజ్ఞానియైన ఈ చిలుక నీకు తగినది” అని ఆపంజరమును రాజు ముందు పెట్టెను.

ఆహ్నికాదులను నిర్వర్తించుకొని రాజు ఏకాంతమున చిలుకను తెప్పించుకొని సర్వశాస్త్రములు తెలిసిన దానిని తద్విజ్ఞానప్రాప్తి ఎట్లు కలిగెనని అడిగెను. చిలుక చెప్పసాగెను.

---

1. కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారి “కథాసరిత్సాగరము” తృతీయ ముద్రణమునకు శాస్త్రి మనుమడు వేంకటరాయశాస్త్రి పరిశోధనాత్మక పీఠిక జిజ్ఞాసువులు అవశ్యము చదువదగినది.

2. క్షేమేంద్రుని ‘బృహత్కథామంజరి’కి ప్రామాణికమును, సర్వజనీనమును అగు తెలుగుసేత శ్రీ తిరుమల రామచంద్రగారిది కలదు. అది వ్యావహారిక భాషలో నున్నది. ఈ వ్యాసము సరళగ్రాంథికమున నుండుటచే, వారి యనువాదమునుండి భాష మార్పుతో సంగ్రహించి ఈ కథ పొందుపరుపబడియున్నది. అనువాదమును వాడుకొనుటకు అనుజ్ఞ నిచ్చిన శ్రీ తిరుమల రామచంద్ర గారికి కృతజ్ఞత.

10. 7. 2. శుకకథనము (< కవిక.)

రాజా, వినుము. హేమవతి యను గొప్ప అడవి కలదు. అందు ఒక రోహిత వృక్షముపై వృద్ధుడైన నాతండ్రికి నేను కలిగితిని. విధివశాత్తు తల్లిలేనివాడను కాగా నా తండ్రియే నన్ను పెంచెను.

ఒకనాడు వేటకై పెక్కుబోయలు అచ్చటికి వచ్చిరి. వారిలో ఒక ముదుసలి బోయ ఆ చెట్టునెక్కి చిలుకలను పట్టి మెడ నులిమి చంపుచుండెను. నేను కర్మశేషముచేత అతని చేతులలో పడక చెట్టు క్రిందనున్న ఆకులకుప్పపై పడి ప్రాణములతో ఉంటిని. మరీచి అను ముని స్నానార్థము వచ్చి (నన్ను చూచి) దయతో తీసికొనిపోయి ఆశ్రమములో నిల్పెను. పులస్త్యముని నన్ను చూచి దివ్యదృష్టితో నా వృత్తాంతమెరిగి నవ్వుచు, "ఈచిలుక తాను చేసిన అవినీతికి ఫల మనుభవించుచున్నది", అనెను. అంత ద్విజులందరును నాకథను చెప్పుమని పులస్త్యుని అడిగిరి. ఆయన చెప్పసాగెను.

10. 7. 3. పులస్త్యకథనము (< శుకక. < కవిక.)

రత్నాకరపురమునందు జ్యోతిష్ప్రభుడు అను రాజు ఉండెను. అతనికి కలలో సూచింపబడిన చంద్రాంశముగల సోమప్రభుడు అను కుమారుడు కలిగెను. తండ్రి కుమారుని యువరాజును చేసెను. అంత సోమప్రభుడు, ప్రియంకరుడు అను మంత్రి పుత్రుడును, గొప్ప సైన్యమును వెంటరాగా దిగ్విజయ యాత్రకు పోయి భూమి నంతయు గెలిచి ఒక గొప్ప అడవిని చేరెను. అచ్చట వనసౌందర్యమును చూచుచు విహరించుచుండగా, సోమప్రభుడు ఒక దివ్యాభరణ భూషితుడైన కిన్నరుని చూచెను. కౌతుకముచేత గుఱ్ఱమెక్కి వాయువేగముతో వెంబడించెను. ఒక నిర్జన ప్రదేశము చేరి, అచట కిన్నరుని కానక, సరస్తీరమున క్షణము విశ్రమించి తరువాత దాపుననే యున్న కైలాసశిఖరమును బోలిన త్ర్యంబకాలయమును చూచెను. అచ్చట వీణవాయించుచున్న దివ్యకన్యకను చూచి, చిరప్రాయయగు ఆమెను ఆ యకాలతపస్సేల అని అడిగెను. ఆమె ఇట్లు చెప్పెను.

10. 7. 4. మనోరథప్రభాకథనము (< పులస్త్యక < శుకక.)

కాంచనము అను హిమశైల శిఖరమున పద్మకూటుడు అను విద్యాధరచక్రవర్తి కలడు. నేను ఆయనకు రత్నప్రభ అను భార్యయందు పుట్టిన కుమారితను. మనో

రథప్రభ అను దానను. ఒకనాడు ఈ సరస్సులో జలకమాడవచ్చి, మదనునివంటి మునికుమారుని చూచితిని. చూడగనే అతని వశమైతిని. నాసఖి పద్మలేఖ అతని సచివుని, బుధదత్తుడు అను వానిని అడుగగా అతడు ఆ మునికుమారుని కథను ఇట్లు చెప్పెను.

"దీధితిమంతుడు అను మహాముని కలడు. అతడు స్నానమునకు సరస్సులో దిగగా సరోలక్ష్మి[1] అతనిని చూచి కామవశ యయ్యెను. క్షణములో రశ్మిమంతుడు అను ఇతడు ఆమెకు మానసపుత్రుడుగ పుట్టెను".

ఇది విని నాసఖియు నాపుట్టుకను అతనికి చెప్పినది. అంతట మేమిరువురము మదనయోజితులమైతిమి. అప్పుడు నాతండ్రి శశిలేఖ అను దాసిచేత నన్ను ఇంటికి రమ్మని ఆజ్ఞాపించెను. ఇంటికి పోయి విరహవ్యథకు గురియైతిని. నన్నుకానక ఆ మునికుమారుడును విరహానలతప్తుడయ్యెను. సఖిని పంపించి సంగమాశతో అతనిని నా యుద్యానవనమునకు రప్పించితిని. కాని అచట చంద్రుని వెన్నెలకు తాళలేక నన్ను తలచుకొనుచు అతడు అసువులను వదలెను. నేను వేగమే వచ్చియు మృతుని చూచి విలపించుచు మూర్ఛనొందునంతలో ఒకడు ఆకసమునుండి దిగి ఆ మృతదేహమును ఎత్తుకొని మింటికెగసి అంతర్ధానమయ్యెను. దుఃఖముచేత నేను అగ్నిలో పడనుండగా ఎవడో ఆకసమునుండి "వీనిని మరల పొందెదవు" అని వాక్రుచ్చెను. అట్లు ఆశ చేత ధైర్యము కలుగగా వరదుడగు పార్వతీపతిని ధ్యానించుచు ఇచ్చటనే ఉన్నాను.

10. 7. 5. పులస్త్యకథనము (< శుకక.)

సోమప్రభుడు ఈయుదంతమును విని, "నీ సఖి పద్మలేఖ ఎక్కడ అని యడిగెను.

"సింహవిక్రముడు అను విద్యాధరరాజు కలడు. అతనికి మకరందిక అను రూపవతి కూతురు కలదు. ఆమె నాకు బహిఃప్రాణము. నాదుఃఖమును విని ఆమె తాను వివాహమాడనని వ్రతము పూనెను. ఆమెతండ్రి నాకు చెప్పిపంపెను. నేను ఆమెకు బుద్ధి చెప్పుటకై పద్మలేఖను పంపితిని;" అని మనోరథప్రభ చెప్పుచుండగనే పద్మలేఖ ఒక విద్యాధరునితో వచ్చెను.

---

1. చూ. 10. 8.

"సఖీ, మకరందిక వివాహము ఒప్పుకొనుటలేదు. ఇతడు దేవజయుడు అను విద్యాధరుడు. నిన్ను తనయొద్దకు తోడితెచ్చుటకు పంపినది", అని పద్మలేఖ పలికెను.

మనోరథప్రభ కొంత యోచించి, "నా దుఃఖమువలన మకరందిక ఇట్టి దీక్ష పూనినది. ఈ రాజపుత్రుడు (సోమప్రభుడు) ఆమెకు ఎంతయు తగినవాడు. ఇతనిని ఆమెయొద్దకు తీసికొనిపోదును. ఇతనిని చూచి ఆమె వ్రతము మానవచ్చును[1]" అని నిశ్చయించి సోమప్రభుని వెంటదీసికొని, పద్మలేఖ, దేవజయుడు వెంటరాగా, పోయి మకరందికను అంతఃపురమున కలిసెను. సోమప్రభుని చూడగానే మకరందిక మనస్సు ఆనందముతో నిండెను. సోమప్రభుడును ఆమెను చూడగానే మదనశరము లకు గురియయ్యెను.

ఇంతలో ప్రియంకరుడు గుఱ్ఱపుటడుగుజాడలను అనుసరించి వచ్చి సోమ ప్రభుని చేరెను. అట్లే ఒక లేఖహారకుడు జ్యోతిష్ప్రభుని యొద్దనుండి వచ్చెను. లేఖలోని 'వేగముగా రమ్ము' అను సందేశమును ప్రియంకరుడు సోమప్రభునికి చెప్పగా అతడు ప్రియను వీడలేక ఎట్టకేలకు 'త్వరగా తిరిగివచ్చెదను' అని మకరంది కతో చెప్పి స్వపురము చేరెను.

మకరందికయు విరహోన్మత్త యయ్యెను. ఆమెతండ్రి సింహవిక్రముడు కర్మ పరిపాకముచేత చిలుక యయ్యెను. [పులస్త్యకథనము సమాప్తము]

## 10. 7. 6. శుకకథనము

దేవా, నేనే ఆచిలుకను. పులస్త్యుని కథనముచేత నాకు పూర్వజన్మ జ్ఞానము కలిగినది. ఈ శబరకన్యయే నాపుత్రిక మకరందిక.[2] శివాజ్ఞచే ఈమె సోమప్రభునే పొందును. నిజరూపములోని ఈమెను, మరియు మనోరథప్రభను నేడు చూడగలవు. పరోలక్ష్మీసుతుడవు రశ్మిమంతుడవు నీవే.

---

1. ఈ యాశయము బాణుని కాదంబరిలో లేదు.

2. మకరందికి రూపాంతరమునకు కారణము కనపడుటలేదు. క్షేమేంద్రుని సంక్షేపణవీరమువలన ఈకథ బహుస్థలములలో దుర్గ్రాహ్యముగను కొన్నిచోట్ల అసంబద్ధముగను ఉన్నది. కడపటి పది శ్లోకములలో విస్తారమయిన కథ త్రుంచివేయ బడినది. కొన్నియెడల స్వనామములకు పూర్వనామములు గుర్తించుట కష్టముగ నున్నది. సోమదేవుని 'కథాసరిత్సాగరము' లేకున్న ఈ కథలోని లంఘనములు దురూహములయ్యెడివి.

ఇట్లు చెప్పి ఆచిలుక విద్యాధరరూపమును పొందెను.

ఇంతలో శివుడు కలలో చెప్పగా సోమప్రభుడును సుమానసుని ఆస్థానమునకు వచ్చి మకరందికను కలిసికొనెను. మనోరథప్రభయు తనవిద్యచేత సర్వమును తెలిసికొని సుమానసరూపుడగు రశ్మిమంతుని చేరెను.

## 10. 7. 7. బృహత్కథామంజరిలోని మరియొక కథ

ఈ సందర్భమున గుర్తింపదగినది మరియొకటి కలదు. నిర్ణయసాగర ప్రతిలో 'వేతాల (బేతాళ) పంచవింశతిక'లో 24వ కథ, ధీమంతుడు అను రాజు చరిత్రము ఉన్నది. ఇది నిర్ణయసాగరప్రతి సంపాదకుల మూలపాఠము కాగా, దానికొక అధిక పాఠమును శ్రీ T. S. కుప్పుస్వామిశాస్త్రిగారు తాళపత్రములలో గుర్తించి, ఎత్తి వ్రాయించి, నిర్ణయసాగర సంపాదకులకు పంపగా వారు క్షేమేంద్రుని బృహత్కథా మంజరిలోనే పరిశిష్టముగ చేర్చుకొని ముద్రింపించిరి.

ఇందు విశేషమేమన, ఆ పరిశిష్టకథ పూర్తిగ కాదంబరికి పద్యసంగ్రహము. పేర్లలోకూడ. మార్పు లేదు. పాఠక పరిశీలనమునకు మొదటి మూడు పద్యముల తాత్పర్యము, మచ్చునకు —

'వేత్రవతీప్రవాహమును మొలనూలుగాగల విదిశయను నగరమున శ్రీమంతుడు, భూపతి శూద్రకుడు ఉండెను. అతనికి ఒకప్పుడు ఆస్థానమున ఒక చండాలపతి పుత్రిక సర్వజ్ఞమైన ఒక శుకరత్నమును నజరు పెట్టెను. ఆరాత్రి రాజు చిలుకకు ఫలాహారమిడి, తన కథను చెప్పుమని అడిగెను. అది చెప్పెను, 'దేవా, భూలోకమునకు జడవలె దీర్ఘమయిన వింధ్యాటవి కలదు .... ....[1]'

(ఇత్యాది మొత్తము 78 శ్లోకములు)

---

1. శ్రీమాన్ వేత్రవతీపూరమేఖలాయాం మహీపతిః।
నగర్యాం విదిశాఖ్యాయాం క్ష్మాపతిః శూద్రకోఽభవత్॥
తస్మై కదాచి దాస్థానే చండాలపతిపుత్రికా।
ఉపాయనీచకారైకం రత్నం సర్వవిదం శుకమ్॥
రాజ్ఞా కృతఫలాహారః స పృష్టః స్వకథాం నిశి।
ఊచే దీర్ఘాస్తి వేణీవ దేవ, వింధ్యాటవీ భువః॥

కథాంతమున బేతాళుడు విక్రమార్కుని ప్రశ్నించును, 'వీరందరిలో అను రాగము ఎవరికి అధికము' అని. రాజు చెప్పుచున్నాడు, "చంద్రాపీడుడే అనురాగ వంతుడు. స్నేహితుని మరణ వృత్తాంతమును వినగానే గుండెపగిలి మరణించెను".

ఇది తరువాతికాలములో ఎవరో కాదంబరిని చూచి పద్య సంగ్రహముగా వ్రాసి బేతాళుని కథలలో బృహత్కథామంజరిలో చొప్పించిరని తోచుచున్నది.

ఈ కథ నిజముగ గుణాఢ్యునిదైనచో ఇక బాణుని కథాకల్పనమును ఉగ్గడించుట వ్యర్థమగును. కవీనము పేర్లకుకూడ బాణునికి మెప్పు దొరకదు.

10. 8. ఇక సోమదేవుని 'కథాసరిత్సాగరము'లోని కాదంబరీ తుల్యకథ. ఇచ్చట రాజుపేరు సుమనసుడు (= క్షేమేంద్రుని సుమానసుడు) ఈ కథయు శక్తియశోలంబకమునవే మూడవతరంగమున కలదు. కాని క్షేమేంద్రుడు శక్తియశోలంబకమును 16వ లంబకము చేయగా, సోమదేవుడు దానిని 10వ లంబకముగ చెప్పెను. సోమదేవుని "మకరందిక కథ" 157 శ్లోకములలో పూర్తియగును. కాదంబరిలో శుకము రాజును స్తుతించు చిన్న పద్యము, "స్తనయుగ మశ్రుస్నాతం..." [1] అనుదానికి తుల్యమగు పద్యము క్షేమేంద్రుని కథలో లేకపోగా సోమదేవుని పాఠములో ఆసందర్భమున ఒక శీకర శార్దూలవిక్రీడితము కలదు.

### 10. 8. 1. మకరందికకథ[2] (కవికథనము)

పూర్వము కాంచనపురియను నగరమున సుమనసుడు అను గొప్పరాజు ఉండెను. ఒకనాడు ఆయన అస్థానమున ఉండగా ప్రతీహారుడు వచ్చి,

"దేవా నిషాదరాజుకూతురు ముక్తాలత అనునది చిలుకతోడి పంజరమును చేతగొని దర్శింపవచ్చియున్నది. వీరప్రభుడు అను ఆమె భ్రాతయు ఆమెతో ఉన్నాడు" అని విన్నవించెను.

---

1. చూ. క. స. సా...

2. ఈకథ శ్రీ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారి తెలుగు 'కథాసరిత్సాగరము'నుండి ఈపట సంగ్రహముగ శాస్త్రి మనుమలు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి M. A. గారి సౌజన్యముతో ఉద్ధరింపబడినది.

"రానిమ్ము" అని రాజు సెలవీయగా, ఆమెయు వచ్చెను. ఆమె యద్భుత రూపమును చూచి అచటివారెల్ల "ఈమె మనుష్యస్త్రీ కాదు; ఎవతెయో దివ్యాంగన" అని తలచిరి. ఆమె రాజునకు ప్రణమిల్లి,

"దేవా, ఇది శాస్త్రగంజుడు అను చిలుక. సర్వశాస్త్రములు, విద్యలు, కళల యందు నేర్పరి. వైశంపాయనుడు," అని చెప్పి, ఆచిలుకను రాజునకు అర్పించెను. ప్రతీహారుడు పంజరమును రాజుదగ్గర పెట్టగా ఆచిలుక (రాజస్తుతిగా) ఒక పద్యమును చదివెను -

"ఓరాజా, ధూమశ్యామలముఖమైన నీ ప్రతాపానలము సదా శత్రురాజుల భార్యల విరహపు నిట్టూర్పుగాలి వీచి ప్రజ్వలించుట యుక్తమే; కాని వారి కన్నీటి ధారల వెల్లువచేత పదిదిక్కులలోను తడిసినకొలదియు (ఆరిపోక) మరింత ప్రజ్వలించుటమాత్రము అద్భుతము[1]"

మరియు "ఏశాస్త్రమునుండి చెప్పదును, ఆనతిమ్ము" అని యడిగెను.

రాజు మిగుల ఆశ్చర్యపడుచుండగా, మంత్రి "దేవా, ఇతడెవడో పూర్వము ఋషిగా నుండి శాపమువలన చిలుక యయినాడని తలచెదను" అనెను.

రాజు చిలుకను, "అయ్యా, నీ వృత్తాంతమేమి? శుకమవయిన నీకు ఈ శాస్త్ర విజ్ఞానమెట్లు కలిగినది" అని అడిగెను,

అంత శుకము కన్నీరుకార్చి, "దేవా, ఇది చెప్పరానిది. అయినను వినుము" అని చెప్పనారంభించెను.

10. 8. 2. శుకకథనము (< కవికథనము)

ఓ రాజా, హిమవత్పర్వతముచెంత ఒక గొప్ప రోహిణవృక్షము కలదు; అందు చిలుకయొకటి పెంటితో గూడు కట్టుకొని జీవించుచుండెను. నేను ఆమెకడుపున

1. రాజన్ యుక్తమిదం సదైవ యదయం దేవస్య సంధుక్ష్యతే
ధూమశ్యామముఖో ద్విషద్వరహిణీనిశ్వాసవాతోద్గమైః ।
ఏతత్త్వద్భుతమేవ యత్ పరిభవాద్బాష్పాంబుపూరప్లవైః
ఆసాం ప్రజ్వలతీహ దిక్షు దశసు ప్రాజ్యః ప్రతాపానలః ॥

పుట్టితిని. నాతల్లి నేను పుట్టినవెంటనే మృతినొందెను. తండ్రియే నన్ను కాపాడు చుండెను. ఇతరశుకముల భుక్తావశేషముతో ఆయన నన్ను తన్ను పోషించుకొను చుండెను.

ఒకనాడు అచటికి వాద్యములు వాయించుచు కొమ్ములు ఊదుచు ఒక భయంకర మైన భిల్లసేన వేటకు వచ్చెను. సాయంకాలమునకు మాంసపుకావళ్లతో భిల్లసైన్యము ఆ చెట్టుక్రింద చేరెను. అందు ఒక ముసలిబోయ మాంసమేమియు సంపాదించుకొన లేక ఆ చెట్టును ఎక్కి గూండ్లలోనుండి చిలుకలను ఇతరపక్షులను వెలికితీసి మెడ నులిమి చంపి క్రిందవేయుచుండెను. అతనిని చూచి నేను నాయన రెక్కలలో దాగితిని. ఇంతలో ఆ పాపాత్ముడు మాగూటికివచ్చి నాయనను మెడనులిమి చెట్టు మొదలు దగ్గర వేసెను. నేను నాయన రెక్కలలోనుండి వెలువడి రాలియున్న ఆకులనడుమ దూరితిని. భిల్లుడు చెట్టుదిగి కొన్ని చిలుకలను కాల్చి, తిని, కడమవానిని కొని పల్లికి పోయెను.

నేను ఆరాత్రి ఎట్లోగడపి, తెల్లవారగానే రెక్కలు నేలకు తగులగా ప్రాకుచు, దప్పిగలిగి చెంతనున్న పద్మాకరమునకు పోయితిని. అచట, స్నానముచేసి ఇసుక తిన్నెపై కూర్చొనియున్న మరీచిమహర్షిని కంటిని. ఆయన నన్నుచూచి ఓదార్చి, నానోట నీటిబొట్లు వేసి సేదదేర్చి తన యాశ్రమమునకు కొనిపోయెను అచట కులపతి పులస్త్యుడు నన్నుచూచి నవ్వెను. ఇతరమునులు అడుగగా దివ్యదర్శనుడు పుల స్త్యుడు "శాపమునలన శుకమైన వీనిని చూచి నవ్వితిని. వీనికథను ఆహ్నిక మయినపిదప చెప్పెదను. అదివిని వీడు తన పూర్వజన్మవృత్తాంతమును స్మరించును" అని, ఆహ్నికము తీరగానే ఇట్లు చెప్పనారంభించెను.

### 10. 8. 3. పులస్త్యకథనము (< శుకకథ < కవికథనము)

జ్యోతిష్ప్రభుడు అని రత్నాకరపురమున రాజు ఉండెను. అతనికి గౌరీపతి వరముచేత హర్షవతీదేవియందు ఒకకుమారుడు కలిగెను. ఆమెనోట చంద్రుడు ప్రవే శించినట్లు కలగనినందున రాజు తనయునికి సోమప్రభుడు అని పేరిడెను. ఆకుమారుడు ఎదిగి వయసువాడయ్యెను. రాజు కుమారుని యువరాజు చేసి తనమంత్రి ప్రభాకరుని పుత్రుడగు ప్రియంకరుని అతనికి మంత్రిగా నిచ్చెను. ఆసమయమున ఆకాశమునుండి మాతలి[1] దివ్యాశ్వమును ఒకదానిని తెచ్చి సోమప్రభునితో నిట్లనియెను,

---

1. ఇంద్రసారథి.

"నీవు ఇంద్రుని చెలికాడవు, విద్యాధరుడవు; ఈ లోకమున అవతరించితివి. నీకు ఉచ్చైశ్రవము[1] యొక్క కొడుకు ఆశుశ్రవము అను ఈ హయోత్తమమును ఇంద్రుడు పూర్వస్నేహముచేత పంపినాడు. దీనిని ఎక్కిన నిన్ను శత్రువులు జయింపలేరు".

గుఱ్ఱమును అప్పగించి మాతలి పోయెను. మరునాడు సోమప్రభుడు తండ్రితో, "నాయనా, అనుజ్ఞ ఇమ్ము; దిగ్విజయమునకు పోయెదను" అని అడుగగా తండ్రి సంతోషించి జైత్రయాత్రకు సరంజామము చేసెను.

సోమప్రభుడు బలసమేతుడై తరలి, అశ్వప్రభావముచే రాజులనెల్ల గెలిచి, కృతార్థుడై మరలివచ్చుచు, హిమవత్సమీపమున దండును విడియించి, వేటాడుచుండి, ఒక కిన్నరమును చూచి, పట్టుటకు ఆశుశ్రవమునెక్కి తరుముచుపోగా ఆకిన్నరము ఒక గుహలో దూరి మాయమయ్యెను. అప్పటికి దండునుబాసి బహుదూరము వచ్చెను. ఇంతలో ప్రొద్దు క్రుంకెను. సోమప్రభుడు బడలి నిలిచి, ఒక మహాసరస్సును కని, దానితీరమున గుఱ్ఱముదిగి, దానికి తృణోదకములు ఇచ్చి, తానును ఫలములను తిని, నీరుత్రాగి విశ్రమించెను. ఇంతలో గీతధ్వని వినబడెను. కుతూహలముచే దానిని అనుసరించిపోయి సోమప్రభుడు సమీపముననే శివలింగమునకు ఎదుట పాడుచున్న ఒక విద్యాధరాంగనను చూచెను. ఆ యద్భుతరూప ఎవతెయో అని ఆశ్చర్యపడుచున్న అతనిని చూచి ఆమె అతిథిసత్కారము చేసి. "ఎవరవు నీవు? ఈ దుర్గమభూమికి ఒంటరిగా నెట్లు వచ్చితివి?" అని అడిగెను. అతడు తన వృత్తాంతమును చెప్పి ఆమెను "నీవెవ్వతెవు? ఏల ఇటనున్నావు" అని అడిగెను. అంతట ఆ దివ్యకాంత కంట నీరుపెట్టుకొని ఇట్లు చెప్పసాగెను.—

### 10. ౪. 4. మనోరథప్రభాకథనము (<పులస్త్యక <శుకక <కవిక.)

ఇచట హిమాద్రి నెత్తమున కాంచననాభము అను పట్టణము కలదు. అందు పద్మకూటుడు అని విద్యాధరుడు కలడు. నేను ఆయనకు హేమప్రభాదేవి అను భార్యయందు కలిగిన తనయను, మనోరథప్రభ అనుదానను. ఒకనాడు ఈ సరస్తీరమున విహరించుచుండి నేను వయస్యసమేతుడగు ఒక మునికుమారుని చూచితిని. అతని రూపముచేత ఆకృష్టనై అతనిచెంతకు పోయితిని. అతడు సాభిప్రాయమైన చూపు

1. ఇంద్రుని గుఱ్ఱము.

తోనే నాకు స్వాగతము చెప్పెను. నేను కూర్చుండగా నాసఖి మా యిరువురి యభిప్రాయ మెరిగి, "ఈ మహానుభావుడు ఎవడు?" అని ఆతనిచెలికానిని అడిగెను. అతడు చెప్పెను,

"ఇచటికి సమీపమున దీధితిమంతుడు అను మహాముని బ్రహ్మచారి కలడు. ఒకనాడు ఆయన స్నానార్థము ఈ సరస్సునకు రాగా అప్పుడు 'శ్రీ' అతనిని చూచి, కామించి, మనస్సుచేతనే కలిసి, మానసపుత్రుని కనెను. 'నీవలన కలిగినాడు; నీవే కైకొనుము' అని ఆమె సుతుని దీధితిమంతునికి ఒప్పగించి తిరోధానమయినది. అతడు సంతోషముతో గ్రహించి వానికి రశ్మిమంతుడు అని పేరిడెను. సకలవిద్యలు నేర్పెను. ఆరశ్మిమంతుడే ఇతడు."

ఆ చెలికాడు నా సఖిని నా వృత్తాంతము అడుగగా ఆమెయు నాపేరు, వంశము సకలము చెప్పెను. అత్యంతానురక్తులమై మేము ఉండగా నా రెండవ చెలి మాయింటి నుండి వచ్చి, "మీనాయన నీకొరకు ఎదురుచూచుచున్నాడు" అని చెప్పెను. అంతట నేను రశ్మిమంతునియొద్ద సెలవుపుచ్చుకొని, మరల వచ్చెదను అని అతనిని అచటనే విడిచి మానాయనయొద్దకు పోయితిని.

కొంతతడవులో నాసఖి వచ్చి, "ఆ మునిపుత్రుని సఖుడు వచ్చి ఇట్లు చెప్పుచున్నాడు,

'ఆమెను బాసిన నన్ను (రశ్మిమంతుని) మదనుడు అతి దారుణదశకు తెచ్చినాడు—

అని నన్ను (సఖుని) రశ్మిమంతుడు మనోరథప్రభ యొద్దకు పంపినాడు'—"
అని చెప్పినది.

ఆమాట వినగానే నేను అవయస్యుడే దారిచూపగా సఖితోడుగా ఇచటికివచ్చి, విరహముచేత చంద్రోదయమును భరింపలేక గతాసువయిన మునికుమారుని చూచితిని. వియోగార్తిచేత అతనిదేహముతో అగ్నిప్రవేశము చేయుటకు నిశ్చయించుకొనగా దివ్యపురుషుడు ఒకడు వచ్చి ఆ మృతదేహమును ఎత్తుకొని ఆకసమునకు ఎగిరిపోయెను. అంత నేను నిప్పులో పడబోగా ఆకాశవాణి,

"ఇట్లు చేయకుము. ఈ మునిపుత్రునితో యథాకాలమున నీకు మరల సమాగమము కలుగును." అని పలికెను. నేను మరణయత్నముమాని ఇచ్చటనే బద్ధాశనై శంకరార్చన చేయుచున్నాను. మునిపుత్రుని చెలికాడును ఎచటికోపోయెను—

10, 8. 5. ప్రలప్తైరక్షణము (శకత. ౧ కవిక.)

ఇట్లు మనోరథప్రభ పలుకగా సోమప్రభుడు “నీవు ఏకాకినివై ఉన్నావు. నీచెలి ఎక్కడ ?” అని యడిగెను. ఆవిద్యాధరి మరల చెప్పసాగెను ---

“సింహవిక్రముడు అని విద్యాధరేశ్వరుడు కలడు. అతనికి మకరందిక అను తనయ కలదు. ఆమె నాప్రాణసఖి. నావియోగముచే దుఃఖితయై నావార్త తెలిసికొని వచ్చుటకు నాయొద్దకు తనసఖిని పంపినది. నేను ఆసఖితో నాసఖిని పంపి ఒంటరిగా నున్నాను.”

ఇట్లు ఆమె పలుకుచుండగానే ఆమెచెలియు ఆకాశమునుండి దిగెను. ఆమెను మనోరథప్రభ సోమప్రభునకు ఎరుకపరచెను. ఆమెయు మకరందికాకుశలము చెప్పెను. అందరును నిద్రించిరి.

తెల్లవారగానే మెల్కొని ఆకాశమునుండి దిగుచున్న విద్యాధరుని దేవజయుడు అనువానిని చూచిరి. అతడు మనోరథప్రభకు నమస్కరించి ఇట్లు పలికెను,

“మనోరథప్రభా, సింహవిక్రమరాజు చెప్పుచున్నాడు —

‘నీకు వరుడు నిశ్చితుడుకాక నాకూతురు మకరందిక వివాహమాడదట. కనుక నీవే వచ్చి ఆమెకు వివాహార్థము బోధింపుము’ — అని.”

ఈమాట విని మనోరథప్రభ అచటికి బయలుదేరగా సోమప్రభుడు, “ఓ మహానుభావురాలా, విద్యాధరలోకముచూడ కుతూహలముగా ఉన్నది. నన్ను కొని పొమ్ము” అని అడిగెను. ఆమెయు అంగీకరించి సోమప్రభుని దేవజయునిమొడిలో కూర్చుండబెట్టి ఆకాశమార్గమున అందరతోను మకరందికయొద్దకు పోయెను.

మకరందికయు ఆతిథ్యముచేసి మనోరథప్రభను సోమప్రభునిగురించి అడిగెను. ఆమె చెప్పెను. మకరందికామానసమును సోమప్రభుడు దర్శనమాత్రముననే హరించెను. మనోరథప్రభ మకరందికను, “ఓ చండీ, వివాహమేల ఒల్లవు ?” అని అడిగెను.

“నీవు వరుని అంగీకరింపకయుండగా నేనుమాత్రము ఎట్లు వివాహమాడుదును ?” అని మకరందిక చెప్పెను.

“నేను వరించితిని. సంగమముకొరకు వేచియున్నాను” అని మనోరథప్రభ అనగా,

"అట్లయిన నీమాటప్రకారమే నడచుకొనియెదను" అని మకరందిక పలికెను.

"సఖీ, ఇతడు సోమప్రభుడు నీయతిథి. సత్కారము చేయవలయును" అని మనోరథప్రభ ఆదేశింపగా,

"నాసర్వస్వమును ఈయనకు అర్ఘ్యముగా ఇచ్చితిని. ఇచ్చుటయేని కొనును గాక" అని మకరందిక నుడివెను.

(ఇరువురి మనసులను ఎరిగిన) మనోరథప్రభ మకరందికతండ్రితో మాటలాడి పెండ్లి స్థిరపరచెను.

సోమప్రభుడు మకరందికతో ఇట్లనియెను, "నేను వెంటనే నీయాశ్రమమునకు పోవలెను. ఒకవేళ నామంత్రియు సైన్యమును నన్నువెదకుచు అచ్చటికి వచ్చి యుందురు. పోయి, పిదపవచ్చి, మంచిరోజున మకరందికను వివాహమాడెదను."

అట్లేయని మనోరథప్రభ సోమప్రభుని దేవజయునియొడిలో కూర్చుండబెట్టి తీసికొనిపోయెను. అప్పటికి మంత్రిప్రియంకరుడు దండుతోవచ్చి అక్కడ చేరి యుండెను. ఇంతలో ఒకదూత సోమప్రభుని 'శీఘ్రముగ రమ్ము' అని జాబు తెచ్చెను. దండుతో పోవుచు సోమప్రభుడు మనోరథప్రభతో, "నాయనను చూచి మరల త్వరగానే వచ్చెదను" అనెను.

దేవజయుడు తిరిగిపోయి ఈవృత్తాంతమును మకరందికతో చెప్పెను. ఆమె విరహాతురయై తల్లిదండ్రులు ఎంతచెప్పినను దుఃఖము మానకుండెను. వారియోదార్పు లను ఆమె గ్రహింపకుండగా వారు ఆమెను, "బోయలనడుమ ఈదేహముతోనే నీజన్మము మరచి కొంతకాలము పడియుందువు" అని శపించిరి.

అంతట ఆమె నిషాదకన్యక అయ్యెను. పుత్రికావిరహదుఃఖముచేత తల్లి దండ్రులును మృతినొందిరి, ఆవిద్యాధరేంద్రుడు పూర్వదోషముచేత[1] చిలుక అయినాడు. అట్లే అతనిభార్య అడవిపంది[2] అయ్యెను. ఆచిలుకయే ఈశాస్త్రగంజుడు. వీనికర్మగతి వైచిత్ర్యమునకు నవ్వితివి.

---

1. ఈకథలో ముందు పులస్త్యవచనముగ "శాపమువలన శుకమైన వీనిని" అనియున్నది. ఇచ్చట పూర్వజన్మదోషము పేర్కొనుట సరిపోదు.

2. పాపము ఆతల్లికి ఈగతిపట్టించుట వలన కథకేమి లాభమో?

మరియు ఈకథను రాజసభలో చెప్పి ఇతడు శాపవిముక్తుడు అగును. సోమప్రభుడు నిషాదియైన మకరందికను విద్యాధరజన్మమున పొందును. మనోరథప్రభయు ఇప్పుడు రాజుగ పుట్టియున్న రశ్మిమంతుని పొందును. సోమప్రభుడు ఇప్పుడు ఆశ్రమమునకు పోయి ప్రియను పొందుటకు శివునిగురించి తపస్సు చేయుచున్నాడు.

(పులస్త్యకథనము సమాప్తము)

## 10. 8. 6. శుకకథనము (శుకవికథనము)

ఇట్లు పలికి పులస్త్యుడు విరమించెను. నేనును పూర్వవృత్తాంతము తెలిసి హర్షశోకములచే ఆకులమనస్కుడనైతిని. నాకు రెక్కలు రాగానే జాతిచాపలముచేత అటునిటు తిరుగుచు నిషాదహస్తగతుడనై ఇప్పుడు ఇచ్చటికి చేరితిని. నేటితో నాపాపము తీరినది.

(శుకకథనము సమాప్తము)

## 10. 8. 7. శేషకథనము

ఇంతలో సోమప్రభునికి ఈశ్వరుడు కలలో కనపడి ఇట్లు ఆనతిచ్చెను, "రాజా, లెమ్ము సుమనోరాజుకడకు పొమ్ము. అట నీప్రాణప్రియను కూడెదవు."

ఈశ్వరుడు మనోరథప్రభనుకూడ ఇట్లు ఉద్బోధించెను, "పుత్రీ, నీవుకోరిన వరుడు ఇప్పుడు సుమనసుడు అనుపేర రాజుగా జన్మించియున్నాడు. నీవు పోయి అతనిని కూడుము. నిన్ను చూడగనే అతడు పూర్వజన్మమును స్మరించును."

అంత మనోరథప్రభ, సోమప్రభుడును సుమనసునిచెంతకు పోయిరి. ముక్తాలతకు సోమప్రభుని చూడగానే శాపము పోయెను. సుమనసుడు దేహమును వదలి అప్పుడే ఆకాశమునుండి వచ్చిన పూర్వదేహమును ప్రవేశించి రశ్మిమంతుడుగ స్వకాంతతో తనయాశ్రమమునకుపోయెను. సోమప్రభుడు ప్రియాసమేతుడై తన నగరమునకు పోయెను. చిలుకయు మోక్షము పొందెను.

(కథ సమాప్తము)

10. 9. బాణుని కాదంబరీకథ పైరెండు కథలను చాలవరకు పోలియున్నను అందు పెక్కు మార్పులును కలవు. ముఖ్యముగా ఉత్తరకాదంబరిలో (భూషణపూరణములో) ఎక్కువ భేదము కలదు. కాని అది బాణునిది కాదు, కావున అప్రస్తుతము. ఇచ్చట బాణునిభాగమువరకే పరిశీలింపదగును.

అన్నిట మొదట తోచునది పేర్లమార్పులు. సోమదేవక్షేమేంద్రుల కథలలో పేర్లు కొన్నితప్ప ఒక్కటిగనే ఉన్నవి. బాణునికథలో పేర్లన్నియు వేరు. క్రింది పట్టిక పేర్లభేదములను చూపును.

| బాణుని కాదంబరి | సోమదేవుని కథా సరిత్సాగరము | క్షేమేంద్రుని బృహత్కథామంజరి |
|---|---|---|
| 1. విదిశాపురి | కాంచనపురి | కాంచనపురి |
| 2. శూద్రకుడు | సుమనసుడు | సుమానసుడు |
| 3. పేరులేని శబరకన్యక | ముక్తాలత | ముక్తాలత |
| 4. వైశంపాయనుడు (చిలుక) | శాస్త్రగంజుడు | పేరులేనిచిలుక |
| 5. వింధ్యాటవిలో శాల్మలీ వృక్షము | హిమవంతములో రోహిణీవృక్షము | హేమవతి అను అడవిలో రోహితవృక్షము |
| 6. హారీతుడు(జాబాలిపుత్రుడు) | మరీచి అను ముని | మరీచి అను ముని |
| 7. జాబాలి (కులపతి) | పులస్త్యుడు | పులస్త్యుడు |
| 8. ఉజ్జయిని | రత్నాకరపురము | రత్నాకరపురము |
| 9. తారాపీడుడు | జ్యోతిష్ప్రభుడు | జ్యోతిష్ప్రభుడు |
| 10. విలాసవతి (తారాపీడసతి) | హర్షవతి (జ్యోతిష్ప్రభసతి) | పేరులేదు |
| 11. చంద్రాపీడుడు (కథానాయకుడు) | సోమప్రభుడు | సోమప్రభుడు |
| 12. శుకనాసుడు (తారాపీడమంత్రి) | ప్రభాకరుడు | పేరులేదు |
| 13. వైశంపాయనుడు (శుకనాసపుత్రుడు) | ప్రియంకరుడు | ప్రియంకరుడు |
| 14. ఇంద్రాయుధము (అశ్వము) | ఆశుశ్రవము | పేరులేదు |
| 15. హేమకూటపర్వతము | హిమాద్రిలో కాంచననాభము | కాంచననాభము |
| 16. హంసుడు (మహాశ్వేత తండ్రి) | పద్మకూటుడు | పద్మకూటుడు |

| | | |
|---|---|---|
| 17. గౌరి (హంసపతి) | హేమప్రభ | రత్నప్రభ |
| 18. మహాశ్వేత | మనోరథప్రభ | మనోరథప్రభ |
| 19. తరలిక (మహాశ్వేతసఖి), మరియు ఒక ఛత్రగ్రాహిణి | పేరులేనిసఖులు | పద్మలేఖ, శశిలేఖ |
| 20. శ్వేతకేతువు (ముని) | దీధితిమంతుడు | దీధితిమంతుడు |
| 21. పుండరీకుడు (శ్వేతకేతు పుత్రుడు) | రశ్మిమంతుడు | రశ్మిమంతుడు |
| 22. కపింజలుడు (పుండరీక మిత్రుడు) | పేరులేని మునికుమారుడు | ముఫదత్తుడు |
| 23. లక్ష్మి (దేవత) | శ్రీ | సరోలక్ష్మి |
| 24. చిత్రరథుడు (కథానాయిక తండ్రి) | సింహవిక్రముడు | సింహవిక్రముడు |
| 25. మదిర (చిత్రరథపతి) | పేరులేదు | పేరులేదు |
| 26. కాదంబరి (కథానాయిక) | మకరందిక | మకరందిక |
| 27. కేయూరకుడు (కాదంబరికి వీణావాహకుడు) | దేవజయుడు | దేవజయుడు |
| 28. పత్రలేఖ (చంద్రాపీడుని తాంబూలకరంకవాహిని) | అట్టిపాత్రలేదు | లేదు |
| 29. మదలేఖ (కాదంబరికి సఖి) | ,, | ,, |

10. 10. సోమదేవుని కథయు క్షేమేంద్రుని కథయు ఒకేమూలకథకు అనువాదములుకావున ఒకేవిధముగ ఉన్నవి.

కాని, మహాలక్ష్మికి మునిమీద కామముకలుగుట శైవులగు బాణసోమదేవులకు అనౌచిత్యము కాకపోగా క్షేమేంద్రుడుమాత్రము[1] 'లక్ష్మి' లేక 'శ్రీ' అనుచోటుల 'సరోలక్ష్మి' అని ఎవరో జలదేవతను చెప్పి మంగళదేవతకు అమంగళము తప్పించినాడు.

1. 'ఔచిత్యవిచారచర్చ' రచించిన కవి ఆమాత్రము ఔచిత్యపోషణ చేయుట న్యాయమే.

10. 11. బాణుడు కాదంబరిలో వాడిన ముఖ్యపాత్రల పేర్లకు సోమదేవక్షేమేంద్రులు వాడిన పేర్లకును కొంత అర్థసంబంధము కలదనుట గుర్తింపవలెను. కొన్ని పేర్లను ఇట్లు సమన్వయము చేయదగును.

| కాదంబరిలో | సోమదేవునికథలో | సంబంధము |
|---|---|---|
| తారాపీడుడు | జ్యోతిష్ప్రభుడు | నక్షత్రసంబంధము |
| విలాసవతి | హర్షవతి | విలాసము = ప్రియదర్శనముచే 'కలుగు ఆనందము' నకు వ్యక్తరూపమగు శృంగారచేష్ట. ఆనందసంబంధము |
| చంద్రాపీడుడు | సోమప్రభుడు | చంద్రసంబంధము |
| గౌరి (తెల్లనిది) | హేమప్రభ | వెలుగు సంబంధము (చూ. క్షేమేంద్రుని రత్నప్రభ) |
| శ్వేతకేతువు | దీధితిమంతుడు | ,, |
| పుండరీకుడు (తెల్లనివాడు) | రశ్మిమంతుడు | ,, |
| కాదంబరి | మకరందిక | కాదంబరి=ఒకమధువు (కల్లు). మకరందము=మధువు (తేనె). మధుసంబంధము |
| హేమకూటము | కాంచననాభము | స్వర్ణసంబంధము |

మహాశ్వేత మనోరథప్రభలకు నామసామ్యములేదు. ఈ అర్థసంబంధము చూడగా ఒకరిని మరియొకరు అనుకరించిరనుట స్పష్టము. కాని ఎవరు ఎవరిని ?

10. 12. సోమదేవ క్షేమేంద్రులకథలను కాదంబరితో పోల్చిన అవి అల్పములుగా, నిష్కారణమైన పరివర్తనములు కలవిగ, అసంపూర్ణములుగను కనపడును. కథాసామ్యమువలన బాణుడును గుణాఢ్యునిమూలమునే గ్రహించి విస్తరించెననుట సాధువాదము. అటులైనను కాదంబరీకావ్యవైభవమంతయు బాణప్రతిభోత్పన్నమే. కథాకంకాళావశేషశల్యమునంటి మూలమును తీసికొని, శల్యసౌష్ఠవము సమకూర్చి,

వర్ణనలు అను మాంసాదులను చేర్చి, రసము అను రుధిరమును నింపి తనప్రతిభ చేత కావ్యచైతన్యమును కలిగించి కమనీయకావ్యకన్యకారూపమునిచ్చి ఉత్కృష్టమైన గద్యశయ్యలో ఉంచి సహృదయపాఠకునికి ప్రసాదించిన కీర్తి బాణునిది.

10. 13. భారతీయసంప్రదాయమున ఒకజీవికి అనేకజన్మలు ఉండుట, కొందరకు శాపములవలన కొంతకాలము వేరు రూపాదులు కలుగుట, శాపావసానమున మరల తొలిరూపు ఏర్పడుట ఇత్యాది నమ్మకములు ప్రజలలో పాతుకొనియుండుటచేత కాదంబరిలోని జన్మలపరంపరలు నవ్యముగనే తోచును. ఈకథ జానపదసంప్రదాయమున వచ్చును.[1] ఈపాత్రల జన్మలవిషయమున కాదంబరీకథకును సోమదేవక్షేమేంద్రుల కథకును భేదమున్నది. ఈచర్చలో కాదంబర్యుత్తరార్ధమునుకూడ అనుసంధింప వలయును.

కాదంబరిలో మొత్తము మూడుతరముల కథ కలదు. కాని ఇందు కొందరివి మాత్రము ఒకేతరము. పాత్రలు మొదట విద్యాధరగంధర్వాది దేవయోనులే కనుక వారికి ముదిమి లేదు. నాయకులు రెండు అధికజన్మలు అనుభవించివచ్చువరకు నాయికలు నిత్యయౌవనలుకావున వేచియుందురు. వారి జన్మసంబంధములను ఇట్లు ప్రస్తరింపవచ్చును.

(క) కాదంబరిలో

| కథముందు | మొదటిమార్పు | రెండవమార్పు | కథాంతమున |
|---|---|---|---|
| 1. కాదంబరి (నాయిక) | లేదు | లేదు | కాదంబరి |
| 2. చంద్రుడు (నాయకుడు) | చంద్రాపీడుడు | శూద్రకుడు | చంద్రాపీడుడు |
| 3. రోహిణి (తార) | పత్రలేఖ | రోహిణి (కథలోలేదు) | రోహిణి (కథలోలేదు) |
| 4. మహాశ్వేత (ఉపనాయిక) | లేదు | లేదు | మహాశ్వేత |

1. చూ. 'Use of folk-tale motifs in the Kadambari' 'Banabhatta' by Mrs. Neetha Sarma, Ch. III, B, 4.

| | | | |
|---|---|---|---|
| 5. పుండరీకుడు (ఉపనాయకుడు) | వైశంపాయనుడు | చిలుక | పుండరీకుడు |
| 6. కపింజలుడు (పుండరీకుని వయస్యుడు) | అశ్వము (ఇంద్రాయుధము) | కపింజలుడు | కపింజలుడు |
| 7. లక్ష్మి (పుండరీకుని తల్లి) | లేదు | చండాలకన్య | లక్ష్మి |

(గ) సోమదేవుని కథాసరిత్సాగరములో (బృహత్కథామంజరిలోను అట్లే)

| కథాప్రారంభమున | మార్పు | కథాంతమున |
|---|---|---|
| మకరందిక (=కాదంబరి, నాయిక) | నిషాదకన్య | మకరందిక |
| సోమప్రభుడు (=చంద్రాపీడుడు, నాయకుడు) | లేదు | సోమప్రభుడు |
| సింహవిక్రముడు (=చిత్రరథుడు, కథానాయిక తండ్రి) | చిలుక | మోక్షము (?) |
| మకరందిక తల్లి | అడవిపంది | ? |
| మనోరథప్రభ (=మహాశ్వేత, ఉపనాయిక) | లేదు | మనోరథప్రభ |
| రశ్మిమంతుడు (=పుండరీకుడు, ఉపనాయకుడు) | సుమనసుడు | రశ్మిమంతుడు |

10. 14. పైయనుక్రమణికలనుండి కథకు సౌష్ఠవము కలిగించుటకు బాణుడుచేసిన మార్పులను ఇట్లు గణింపవచ్చును —

1. ఇరువురునాయికలకును జన్మలమార్పులు లేకుండుట.
2. ఇరువురునాయకులకును క్రమముగా రెండుజన్మలు కలిగించి తుదకు పూర్వస్థితికి తెచ్చుట.
3. కథానాయిక తలిదండ్రులకు క్షుద్రజన్మలు ప్రసాదింపకుండుట.

చిలుకజన్మము ఉపనాయకునికి కలిగించుట.

5. లక్ష్మినే చండాలకన్యగా చేయుట.

6. పుండరీకుని మిత్రుడైన కపింజలునికి కథలో ప్రాముఖ్యమునిచ్చి అతనినే ఇంద్రాయుధరూపముగ చంద్రాపీడునికి అశ్వముగ చేర్చుట.

ఇట్టిమార్పులకన్న ముఖ్యమైనది కథలోని పరివర్తనములకు మంచిహేతువులు కల్పించుట, సోమదేవక్షేమేంద్రులకథలలో అనేకసంఘటనలకు, ఇట్టిమార్పులకును సరియైన కారణములు లేవు. బాణుడు ఒక్కొక్క పరివర్తనమునకు ఒకశాపమో, లేక వాస్తవిక సంఘటనమో, స్వాభావిక వర్తనమో కారణముగ కల్పించి కథలోని అంశములకు క్రమమైన కార్యకారణసంబంధము నేర్పరచినాడు. ఇది బాణుని కథాసంవిధానవైశిష్ట్యము.[1]

## 10. 15, కాదంబరీ కథాప్రకారము

(క) కథకుడు (కవి) ఒకకథను మొదలుపెట్టి చెప్పుచుండగా ఆకథలో ఒకపాత్ర మరియొక కథనో వృత్తాంతమునో చెప్పసాగుట, అందులో మరియొకకథ, ఇట్లు కథలను ఒకదానిలోనొకదానిని ఇమిడ్చి తుదకు వరుసగా అన్నిటిని ఉపసంహరించుచు పోవుట ఒకప్రత్యేకమయిన భారతీయరచనావిశేషము. ఇది పంచతంత్రమునను కథాసరిత్సాగరమునను విలక్షణముగ కనపడును.

“కాదంబరి”లో కథను కవి తన వాక్యములలోనే చెప్పక అచ్చటచ్చట వేర్వేరుపాత్రలచే చెప్పించును.[2] ఆ పాత్రల వాఙ్మూలముల సంచయమే కథ యగును. కాని కాదంబరిలో పంచతంత్రాదులందువలె దృష్టాంతమాత్ర సంబంధముగల ఇతర

---

1. కాని ఈచాతురి భూషణుని భాగమువలననే తెలియుచున్నది. భూషణుడు పూర్తికథను సూక్ష్మరూపమున తండ్రినోటనే వినియుండవచ్చును. లేక వ్రాసియుంచిన కథాపథకమును (Plot) చూచియుండవచ్చును. అట్లుకాక ఉత్తరార్ధము పూర్తిగ స్వోపజ్ఞతో కల్పించుట రమారమి ఎవరికైనను అసాధ్యము. కథవరకు పూర్తి కాదంబరిని బాణకృతముగనే గ్రహించుట న్యాయము.

2. స్ఫుటముగా తోచుటకు ఈ కథనప్రకారము ‘ప్లాను’ రూపమున ఎదుటిపుటలో చూపబడియున్నది.

కథలు అవాంతరకథలుగ లేవు. కాదంబరీ కథన ప్రకారము చాలవరకు సోమదేవ క్షేమేంద్రుల కథలను పోలుటచేత ఆవైనమును బాణుడు గుణాఢ్యుని మూలకథ నుండియే గ్రహించియుండుననుట విస్సంశయము. అన్నిటను ముఖ్యాంశము శుక కథనమగుట[1] గుర్తింపవలెను.

(గ) కథనక్రమమునకాక కథను కథాకాలక్రమమున విడదీసి క్రిందివిధముగా చూప వచ్చును

<u>ప్రథమదశ :</u> మహాశ్వేతాపుండరీకుల కథ, పుండరీకమరణ పర్యంతము. పుండరీక చంద్రుల పరస్పరశాపములు తరువాతికథకు బీజములు. కపింజలుని సిద్ధుడు శపించుటయు పిదప ఉపకరించును

<u>ద్వితీయదశ :</u> కాదంబరీ చంద్రాపీడుల కథ. చంద్రాపీడ మరణ పర్యంతము, పత్రలేఖ యంతర్ధానము, ఇంద్రాయుధము కపింజలుడై పూర్వ వృత్తాంతము చెప్పుట.

<u>తృతీయదశ :</u> వైశంపాయనుడు చిలుకయగుట, చంద్రాపీడుడు శూద్రకు డగుట, శాపావసానములు, అందరును మరల ద్వితీయదశలోవలె మారి సుఖించుట.

## 10. 16. వైశంపాయనశుకము - దానివయస్సు[2]

భూషణుని పూరణముప్రకారము వైశంపాయనుడు, మహాశ్వేత శపింపగా, శుకయోనియందు జన్మించిన తరువాత కొద్దికాలములోనే చంద్రాపీడుడు మరణించును.

---

1. చిలుక కథ చెప్పుట భారతీయ ప్రాచీన సాహిత్యమున తరచు కనపడును. శుకసప్తతికథలును అట్టి ఒక సహృదయులైన వైష్ణవులు, గొప్ప సంస్కృత పండితులు ఈ శుకకథన సంప్రదాయము శ్రీమద్భాగవతములో శుకకథనము (శుక మహర్షి చెప్పుట)ను అపహాస్యము చేయుటకై 'శుకః' అను పదముమీది శ్లేష వలన చిలుక పలుకులుగ శైవులు చేసిన ప్రక్రియ అని ఈవ్యాసకర్తకు చెప్పిరి. గుణాఢ్యుడును శైవుడే అగుటవలన ఈ వాదము దుర్భేద్యమనుట సులభముకాదు.

2. ఈ విషయముమీదికి నాదృష్టిని మరల్చినవారు శ్రీ వట్టిపల్లి మల్లినాథ శర్మగారు.

# కాదంబరి

**బాణుని కథనము**

ప్రారంభము
శూద్రకునిమొద్ద
కు చండాలకన్య
వైశంపాయనశు
కమును తేగా ఆ
ది రాజునకుల
న పూర్వకథను
(జాబాలి చెప్పినది)
చెప్పుటకుమొ
దలుపెట్టు వరకు

**వైశంపాయనశుకకథనము**

ప్రారంభము
చిలుక పుట్టుట
మొదలు జాబాలి
యాశ్రమము చేరు
ట, అచ్చట జా
బాలి చిలుకపూ
ర్వకథను చెప్ప
నుపక్రమించు
వరకు →

**జాబాలికథనము**

ప్రారంభము
తారాపీడుని ఉదయ
[illegible]
చంద్రాపీడ జననము, విద్యా
భ్యాసము, దిగ్విజ
యము, మహాశ్వే
తను సంధించుట
తన కథను
చెప్పనుపక్రమిం
చుట →

**మహాశ్వేతకథ**

మహాశ్వేతాపుండరీకు
ల ప్రేమ కథ, అతని మ
రణము, [illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible] →

ప్రారంభము
→ చంద్రాపీడకా
దంబరుల సమాగమ
ము, ప్రేమ, అతడు
తిరిగి పోవుట, పత్ర
లేఖ వచ్చి కాదంబరి
విరహమును వర్ణిం
చుట (కొంత)
ఇచ్చట బాణుని
రచన ఆగినది.

కాదంబరీ విరహము, వైశంపాయనుని మతి చెడుట, మహాశ్వేత శాపము, అతని మరణము, చంద్రాపీడుని అనుమరణము, పత్రలేఖ, ఇంద్రాయుధము సరస్సున మునుగుట, కపింజలుని ఆగమనము, అతని కథ.

ఇది భూషణుని పూరింపు

**జాబాలికథనము**

అంతము
జాబాలియాశ్ర
మమునుండి శు
కము ఎగిరిపో
యి బోయకుచి
క్కి చాండాలక
వశమై శూద్ర
కాస్థానముచే
రుట వరకు →

**వైశంపాయనశుకకథనము**

**భూషణుని కథనము**

అంతము
శాపవిమోచన
ము, ప్రేయసీ
ప్రియుల సమా
గమము, మం
గళాంతము -
పత్రలేఖ అంత
మయిన వైనము

**బాణుని కథనము**

**భూషణుని కథనము**

అతడు శూద్రకుడుగా పుట్టి, పెరిగి, వివాహితుడై చక్రవర్తిగ ఉన్నపుడు వైశంపాయన శుకమును శబరకన్యక అతనికి కానుక పెట్టును. అప్పటికి శూద్రకునకు ఎంతలేదన్నను ఇరువదియేండ్లైన[1] నుండును.

వైశంపాయనుడు చిలుకగపుట్టి, ఇరుసులబడి, హారీతునియాశ్రమమున రెక్కలువచ్చువరకు నుండుటచేత పక్షిజాతిసామాన్యముగ కొన్ని నెలలుమాత్రము గడచియుండును. అచ్చటి నుండి పోయి, బోయలకు చిక్కి, చాండాలిక యింట కొంతకాల ముండెను. అది యెంతకాలమో తెలియదు. నెలలో, సంవత్సరములో? 'తరుణతామాపన్నే మయి (యౌవనము నాకురాగా)' అనుటచేత చిలుకకు బాల్యము దాటి యౌవనము వచ్చుట ఎంతకాలమో అంతవరకు అచ్చట నుండెనని అనుమానింప దగును. చిలుకకు బాల్యము, యౌవనము ఎంతెంత అని కచ్చితముగ చెప్పలేము, కాని చిన్నపక్షులన్నియు ఆరు నెలలలోపుననే పూర్తిగ దశాపరిణామము పొందుననుట అందరకును తెలిసినదే.

వైశంపాయనశుకమునకు ఆజన్మలో ఒక సంవత్సరమైన నిండకమునుపే దానికి తరువాత పుట్టిన (మరణము వెనుక కావున పుట్టుకయు వెనుక కావచ్చును) శూద్రకునకు ఇరువదియేండ్లు ఎట్లగును? ఇచ్చట కవియొక్క కాలమానము విచార్యము.

## 10. 17. ఇంద్రాయుధము - దానివయస్సు

కపింజలుడు, ఇంద్రాయుధమను అశ్వముగ మారుట పుండరీక మరణము వెనువెంటనే జరిగినది. అతడు సముద్రమున పడి పూర్తిగ పెరిగిన గుఱ్ఱముగనే ఉద్భ వించినట్లు కథలో తోచును. అప్పటికి అశ్వదశాపరిణామక్రమము ప్రకారము దానికి సుమారు మూడు లేక నాలుగు వత్సరములు ఉండదగును. ఆదరిదాపులలోనే పుండరీ కుడు వైశంపాయనుడుగను, చంద్రుడు చంద్రాపీడుడుగను పుట్టిరి. చంద్రాపీడుడు బాల్యము గడచి విద్యాభ్యాసము పూర్తిచేయు కాలమునకు అతనికి కనీసము పదునెని మిది వత్సరము లుండును. అప్పటికి ఇంద్రాయుధము ఇరువదిరెండేండ్లది అగును. గుఱ్ఱము అంతకాలము జీవించును కాని ఆనాటికి ముదిమిముదిరి, అశక్తమయి, కళ్లు

1. హర్షవర్ధనుడు చక్రవర్తిగ నిలుచునప్పటికి అతనివయస్సు అంతే.

గానక, కీళ్లపట్టుకొనిపోయి తానే నిలువబడలేని స్థితిలో నుండును. మహోజ్జ్వలమును మహాజవమును అగు ఇంద్రాయుధముగ నుండదు.

ఇంద్రాయుధము దివ్యాశ్వము, కనుక నిత్యయౌవనము. మహాశ్వేతా కాదంబరులవలె అదియు నుండెనని సరిపెట్టుకొనదగును.[1]

## 10, 18. కాదంబరిలో శాపములు

భారతీయ పురాణేతిహాస కావ్యాదులందు, జానపద కథలందును శాపములు, జన్మాంతరములు సాధారణాంశములు. భారతీయ పాఠకునికి ఇవి విశేషముగ తోపవు. కాని కాదంబరీకథలోని శాపములలో కొంతవిశేషము కలదు.

శాపములు రెండు విధములు, అనివర్తనీయములు, నివర్తనీయములు అని.

(క) అనివర్తనీయములు శప్తునికి తిరుగులేని దశ మార్పు కల్గించును. దశరథునికి మునిశాపము అట్టిది. అట్లే పాండురాజునకు. భీష్ముని పరాజయమును అట్లే.

(గ) నివర్తనీయములు శప్తునికి కొంతకాలము వేరురూపమో దశయో కల్గించి మరల పూర్వస్థితిని ఇచ్చునవి. వీనికొక పద్ధతియున్నది. ఒక దివ్యుడో, మునియో లేక పతివ్రతయో శాపమీయగా శప్తుడు, లేక అతని పక్షమున మరియొకరు శాపకుని కాళ్లమీదబడి వేడుకొనును. శాపకుడు కరుణించి 'ఫలాని దినము ఫలాని విధముగ నీవు మరల ఇప్పటి స్థితిని పొందెదవు' అని శాపావసానమును అనుగ్రహించును.

(చ) కాదంబరీ కథాసంవిధానమున నాలుగు శాపములు కలవు. ఇవి బాణుడు మొదలుపెట్టిన కథలోని వ్యక్తులను, సంఘటనలను, సహేతుకముగ కథలో బిగించుటకు ఉపయోగించును.

శూద్రకుడు ఎవడు ? చిలుక ఎవరు ? ఇంద్రాయుధము ఏల ? వైశంపాయనుడు ఎవడు ? అను నాలుగు ప్రశ్నలకు సమాధానములు నాలుగు శాపముల మూలమున కాదంబరీకథలో విశదమగును. ఈ శాప వృత్తాంతములన్నియు భూషణుని యనుబంధములోనివి.

---

1. చిలుక వయస్సు, ఇంద్రాయుధపు వయస్సు, వీనిని హేత్వంతరముల చేత సమర్థించుటకు వీలున్న పండితులు విచారింతురు గాక.

మొదటి శాపము — పుండరీకుడు చంద్రుని శపించుట - దీనివలన చంద్రాపీడ శూద్రకులు సంభవింతురు. చంద్రాపీడుడు కథానాయకుడు కావున ఈశాపము కాదంబరీ కథకు ఉత్పాదకము.

రెండవ శాపము — పుండరీకునికి చంద్రుని ప్రతిశాపము - దీనివలన వైశంపాయనుని జన్మ.

మూడవ శాపము — సిద్ధుడు కపింజలుని శపించుట - ఇందువలన ఇంద్రాయుధ సంభవము.

నాలుగవ శాపము — మహాశ్వేత వైశంపాయనుని శపించుట. ఇందువలన వైశంపాయనుడు చిలుక అగుట.

వీనిలో మూడవదియగు సిద్ధశాపము నివర్తనీయము, నివర్తితమును. సిద్ధుడు కపింజలుని అశ్వమగుమని శపింపగా కపింజలుడు సిద్ధుని వేడుకొనును. సిద్ధుడు అనుగ్రహించి అశ్వజన్మమున పూర్వజన్మజ్ఞాన ముండుననియు మరియు చంద్రాపీడ మరణానంతరము నీట మునుగగా కపింజలుడవగుదువనియు అనెను. ఇది పూర్తిగా భారతీయులకు సుపరిచితమగు శాపవ్యవస్థ.

పుండరీక శాపమునకుగాని చంద్రుని శాపమునకుగాని అవసానము లడుగుటగాని చెప్పుటగాని లేదు. కావున ఇవి అనివర్తనీయములు కావలెను. అటులైన చంద్రుడు చంద్రాపీడ శూద్రక జన్మలేకాక పలుజన్మలలో విరహముచేత మరణించుచు అట్లే యుండవలెను. చంద్రశాపమువలన పుండరీకుడును చంద్రునితో నిరంతర జన్మ మరణ సంతతిలో చిక్కుకొనును. ఈ యనివర్తిత శాపములకును, మహాశ్వేత వైశంపాయనుని శపించుటకును కొంత విరోధము కలదు.

మహాశ్వేత వైశంపాయనుని చిలుకయగునట్లు శపించినది. ఇదియు అనివర్తనీయము. ఈ శాపము చంద్రాపీడుడు పుండరీకున కిచ్చిన శాపమునకు గతి మార్చును. చిలుక జన్మలో విరహమున చచ్చుట ఎట్లు? రెండు శాపములను సమన్వయము, చేసిన వైశంపాయనుడు ఎప్పుడును చిలుకగనే పుట్టుచు శుకీవిరహమున మరణించుచునుండవలె నని తేలును.

ఈ పరిస్థితిలో గత్యంతరములేక శ్వేతకేతువు, లక్ష్మియు యజ్ఞములు, ప్రయోగములు చేసి ఈ శాపములను సాంతములుగ మార్చి, రెండు జన్మలలోనే చంద్ర పుండరీకులను రక్షించుటవలన, కాదంబరీకథకు ముగింపు ఏర్పడినది. శ్వేతకేతువు యొక్క ప్రయోగము జిల్లాకోర్టు వేసిన శిక్షను హైకోర్టు రద్దుచేసిన ట్లున్నది.[1]

కథను 'కడతేర్చిన' పుణ్యము భూషణునిది.



1. ఇది బాణుని యూహయే అనియు భూషణుడు కల్పించినది కాదనియు చెప్పుటకు బాణుని 'హర్షచరితము'లోని యొక శాపముకు ఉల్లేఖింపవచ్చును. అందు దూర్వాసుడు సరస్వతికి ఇచ్చిన శాపమునకు అవసానము చెప్పలేదు. అది అనివర్తనీయము. అయినను బ్రహ్మ, పుత్రముఖదర్శనముతో శాపము ముగియుననే, అవధిని నిర్ణయించి దూర్వాసుని శాపమును మార్చును.

# 11. కాదంబరీ భాషా విశేషములు

11. 1. సంస్కృత గద్యరీతులు బాణునికన్న కొన్ని శతాబ్దముల పూర్వమే ఏర్పడి నను, సుబంధువు తన 'వాసవదత్త'లో బాణుని వాక్య విన్యాసములనన్నిటిని చూపించి బాణ సమానమయిన వక్రోక్తి నైపుణ్యము ప్రదర్శించినను, సంస్కృత గద్యవాఙ్మయమున బాణునిభాషను, ముఖ్యముగ కాదంబరీభాషను, అత్యుత్తమ లక్ష్యముగ లాక్షణికులు గుర్తించియున్నారు. బాణుని సంస్కృత వచనము కాదంబరిలో వివిధ కారకములతో, అలంకార వైభవముతో, వర్ణనాతిశయముతో, విషయ బాహుళ్య ముతో, బహుపాత్ర వైవిధ్యముతో, రసభరితమై సంస్కృత వాఙ్మయమున విశిష్ట స్థానమును ఆక్రమించినది. గద్యరచనలోని గణనార్హాంశములు అన్నియు అందు పరిపక్వములై, సర్వగుణసమన్వితములై, ప్రాయికముగ దోషరహితములై సహృ దయ పరితోషకములుగ నున్నవి. బాణగద్యప్రతిభ బాణకావ్యములు చదివిననేకాని బోధపడదు. అయినను అతని మెరుగులు, విశేషములు ఇంచుక పరిశీలింపదగును.

11. 2. గద్యకావ్యము ఎట్లుండవలెను? అను ప్రశ్నకు సమాధానము బాణుడే హర్షచరితారంభమున చెప్పియున్నాడు,

"క్రొత్తవస్తువు, రమ్యమైన స్వభావోక్తి (లేక శిష్టరీతి), సులభమగు శ్లేష, సుబోధమగు రసము, చక్కని యక్షరబంధము మున్నగు గుణములన్నియు ఒక్క కావ్యములోనే వలయునన్న దుష్కరము[1]".

---

1. నవోఽర్థో, జాతిరగ్రామ్యా, శ్లేషోఽక్లిష్టః, స్ఫుటోరసః।
వికటాక్షరబంధశ్చ, కృత్స్నమేకత్ర దుష్కరమ్॥

(హ. చ. 8వ పద్యము)

ఇందు 'జాతిరగ్రామ్యా' అను దానిని సాంప్రదాయిక వ్యాఖ్యాతలు 'అలంకారికమయిన స్వభావోక్తి' యని అర్థముచేయగా E. B. Cowell & F. W. Thomas అను ఆంగ్లపండితులు హర్షచరితాంగ్లానువాదమున రీతిపరముగ 'a diction not homely (= అనాగరికాని రీతి అనగా రమ్యమైనరీతి)' అని వ్రాసియున్నారు.

మరియు,

కాదంబరీపీఠికాపద్యములలో మంచికథాకావ్యమును నవవధువుతో శ్లేషించుచు ఆసందర్భమున ఉత్తమకథాకావ్యగుణములుగ రసము, శయ్య, దీపకాద్యలంకారములు, నవకథావస్తువు, నిరంతర శ్లేష, జాతి (స్వభావోక్తి) అను వానిని పేర్కొనియున్నాడు.[1]

ఈ దుష్కరమైన ఆదర్శవచనకావ్యమును సాధించిన బాణుని సంస్కృత భాషా వైదుష్యము అనన్యసామాన్యము.

## 11. 3. బాణుని భాషావైదుష్యము

బాణుడు మహాపండితుడు. వేదవేదాంగములు, పురాణేతిహాసములు, వ్యాకరణాదిశాస్త్రములు అతనికి కొట్టినపిండి. వానియనుసంధానములు (allusions) బాణకావ్యములలో ఎచ్చట చూచినను కనబడుచునేయుండును. ముఖ్యముగా వ్యాకరణమున బాణుడు దిట్ట. బాణుని సంస్కృతభాష నిర్దోషము. కాదంబరిలో ఏమరుపాటున దొరలినవి లేక లేఖకులవలన ప్రాప్తించినవి రెండుమూడు దొసగులు తప్ప భాష చాల ప్రామాణికము, పాణినీయమును.

11. 3. 1. ఆస్వాద్యరసపాత్రమున తేలెడు రెండుమూడు నలుసులవలెనుండు దోషములను తీసివేసి తరువాత తదాస్వాదనమునకు కడంగుట సముచితము. అవి—

(క) 'అనుకరోతి భగవతో నారాయణస్య.'[2]

ఇచట 'అనుకరోతిస్మ' అని భూతకాలక్రియ యుండవలెను. దీనిని ఆలంకారికుడు వామనుడు గుర్తించి లేఖకప్రమాదమని తీర్మానించెను. అన్నివ్రాతప్రతులలోను ఒకేవిధముగ ఉండుటవలన అచ్చుప్రతులలో ఈదోషము అట్లే నిలిచినది.

(గ) 'ఆజన్మనః ప్రభృతి.'[3]

ఇచట 'ఆజన్మనః' అనియో 'జన్మనః ప్రభృతి' అనియో ఉండవలెను. వేగముగ వ్రాయునపుడు పండితులకును సంభవింపదగిన పొరపాటు.

---

1. చూ. కాదంబరీ పీఠిక పద్యములు 8, 9., ఈ వ్యాసములో 4. 14.

2. చూ. కాదంబరి. కాలే ప్రతి, పుట. 11; వావిళ్ల ప్రతి పుట. 8. మరియు ఈ వ్యాసమున 2. 3. 5.

3. చూ. కాదంబరి, కాలే ప్రతి, పుట. 264; వావిళ్ల ప్రతి పుట. 167.

(చ) 'పింజరిమ్ణా.'

ఇది 'పింజరిమన్' అను ప్రాతిపదికనుండి ఏర్పడినది. పింగళిమన్, ప్రథిమన్ ఇత్యాది పదముల సాహచర్యదోషమున ఏర్పడినది. పింగలిమన్ (<-పింగల) మొదలగు పదములు 'పృథ్వాదిభ్య ఇమనిజ్వా' (పాణిని 5-1-122) ప్రకారము '— ఇమన్' అను ప్రత్యయమును పొందును. కాని 'పింజర' అను వర్ణార్థకవిశేషణము పాణిని సంప్రదాయములోని పృథ్వాదిగణములో లేదు. కావున పాణినీయమతమున ఇది అసాధువు.

కాని ఇట్టిప్రయోగము ఇతిహాసపురాణాదులలో కనపడుచునే యుండును. అచ్చట దీనిని ఆర్షప్రయోగమని మన్నింతురు. బాణుడును యథాప్రయోగముగా గ్రహించి యుండును.

(ఛ) 'శార్వరే తమసి.'

వామనునిమతమున 'శార్వర' అను రూపము తప్పు. ఇది 'శర్వరీ (=రాత్రి)' అను పదమునకు 'అణ్' ప్రత్యయము విధింపబడినందున. కాని 'కాలాట్ఠఞ్' (పాణిని 4-3-11) అను సూత్రము ప్రకారము ఠఞ్ (=ఇక) ప్రత్యయము రావలెను. కావున అసాధువని వామనుడు.

కాని కాళిదాసుని కుమారసంభవమున అష్టమసర్గలో ౕ౫-వ శ్లోకమున 'శార్వరస్య తమసః' అని ప్రయోగము కలదు. వామనునిమతమున కాళిదాసుప్రయోగముమ అసాధువే.

ఈవిషయమున వైయాకరణులకు ఏకాభిప్రాయము ఉన్నట్లు లేదు. కొందరు పాణిని సూత్రములోని 'కాల' శబ్దమునకు 'కాల, సంవత్సర, మాస (—కాలిక, సాంవత్సరిక, మాసిక)' వంటి పదములు చేరునేకాని 'శర్వరీ' అనునది చేరదందురు.

పురాణేతిహాసములందు 'శార్వర' శబ్దము తరచు కనపడును.

భూతద్దముతో వెదకిన మరికొన్ని ఇట్టివి కనపడకపోవు, అవియు పూర్తిగ అసాధువులని చెప్పుట కష్టము. ఇంత తక్కువ సంఖ్యలో అవియుండుటయు బాణుని భాషాశుద్ధిని ప్రకటించుచున్నది.

## 11. 3. 2. బాణుని పదజాలము

బాణుని పదజాలము అపారము. సంస్కృతమున అతనికి తెలియనిపదము ఉన్నట్లులేదు. తెలియుటయేకాదు, అన్నిటిని ప్రయోగమున చూపుట అతని విశేష ప్రతిభ. ఉదాహరణమునకు శబ్దము, సమూహము, పద్మము అను పదములకు బాణుడు వాడిన పర్యాయపదములు[1] ఇచ్చట చూడనగును.

శబ్దము : రణిత, రసిత, హుంకృత, క్వణిత, విరుత, గర్జిత, ఆక్రందిత, కూజిత, ఛీత్కృత, నాద, రవ, నిస్స్వన, ధ్వని, ధ్వాన, ఘోష, స్వర, స్వన, ప్రోద, ఝుంకార, కోంకార, టంకార, ఘర్ఘర, కోలాహల, కలకల, ఝణఝణ, ఇత్యాది.

సమూహము : సంచయ, నిచయ, ప్రకర, నికర, కదంబక, జాల, నివహ, రాశి, కుల, యూథ, గ్రామ, వృంద, సంహతి, పేటిక, పటల, సార్థ, పుంజ, గణ, మండల, వ్రాత, దల, కలాప, ఇత్యాది.

పద్మము, (కలువ) : పంకజ, కమల, అంబుజ, సరోజ, రాజీవ, నలిన, అరవింద, అంబురుహ, తామరస, పంకేరుహ, కుశేశయ,

కువలయ, ఉత్పల, పుండరీక, కహ్లార, మొదలగునవి.

ఇట్లే హస్తిహయాదులకు, రవిచంద్రులకు, మదనమరుత్తులకు ఎన్నియో, శివునికి సుమారు ముప్పదిపేర్లకుపైగా బాణుడు ప్రయోగించియున్నాడు.

## 11. 3. 3. భంగ్యంతరములు

ఒకేభావమును వేరుపదములతో భంగ్యంతరములచే వర్ణించుట బాణునికిప్రీతి. దీనివలన పాఠకునకు విసుగురావలసినచోట ఆనందము కలుగును. సూర్యోదయాస్తమయములు, చంద్రోదయాస్తమయములు కాదంబరిలో బహుభంగుల నిర్వచింపబడియున్నవి. పూర్వకాదంబరిలోని అట్టివాక్యముల ప్రధానాంశములు ఇందుక—

---

1. ఈ క్రోడీకరణము శ్రీమతి నీతాశర్మ పుస్తకము "Bana Bhatta" లోనిది.

సూర్యాస్తమయము.

1. అస్తముపగతే భగవతి సహస్రదీధితౌ .... .

2. శ్రుతమహాశ్వేతావృత్తాంతోపజాతశోకఇవ సముత్సృష్టసెవనవ్యాపారో రవి రపి భగవా నధోముఖతా మయాసీత్.

సూర్యోదయము.

1. అథ భగవతి పూష్ణి క్రమేణచ ... సంహృతరోచిషి జాతే ...

2. అథ లోహితాయతి గగనతలోపాంతావలంబిని రవిబింబే.

ఇట్లే చంద్రునకు ఇతరములకును.

## 11. 4. బాణుని వాక్యసంవిధానము

బాణుడు సంస్కృతభాషావాక్యసంవిధానవిశేషములను అన్నిటిని 'కాదంబరి'లో ప్రయోగించియున్నాడు. కర్తరి - కర్మణి - భావేప్రయోగములన్నియు కలవు. కాని వాల్మీకి వ్యాసులవలె బాణుడును నిత్యజీవితములో మనుష్యులు మాటలాడునపుడు సహజమగు కర్తృప్రయోగవాక్యములయందే ఎక్కువ ప్రీతికలవాడు.

పూర్వకవులవలె ధాతువును విరివిగా అన్ని ల - కారములందును బాణుడు ప్రయోగించెను. సంస్కృతవిద్యార్థులు 'కాదంబరి'ని శ్రద్ధతో చదివిన వ్యాకరణ శాస్త్రాభ్యాస శ్రమలేకయే లక్ష్యబలమువలన వారికి సంస్కృతకారకము బోధపడును. ఈకావ్యము 'భట్టికావ్యము' వలె భాషాపాటవమునకు చదువదగినది.

బాణుడును తనకావ్యము సంస్కృతభాషాకారకజిజ్ఞాసువులకు ఆదర్శముగ ఉండునుగాకయని తలచెననుటకు ఆతని సార్వవిభక్తిక చిత్రవాక్యవిన్యాసము నిదర్శనము.

'సార్వవిభక్తికచిత్రవాక్యములు' అనగా ఒకపదమును (నామవాచకమును) మొదట కర్తగచేసి ప్రథమావిభక్తిలో ప్రయోగించి తరువాత ఆకర్తనే మిగిలినయన్ని విభక్తులలోను వరుసగా వేరువేరు వాక్యములలో ప్రయోగించిచూపుట. ఇట్టిప్రయోగ ములు బాలురకు సంస్కృతభాష నేర్పునపుడు విభక్త్యర్థములు తెలియుటకై చెప్పుట

పూర్వము ఒజ్జల వాడుక. ధారణకై ఇట్టి వాక్యములను ఒకదేవునిపేర స్తుతిపద్యముగ రచించి బాలురచేత వల్లెవేయించెడివారు.[1]

11. 4. 1. యచ్ఛబ్దముమీద సార్వవిభక్తికవాక్యములను బాణుడు తారాపీడవర్ణనమున ప్రదర్శించియున్నాడు.[2]

1. ప్రథమావిభక్తి (ఒకవాక్యము) — 'యః' — తమఃప్రసరమలినవపుషా పాపబహులేన కలికాలేన చాలితమామూలతః ధర్మం ...... పునరపి స్థిరీవకార.

2. ద్వితీయావిభక్తి (రెండువాక్యములు) — 'యం' చ ...... అపరం మకరకేతుమమంస్త లోకః; 'యం' చ ...... భుజబలవిజితాః ప్రణేమురవనిపాః.

3. తృతీయావిభక్తి (ఒకవాక్యము) — 'యేన' చ ...... సింహాసనే భరేణ ...... నేముః ... సర్వదిశః.

4. చతుర్థీవిభక్తి (ఒకవాక్యము) — 'యస్మై' చ మన్యే సురపతిరపి స్పృహయాంచకార.

5. పంచమీవిభక్తి (ఒకవాక్యము) — 'యస్మాత్' చ ...... సకలలోకహృదయానందకారీ నిర్జగామ గుణగణః.

6. షష్ఠీవిభక్తి (రెండువాక్యములు) — 'యస్య' చ ...... దశసు దిక్షు ముఖరితభువనమభ్రమ్యత కీర్త్యా; 'యస్య' చాతిదుస్సహప్రతాపఖిద్యమానేవ క్షణమపి న ముమోచాతపత్రచ్ఛాయాం రాజలక్ష్మీః.

---

1. ఈ క్రింది పద్యము అనేకులకు పరిచితమే,

శా॥ 'రామో' రాజమణిః సదా విజయతే; 'రామం' రమేశం భజే;
'రామే'ణాభిహతా నిశాచరచమూ; 'రామాయ' తస్మై నమః।
'రామా'న్నాస్తి పరాయణం పరతరం; రామస్య దాసోఽస్మ్యహం;
'రామే' చిత్తలయః సదా భవతు మే; 'భో రామ' మాముద్ధర॥

'రామ' బదులం 'కృష్ణ' అని కొద్ది మార్పులతో ఇట్టి పద్యము కులశేఖరాళ్వారు 'ముకుందమాల'లో కలదు.

2. చూ. కాళే ప్రతి, పుటలు 93, 94, 95; వానిళ్ళ ప్రతి 54, 55.

7. సప్తమీవిభక్తి (ఒకవాక్యము, బహుదీర్ఘము) — 'యస్మిన్' త రాజని గిరీణాం విపశ్చితా (ఇత్యాది పరిసంఖ్యలు) ...... పృథివ్యామాసీత్.[1]

యదృచ్ఛమునకు సంబోధన పిలుకాదు కావున లేదు. ఇతరగద్యకావ్యముల లోను వర్ణనలందు ఒకేపేరును కొన్నివిభక్తులలో ప్రయోగించు పరిపాటియున్నను బాణుడు ఏడువిభక్తులలోను పట్టుపట్టి ప్రయోగించుట ప్రయత్నసాధ్యమేగాని యాదృచ్ఛికము కాజాలదు.

## 11. 4. 2. వ్యంగ్యవిపరీతపద్ధతి

వ్యంగ్యము ధ్వని అను కావ్యగుణములు కాళిదాసులో అతిశయించినను అవి సుకవిరచనాసామాన్యగుణములే. వ్యంగ్యము ప్రధానముగాగల కావ్యమును ధ్వని కావ్యము అని లాక్షణికులు ఉగ్గడింతురు.

---

1. ఈ సార్వవిభక్తిక ప్రక్రియ ఎక్కువగా 'ఉదాహరణము' అను స్తుత్యాత్మకమైన కావ్యవిశేషమున కనబడుచున్నది. ఉదాహరణములు పూర్వకాలము నుండి ప్రచారములో కలవనుట కాళిదాసాదులం పేర్కొనుటవలన తెలియుచున్నది. దానిని 'ప్రతాపరుద్ర యశోభూషణము'న విద్యానాథుడు నిర్వచించుచు 'తదుదాహరణం నామ విభక్త్యష్టాంగ సంయుతమ్' అని దాని సార్వవిభక్తిక లక్షణమును చెప్పియున్నాడు.

కాని చాల ప్రాచీనమయిన ఉదాహరణమేదియూ ఇప్పుడు లభ్యము కాదు. సంస్కృతమున పాల్కురికి సోమనాథుని 'బసవోదాహరణము' ప్రాచీనతమము, లభ్యమును. అందు —

శా॥ యస్సంగీత నిధి, ర్యమాహురభవం, యేనార్చితం నూన్వృతం,
యస్మై స్వస్తి, యతస్తదీయముదభూ, ద్యద్వీరశైవ వ్రతం।
యస్యాపాంగ సహోదరీ చ కరుణా, యస్మిన్మహాత్మ్యాధికం,
స త్వం త్రీణి జగంతి పాహి బసవామాత్యేశ చూడామణే॥

(ఈ పద్యము శ్రీ నిడదవోలు వేంకటరావుగారి త్రిపురాంతకోదాహరణ పీఠికలో నుండి ఉద్ధృతి).

ఈ 'ధ్వని', 'వ్యంగ్యము' అను పదములు కావ్యమునందలి వాక్యములలో సహృదయునికి స్ఫురించు వాచ్యేతరార్థములకు లాక్షణికపరిభాషలు. ఒకయర్థము స్ఫుటముగ నుండగా మరియొక రమ్యమైనయర్థము పాఠకునికి తోచుట వ్యంగ్యము. 'సమాసోక్తి' అను అలంకారము ఒకవిధమైన వ్యంగ్యమే. వ్యంగ్యమునకు శ్లేష ఒక ఉపకరణము.

ఈ వ్యంగ్యలక్షణమునకు విపరీతమయిన రచనాప్రకారము గద్యకావ్యములలో కనబడుచున్నది. ఇది సుబంధుని 'వాసవదత్త' లో కలదు. బాణుడును దానిని విస్తారముగ ప్రయోగించి ఆపద్ధతికి ఆదర్శప్రాయమయిన ఉదాహరణములు కల్పించినాడు.

ఈపద్ధతిలో బహుపదములచేత ఏకార్థమును స్ఫురింపజేయుటయే వ్యంజనము. ఒకచేష్టనో స్థితినో బహుపదములచే ఉపలక్షించి, ఉత్ప్రేక్షించినపుడు ఆపదముల అర్థభేదములు అప్రస్తుతమై వానికన్నిటికిని సామాన్యమగు ఒకయర్థమో, రసమో పాఠకునికి గోచరించును. ఇట వ్యంగ్యపరిత్యాగముచేత వాచ్యోద్దీపనమగును. 'కాదంబరి' లో కొన్నియుదాహరణములు —

(క) పారిజాతకుసుమసౌరభము చాలగొప్పగా నాసికాపుటము చొచ్చెననుటకు — 'అతిసురభితయా అనులింపంతమివ, తర్పయంతమివ, పూరయంతమివ ఘ్రాణేంద్రియం...[1]'

(గ) మహాశ్వేత పుండరీకుని చూచి కదలక నిలిచెననుటకు — 'కరణానాం స్తంభితేవ, లిఖితేవ, ఉత్కీర్ణేవ, సంయతేవ, మూర్ఛితేవ, కేనాపి విధృతేవ, నిష్పంద సకలావయవా...[2]'

(చ) ఇట్లే మరియొకచోట పుండరీకునిగురించి కపింజలుడు — 'లిఖితమివ, ఉత్కీర్ణమివ, స్తంభితమివ, ఉపరతమివ, ప్రసుప్తమివ, యోగసమాధిస్థితమివ...[3]'

1. కాలే ప్రతి పుట. 223; వావిళ్ల, 134.
మరికొన్ని ఇట్టి యుదాహరణములకు చూ. 12. 6. 6.

2. కాలే ప్రతి, పుట. 227; వావిళ్ల, పుట. 134.

3. కాలే ప్రతి, పుట. 240; వావిళ్ల, పుట. 147. ఈ సందర్భమున సుబంధుని 'విలిఖితమివ, ఉత్కీర్ణమివ, ప్రత్యుప్తమివ, ...' ఇత్యాది గుర్తింపదగినది. (చూ. వాసవదత్త, చౌఖంబా ప్రతి, పుట. 140).

పైమూడు వాక్యములు ఉత్ప్రేక్షాపరంపరలు. 'మాలోపమ' వలె 'మాలోత్ప్రేక్ష' అనదగును.

(జ) మృతుడగు పుండరీకుని చూచి విహ్వలయయిన మహాశ్వేత దీనావస్థ ఆమెమాటలలో —

'ఆర్తాఽస్మి; భర్త్రాఽస్మి; అనురక్తాఽస్మి; అనాథాఽస్మి; బాలాఽస్మి; అగతికాఽస్మి; దుఃఖితాఽస్మి; అనన్యశరణాఽస్మి; మదనపరిభూతాఽస్మి...[1]'

(ట) చంద్రాపీడునితో మహాశ్వేత తాను సర్వావలక్షణోపేతయని ఆత్మనింద — 'సాఽహమేవంవిధా పాపకారిణీ, నిర్లక్షణా, నిర్లజ్జా, క్రూరాచ, నిఃస్నేహాచ, నృశంసాచ, గర్హణీయాచ, నిష్ప్రయోజనోత్పన్నా, నిష్ఫలజీవితా, నిరవలంబనా, నిఃసుఖాచ.[2]

ఇట్టి పదగుంఫనములు కాదంబరిలో తరచు కనబడును.

### 11. 4. 3. క్త్వార్థకక్రియాప్రయోగము[3]

క్త్వార్థకప్రయోగము అచ్చటచ్చట ఉండుట ఏభాషకైనను సహజము, సంభాషణాసామాన్యము, కవిసామాన్యమును. గద్యకావ్యములందు కథావేగమునకై వీరసములగు వ్యక్తిచేష్టాదికములను త్వరగ దాటిపోవుటకు క్త్వార్థకక్రియలను వరుసగా ప్రయోగించుట వాడుక. వీనివలన కథాగమనము చలనచిత్రములో (Cinema)వలె చకచక సాగిపోవును. బాణుడు ఈప్రయోగమున అతిశయించును.

ఉదాహరణములు —

(క) సరస్తీరమున చంద్రాపీడుడు గుఱ్ఱమును, "సరోఽవతార్య, పీతసలిలమిచ్ఛయా స్నాతంచోత్థాప్య, .... తరోర్మూలశాఖాయాం .... చరణౌబద్ధ్వా, కృపాణికావలూనాన్ క్షిప్త్వా .... దూర్వాప్రవాలకవలాన్, స్వయమపి సలిలమవతతార."[4]

---

1. కాశీ ప్రతి, పుట. 257; వావిళ్ల, పుట. 161, 162.

2. కాశీ ప్రతి, పుట. 263; వావిళ్ల, పుట. 166.

3. తెలుగున 'వచ్చి, పోయి, తిని, ...' అను అసమాపక క్రియలవంటివి.

4. కాశీ ప్రతి, పుటలు. 202, 203; వావిళ్ల, 121.

(గ) "తతోఽవతీర్య, తరుశాఖాయాం బద్ధ్వా తురగం, ఉపసృత్య భగవతే, భక్త్యా ప్రణమ్య త్రిలోచనాయ...."[1]

పెద్దవర్ణనచేయునపుడు కథస్తంభించును కాన అట్టి వర్ణనలు కాగానే ఈక్త్వార్థకములతో కథను వేగముగానడిపి పాఠకునికి గద్యకవి ఒకవిధమయిన మానసికోల్లాసమును కల్గించును. ఈవైనమును బాణుడు అతినైపుణ్యముతో విస్తారముగ పాటించియున్నాడు.

11. 4. 4. ఇట్లే (సతి) సప్తమీప్రయోగము[2], కృదంతములను క్రియాపదములుగ చేయుట మొదలగు భాషాప్రక్రియలన్నిటిని బాణుడు అతిశయముగను, ఔచిత్యముతోను, రమణీయముగను ప్రయోగించి తానును భాషానుశాసకుడని నిరూపించుకొనినాడు.

## 11. 5. బాణుని దీర్ఘవాక్యములు

వర్ణనలో మిక్కిలి నిడివిగల ఒకేవాక్యముతో చెప్పవలసినదంతయు చెప్పివేయుటను బాణుడు మిగుల సామర్థ్యముతో నిర్వహించియున్నాడు. ఈపద్ధతి శాసనములలో కనబడి తరువాత గద్యకావ్యములలో స్థిరపడినది.[3] దీనివలన కవియభిప్రాయము దుర్బోధముకాదా యనుసంశయమును సముచితమే. ఆధునికులకు ఇది దోషమగును. కాని పూర్వము ఇట్టిరచన మిక్కిలి యామోదము పొందినదని శాసనములే తార్కాణము. గద్యకవులందరును ఈపద్ధతిని అవలంబించుట ఆనాటిపాఠకుల మెప్పునలను సూచించును.

మరియు బాణుని దీర్ఘవాక్యములలో దైర్ఘ్యము దుర్ధర్షమయినను సంవిధానము మాత్రము చాలస్పష్టముగనే యుండును. ఉదాహరణమునకు శూద్రకవర్ణనము పరిశీలింపదగినది. అందు మొదటివాక్యమును ఇట్లు విశ్లేషింపవచ్చును —

1. ఆసీత్ (క్రియాపదము)

---

1. కాలే ప్రతి, పుట. 214; వావిళ్ల, 127.

2. ఉక్తవతి తస్మిన్ = అతడు చెప్పగా, అస్తంగతే రవౌ = సూర్యుడు క్రుంకగా ... అట్టి ప్రయోగములు.

3. చూ. సముద్రగుప్త వర్ణనము, 3. 13.

2. అశేషనరపతిశిరఃసమభ్యర్చితశాసనః,
3. పాకశాసనఇవాపరః,
4. చతురుదధిమాలామేఖలాయా భువోభర్తా,
5. ప్రతాపానురాగావనతసమస్తసామంతచక్రః,
6. చక్రవర్తిలక్షణోపేతః,
7. చక్రధరఇవ కరకమలోపలక్ష్యమాణ శంఖచక్రలాంఛనః,
8. హరఇవ జితమన్మథః,
9. గుహఇవాప్రతిహతశక్తిః,
10. కమలయోనిరివ విమానీకృతరాజహంసమండలః,
11. జలధిరివ లక్ష్మీప్రసూతిః,
12. గంగాప్రవాహఇవ భగీరథపథప్రవృత్తః,
13. రవిరివ ప్రతిదివసోపజాయమానోదయః,
14. మేరురివ సకలభువనోపజీవ్యమానపాదచ్ఛాయః,
15. దిగ్గజఇవానవరతప్రవృత్తదానార్ద్రీకృతకరః,
16. కర్తా మహాశ్చర్యాణాం,
17. ఆహర్తా క్రతూనాం,
18. ఆదర్శః సర్వశాస్త్రాణాం,
19. ఉత్పత్తిః కలానాం,
20. కులభవనం గుణానాం,
21. ఆగమః కావ్యామృతరసానాం,
22. ఉదయశైలో మిత్రమండలస్య,
23. ఉత్పాతకేతు రహితజనస్య,
24. ప్రవర్తయితా గోష్ఠీబంధానాం,
25. ఆశ్రయో రసికానాం,
26. ప్రత్యాదేశో ధనుష్మతాం,
27. ధౌరేయః సాహసికానాం,

28. అగ్రణీర్విదగ్ధానాం,

29. వైనతేయఇవ వినతానందజననః,

30. వైన్యఇవ చాపకోటిసముత్సారిత సకలారాతికులాచలః,

31. రాజా (కర్త),

32. శూద్రకోనామ.

ఇందు మొదటియంశమయిన 'ఆసీత్' అను క్రియాపదము ముప్పదియొకటవ అంశమయిన 'రాజా' అను కర్తయు చేరి వాక్యసంబంధము ఏర్పడుచున్నది. మిగిలిన ముప్పదియధికాంశములగు విశేషణములు, ఉపమానములు సమానాధికరణముననున్న పదబంధములును (Appositional phrases) కర్తను వర్ణించును. కావున వీనికిని వాక్యకారకమునకును సంబంధము లేదు.

ఈవాక్యములో ఆకాంక్ష[1] (అర్థరీత్యా పదసంబంధము) ఇట్లు —

ఆసీత్ (క్రియ) = ఉండెను. ప్రశ్న, కః (ఎవరు)? జవాబు 'రాజా' (రాజు).

1. 'రాజా ఆసీత్' అని వాక్యపు మూలరూపము.

ప్రశ్న, కోనామ (పేరేమి)? జవాబు. 'శూద్రకోనామ' (శూద్రకు డను.)

2. 'రాజా శూద్రకోనామ ఆసీత్' అని వాక్యపు రెండవదశ.

ప్రశ్న, కీదృశః (ఎట్టివాడు)? జవాబు 'అశేషనరపతిశిరఃసమభ్యర్చిత శాసనః.'

3. 'రాజా శూద్రకోనామ, అశేషనరపతిశిరఃసమభ్యర్చితశాసనః ఆసీత్' అని వాక్యపు మూడవదశ.

1. పూర్వము శ్లోకములకు అన్వయము చెప్పి విద్యార్థులకు బోధించుటకు ఈ ఆకాంక్షావిధానము అవలంబించెడువారు. ఆ విద్యార్థులకు కొద్ది కాలములోనే స్వయముగా అన్వయించుకొను శక్తి వచ్చెడిది. కాని వ్యాఖ్యాసంక్షేపమునకు శ్రీ కోలాచలం మల్లినాథసూరి అన్వయముఖమును అవలంబింపగా తరువాత అదియే వాడుక అయినది.

ప్రశ్న, పునః కీదృశః (ఇంకను ఎట్టివాడు)? జవాబు, 'పాకశాసన ఇవాపరః.'

4. 'రాజా శూద్రకోనామ, అశేషనరపతిశిరః సమభ్యర్చితశాసనః, పాకశాసన ఇవాపరః ఆసీత్' అని వాక్యపు నాలుగవదశ.

ఇట్లు వాక్యము పెరుగుమనే పోవును. 'పునః కీదృశః' అను ప్రశ్నను పలుమారు వేయుటయు దానికి జవాబుగ ఒకపదమో సమాసమో అనుసంధించుటయు ఈవాక్యపు విధానము 'ఆసీ ద్రాజా శూద్రకోనామ' అను వాక్యసంబంధమును గ్రహించిన పిమ్మట చిక్కులేదు.

ఇట్లే చంద్రాపీడుడు కాదంబరిని శ్రీమండపమున చూచెను అనుటకు కర్తను అధ్యాహారమునకువదలి 'కాదంబరీం దదర్శ' అను చిన్నవాక్యములో కాదంబరీరూప వర్ణనమంతయు ఇమిడ్చి బాణుడు ఆవాక్యమును అనేకపంక్తులకు పెంచినాడు.[1] ఇచ్చటను సంవిధానక్లేశము లేదు. కాని వాక్యములోని వర్మవిశేషణరూపమునవచ్చు పదజాలములలో చిక్కుకొని అల్పసత్త్వుడయిన పాఠకుడు కాందిశీకుడు కావచ్చును. అయినను ఒకింత సంస్కృతభాషానుభవము కలవారికి, హైందవసంప్రదాయము తెలిసినవారికి, వ్యాఖ్యానసహాయమున చదివినపుడు, లేక గురుముఖముగ విన్నపుడు కష్టమునకు తగిన మహోజ్జ్వలమగు కాదంబరీనాయికారూపము మనోగోచరమగును. పఠనప్రయత్నక్లేశము ప్రమోదఫలమగును.

11. 6. బాణుని సమాసభూయిష్ఠమైన రచన ఓజోగుణాన్వితము కావున దండి యభిప్రాయమున గొప్పరీతి. ఈప్రౌఢియే బాణునికి పండితులమెప్పును ఇచ్చినది. కాని ఈశైలి భారతీయేతరులకు కొంత వికారముగ తోచును. జర్మనుభాషలో వెబరు పండితుడు వ్రాసిన, అన్నింటమొదటిదైన, సంస్కృతసాహిత్యచరిత్రలో బాణుని శైలినిగురించి ఇట్లు చెప్పియున్నాడు,

"........ క్రియాపదము రెండు, మూడు, నాలుగు, ఒకపరి యారవపుట వరకును నెట్టబడియున్నది. ఈవిరామమంతయు విశేషణములు, విశేషణములకు విశేషణముల చేత నింపబడియున్నది. మరియు ఈవిశేషణములు తరచు అనేకపంక్తుల

1. కాశే ప్రతిలో 72 పంక్తులు; వావిళ్ల ప్రతిలో 84 పంక్తులు.

నిడివిగల సమాసములుగ ఉండును. ముక్తసరిగ ఇట్లు చెప్పవచ్చును. బాణుని గద్యము ఒక భారతకీకారణ్యము. అచ్చట దట్టమయిన పొదలవలన (=సమాసములవలన) పాంథుని (పాఠకుని) పురోగతి దుష్కరము కాగా అతడే ఆపొదలను నరుకుకొనుచు బాట చేసికొనవలెను. అప్పటికిని క్రూరమృగములవలె ఎదురుపడు అజ్ఞాతపదముల వలని భయమును సమాళించుకొనవలెను.[1] ”

ఇందుపై ఇంకను ప్రామాణికమయిన పెద్దభారతీయసాహిత్యచరిత్రను వ్రాసిన వింటర్‌నిట్స్ (Winternitz) అను మరియొక జర్మను పండితుని విమర్శ,

‘ భయంకరమృగరూపపదములు, భయంకరమైన వాక్యముల మధ్య తరచుగ, తప్పక, సరళమైన శైలిలో నిరలంకారమయిన చిన్నవాక్యములు కనపడునని గుర్తింప వలెను. ఆకథ చదువుటకు మనకు (పాశ్చాత్యులకు) విసుగైనను సంస్కృతజ్ఞానము గల భారతీయపాఠకునికి అదియే ఆకర్షకమగునని ఒప్పుకొనక తప్పదు.[2] ’

వర్ణనలు లేనిచోట బాణుని భాష మిక్కిలి తేటగ, మనోహరముగ, వేగముగ ప్రవహించు నదివలె నుండును. కొన్నిచోటుల రెండు, మూడు లేక నాలుగు పదములు

---

1. ‘...... the verb is kept back to the second, third, fourth, nay, once to the sixth page, and all the interval is filled with epithets, and epithets to these epithets: moreover, these epithets frequently consist of compounds extending over more than one line: in short, Bana's prose is an Indian wood, where all progress is rendered impossible by the undergrowth until the traveller cuts out a path for himself: and where, even then, he has to reckon with malicious wild beasts in the shape of unknown words that affright him.’

(వెబరు పుస్తకపు రెండవ సంస్కరణము, ఆంగ్లానువాదము).

2. ‘It must be remembered that the monsters in the form of words and the frightful passages are regularly and repeatedly inter-cepted by quite brief passages in easy unaffected style. Though the reading of the fiction may be tedious to us, it must indeed be granted that for the Indian reader, presuming that he is well-acquainted with Sanskrit, the work has its charms’.

(History of Indian Literature by M. Winternitz)

మాత్రమే గల వాక్యములు అనేకములు రాసులుగ కనబడును. వర్ణనలలో గౌడీరీతి, మనోభావప్రకటనమున వైదర్భీరీతి, ఇతరత్ర పాంచాలీరీతియు కాదంబరిలో కనబడును.[1]



1. చూ. 5. 8.

మరియు, ఆలంకారికులు చెప్పు కైశిక్యాది వృత్తి భేదములు రీతులవంటివే యైనను తుదకు పదరచనావిశేషములు కాక రసభేద సందర్భములే అగుట, వానిని వేరుగ బాణుని గద్యమునకు అన్వయించుట నిష్ఫలమని అవి వదలివేయబడినవి. ప్రతాపరుద్రయశోభూషణమున కైశికీవృత్తి కరుణ శృంగారములలో, ఆరభటి రౌద్ర బీభత్సములలో, భారతీ (ఈషత్ సుకుమారము) హాస్య శాంతాద్భుత రసములందు, సాత్వతి (ఈషద్ ప్రౌఢము) వీరభయానకములందును కానవచ్చు ననుటవలన ఇవి భాషాభేదములు కావని తెలియుచున్నది. ఈ వృత్తులు నాట్యశాస్త్రమున భావప్రకటన సంబంధమయిన అభినయమునకు చెందినవి, శ్రవ్యకావ్యమునకు చెల్లునట్లు లేవు.

# 12. కాదంబరి కావ్యాలంకార విశేషములు

12. 1. కవిత్వము 'వక్రోక్తి, స్వభావోక్తి' అను రెండు ఉక్తిభేదములు కలది అని భామహుని మాట.[1] దండియు అట్లే. మరియు దండి శ్లేష వక్రోక్తికి సిరినిచ్చు నని చెప్పియున్నాడు.[2] భామహుడు వక్రోక్తి, స్వభావోక్తి అను పేర్లను ప్రత్యేకముగ అలంకారములుగ చెప్పియున్నను కవిత్వతత్త్వమున వీనియర్థములు వేరు. భామహుడు బాణునికి, కాలములో, మిక్కిలి సమీపవర్తి.[3] కావున భామహామతమును బాణమతమును కవిత్వవిషయములో ఇంచుమించు ఒకటిగనే ఉండుననుటకు అవకాశముకలదు.

12. 2. సాధారణముగ ప్రజలు మాటలాడుకొనునప్పుడు కేవలము అర్థవ్యంజకములగు పదములను కేవలము భావద్యోతకమగు వాక్యసంవిధానమున వాడుదురు. అట్టి భాష సరళముగ నుండును కావున దానిని 'సరళోక్తి (లేక ఋజూక్తి)' అని చెప్పవచ్చును. ఈ సరళోక్తిలోనే రమ్యవస్తుచేష్టాదివర్ణనమును చేసి అందు రసస్ఫూర్తియున్న అది స్వభావోక్తి అను కవ్యుక్తి అగును. అది ఒక అలంకారము.

అట్లుకాక ఒకడు తన ప్రతిభచేత పదములను ఏరుకొనుటలోను, వాక్యమును అల్లుటలోను కొంత అసామాన్యప్రక్రియ చేసిన ఆవాక్యము సరళోక్తి కాదు, ఆప్రక్రియ సర్వజనసాధ్యమును కాదు. అట్టి వాక్యమును చెప్పగలవాడు బీజరూపమున కవిత్వశక్తి కలవాడు అతడు కావ్యము వ్రాసిన కవియగును.

---

1. యుక్తం వక్రస్వభావోక్త్యా సర్వమేవైతదిష్యతే.

(భామహాలంకారము 1-30)

2. శ్లేషః సర్వాసు పుష్ణాతి, ప్రాయోవక్రోక్తిషు శ్రియమ్।
భిన్నం ద్విధా స్వభావోక్తి ర్వక్రోక్తి శ్చేతి వాఙ్మయమ్॥

(దండి, కావ్యాదర్శము, 2-363)

3. కొందరు భామహుడు బాణునికి పూర్వుడనియు మరికొందరు తరువాతివాడనియు తలతురు.

సరళము కాని రమ్యమయిన ఉక్తిని 'వక్రోక్తి' అనవగును. అదియే కవ్యుక్తి కావున దాని భేదములే అన్నిరీతులు, వృత్తులు, అలంకారములు, వ్యంగ్యాములును అగును. వక్రోక్తిలోని ఆకర్షణమే చమత్కారము.[1] శబ్దాలంకారములును జనసామాన్య సంభాషణమున ఉద్దిష్టములు కావు కావున అవియు వక్రభాషణములే అయి కవ్యుక్తికే చెందును. అవియును వక్రోక్తులే.

12. 3. వక్రోక్తి కవ్యుక్తికి ముఖ్యాధారము అనుభావము పోనుపోను దృఢమై 'వక్రోక్తియే కావ్యమునకు ప్రాణము'[2] అనునంతవరకు వచ్చినది. కాని ఈమత మును పూర్తిగా ఒప్పుకొనరాదు. ఏలయన ఈమతమున స్వభావోక్తి అను కవ్యుక్తికి తావులేదు.

బాణుడు వక్రోక్తిప్రియు డనుటకు అతని కావ్యములే నిదర్శనము. అతనికి స్వభావోక్తియు ప్రియమనుటకును అవియే నిదర్శనము. భామహ దండుల మతమును అతని మతమును కవిత్వవిషయమున ఒకటే.

బాణునికి వక్రోక్తిమీద కొంత ఎక్కువప్రీతి కలదనుటకు కాదంబరిలో ఒక చోట, 'వక్రోక్తి నిపుణేన (విలాసిజనేన)' అని, మరియొకచోట, 'ఏతాసతీర్వక్రోక్తీః' అనియు లాక్షణిక వక్రోక్తి ప్రశంస చేయుటయే తార్కాణము.

బాణునిగురించి కవిరాజు,

> సుబంధు ర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః ।
> వక్రోక్తిమార్గనిపుణా శ్చతుర్థో విద్యతే న వా ॥[3]

అని పొగడుటవలన గద్యకవిత్వమున ఈవక్రోక్తికి ఆనాడున్న ఆదరమును, ఔన్నత్య మును తెలియుచున్నది.

---

1. ఆంగ్లమున 'విట్ (wit)' అను పదమును "What is often thought but never so well expressed = "అందరికిని తరచు తోచునదే కాని ఇంత ముచ్చటగ ఎప్పుడును చెప్పనిది" అని ఒక కవి నిర్వచించెను. ఈ 'wit' అనుటకు మన సంప్రదాయమున 'వక్రోక్తి, చమత్కారము' అను పదములు సరిపోవును.

2. 'వక్రోక్తిః కావ్యజీవితమ్' (కుంతక వాక్యము).

3. చూ. బాణప్రశస్తి. 1. 2. 13.

12. 4. ఈకవిత్వపరమయిన వక్రోక్తియే అన్ని అలంకారములకు మూలమయినను శ్లేషయు, శ్లేషానుప్రాణితములయిన ఉపమా విరోధాభాసపరిసంఖ్యాలంకారములును అత్యంతవక్రభాషణము లగును. ఈయలంకారములలో శబ్దముమీది చమత్కారమే ముఖ్యము. తరచు ఈయలంకారములవలన కవిచాతుర్యము ప్రకాశించినంత కావ్య వస్తువు ప్రకాశింపదు. అయినను సుబంధువు[1] 'వాసవదత్త' లో వీనిని ఎక్కువగ ప్రయోగించి ఒక బాటను ఏర్పరుపగా ఆగద్యసరణిలోనే బాణుడు విజృంభించి విహరించియున్నాడు. సుబంధువు ఔచిత్యమును మరచి చమత్కారమును సాధింపగా బాణుడు కొంత హద్దులలోనే వర్తించును.

బాణుడు శ్లేషప్రియుడనుటకు 'అక్లిష్టమయినశ్లేష దుష్కరము'[2] అని హర్ష చరితపీఠికలోను, 'నిరంతరశ్లేషఘనములగు కథలు ... ఎవరిమనస్సులను హరింపవు ?'[3] అని కాదంబరీపీఠికలోను ఉన్న అతనిమాటలే ఋజువు. శ్లేషాదులన్నిటను బాణుడు సింహాశక్తిసంపన్నుడు అను చంద్రదేవుని స్తుతియు[4] ప్రకృతమే.

## 12. 5. బాణుని శ్లేషాలంకారము

శ్లేషయనగా[5] నామగుణక్రియలలో దేనినిచెప్పు పదమునకైనను అనేకార్థము లుండి (లేక పదములను విడదీయుటలో భేదమువలన ఎక్కువయర్థములు తోచి[6])

---

1. సుబంధువు 'ప్రత్యక్షరశ్లేషమయ ప్రబంధ విన్యాస వైదగ్ధ్య నిధిః' అని తన్ను చెప్పుకొని రచనను రమారమి అట్లే సాగించెను.

2. చూ. 11. 2. అథోజ్ఞాపిక.

3. చూ. 4. 14.

4. చూ. 1. 2. 22.

5. భామహుడుం శ్లేషను 'శ్లిష్టము' అనును. అతని శ్లిష్ట లక్షణము —

✓ ఉపమానేన యత్ తత్త్వ ముపమేయస్య సాధ్యతే।
గుణక్రియాభ్యాం నామ్నాచ శ్లిష్టం తదభిధీయతే॥

(భామహాలంకారము 3-14)

6. పదమునకు అనేకార్థములున్న అట్టి శ్లేషను అభంగశ్లేష అని అందురు. అట్లుకాక ఒకేపదమును లేక సమాసమును వేరువేరు చోటుల విరుచుటచేత ఏర్పడు అర్థభేదమును సభంగశ్లేష అందురు.

అందువలన వాక్యమున ప్రకృతార్థము ఉపమేయము కాగా, మరియొకయర్థము ఉపమానమువలె తోచుట. ఈరెండు అర్థములకును సాదృశ్యమున్ననే శ్లేష సార్థకమగును. కాని కొన్నియెడల శ్లేష వ్యక్తమయిన అధికార్థము నిచ్చును. అట్టిశ్లేష అలంకారము కాక ఆటంకమగును.

బాణుని శ్లేషలు ప్రయోజకములుగనే యుండును. కాదంబరిలో శ్లేషకు మంచి యుదాహరణము శూద్రకునియందు వైశంపాయనశుకము చెప్పిన స్తుతిపద్యము,

"స్తనయుగ మశ్రుస్నాతం సమీపతరవర్తి హృదయశోకాగ్నేః।
చరతి విముక్తాహారం వ్రతమివ భవతో రిపుస్త్రీణామ్" ॥

మొదటియర్థము — నీశత్రురాజుల భార్యల స్తనయుగము(లు) కన్నీట స్నానమాడి, హృదయశోకము అను అగ్నికి చేరువగ నిరాహారముగ (విముక్త + ఆహారం = విముక్తాహారం) వ్రతమాచరించునట్లు ఉన్నది (-వి).

రెండవయర్థము — నీశత్రురాజుల భార్యల స్తనయుగము(లు) హృదయశోకము అను అగ్నిదగ్గర ముత్యాలపేరులు విసర్జించి (వి + ముక్తా + హారం = విముక్తాహారం) వ్రతదీక్షలోవలె ఉన్నది (-వి). ఇచ్చట ముక్తాహారరాహిత్యము వైధవ్యలక్షణము.

ఇందు వి + ముక్తా + హారం అనుట సభంగశ్లేష. ఆయర్థము ఉపమేయము. విముక్త + ఆహారం అనుట ఉపమానము.

ఇట్లే పుండరీకుని సందేశపద్యమును శ్లేషయుతము.[1]

## 12. 6. బాణుని శ్లేషచక్రము

శ్లేష కాదంబరిలో పలుచోట్ల కనపడును. కాని శ్లేషానుప్రాణితములగు ఉపమా, విరోధాభాస, పరిసంఖ్యాలంకారములు మిక్కిలి చమత్కారజనకములై

(మిగులు) దండియు —

శ్లిష్టమిష్ట మనేకార్థ మేక రూపాన్వితం వచః।
తదభిన్నపదం భిన్నపదప్రాయ మితి ద్విధా॥ (కావ్యాదర్శము)

1. చూ. 9. 4. మహాశ్వేతాకథనమున అధోజ్ఞాపిక.

వక్రోక్తి యను పేరునకు సార్థకలక్ష్యము లగుచున్నవి. ఇవియే గద్యకావ్యమున విశేషాలంకారములు. బాణుడు వీనిని విరివిగా ప్రయోగించియున్నాడు.

### 12. 6. 1. శ్లేషోపమా ప్రయోగము

శ్లేషోపమలో ఉపమానోపమేయములకు గుణసాదృశ్యము లేక శబ్దసామ్య ముండును. ఇందు చమత్కారమే ప్రధానము. ఉపమానముచేత ఉపమేయమునకు సాదృశ్యశ్రీ కలుగదు.

ఉదాహరణములు

(క) శూద్రకవర్ణనమున — శూద్రకుడు ఉపమేయము.

1. హర ఇవ జితమన్మథః (హరునివలె జితమన్మథుడు). హరుడు మన్మథుని జయించెను కాన జితమన్మథుడు. శూద్రకుడు మన్మథవికారమును జయించెను కాన జితమన్మథుడు. ఇచట 'జితమన్మథః' అను పదము వేరువేరు అర్థములలో ఉపమానోపమేయములకు సమానము. ఇట్లే ఈక్రింది శ్లేషోపమలను అన్వయింపవలెను.

2. గుహ ఇ వాప్రతిహతశక్తిః (గుహునివలె అప్రతిహతశక్తికలవాడు).

అప్రతిహతశక్తిః — 1. తిరుగులేని 'శక్తి' అను ఆయుధము కలవాడు గుహుడు (కుమారస్వామి) 2. ఎదురులేని పరాక్రమము కలవాడు శూద్రకుడు.

3. కమలయోనిరివ విమానీకృత రాజహంసమండలః (బ్రహ్మవలె విమానీకృతరాజహంసమండలుడు).

విమానీకృత — 1. విమానములుగ చేయబడిన 2. అవమానింపబడిన

(విమానీకృత వి + మానీకృత అని సభంగశ్లేష)

రాజహంస — 1. రాయంచల 2. రాజప్రముఖుల

బ్రహ్మ విమానములుగ (వాహనపక్షులుగ) చేయబడిన రాయంచల మండలము (గుంపు) కలవాడు. శూద్రకుడు అవమానితులయిన (యుద్ధమున ఓడిన) రాజప్రముఖుల మండలము (పరివారము) కలవాడు.

4. జలధిరివ లక్ష్మీప్రసూతిః (జలధివలె లక్ష్మికి పుట్టుకచోటు). ఇచట సముద్రము లక్ష్మికి పుట్టినిల్లు, శూద్రకుడు సంపదలకు నిలయము.

(గ) హారీతవర్ణనమున (హారీతుడు ఉపమేయము).

1. విటప ఇవ కోమలవల్కలావృతశరీరః (చెట్టుకొమ్మవలె కోమలవల్కలావృతశరీరము కలవాడు).

చెట్టుకొమ్మ కోమలవల్కలము(లేతబెరడు)చేత చుట్టబడినది. హారీతుడు సన్నని నారచీరలను ధరించినవాడు.

2. గిరిరివ సమేఖలః (గిరివలె మేఖలతో కూడినవాడు).

గిరి (కొండ) మేఖల (సానువు) కలది. హారీతుడు మేఖల (గడ్డిమొలత్రాడు) కలవాడు.

(చ) తారాపీడవర్ణనమున (తారాపీడుడు ఉపమేయము).

1. దశరథ ఇవ సుమిత్రోపేతః (దశరథునివలె సుమిత్రోపేతుడు).

దశరథుడు సుమిత్రతో కూడినవాడు (సుమిత్రా + ఉపేతః). తారాపీడుడు మంచిమిత్రులతో కూడినవాడు (సుమిత్ర + ఉపేతః).

2. పశుపతిరివ మహాసేనానుగతః (శివునివలె మహాసేనానుగతుడు).

శివుడు మహాసేనుని(కుమారుని)చేత అనుసరింపబడినవాడు. తారాపీడుడు మహాసేన(గొప్పసైన్యము)చేత అనుసరింపబడినవాడు.

3. మకరధ్వజ ఇవోత్పన్న విగ్రహః (మకరధ్వజునివలె నష్టమైన విగ్రహము కలవాడు).

మన్మథుడు నశించిన విగ్రహము (శరీరము) కలవాడు. తారాపీడుడు నశించిన విగ్రహము (యుద్ధము) కలవాడు. అతనితో ఎవరును యుద్ధమునకు సాహసింపరని భావము.

ఇట్టివి అనేకములు కాదంబరిలో కనపడును.

## 12. 6. 2. విరోధాభాసము

సామాన్యముగా ఆలంకారికులు చెప్పు విరోధాభాసము ఒకయలంకారము ఉండగా[1] గద్యకవులు శ్లేషచేత పరిహారముకల ఒక విరోధాలంకారవిశేషమును ఎక్కువగా మన్నింతురు. ఈజాతి విరోధాలంకారమును ఒక విద్యానాథుడు మాత్రము పేర్కొనియున్నాడు.

ఇందు ఒకవిశేష్యమునకు రెండు విశేషణములను వాడుటయు ఆవిశేషణములకు అర్థవైరుద్ధ్యము కనపడుటయు లక్షణము. ఒకవిశేషణమునకు శ్లేషవలన మరియొక యర్థము సంభవింపగా విరోధమునకు పరిహారమగును.

విశేషణముల ప్రసిద్ధార్థములకు విరోధమును ఒకదానియప్రసిద్ధార్థముచేత పరిహారమును ఏర్పడుట గొప్పకవుల పద్ధతి.

---

1. భామహాలంకారమున విరోధాలంకారము —

గుణస్య వా క్రియాయా వా విరుద్ధాన్యక్రియాభిధా ।
యా విశేషాభిధానాయ విరోధం తం విదుర్బుధాః ॥ (౩ - ౨౫)

ఇది ఆంగ్లమున Oxymoronకు సరిపోవును. దండి మతమున విరోధాలంకారము వేరు—

విరుద్ధానాం పదార్థానాం యత్ర సంసర్గదర్శనమ్ ।
విరోధదర్శనాయైవ స విరోధః స్మృతో యథా ॥

(కావ్యాదర్శము - 2. 333)

ఇది ఆంగ్లమున Antithesisకు సరిపోవును సుబంధు బాణాది గద్యకవుల విరోధాభాసము శ్లేషమూలకము. దానిని ప్రాచీన లాక్షణికు లెవరును పేర్కొనలేదు. వామనుడు, ఉద్భటుడు కూడ అట్లే. విద్యానాథుడు ప్రతాపరుద్రయశోభూషణమున మాత్రము శ్లేషమూలకవిరోధమును పదిరకములుగ చెప్పియున్నాడు. అందు 'సార్వభౌమోఽపి అమదః, భాస్వానపి కలానిధిః' వంటివి గద్యకవులు ఎక్కువగా ప్రయోగింతురు. 'సాహిత్యదర్పణము'న ఇది లేదు.

గద్యకవులు పెద్ద వర్ణనలలో శ్లేషోపమలు వరుసగ చెప్పి పిదప శ్లేషమూలక విరోధాభాసములు చెప్పుట వాడుక.

## ఉదాహరణములు

(క) శబరసేనాపతివర్ణనమున — సేనాపతి వాక్యకర్మ, కర్మవిశేషణములలో విరోధభ్రాంతి.

1. అభినవయౌవనమపి క్షపితబహూనయసం.

'నవయౌవనుడయినను చాలయేండ్లు గడచినవానిని.' ఇందు యౌవనము నకును ముసలితనమునకును విరోధము. కాని క్షపిత = 'పంపివేసిన' అనుటను ధ్వనిచేత 'చంపిన' అను అర్థమును, వయస్ = పక్షి అను అర్థమును, గ్రహించిన 'క్షపితబహూనయసం' అను విశేషణము 'చంపిన బహుపక్షుల కలవానిని' అనగా అనేకపక్షులను చంపినవానిని అని శబరవిశేషణముగ సరిపోవును. శ్లేషచేత విరోధము పరిహృతము.

2. కృష్ణమ ప్యసుదర్శనం.

'కృష్ణుడయినను సుదర్శనచక్రములేనివానిని.' కృష్ణునికి సుదర్శనము లేకుం డుట విరోధము. కాని కృష్ణశబ్దమునకు 'నల్లని' అను అర్థము గ్రహించిన 'నల్లని వాడయ్యు చక్రములేనివానిని' అని విరోధభ్రాంతి పోవును.

(గ) ఉజ్జయినీవర్ణనమున — ఉజ్జయిని వాక్యకర్త. కర్తృవిశేషణములలో విరోధభ్రాంతి.

1. రక్తవర్ణాఽపి సుధాధవలా.

'ఎఱ్ఱనిదైనను సున్నమువలె తెల్లనిది' అని విరోధము. కాని 'రక్తవర్ణా' అనుటను 'పరస్పరము అనురక్తులయిన నాలుగువర్ణముల ప్రజలను కలది' అని యర్థముచేసిన విరోధము తొలగును.

2. బహుప్రకృతిరపి స్థిరా.

అనేకప్రకృతులున్న చంచలమగును కాని స్థిరకాదు. ప్రకృతిశబ్దమునకు ప్రజ యను అర్థము గ్రహించిన స్థిరత్వముతో విరోధము పోవును.

12. 6. 3. పరిసంఖ్య[1]

గద్యకవులు ఎక్కువగ ఆదరించిన పరిసంఖ్యాలంకారము రెండు విధములు.

మొదటివిధము — ప్రకృతపు వర్ణితవస్తువులో ఒకయవాంఛితమో దోషమో లేదనుటకు తదర్థకమైన పదముమీది శ్లేషచేత మరియొక యప్రకృతవస్తువునందే ఉన్నట్లు చెప్పుట. ఇందు ప్రకృతవస్తుప్రశంస అధ్యాహార్యము.

ఉదాహరణములు

(క) శూద్రకుని పాలనమున ప్రజలయందు — ఇచ్చట ప్రజలు ప్రకృత వస్తువు.

1. చిత్రకర్మసు వర్ణసంకరాః

'వర్ణసంకరము (రంగులు కలియుట) చిత్రకళలో'. అనగా వర్ణసంకరము (నాలుగువర్ణములవారును తమధర్మములను విడనాడుట) ప్రజలలో లేదు అని ధ్వని.

2. శాస్త్రేషు చింతా

'చింత (ఆలోచన) శాస్త్రములందు.' చింత (శోకము) ప్రజలలో లేదు అని.

3. చాపేషు గుణచ్ఛేదాః

'గుణచ్ఛేదములు (అల్లెత్రాళ్ల తెగుట) విండ్లయందు.' గుణచ్ఛేదములు (మంచిగుణములు నశించుట) ప్రజలలో లేదు అని.

4. ధ్వజేషు ప్రకంపాః

'ప్రకంపములు (కదలికలు) జెండాలయందు' ప్రకంపములు (భయమున వణకుటలు) ప్రజలయందు లేవు. అనగా ప్రజలు నిర్భయముగ ఉందురని భావము.

---

1. దీనిని భామహుడు, దండి చెప్పలేదు. ప్రతాపరుద్రీయమునను సాహిత్య దర్పణమునను కలవు. సాహిత్యదర్పణమున బాణుని వాక్యమే 'చిత్రకర్మసు వర్ణ సంకరాః ... ఇత్యాది' ఉదాహృతము.

రెండవవిధము — ప్రకృతపు వర్ణితవస్తువులోని వివిధాంశములలో ఒక ధర్మము ఒకయంశమున ఉచితమును మరియొకయంశమున అనుచితమును కాగా ఆ ధర్మవాచకముపై శ్లేషచేత ఒకచోట ఉన్నది మరియొకచోట లేదు అనుట.

ఉదాహరణములు

జాబాలియాశ్రమమున — ఆశ్రమము ప్రకృత వస్తువు.

1. మలినతా హవిర్ధూమేషు న స్వభావేషు

'మలినత హోమపు పొగలలో, (తాపస) స్వభావములలో కాదు.' మలినత (నలుపు) పొగలో ఉచితము కావున ఉన్నది. తాపసస్వభావములలో మలినత (దుష్ట గుణము) అనుచితము కావున లేదు. తాపసులు నిర్మలస్వభావులని గమ్యము.

2. తీక్ష్ణతా కుశాగ్రేషు న స్వభావేషు

'తీక్ష్ణత దర్భలకొనలలో (తాపస) స్వభావములలో కాదు.' తీక్ష్ణత (సూదిగ పొడుచు గుణము) దర్భల కొనలలో ఉచితము కావున ఉన్నది. తాపసస్వభావములలో తీక్ష్ణత (కరకుతనము) అనుచితము కావున లేదు. తాపసస్వభావము శాంతము అని గమ్యము.

3. ముఖరాగాః శుకేషు న కోపేషు

'ముఖరాగములు చిలుకలలో (తాపసుల) కోపములలో కాదు.' ముఖరాగ ములు (ముఖములందు ఎఱ్ఱనికాంతులు) చిలుకలలో ఉచితము కావున ఉన్నవి. ముఖ రాగములు (ముఖము కోపమున ఎఱ్ఱగ అగుటలు) తాపసులకు అనుచితము కావున లేవు. తాపసులకు కోపముచేత ఎప్పుడును ముఖములు ఎఱ్ఱగ కావు అని గమ్యము.

12. 6. 4. ఈ శ్లేషానుప్రాణితములగు ఉపమావిరోధపరిసంఖ్యాలంకారములను సుబంధువు, బాణుడు సముచ్చయములుగనే ప్రయోగించియున్నారు. కొన్ని శ్లేషోపమల పరంపర, తరువాత విరోధాలంకారములపరంపర, తరువాత పరిసంఖ్యలపరంపర — ఇది గద్యకవి భంగిభణితి. బాణుడు వీనిని విస్తారముగ ప్రయోగించియున్నాడు. ఇవి గద్యమును ఆశ్చర్యజనకము చేసి కవిప్రతిభావ్యోతకము లగుచున్నవి.

12. 7. బాణునియుపమలలో శ్లేషోపమ కాక గుర్తింపదగిన ఉపమావిశేషము మాలోపమ (లేక రశనోపమ).[1]

(క) అనేకోపమానములను ఒకేయుపమేయమునకు జోడించుట మాలోపమ అని యొకనిర్వచనము.

ఉదాహరణము —

హిరణ్యగర్భో భువనాండకాదివ, క్షపాకరః క్షీరమహార్ణవాదివ ।
అభూత్ సుపర్ణో వినతోదరాదివ, ద్విజన్మనా మర్థపతిః పతిస్తతః ॥
(కాదంబరీ పీఠిక, 13)

ఇచ్చట అర్థపతి యను బాణునితాత పుట్టుక బ్రహ్మ చంద్ర గరుత్మంతుల పుట్టుకలతో వరుసగా పోల్పబడినది.

(గ) కొందరిమతమున మాలోపమ అనగా ఒకయుపమలోని ఉపమానము తరువాతియుపమకు ఉపమేయమగుచు పోవుట. కాదంబరిలో —

1. క్రమేణ చ కృతం మే వపుషి,

వసంత ఇవ మధుమాసేన, మధుమాస ఇవ నవపల్లవేన, నవపల్లవ ఇవ కుసుమేన, కుసుమ ఇవ మధుకరేణ, మధుకర ఇవ మదేన,

---

1. మాలోపమ, రశనోపమ అను అలంకారములను గురించి లాక్షణికులకు ఏకాభిప్రాయము లేదు. దండి మతమున,

పూర్ణ్యాతప ఇవాహ్నీవ పూషా వ్యోమ్నీవ వాసరః ।
విక్రమస్త్వయ్యధాల్లక్ష్మీ మితి మాలోపమా మతా ॥
(కావ్యాదర్శము 2-42)

భోజుని 'సరస్వతీకంఠాభరణము'న 'ఉత్తరోత్తర ముపమేయానా ముపమానత్వాత్ - రశనోపమా'

విశ్వనాథుని 'సాహిత్యదర్పణము'న మాత్రము మాలోపమ, రశనోపమ అను పేర్లతో పైన ఉదాహరించిన బాణుని ప్రయోగములకు క్రమముగ లక్షణములు చెప్పబడియున్నవి. పూర్వలాక్షణికులు మాలోపమను రశనోపమను ప్రత్యేకముగ గుర్తించినట్లు లేదు. వారికి 'మాలా' 'రశనా' పదములు ఏకార్థకములుగ తోచి యుండవచ్చును.

నవయౌవనేన పదం.[1]

ఇచ్చట 'మే వ పుషి నవయౌవనేన పదం కృతం' అని వాక్యసంబంధము.

2. అథ ముహూర్తాదివ తం,

తస్య రూపస్యైవ యౌవనం, యౌవనస్యైవ మదనకేతనం, మదనకేతనస్యైవ వసంతసమయం, వసంతసమయస్యైవ దక్షిణానిలం ...... అపశ్యమ్.[2]

12. 8. లాక్షణికులు గుర్తింపకున్నను మాలోపమవలె 'మాలోత్ప్రేక్ష'యు సాధ్యమే. దానిని సుబంధువు, బాణుడు వాడియున్నారు. ఇందు ఒకేయుపమేయము అనేకోపమానములతో 'అన్యతాదాత్మ్య సంభావనము' చేయబడును. దీనికి ఉదాహరణములు 'స్తంభితేవ లిఖితేవ ...' ఇత్యాది బాణుని భాషావిశేషము లనుకీర్తిక్రింద (11. 4. 2, క, గ, చ) చూడనగును.

మరికొన్ని యుదాహరణములు

(క) 'ఉపశాంతవచసి శుకనాసే, చంద్రాపీడ స్తాభి రుపదేశవాగ్భిః ప్రక్షాళిత ఇవ, స్వచ్ఛీకృత ఇవ, నిర్మృష్ట ఇవ, అభిషిక్త ఇవ, అభిలిప్త ఇవ, అలంకృత ఇవ, పవిత్రీకృత ఇవ, ఉద్భాసిత ఇవ ప్రీతహృదయః ......[3]'

(గ) (పుండరీకుడు విరహమునమున్న లతామండపము)

'...... నిరంతరతయా కుసుమమయఇవ, పరభృతమయఇవ, మయూరమయఇవ, మధుకరమయఇవ, అతిమనోహరే ...... లతాగహనే .... ... [4]'

(చ) (ఆమండపముననే పుండరీకుని)

'........ ఆవిష్టమివ, మహాభూతాధిష్ఠితమివ, గ్రహగృహీతమివ, ఉన్మత్తమివ, ఛలితమివ, అంధమివ, బధిరమివ, మూకమివ, విలాసమయమివ, మదనమయమివ ...... తమద్రాక్షమ్.[5]'

---

1. కాశీప్రతి, పుట 221; వావిళ్ల, 138.
2. కాశీప్రతి, పుట 288; వావిళ్ల, 145.
3. కాశీప్రతి, పుట 180; వావిళ్ల, 106.
4. కాశీప్రతి, పుట 240; వావిళ్ల, 147.
5. కాశీప్రతి, పుట 241; వావిళ్ల, 148.

12. 9. దీపకము ఒకప్పుడు ప్రసిద్ధాలంకారము. భరతనాట్యశాస్త్రమున నాలుగే అలంకారములు చెప్పబడగా అందు దీపకమొకటి. బాణుడును 'దీపకోపమైః' అని కథా కావ్యమునకు ముఖ్యముగ దీపకప్రశంస చేసియున్నాడు.[1]

అయినను కాదంబరి పూర్వార్ధములోగాని, హర్షచరితములోగాని దీపకాలంకార ప్రాచుర్యము కనబడదు. ప్రాచుర్యము లేకపోయె, మచ్చునకును సరియైనది లేదు. కాదంబరిలో ప్రత్యక్షరాలంకారాన్వేషణము చేసిన ఎచ్చటనైన ఉండునేమో ? దీపక శబ్దముమీది శ్లేషకై బాణుడు దానిని తన కథాలక్షణముగ చెప్పెననుకొనవలెను. 'రూపకోపమైః' అనిన సత్యమయ్యేడిది.

12. 10. 'వక్రోక్తి' అనదగిన అర్థాలంకారములను అనేకములను బాణుడు కాదంబరిలో ప్రయోగించియున్నాడు. శబ్దాలంకారములును అచ్చటచ్చట కనబడును.

కాని బాణుడు శబ్దాలంకారప్రియుడనియు, శబ్దాలంకారమునకు అర్థమును త్యజించువాడనియు ఒకదురభిప్రాయము 'కాదంబరి'ని కాని 'హర్షచరిత'మును కాని సరిగా చూడనివారియందు కనబడును. బాణుడు దీర్ఘసమాసములు ప్రయోగించుట చేత చదువునపుడు గొప్ప శబ్దోత్సాహము తోచును. కొన్నియెడల శబ్దాలంకారములును ఉన్నవి. బాణుడు శబ్దాలంకారముకొరకు ప్రాకులాడినట్లు మాత్రము ఎచ్చటను తోచదు. అసలు మృదుశబ్దములకుగూడ అతడు ప్రయత్నించినట్లు లేదు. అర్థగాంభీర్యము, శ్లేషవైభవము అతనికి ప్రియములు.

ఈశబ్దాలంకారములను పలువిధములుగ శాస్త్రకారులు విభజించి చెప్పినను అందు ముఖ్యమైనగుణము ఆస్యప్రయత్నాదిసామ్యములుగల యక్షరములు, లేక కొన్ని యక్షరములే మరలమరల పలుమారు, వాక్యమున వినబడుట. దీనికి 'యమకము, అనుప్రాసము' అనుపదములు లాక్షణికపరిభాషలో కలవు. దీని సూక్ష్మభేదములు అంతప్రయోజకములు కావు.

ఉదాహరణములు (కాదంబరి)

1. సారసితమదసారసమ్.

2. లతామండపతల శిఖండిమండలారబ్ధ తాండవాభిః మధుకరకుల కలంకకాలీకృత కాలేయ కుసుమ కుడ్మలేషు.

---

1. చూ. 4. 14.

3. ఆలోల లోధ్ర లవలీలవంగ పల్లవైః ...

4. అనశనేన హుతాశనేన.

5. ఒకేవిభక్త్యంతముగల పదములు సంస్కృతమున వరుసగ వచ్చిన ఒక శబ్దాలంకారభ్రమ కలుగును.[1] —

తిరోహితనీలిమ్ని వ్యోమ్ని.

అతపేన ముచ్యమానేషు దిఙ్ముఖేషు, ఇత్యాది.

బాణుని 'హర్షచరితము' లో శబ్దాలంకారములు కొంత యెక్కువ. అది తొలి కృతి. 'కాదంబరి' వ్రాయునాటికి అతనికి శబ్దాలంకారములమీద గురితగ్గినదని చెప్పవచ్చును.

12. 11. ఆర్థికశాబ్దికవక్రోక్తివిచార మయినపిదప కవిత్వములో మిగిలినది స్వభావోక్తి.[2] 'జాతిరగ్రామ్యా'[3] అని బాణుడు ప్రత్యేకముగ చెప్పిన అలంకారముమీద అతనికి తగిన గౌరవము కలదు. కాదంబరిలోని వర్ణనలలో వక్రోక్తులమధ్య స్వభావోక్తులను కనబడుచునేయుండును. స్వభావోక్తి వక్రోక్తికి విపరీతము.[4] అటులని

1. చూ. 3 11. (గ). రుద్రదామునిశాసనము.

2. స్వభావోక్తిని భామహుడు,

స్వభావోక్తి రలంకార ఇతి కేచిత్ ప్రచక్షతే।
అర్థస్య తదవస్థత్వం స్వభావోఽభిహితో యథా॥

(భామహాలంకారము, 2-93)

3. దండియు

నానావస్థం పదార్థానాం రూపం సాక్షా ద్వివృణ్వతీ।
స్వభావోక్తిశ్చ జాతిశ్చే త్యాద్యా సాఽలంకృతిర్యథా॥

(కావ్యాదర్శ. 2-8.)

దండి నిర్వచనమున జాతియు, స్వభావోక్తియు నొకటే.

4. విద్యానాథుడు,

'స్వభావోక్తిరసౌ చారు యథావ ద్వస్తువర్ణనం నిబధ్యతే సా స్వభావోక్తిః' ఇందుపై రత్నాపణవ్యాఖ్యలో 'వక్రోక్తివిపర్యయేణ స్వభావోక్తిం లక్షయతి'. (ప్రతాపరుద్రీయము, వావిళ్ల ప్రతి, పుట 352).

అతిసామాన్య విషయమును అత్యంతసరళముగ చెప్పిన అది పామరభాషణ మగును. అందులోను శబ్దశుద్ధిలేకున్న అది గ్రామ్యమగును.[1] అది కవ్యుక్తి కానేరదు. అది అలంకారమగుటకు 'అగ్రామ్యము' కావలయును కావుననే బాణుడు 'జాతిర గ్రామ్యా' అనియు 'సుజాతయః' అనియు విశేషించి స్వభావోక్తిని చెప్పియున్నాడు.[2]

'కాదంబరి' లో స్వభావోక్తి — ఉదాహరణములు.

1. వైశంపాయనశుక జన్మకథనమున —

ఏకస్మింశ్చ జీర్ణకోటరే జాయయాసహానివసతః, పశ్చిమే వయసి వర్తమానస్య కథమపి పితు రహమేకో విధివశాత్ సూను రభవమ్ । అతిప్రబలయా చాభిభూతా మమైవ జాయమానస్య ప్రసవవేదనయా జననీ మే లోకాంతరమగమత్ । అభిమత జాయావినాశదుఃఖితోఽపి ఖలు తాతః సుతస్నేహా దంతర్నిగృహ్య పటుప్రసరమపి శోక మేకాకీ మత్సంవర్ధనపర ఏవాభవత్[3] । ...... (మరల పోషణవిధానము) ...

పరపీడనిపతితాభ్యః శాలివల్లరీభ్య స్తండులకణానాదాయ తరుమూలనిపతితాని చ శుకకులావదలితాని ఫలశకలాని సమాహృత్య పరిభ్రమితుమశక్తో మహ్యామదాత్ । ప్రతిదివస మాత్మనా చ మదుపభుక్తశేష మకరో దశనమ్ ।[4]

2. రాజకులవర్ణనమున — కోతులచేష్టలు.

---

1. 'పామరవ్యవహారైకసిద్ధం గ్రామ్య ముచ్యతే'
(ప్ర. రు. దోషప్రకరణము శ్లో. 7)

2. 'జాతిరగ్రామ్యా' హర్షచరిత పీఠిక, పద్యము 8. 'సుజాతయః' కాదంబరీపీఠిక, పద్యము 9.

గమనిక : పై యుదాహరణములు గొప్ప విమర్శకులు ఉల్లేఖించినవే. అయినను అలంకారముల విషయమున ఏకాభిప్రాయము లాక్షణికులలోనే అప్పుడప్పుడు కనపడదు. ఒకడు స్వభావోక్తి అనగా మరియొకడు కాదనవచ్చును. శుకజనన సందర్భమును కథనమేకాని అలంకారము కాదు అనువారుండవచ్చును. స్వభావోక్తిని సరళోక్తిని వేరుచేయుట కష్టము. విద్యానాథుడు 'చారుయథావద్వస్తువర్ణనం' అనుటలో 'చారు' అనునది ముఖ్యము.

3. కాశీ ప్రతి, పుట 49; వావిళ్ల, 26.

4. కాశీ ప్రతి, పుట 49; వావిళ్ల, 26.

అశ్వమందురాపరిభ్రష్టాగతై రవలుప్తభవనదాడిమీఫలై రాఖండితాంగణసహకారపల్లవై రభిభూతకుబ్జవామనకిరాతకరతలావచ్చిన్నాని భూషణాని వికిరద్భిః కపిభి రాకులీభూతేన ... సముపేతాభ్యంతరం ... రాజకులం ...[1]

'కాదంబరి' లో ప్రతిపుటయందును ఒకచిన్నవాక్యమో పలువాక్యములసముదాయమో స్వభావోక్తి తగులుచునేయుండును.

12. 12. అలంకారములు నూటికిపైగా కలవు. అందు ఏవోకొన్నితప్ప చాలవరకు బాణభాషలో కలవు. అతనికి రూపకమును ఉత్ప్రేక్షయు ప్రియతరములు, కాళిదాసునికి ఉపమ వలె. బాణుని యుత్ప్రేక్షలను ఏరుట మొదలుపెట్టిన దానికి అంతముండదు. ప్రతివర్ణనములోను అవి రాసులుగ కనిపించును. ఇవి సర్వకవిసామాన్యములు కావున వీనిని చర్చించుటలో పసయుండదని పూనుకొనలేదు.[2]

బాణుని 'హర్షచరితమును', 'కాదంబరి' ని లక్ష్యములుగ చేసి ఒకయలంకార శాస్త్రమునే నిబంధింపవచ్చు నను సూచనతో ఈయలంకార విషయకప్రకరణము సమాప్తము.



1. కాలే ప్రతి, పుట 145; వానిల్ల, 87.

2. అవి వ్యాఖ్యానములలో అయా చోటులలో చెప్పదగినవి.

# 13. కాదంబరీ కావ్య రస చర్చ

13. 1. కావ్యములో రసప్రాధాన్యమును భరతముని మొదలు[1] నేటివరకును అందరు లాక్షణికులును అంగీకరించియు తద్రసవ్యంజకముల విషయములో కొందరు అలంకారములని, కొందరు వ్యంగ్యము లేక ధ్వనియని, కొందరు రీతియనియు, బహువిధములుగ ఊహించియున్నారు.

రసార్ద్రమయిన యాహారము ఎట్లు ఆస్వాద్యమగునో అట్లే నాటకమును అని భరతముని యభిప్రాయము.[2] రసమును గురించి 'కావ్యాత్మ అదియే' అని ఆనంద వర్ధనుడు నిర్ణయింపగా[3] 'రసాత్మకమయిన వాక్యము కావ్యము' అని విశ్వనాథుడు[4] ఇక తిరుగులేని విధముగా నిశ్చయించెను.

---

1. 'నహి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే'
(నాట్యశాస్త్రము 6-31, 6-32 శ్లోకముల మధ్య వచనము)

2. 'యథా బహుద్రవ్యయుతై ర్వ్యంజనై ర్బహుభిర్యుతమ్।
ఆస్వాదయంతి భుంజానా భుక్తం భుక్తివిదో జనాః॥ 32

భావాభినయసంయుక్తాః స్థాయిభావా స్తథో బుధాః।
ఆస్వాదయంతి మనసా తస్మా న్నాట్యరసాః స్మృతాః॥ 33

(అందే)

గమనిక: భరతుడు చెప్పినదంతయు నాటకములో అభినయసంబంధ మయినను ఔపచారికముగ కావ్యమునకును వర్తించును. నాటకము కావ్యము అని సర్వత్ర అంగీకృతము.

3. 'కావ్యాత్మా స ఏవ' (ధ్వన్యాలోకము, 1-5).

4. 'వాక్యం రసాత్మకం కావ్యమ్' (సాహిత్యదర్పణము 1-3)

# 13. కాదంబరీ కావ్య రస చర్చ

13. 2. 1. భరతముని ప్రకారము (నాటకవిషయమున) రసములు ఎనిమిది మాత్రమే.[1] 1. శృంగారము 2. హాస్యము 3. కరుణము 4. రౌద్రము 5. వీరము 6. భయానకము 7. బీభత్సము 8. అద్భుతము. తరువాతి యాలంకారికులు (ముఖ్యముగ శ్రవ్యకావ్యవిషయమున) రసములను తొమ్మిదిచేసి 'కావ్యము నవరసభరితము'[2] అను నభిప్రాయమును గట్టిచేయుచు తొమ్మిదవరసము ఏదియనుటకు కొందరు శాంతము, కొందరు భక్తి, కొందరు ఆనందము అని భిన్నాభిప్రాయములను వెలిబుచ్చియున్నారు.[3]

13. 2. 2. భక్తి, వాత్సల్యము అనునవి శృంగారభేదములే కాని వేరు రసములు కావు అని అనేకులమతము. శృంగారము యువతీయువకుల పరస్పరానురాగము కాగా, 'భక్తి' అల్పునకు అధికునియందు (శిష్యునకు గురువునందు, భక్తునికి దేవునియందు, ఇత్యాది) అనురాగము. 'వాత్సల్యము' అధికునికి అల్పునియందు (గురువునకు శిష్యునియందు, మాతాపితరులకు బిడ్డయందు ఇత్యాది) అని పండితులు నిర్ణయింతురు.

13. 3. లాక్షణికులమతమున శృంగారమో వీరమో ప్రధానరసము (లేక అంగిరసము) కాదగినది. ఇది ముందు నాటకమునకు నిర్ణీతమై తరువాత శ్రవ్యకావ్యమునకును అనుసంధింపబడినది. దీనికి అపవాదముగ భవభూతి తన 'ఉత్తరరామచరిత

---

1. శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః ।
బీభత్సాద్భుత సంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యే రసాః స్మృతాః ॥
(నాట్యశాస్త్రము, 6-15)

కాళిదాసు విక్రమోర్వశీయమున (2-18 పద్యము) "ప్రయోగః ... అష్టరసాశ్రయః" అనుట భరతమతానుసరణమే.

2. 'నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవేర్జయతి'.
(మమ్మటుని కావ్యప్రకాశ, 1)

3. తొమ్మిదిరసములు చాలక కొందరు పదియవరసముగ 'వాత్సల్యము'ను చెప్పగా భోజుడు సరస్వతీ కంఠాభరణమున ఉదాత్తము, ఉద్ధతము అని మరి రెండు చేర్చినందున ఒక 'డజను' రసములయినవి. కాని శ్రవ్యకావ్యమున తొమ్మిది రసములు అనేకులకు సమ్మతము. శాంతరస నిరూపణమునకు చూ. సాహిత్యదర్పణము (3-239, 240).

మున' కరుణమును అంగిగ చేసినా డను వాదము కలదు. కాని ఆనాటకమున సత్యముగ విప్రలంభశృంగారమే కాని. కరుణము ప్రధానరసము కాదు అను నభిప్రాయమును కలదు.[1] కావున నాటకమున శృంగారవీరములే తగిన అంగిరసములు అను మతమే ప్రబలము, లక్ష్యములచేత గ్రాహ్యమును.

13. 4. సంస్కృతమున ఉపలబ్ధనాటకములలో, ప్రసిద్ధకావ్యములలోను అంగిరసముగా శృంగారప్రాచుర్యము ఎక్కువ. 'శృంగారము' అను పదమునకు 'శృంగం = శిఖరము' అను నర్థములో 'ప్రాధాన్యము' ధ్వనించును కాన 'ప్రధానరసము' అని అర్థము చెప్పుదురు. దీనివలన శృంగారము ఒకటియే ప్రధానరసము కాగా, వీరమును నిరస్తమగును.

భరతమునియు రసములపట్టికలో శృంగారమును మొదట పేర్కొనుట, దానిని 'ఉజ్జ్వలవేషకము' 'ఉత్తమయువతిప్రకృతి' అని అది గొప్పదను ధ్వని కల్గించుటయు గుర్తింపదగును.[2] అమరకోశమునకూడ 'శృంగారము, శుచి, ఉజ్జ్వలము' అను పర్యాయపదములు స్మర్తవ్యములు.[3]

13. 5. 1. కాదంబరీకావ్యమున ప్రధానరసము శృంగారము అను విషయమున పండితులలో మతభేదము కనపడదు. కాని సామాన్యపాఠకునికి ఇట్లు తోచవచ్చును,

'ఈకథయంతయు అద్భుతములతో నిండియున్నది. శాస్త్రములు నేర్చినచిలుక కథచెప్పుట, చంద్రాతపముచేత కాముకుడు వాస్తవముగ మరణించుట, అతని శాపముచేత చంద్రునికి మానవజన్మలు కలుగుట, దివ్యుడు వచ్చి మృతదేహమును ఎత్తుకొని

---

1. ఉత్తరరామచరితమున ప్రధానరసమేది యను సుదీర్ఘమును ప్రామాణికమును అగు చర్చ శ్రీ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయ శాస్త్రులవారి ఆంధ్రీకరణ పీఠికయందు కలదు.

2. 'శృంగారో నామ రతిస్థాయి భావప్రభవ ఉజ్జ్వలవేషకః; స చ స్త్రీపుంసహేతుక ఉత్తమ యువతి ప్రకృతిః'

(నాట్యశాస్త్రము 6-45, 6-46 శ్లోకముల మధ్య వచనము)

3. 'శృంగార శ్శుచి రుజ్జ్వలః' (అమరకోశము, ప్రథమ కాండము)

అతీసమున మాయమగుట, మునికుమారుడు గుఱ్ఱమగుట, ప్రియులు రెండు జన్మలు పూర్తిచేసికొని వచ్చువరకు ప్రియలు వేచియుండుట - ఇత్యాది పరివర్తనములు, అద్భుతమైన సరస్సు, దేవాలయములు, విద్యాధరనగరము ఇత్యాది వర్ణనలు, ఈకావ్యమున నున్నవి. కావున ఇందు ప్రధానరసము అద్భుతము.'

ఇది న్యాయమే. భరతుడు అద్భుతరసమునకు చెప్పిన విభాగములు ఇట్టివే.[1] కాదంబరీకథ అసంభావ్యమాహేంద్రజాలముగనుండి అతివిస్మయజనకమగుట నిర్వివాదము.

13. 5. 2. అద్భుతమును గొప్పరసముగ తలచినవారును లేకపోలేదు. సాహిత్యదర్పణకర్త విశ్వనాథుని ప్రపితామహులు 'సహృదయగోష్ఠీగరిష్ఠులు, కవిపండితముఖ్యులు శ్రీమన్నారాయణపాదులవారు' అద్భుతరసప్రమాణత్వమును చెప్పగా ధర్మదత్తుడు (ఏగ్రంథములోనో) ఇట్లు చెప్పినాడట —

"రసమందు సారము చమత్కారము, అంతటను అనుభవింపబడుచున్నది. ఆచమత్కారమునకు సారముగా అంతటను అద్భుతరసము. కావున విద్వాంసుడు నారాయణుడు అద్భుతమును మాత్రమే రసముగా చెప్పినాడు."[2]

13. 5. 3. అటులైన 'కాదంబరి'లో అద్భుతమే ప్రధానరసమేల కారాదు?

అద్భుతరసమును ప్రధానరసముగ ప్రసిద్ధలాక్షణికులెవరును గణింపలేదు. రౌద్రాదులనుకూడ ఎవరును అంగిరసములుగ పేర్కొనలేదు. దీనికి కారణము శాస్త్రముకాదు. సహృదయమనస్తత్త్వమును, లోకానుభవమును వాని ప్రధానత్వము నంగీకరింపవు.

---

1. అద్భుతో నామ విస్మయస్థాయిభావాత్మకః. స చ దివ్యదర్శనేప్సిత మనోరథావాప్త్యుపవనదేవకులాభిగమనాసంభావ్యమాన మాహేంద్రజాల సాధనాదిభి ర్విభావై రుత్పద్యతే.

(నాట్యశాస్త్రము, 6 - 74, 6 - 75 శ్లోకముల మధ్య వచనము)

2. చూ. కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రులవారి ఆంధ్ర సాహిత్య దర్పణము. 3 - 33.

అద్భుతరౌద్రాదులు మనస్సును కొద్దికాలము నింపి తరువాత నశించునవి. అద్భుతరసము నవస్పర్శలో తీవ్రముగనుండి క్రమముగా తగ్గిపోవును. దానికి స్థాయిత్వము తక్కువ. పునఃపరిచయమున తీవ్రతను కోల్పోవురసములు అంగిరసములుగ పనికిరావు.

ఏకావ్యమునకైనను అంగిరసాన్వేషణము చేయునెడ ఆకావ్యమును పలుమార్లు చూడవలయును. అట్లుచేసిన భ్రాంతులు తొలగి వాస్తవమైన ప్రధానరసము గోచరమగును. 'కాదంబరి' నూతనస్పర్శలో అద్భుతరసప్రతిపాదకముగ తోచినను తరువాత శృంగారాంగిగ దృఢమగును.

శృంగారమునకు విప్రలంభరూపమున మిక్కిలి స్థాయిత్వమున్నది. కరుణము లాక్షణికులు చెప్పకపోయినను నిలుకడకలరసము. ప్రధాన రసము కాదగినది. వీరము ఏకాంకములందు మాత్రము అంగిగ తగును. రౌద్రమును అట్లే.

13. 6. శృంగారరసమునకు రెండు అధిష్ఠానములు - సంభోగము, విప్రలంభము.[1] అందు సంభోగశృంగారము నాయికానాయకుల సమాగమమున సర్వసుఖాశ్రయమగును.[2] దానికి విపర్యయముగ విప్రలంభము ఇష్టజనవియోగము, అనగా నాయికానాయకులవియోగమువలన ఇరువురికిగాని, ఒకరికిగాని కలుగు విరహబాధ[3] ఇది బహువిధముల వ్యక్తమగును. బాణుడు శృంగారమును పరిపూర్ణముగ 'కాదంబరి' లో పోషించినను అతనికి విప్రలంభముమీద ఆసక్తియు, శక్తియు ఎక్కువ అని తోచును.

13. 7. కాదంబరీకావ్యపు శృంగారవైభవము తద్రససర్వాధిష్ఠాన సర్వాంగ సర్వాంశములను లోకోత్తరముగ చిత్రించుటలో ఉన్నది. శృంగారమునకు ఇంత విస్తార

1. తస్య (శృంగారస్య) ద్వే - అధిష్ఠానే సంభోగో విప్రలంభశ్చ.
(భరత నాట్యశాస్త్రము, 6 - 45, 6 - 46 శ్లోకముల మధ్య వచనము)

2. తత్ర సంభోగస్తావత్ — ఋతుమాల్యానులేపనాలంకారేష్టజనవిషయవరభవనోపభోగోపవనగమనానుభవన శ్రవణ దర్శన క్రీడా లీలాదిభిర్విభావైరుత్పద్యతే. (అందే)

3. విప్రలంభకృతస్తు — నిర్వేద గ్లాని శంకాసూయా శ్రమ చింతౌత్సుక్య నిద్రా సుప్త స్వప్న విబోధ వ్యాధ్యున్మాదాపస్మార జాడ్య మరణాదిభిరనుభావైరభినేతవ్యః. (అందే)

ప్రయోజకకావ్యము మరియొకటి సంస్కృతమున లేదు. మొదట మహాశ్వేతాపుండరీకుల ప్రణయమున, తరువాత చంద్రాపీడకాదంబరీ ప్రణయమునను శృంగారవిన్యాసము అన్యూనము, అనన్యసామాన్యము.

13. 8. యథాక్రమముగ మహాశ్వేతాపుండరీకుల వృత్తాంతము ముందు విచార్యము. ఇచ్చట శృంగారలక్షణములన్నియు లక్షితములు.

మహాశ్వేతాపుండరీకులకు పరస్పరవీక్షణమున శృంగారభావోత్పాదనమయినది. మహాశ్వేతకు పుండరీకుడు ఆలంబనవిభావము. అతని రూపము, వసంతర్తువు, పారిజాతపరిమళము ఇత్యాదులు ఉద్దీపనవిభావములు కాగా 'చక్షుఃప్రీతి' అను ప్రథమ మన్మథావస్థ మహాశ్వేతకు కలిగినది ---

"...... కన్నార్పమరచి, అరమోడ్పుకన్నులతో, ఓరగ చలించు తెలుపు నలుపుగల కంటిగ్రుడ్లతో, కుడికంట సాభిలాషగ త్రాగివేసినట్లు ...... (ఇత్యాది) ...... అతనిని బహుకాలము చూచితిని.[2]"

ఈసందర్భమున స్తంభాది సాత్త్వికభావములను నిర్వేదగ్లానిశంకాది వ్యభిచారిభావములతో (లేక సంచారిభావములతో) ఉపమానోపమేయవిధిలో బిగించిన అతి మనోహరమయిన వర్ణనము ఉత్ప్రేక్షలలో నున్నది.

"అనంతరము నాహృదయములో మదనునికి చోటిచ్చుటకా అన్నట్లు ఉచ్ఛ్వాసనిశ్వాసములు నిలిచిపోయినవి; హృదయములోని కోరికను పలుకుటకా

---

1. మన్మథావస్థలు -

చక్షుఃప్రీతి ర్మనస్సంగః సంకల్పో ఽథ ప్రలాపితా।
జాగరః కార్శ్య మరతి ర్లజ్జాత్యాగో ఽథ సంజ్వరః॥ 84
ఉన్మాదో మూర్ఛనం చైవ మరణం చరమం విదుః।
అవస్థా ద్వాదశమతాః కామశాస్త్రానుసారతః॥ 85

కొందరు మన్మథావస్థలు పదియందురు. (ప్రతాపరుద్రీయము, రసప్రకరణము)

2. "విస్మృతనిమేషేణ, కించిదాముకులిత పక్ష్మణా, జిహ్మితతరల తారా సారోదరేణ దక్షిణేన చక్షుషా సస్పృహ మాపిబంతీవ ...... త మతిచిరం వ్యలోకయమ్". (కాదంబరి, కాశీ ప్రతి పుటలు 226, 227; వావిళ్ల, 136)

అన్నట్లు చనుమొనలు అదరినవి; స్వేదబిందుసరములచే కడిగివేయబడినట్లు లజ్జ జారి పోయినది; మదనుని వాడిబాణములమొత్తము పడుటచేత భయమొందినట్లు దేహము వడకినది; అతని రూపాతిశయమును తామే తెలిసికొనవలెనని ఉత్సుకతతో అతనిని కౌగలింప ఆసక్తిగల అంగములనుండి రోమాంచజాలము నిక్కవొడిచినది. స్వేద జలముచేత పూర్తిగ కడిగివేయబడినట్లు నాపాదములరాగము (ఎరుపు, ప్రేమ) నాహృదయమును ప్రవేశించినది.[1] ”

తరువాత మహాశ్వేత మనోగతవచనములో మనస్సంగము (మనస్సక్తి) అను రెండవ మన్మథావస్థయు, చింతాశంకాది కొన్నివ్యభిచా ర్యనుభావములును లక్షితములు.

13. 9. ఈవిధముగనే పుండరీకునియవస్థయు అన్వయింపదగును. వీరి సమాగమ మున సంభోగశృంగారము. ఇట ఇద్దరకును కోరినప్రియము కలుగుట (మనోరథైః ప్రియావాప్తి)చే ‘సంకల్పము’ అను మూడవ మన్మథావస్థ అగును. పారిజాతపుష్ప మును పుండరీకుడు మహాశ్వేత చెవినిడుట సంకల్పమునకు కార్యరూపము. మహా శ్వేత ముక్తాహారమునిచ్చుటయు అదియే.

13. 10. ఇరువురును విడిపోయినదిమొదలు ఇరువురికిని సమానావస్థలు. ఇచ్చటి నుండి విప్రలంభము ఆరంభమగును. కపింజలుడు మహాశ్వేతతో చెప్పిన పుండరీకా వస్థావర్ణనములో అతనికి క్రమముగా సంక్రమించిన మదనావస్థలు జ్ఞేయములు. కొద్ది కాలములోనే ఎడబాటువలన పుండరీకుడు ఆమెనే ధ్యానించుచు నాలుగవయవస్థ ‘జాగరము’, అయిదవయవస్థ కామజ్వరమువలని ‘కార్శ్యము (బలహీనము)’ను దాటి ఆరవ మన్మథావస్థయయిన ‘విషయద్వేషము’ను పొందెను. ఇతర విషయ ద్వేషమును ప్రియయందేధ్యానమును కలిగిన ఈయవస్థలో (తపసికి తగనిదగుట) ‘త్రపానాశము’ అను ఏడవయవస్థను పొందెను. ‘ఉన్మాదము’వలన చిత్తవైకల్యము

1. అనంతరం చ మే ఉంతర్మదనావకాశమివ దాతుం మోహితః సంతానా నిరీయుః శ్వాసమరుతః, సాభిలాషం హృదయ మాఖ్యాతుకామమివ స్ఫురితమాఖము భూత్ కుచయుగలమ్. స్వేదసలిల అవలేఖా క్షాలితేవాగలల్లజ్జా. మకరధ్వజనిశిత శరనికరనిపాతత్రస్తే వా కంపత గాత్రయష్టిః. తద్రూపాతిశయం ద్రష్టుమివ కుతూ హలా దాలింగనలాలసేభ్యో ఉంగేభ్యో నిరగా ద్రోమాంచ జాలకమ్. అశేషతః స్వేదాంభసా ధౌతశ్చరణయుగలాదివ హృదయ మవిశద్రాగః.

(కాదంబరి. కాశీ ప్రతి, పుట 227; పాఙ్క్తి 137)

కలిగి ఎనిమిదవ అవస్థకు వచ్చెను. అంత సర్వేంద్రియవైకల్యము సిద్ధింపగా చంద్రాతపమును భరింపలేక చంద్రుని శపించి తొమ్మిదవయవస్థ 'మూర్ఛ'లో పడి క్షణములో ప్రాణహానికాగా దశమావస్థ 'మృతి'ని పొందెను.

13. 11. ఈదశమావస్థను ఏకవియు వర్ణింపలేదు. అది చెప్పరాదని లాక్షణికుల మతము[1] కాని ప్రత్యుజ్జీవనము కలదు కావున 'కాదంబరి'లో పుండరీకమృతి వర్ణనము, తదుపరి చంద్రాపీడమృతివర్ణనమును దోషములుకావు. మహాశ్వేతావృత్తాంతమున విప్రలంభము ఎక్కువగా నాయకుడగు పుండరీకునిలోను, కాదంబరీవృత్తాంతములో ఎక్కువగా నాయికయగు 'కాదంబరి'లోను కనపడును. కాదంబరి పాత్రలో సంభోగవిప్రలంభములు పూర్తిగ వికసిల్లగా మహాశ్వేతలో పుండరీకమరణానంతరపు శోకము కరుణమనదగును.

13. 12. కరుణమునకును శృంగారవిప్రలంభమునకును భేదమును భరతమునియే చెప్పియున్నాడు. నిరపేక్షభావమున కరుణమును, సాపేక్షభావమున విప్రలంభమును రెండు వేర్వేరు రసములని భరతమతము.[2]

పుండరీకుని మరణమువలన గుండెపగిలి ఏడ్చుట పుండరీకుడు మరల బ్రతుకునను మాట వినువరకు కరుణమే అగును. కాని దివ్యవాణి చూపినయాశవలన మరల విప్రలంభము కాదగును.[3] మహాశ్వేత దివ్యవాణివలన మరణప్రయత్నము మానినదే కాని పుండరీకుడు మరలవచ్చునను ఆశ అంత సులువుగ నెరవేరునని ఆమెకు తోచ

---

1. చూ. సాహిత్యదర్పణము, కారిక 216. అచట కాదంబరీ చర్చయున్నది. మరియు చూ. కారి: 225.

2. కరుణస్తు — శాపక్లేశ వినిపాతేష్టజనవిప్రయోగ విభవనాశ వధ బంధన సముత్థో నిరపేక్షభావ ఔత్సుక్య చింతాసముత్థః, సాపేక్షభావో విప్రలంభకృతః. ఏవ మన్యః కరుణః, అన్య ఏవ విప్రలంభః.

(నాట్యశాస్త్రము 6-45, 6-46 శ్లోకముల మధ్య వచనము)

3. ఈసందర్భమున సాహిత్యదర్పణమున ఇట్లున్నది — యౌవనవంతులగు ఇరువురు స్త్రీ పురుషులయందు ఒకరు లోకాంతరమునకుబోయి వెండియు దొంకవారైయుండ రెండవవారు దుఃఖపడుట కరుణవిప్రలంభమగును (3-225).

లేదేమో. కావుననే ఆమెదుఃఖము వైరాగ్యముగను, ఆశ భక్తిగను మారినది. ఆమె ఒక తపస్వినియైనది. అట్లు కరుణవిప్రలంభము ఆమెలో దశాపరిణామము పొంది నవమరసమనదగిన శమముగా నైనది.

13. 13. చంద్రాపీడుడు చక్షుఃప్రీత్యాది మన్మథావస్థలను పొందినను ధీరుడుకావున ఎక్కువ వైకల్యమును పొందలేదు. ఒకవేళ పొందువాడయినను బాణునికథనము ఆకస్మికముగ ఆగుటచే మనకు కేవలము ఊహాగానమగును. భూషణుని భాగములోని చంద్రాపీడవర్ణనము ఇచట బాణుని రసపోషణమున అప్రస్తుతము.

కాదంబరీవిరహపు ప్రథమదశలు చంద్రాపీడుని హేమకూటపునర్గమనముచేతను, పత్రలేఖ తరువాత చంద్రాపీడునికి చెప్పిన అసంపూర్ణ కాదంబరీ విరహావృత్తాంతము వలనను, మనకు బాణోక్తులలోనే లభించినది. ఎటులైనను వారిసమాగమశృంగారము పూర్వభాగముననే యున్నది.

13. 14. బాణుని శృంగారపోషణము మిక్కిలి యుదాత్తము. కేవలము దైహికమయిన అసభ్యశృంగారమును బాణుడు స్పృశింపనైన లేదు. కాళిదాసువంటి ఔచిత్యాము పాటించు మహాకవియే 'కుమారసంభవము'న ఆదిదంపతుల సంభోగశృంగార

---

(మిగులు) ఉదా: కాదంబరియందు పుండరీకమహాశ్వేతల వృత్తాంతమున, మరల దొరకని పక్షమున గాని, శరీరాంతరముచే దొరకెడు పక్షమునగాని కరుణమను పేరి రసమే యగును. మరియు 'ఇట ఆకాశవాణి పలికిన యనంతరమే శృంగారము (విప్రలంభము); ఏలన సంగమ ప్రత్యాశచే రతి జనించుట వలన; ప్రథమమందో కరుణమే' అని పెద్దలు తలంతురు.

(కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రులవారి 'ఆంధ్ర సాహిత్య దర్పణము', పుట 93).

అట్లే జగన్నాథుడు రసగంగాధరములో 'యదాతు సత్యపి మృతత్వజ్ఞానే దేవతాప్రసాదాదినా పునరుజ్జీవన జ్ఞానం కథంచిత్ స్యాత్, తదాఽఽలంబనస్యాత్యంతిక నిరాసాభావాచ్చిరప్రవాస ఇవ విప్రలంభ ఏవ, న స కరుణః చంద్రాపీడంప్రతి మహాశ్వేతా వాక్యేషు, కేచిత్తు రసాన్తర మేవాత్ర కరుణ విప్రలంభాఖ్య మిచ్ఛంతి'

(వేదమువారి ఉత్తరరామచరిత పీఠికలోని ఉద్ధృతికి పునరుద్ధారము)

షుమ మైథునపర్యంతము వర్ణించి లాక్షణికుల నిందకు పాత్రుడయ్యెను. శ్రీహర్షుడును నైషధీయచరితమున తుదలో మైథునవర్ణనమును ఉత్సాహముతో చేసెను. బాణుని కథలో వీలులేకపోయెనో లేక అతనికి ఇష్టముకాదో తెలియదుకాని ప్రేయసీప్రియులకు కొంతయెడముంచియే వర్ణించెను. వారి పరస్పరస్పృహను కేవలము మానసికముగనే చిత్రించెను. ఈపద్ధతి గ్రీసుసంప్రదాయమున కలదు. ప్లేటో (Plato) అను గ్రీకు వేదాంతి ఉత్తమమైనప్రేమ మానసికమేకాని దైహికము కాదనెను. అదియే ప్రాచ్య దేశ ప్రాచీనసాహిత్యమునను ఆంగ్లసాహిత్యమునను మానసికప్రేమ (Romantic love) అని ప్రసిద్ధమయినది. బాణుడు అట్టి నిర్మలమయిన ప్రేమను గొప్పగ కాదంబరిలో చూపియున్నాడు.

చంద్రాపీడపత్రలేఖల సంబంధముకూడ చిత్రమయినది. ఇది మిక్కిలి అభారతీయపద్ధతి. మనకావ్యనాయకునెవరును పత్రలేఖవంటి చిన్నదానిని దగ్గర నుంచుకొని ఊరకుండలేరు. ఇందు బాణునికి ఏదైన దేశాంతరసంప్రదాయము ఎవరో చెప్పగా లభించి అది కాదంబరిలో రూపొందినదనియు, మనకవులు తమకుతాము ఇట్టి మడిగట్టుకొనిన మదనవ్యాపారము నొల్లరనియు ఊహించుట[1] తప్పుకాదేమో ?

బాణుని శృంగారపోషణము పాశ్చాత్యులకు మనము గర్వముతో చూపదగిన ప్రక్రియ.

13. 15. శృంగారము 'కాదంబరి'కి ప్రధానరసముకాగా నవరసములలో మిగిలినవి కూడ స్పృశింపబడినవి. రౌద్ర బీభత్సాదులు శృంగారముతో సరిపోవు కావున 'కాదంబరి'లో వానికి ప్రాచుర్యములేదు. అయినను ఉన్నవరకు అంగరసములను ప్రత్యేకముగ పరిశీలింపదగును. వానివరుసలో శృంగారమునకు వెనువెంటనే చెప్పవలసినది హాస్యము.

హాస్యము : సంస్కృతసాహిత్యములో హాస్యరసము తక్కువ. కావ్యములలో సాధారణముగ కనబడదు. నాటకములో విదూషకుని పాత్రలోని హాస్యము ఆధునికులకు నచ్చదు. అతని వికారములు హాస్యమునకుబదులు జుగుప్స కలిగించును.

---

1. అని యాప్తయుం మిత్రుడు, పండితుడు శ్రీ G. C. V. రమణారావు M.A. (V. R. కాలేజి, ఆంధ్రశాఖ)కు గట్టి నమ్మకము.

కాని శృంగారమునకు అనుగుణమయిన హాస్యము కొద్దిపాటి వినోదమును కల్గించి ప్రేయసీప్రియులకు చిరునవ్వు కలిగించువరకే. లాక్షణికులు ఈహాస్యమును శృంగారాంగిమైన విశేషముగనే గ్రహింతురు. హాస్యము శృంగారమునుండి పుట్టిన దని భరతముని మతము.[1] అనగా అది నాయికానాయకభాషణ చేష్టాద్యాశ్రయముగ ఉండవలెను. ఈయర్థమున 'కాదంబరి' లో హాస్యమొకచోట నున్నది. శుకశారికా కలహావృత్తాంతమున[2] శారికయీర్ష్యయు, కోపమును దానిమీద చంద్రాపీడుని నర్మోక్తు లును, అందుపై శుకము చంద్రాపీడుని ఉపాలంభముచేయుటయు సున్నితమయిన హాస్యమునకు ఉదాహరణము.

మనుష్యసహజమైన, శృంగారసంబంధమయిన ఈర్ష్యాక్రోధములను, మనో వికాసబుద్ధిబలములులేని, క్షుద్రపక్షిజాతిపై ఆరోపించుటలోని అసంగతివలన ఈసందర్భ మున హాస్యము జనించుచున్నది.[3]

బాణభాగాంతమునవచ్చు జరద్రవిడధార్మికవర్ణనమును ఉత్తరాది విమర్శకులు గొప్ప హాస్యరసావలంబముగ చెప్పుదురు. ఇందు హాస్యమున్నది, కాని అది సహృ దయపరితోషకము కాదు. దాక్షిణాత్యమునిని జుగుప్సాకరముగ వర్ణించుటలో దూషణ రూపమైన హాస్యము పుట్టుచున్నది. సత్యముగ ఈ ద్రవిడమునిపాత్ర కథకు అనా వశ్యకము.[4] చండికాలయవర్ణనమున భయానకరసమును, ద్రవిడమునిలో హాస్యమును కావ్యములో నవరసత్వస్థాపనమునకు బాణుడు పోషించెనని పండిత P. V. కాణే యభిప్రాయము.

---

1. శృంగారాద్ధి భవేద్ధాస్యః. (నాట్యశాస్త్రము 6-39)

2. చూ. కాలేప్రతి, పుటలు, 294, 295, 296; వానిళ్ల, 186, 187, 188.

3. ఈ శుకశారికోపాఖ్యానముపై మరికొంతచర్చ పరిశిష్టము 1లో నున్నది.

4. దీనినిగురించి ఒక ఆభాణకము కలదు బాణుడు దేశాటనముచేయు కాలమున దక్షిణదేశమునకును (ద్రవిడదేశమునకు) వచ్చెనట. దక్షిణదేశము సంస్కృతకవులకు ప్రసిద్ధము కాకున్నను అచట శాస్త్రములందు ఉద్దండులయిన పండితులుండిరి. వారితో కొన్నివాదములు చేసి, ఓడి, అవమానముతో తిరిగి పోయిన బాణుడు ద్రవిడమునిపాత్రను నీచహాస్యమునకు, జుగుప్సకును నిలయము చేసి తనయక్కసు వెళ్లగ్రక్కెనని కొందరు దాక్షిణాత్యులు అందురు. కాని ఈ కథకు చారిత్రకాధారము లేదు.

13. 16. కరుణము: 1. శోకస్థాయిభావకమయిన కరుణరసప్రస్తావన పూర్వమే శృంగారరసచర్చలో అయినది. ఇది ఎక్కువగ మహాశ్వేతావృత్తాంతమున కలదు. కపింజలుడు పుండరీకునియవస్థను మహాశ్వేతతో చెప్పుటలో, పుండరీకుని మృతికి అతడు వాపోవుటలోను కరుణరసము కలదు. మహాశ్వేతావిలాపములో అతిగంభీరమయిన కరుణ మున్నది. ఇచ్చట పుండరీకదేహము ఆలంబనవిభావము, కపింజలశోకము ఉద్దీపనము, మహాశ్వేత ఏడ్పు అనుభావము.

2. వైశంపాయనశుక కథనమున తండ్రిచిలుక చనిపోవుటయు చిలుకకూన నిస్సహాయతయు కరుణాకరము.

3. కొందరు విమర్శకులు చంద్రాపీడుని మరణమువిన్న కాదంబరీవిలాపమును కూడ కరుణరసపోషణమునకు చెప్పుదురు. కాని ఆభాగము భూషణునిది. దానిని బాణునికి తగిలించుట పొరపాటు.

కరుణమున బాణుడు కాళిదాసభవభూతులను తాకకున్నను వారితరువాత చెప్ప వలసినకవి.

13. 17. వీరము: వీరము శృంగారమునకు అంగముగా ఇముడదు. కావున 'కాదంబరి'లో అది నామమాత్రావశిష్టముగ చంద్రాపీడ దిగ్విజయయాత్రావర్ణనమున కలదు.

బాణుడు వీరరసప్రధానమయిన 'హర్షచరితము'ను రచించుట గుర్తింప దగును. అంగిరసములుగ, ముఖ్యముగ, శృంగారవీరములను లాక్షణికులు చెప్పుటయు బాణుడు ఆరసములకు అనుపమానలక్ష్యములుగ రెండు గద్యకావ్యములు రచించుటయు అతని లాక్షణికదృష్టిని తెలుపుచున్నది.

13. 18. రౌద్రము: ఇది క్రోధము స్థాయిభావముగాగల రసము. శృంగారరస ప్రధానమయిన 'కాదంబరి'లో దీనికి స్థానము లేదు. కపింజలుడు పుండరీకుడు

---

(మిగులు) మరియు, మహావీరుడగు హర్షవర్ధనుడు ఉత్తరదేశమంతయు జయించి నర్మదనుదాటి దక్షిణదేశమును జయించుటకు రాగా అచట బాదామిచాళుక్యరాజు, (రెండవ) పులకేశి ప్రతిఘటించి చావగొట్టి తరిమెనని పులకేశిశాసనమున కలదు. హర్షుని యాస్థానకవులకు దక్షిణదేశముమీద కోపము న్యాయమే.

ప్రేమలోపడినందులకు చీవాట్లుపెట్టుటలో అధర్మవర్తనముపై నైష్ఠికకోపము (Righteous indignation) కనపడునేకాని అది రౌద్రము కాదు. అయినను కపింజలుడు 'దురాత్మక, నావయస్యుని అపహరించుకొనిపోవుదువా?[1]' అని మిక్కిలి కోపముతో దివ్యపురుషుని వెంటబడి ఆకసమున ఎగిరిపోవు ఘట్టములో కొంత రౌద్రస్పర్శ కలదు.

13. 19. భయానకము : ఇదియును శృంగారముతో చేరదు. శబరసైన్యవర్ణనమున, చండికాలయవర్ణనమునను ఈరసము ఒకింత కలుగును. మహాశ్వేతాకాదంబరుల వృత్తాంతమున ఇది విరసముచేయునని బాణుడు దీనిని దూరముగ ఉంచినట్లున్నది.

13. 20. బీభత్సము : జుగుప్సలో పుట్టు ఈరసము శబరసైన్యపువేటలోను జరద్ద్రవిడవర్ణనలోను ఇంచుకకలదు. ఇదియు శృంగారవిరోధియే.

13. 21. అద్భుతము : దీనిచర్చయు శృంగారరససంబంధముననే అయినది.[2] ఇది కాదంబరిలో ఎక్కువగనున్న రసము. శృంగారము అంగి కాగా ఇది తదనుగుణమైన అంగరసమగును.

'కాదంబరి'లో శృంగారము ప్రధానమేకాక విప్రలంభరూపమున విపులముగ ఉన్నది. ఇతరరసములు కావ్యపు నవరసలక్షణమునకై బీజప్రాయముగ నున్నవి.

13. 22. ఈ ప్రకరణమున తుదిమాటగా బాణుని వర్ణనాచాతురీద్యోతకమును, శృంగారసంచారీభావవ్యంజకమును అగు ఒక వాక్యము స్మర్తవ్యము. చంద్రాపీడుడు కాదంబరిని దర్శించినపుడు కాదంబరి లజ్జచేత మహాశ్వేతనే చూచుచు క్రీగంట చంద్రాపీడుని అవలోకించును. అప్పుడు చంద్రాపీడుడు (అతనిరూపము).

"దగ్గరనున్న చెలికత్తెల చెక్కుటద్దములమీద ప్రతిబింబించుటవలన ఈర్ష్యయు, తన కుచతటమున అతని ప్రతిబింబము (గగుర్కొనిన) రోమములవలన చెరగిపోగా విరహమును, అతని చెమటలోతడిసిన ఱొమ్ముపై సాలభంజిక ప్రతిబింబింపగా

---

1. దురాత్మక, క్వ మే వయస్యమపహృత్య గచ్ఛసీ త్యభిధాయోన్ముఖః సంజాతకోపః ...... (ఇత్యాది). (కాశీప్రతి, పుట 261; వావిళ్ల, 164)

2. చూ. 13. 5. 1., 13. 5. 2., 13. 5. 3.

సవతికోపమును, (అతడు) కండ్లు (ఒకక్షణము) మూయగా తనదౌర్భాగ్యమునకు శోకమును, తనయానంద బాష్పములచే తనకు కండ్లు కనపడకపోగా అంధత్వదైన్యమును ... (కాదంబరి అనుభవించెను అని వాక్యసంబంధము.)[1] ”



1. తేనైవ క్షణేన తేనాసన్న సఖీకపోలసంక్రాంతేన ఈర్ష్యాం, రోమాంచ భిద్యమానకుచతట నఖక్షత ప్రతిబింబేన విరహవ్యథాం, స్వేదార్ద్ర స్తనస్థల ఘటిత సాలభంజికాప్రతిమేన సపత్నీరోషం, నిమిషతా దౌర్భాగ్యశోకం, ఆనందజల తిరోహితేనాంధతాదుఃఖమభజత సా.

(కాశీ ప్రతి, పుట, 292; పావిళ్ల, 185. ఇది శ్రీ P. V. కాణే ఆంగ్ల వ్యాఖ్యలో సూచింపబడినది).

ఈర్ష్య (లేక అసూయ), విరహము, సవతికోపము (లేక రోషము), శోకము, (అంధత్వము అను) దైన్యము వ్యభిచారి (లేక సంచారీ) భావములు.

# 14. కాదంబరిలో వర్ణనలు

14. 1. 'కాదంబరి' లోని వర్ణనల వైశిష్ట్యము, ఔచిత్యము, మనోజ్ఞత, ఇత్యాది పరిశీలనమునకుముందు కావ్యములో వర్ణనల ఆవశ్యకత, వర్ణనాసంప్రదాయమును విచార్యములు.

లాక్షణికులమతమున కావ్యమునకు రసము ప్రధానము. తద్రసోత్పాదకములు అలంకారములు. అలంకారములకు కావ్యములోని వ్యక్తివస్తుచేష్టాదివర్ణనములు ఆలంబములు. వర్ణనలు రసపాత్రము లనవచ్చును.

వర్ణనలు కవిత్వములో సహజాంశములు. దైవతములుగ ప్రకృతిశక్తులను ఆరాధించు ప్రాచీనమానవసంఘములలో స్తుతిరూపముగ కవిత్వము పుట్టినట్లు తార్కాణము లున్నవి. అట్టిసంఘములలో మిక్కిలిప్రాచీనమును, పుష్కలముగ దైవస్తుతి కవిత్వము కలదియును అగునది భారతదేశములోని ప్రాచీనార్యసమాజము. వారి ఋగ్వేదసంహిత ప్రకృతిశక్తుల వర్ణనలతో కూడిన అతిప్రాచీనగ్రంథము. భారతదేశమున ఈవర్ణనలే తరువాతికాలపు వివిధకవిత్వరీతులకు బీజములు.

కాని వర్ణనలను ముఖ్యమయిన కావ్యాంశముగ లాక్షణికులు ఎప్పుడు గుర్తించిరో తెలియదు. మిక్కిలి ప్రాచీనమయిన అలంకారశాస్త్రములు ఏవియు ఇప్పుడు లేవు. భరతనాట్యశాస్త్రము ప్రాచీనమని అనేకులు చెప్పుదురు.[1] కాని అందు శ్రవ్యకావ్యలక్షణములు లేవు. కావున బాణునినాటికి ఒక లాక్షణికవర్ణనాసంప్రదాయము ఏర్పడియుండెనో లేదో స్థిరముగ చెప్పలేము. కాని అప్పటికి ప్రసిద్ధములయిన కావ్యములలో వర్ణనలు విందుగనే యున్నవి. వాల్మీకి, కాళిదాసు మొదలగువారి కావ్యములలో అనేకవర్ణనలు కలవు.

---

1. సాహిత్యకచారిత్రికులు భరతశాస్త్రము అంత ప్రాచీనము కాదందురు. వారియభిప్రాయమున భామహుడు, దండి మనకు తెలిసిన ప్రాచీనాలంకారికులు. వారిలో భామహుడే పూర్వుడని అనేకుల యభిప్రాయము.

## 14. 2. వాల్మీకి - బాణుడు

విస్తారమయిన వర్ణనలను భారతీయార్యవాఙ్మయమున మొదట ప్రయోగించిన లౌకికకవి వాల్మీకి. వర్ణనలబాహుళ్యముచేతను రసాధిక్యమువలనను 'రామాయణము' ఆదికావ్యమయి వాల్మీకి 'ఆదికవి' అయ్యెను. లేకున్న 'రామాయణము' కూడ భారతమువలె ఇతిహాసమో పురాణమో అయ్యెడిది.

బాణుడు హర్షచరితారంభమున పూర్వకవిస్తుతిలో వ్యాసభాస కాళిదాసాదుల నెందరనో స్తుతించి వాల్మీకిపేరును మరచుట చిత్రము. కాని 'కాదంబరి' లో పలు చోటుల రామాయణ కథాంశశ్రుతి ఉండుటచేత బాణునికి 'రామాయణము' తెలియదనుటకు వీలులేదు.[1]

వాల్మీకిని చెప్పకుండుట కేవలము ప్రమాదజనితమని తలపకతప్పదు. అతిపరిచయముచేత, అత్యంతభక్తివలన ఒకవ్యక్తిని మరచుట మానవనైజము.[2] 'కాదంబరి' లో వర్ణనలవైనము, విప్రలంభశృంగారపోషణము రామాయణప్రభావితములనుట స్పష్టము. గద్యకావ్యరీతిని బాణుడు సుబంధువునుండి గ్రహించినను, కవిత్వవిషయమునమాత్రము అతనికి వాల్మీకియు కాళిదాసును గురువులు.

## 14. 3. వర్ణనలు - ఆలంకారిక సంప్రదాయము

కావ్యమునకు నవరసత్వమువలె అష్టాదశవర్ణనలును ఒకలక్షణమని అవిచారిత సత్యముగ సాహిత్యప్రియులు గ్రహించియున్నారు. వాల్మీకి 'రామాయణము' లభ్యము

---

1. వింధ్యాటవీవర్ణనమున, 'జానకీవ ప్రసూతకుశలవా', పంచవటి వర్ణనము, అందులో 'యత్ర చ దశరథవచనమనుపాలయన్నుత్సృష్టరాజ్యో దశవదనలక్ష్మీవిభ్రమవిరామో రామో, మహామునిమగస్త్యమనుచరన్, సహ సీతయా లక్ష్మణోపరచితరుచిరపర్ణశాలః పంచవట్యాం కంచిత్కాలం సుఖమువాస' (ఈ వాక్యములో $2\frac{1}{2}$ కాండల రామాయణమున్నది) ఇట్లే పలుతావుల.

2. పెండ్లిపత్రికలు పంపునపుడు ఒకొక్కప్పుడు అత్యాప్తులను మరచి, వారు రాకపోగా, తరువాత ఎదురుపడినపుడు పెండ్లికి రాలేదని ఆక్షేపించి, సత్యము తెలియగానే మిక్కిలి లజ్జాకరమును అసమర్థనీయమును అగు స్థితిలో పడుట, అనేకులకు అనుభవమే. బాణుని ఎవరైన 'వాల్మీకిని మరచితివే' అని అడిగియుండిన అతడును త్రపాహతుడయి యుండునని భావింపదగును.

లగు అలంకారశాస్త్రము లన్నిటికన్న ప్రాచీనమగుటవలన, వాల్మీకి చేసిన వస్తు, స్థితి, వ్యక్తి, చేష్టా, ఘటనాది వర్ణనముల వివిధాంశములు, బహుభంగులును తరువాతి కవులకును అలంకారికులకును విశిష్టలక్ష్యములై వానినుండియే ఆలంకారికుల వర్ణనల పట్టీ తయారయినదని చెప్పుటకు అవకాశమున్నది. రామాయణమున పురరాజప్రజా వనర్తుశైలసరఃసాగరాదివర్ణనలు ఎన్నియో విస్తారముగ కలవు. వీనిలో కొన్నిటిని తీసికొని, సంభోగశృంగారప్రధానములగు కావ్యముల ప్రాచుర్యమువలన ఉద్యాన సలిలక్రీడారతాదికములను మరికొన్నిటిని చేర్చి, ఒక లాక్షణికవర్ణనానుక్రమణికను ఆలంకారికులు ఏర్పరచియుందురు. కాని అట్టి అనుక్రమణికకు అష్టాదశత్వము ఎప్పుడు కలిగెనో నిర్ణయించుట సుకరముకాదు.

## 14. 4. అష్టాదశవర్ణనాసంప్రదాయవిచారము

(క) ఉపలబ్ధాలంకారశాస్త్రములలో శ్రవ్యకావ్యచర్చ మొదట భామహుని 'కావ్యాలంకారము' లో కలదు. అందు —

"మంత్రము, దూతము, ప్రయాణము, ఆజి, నాయకాభ్యుదయము.[1]"

అనునవి కావ్యములో ఉండునని భామహుడు చెప్పియున్నాడు. ఇవి అయిదు విషయములు మాత్రమే. భామహుడు వానిని 'వర్ణనలు' అనలేదు. అతనికి అష్టాదశవర్ణనల సంగతి తెలియదు.

(గ) భామహుని వెనువెంటనే చెప్పవలసిన దండి తన 'కావ్యాదర్శము' న పదునెనిమిదివర్ణనల పట్టీని పొందుపరచియున్నాడు —

1. నగరము 2. అర్ణవము 3. శైలము 4. ఋతువులు 5. చంద్రోదయము 6. అర్కోదయము (అను వర్ణనలతో) 7. ఉద్యానము 8. సలిలక్రీడ 9. మధుపానము 10. రత + ఉత్సవము (అనువానితో) 11. విప్రలంభము 12. వివాహములు 13. కుమారోదయము (అను వర్ణనలతో) 14. మంత్రము 15. దూత 16. ప్రయాణము 17. ఆజి 18. నాయకాభ్యుదయము (అనువానితోను అలంకృతము ...... కావ్యమగును అని దండి యాశయము.)[2]

---

1. 'మంత్రదూత ప్రయాణాజినాయకాభ్యుదయైః చ యత్'

(భామహాలంకారము 1 - 20)

2. నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయవర్ణనైః।
ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవైః॥

ఇందు పదియవదైన రతోత్సవమును 'రతము, ఉత్సవము' అని విరిచిన వర్ణనలసంఖ్య పందొమ్మిది యగును. దండి ఎచ్చటను ఈవర్ణనలు పదునెనిమిదని చెప్పలేదు.

మరియు 14 నుండి 18 వరకును చెప్పిన అయిదు విషయములు, భామహునివి, అట్లే సమాసమునుగాని విభక్త్యంతమునుగాని మార్పక దండి గ్రహించుట[1] గుర్తింపదగును. దండి భామహునికి తరువాతివా డను అభిప్రాయమున, వారిరువురిమధ్య కొలది కాలములో వర్ణనలజాబితా విస్తరించినదని బోధపడుచున్నది.

ఈయష్టాదశత్వము పురాణములకు మహాభారతపర్వములకును ప్రాప్తించుటవలన ఎట్లో ఈవర్ణనలకును తగిలియుండవచ్చును. లేక కాకతాళీయన్యాయమున దండి చెప్పినవి పదునెనిమిది కావున తరువాతియాలంకారికులు అసంఖ్యను పవిత్రముగ భావించి అనుకరించియుండవచ్చును.

(చ) ఆగ్నేయపురాణమున ఒక వర్ణనలజాబితా కలదు. ఈపురాణము చారిత్రక దృక్పథములో అర్వాచీనము. కాని క్రీ. శ. 9-వ శతాబ్దమునకు ముందే ఈ పురాణము పూర్ణరూపమును పొందినట్లు చారిత్రకుల తీర్మానము కావున భామహదండ్యాది ప్రాచీనాలంకారికుల వెనువెంటనే దీనిని ప్రస్తావింపదగును. ఇందలి కావ్యలక్షణవిభాగము బహుశః పూర్వలాక్షణికప్రోక్తసంగ్రహము. కాని కొన్నియెడల, ముఖ్యముగా వర్ణనల పట్టీలో కొంత భేదించుటచేత తారతమ్యబుద్ధికై ఇచ్చట పత్యమగుచున్నది.

అగ్నిపురాణోక్తవర్ణనలు[2] —

1. నగరము 2. అర్ణవము 3. శైలము 4. ఋతువులు 5. చంద్రుడు 6. అర్కుడు (ఉదయము అనిలేదు) 7. ఆశ్రమము 8. పాదపములు 9. ఉద్యానము

---

(మిగులు) విప్రలంభై ర్వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః।
మంత్రదూతప్రయాణాజి నాయకాభ్యుదయై రపి॥
(అలంకృతమసంక్షిప్తం ...) — ఇట్టిది కావ్యము
(దండి, 'కావ్యాదర్శము', 1-16, 1-17, 1-18)

1. చూ. 14. 4 అధోజ్ఞాపిక 1.

2. నగరార్ణవశైలర్తు చంద్రార్కాశ్రమపాదపైః।
ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవైః॥

10 సలిలక్రీడ 11. మధుపానము 12. రతోత్సవము 13. దూతీవచనవిన్యాసములు 14. అసతీచరితాద్భుతములు 15. తమస్సు 16. మరుత్తు, ఇతరవిభావములతోను ...

ఇందు 1 నుండి 6-వ యంశమువరకు, 9 నుండి 12-వ యంశమువరకును దండి పాఠమే. 'దూత'కు మారు 'దూతీవచనవిన్యాసములు', మరియు 'అసతీ చరితాద్భుతములు' అవి అక్రమసంభోగశృంగారసంబంధవర్ణనములు చేర్పబడినవి. మిగిలినవన్నియు దండిపాఠమునకు భిన్నములు. మొత్తము 16.

ఆగ్నేయపురాణమున ఈభాగము అర్వాచీనప్రతిక్షేపణమనుకొనిన, అప్పటికి ప్రసిద్ధమయిన దండి చెప్పిన వర్ణనలజాబితా ఏల వల్లింపబడలేదు, అను ప్రశ్న తప్పదు. 9-వ శతాబ్దమునాటికిని ఈవర్ణనల సంఖ్యగాని విషయములుగాని నియతము కాలేదని అనుమానింపవలసియున్నది.

లేక, ఆగ్నేయపురాణములోని వర్ణనానుక్రమణిక వేరుగా ఒకపౌరాణికసంప్రదాయము కావచ్చును. మరియు 16 వర్ణనలే చెప్పి 'ఇతరములును (అన్యైరపి)' అనుటవలన ఇవి మచ్చుకుమాత్రమే యనియు ఏవర్ణనలైనను ఉండవచ్చుననియు తేలపడుచున్నది.

(జ) ఇక పోనుపోను అగ్నిపురాణపాఠము తెగిపోయి దండివచనమే రమారమి రూఢిమైనదనుటకు ఆంధ్రుడు, విద్యానాథుడు[1] దండిశ్లోకములను అట్లే పాదాంతవిరక్తులుమార్చి సంగ్రహించుట తార్కాణము. ఆశతాబ్దములోని మరియొక ఆలంకారికుడు, అమృతానందయోగియొక్క "అలంకారసంగ్రహము"లోను దండిశ్లోకములే ఉన్నవి. విద్యానాథుడు 'ప్రతాపరుద్రీయము'న 'దూత'కు బదులు 'ద్యూత' అని మార్చి అనుక్రమణికాంతమున,

(మిగులు) దూతీవచనవిన్యాసైరసతీచరితాద్భుతైః ।
తమసామరుతాప్యన్యైర్విభావైరతినిర్భరైః ॥
(ఆగ్నేయపురాణము, 333వ అధ్యాయము)

1. విద్యానాథుడు క్రీ. శ. 13వ శతాబ్దాంతమునను, 14వ శతాబ్దాదిలోను ఉండియుండెను.

"ఇవి దేనిలో వర్ణింపబడునో అది మహాకావ్యము అనబడును. ఈపదునెని మిదిలోను కొన్నితగ్గినను సమ్మతమే[1]" అని చెప్పుటచే అష్టాదశసంఖ్య వర్ణనలకు రూఢియయినను సంఖ్య తగ్గింపవచ్చునని ఏర్పడినది. ఎక్కువచేయరాదని విద్యానాథుని మతమేమో ?

(ట) క్రీ. శ. 14_వ శతాబ్దమున ఒరిస్సారాష్ట్రములోని ప్రసిద్ధాలంకారికుడు విశ్వనాథుడు తన 'సాహిత్యదర్పణము' న ఈవర్ణనల విషయము, సంఖ్య రెండింటి యందును స్వతంత్రించియున్నాడు. 18 బదులు 25 విషయములు చెప్పి ఇంకను చెప్పవచ్చుననుటయేకాక, విషయములు తనంతతోచినవి పొందుపరచెను. అవి[2] —

1. సంధ్యలు 2. సూర్యుడు 3. చంద్రుడు 4. రజని 5. ప్రదోషము 6. ధ్వాంతము 7. వాసరము 8. ప్రాతఃకాలము 9. మధ్యాహ్నము 10. మృగయ 11. శైలము 12. ఋతువులు 13. వనము 14. సాగరము 15. సంభోగ (శృంగారము) 16. విప్రలంభ (శృంగారము) 17. ముని 18. స్వర్గము 19. పురము 20. అధ్వరము 21. రణము 22. ప్రయాణము 23. ఉపయమము (పెండ్లి) 24. మంత్రము (ఆలోచన) 25. పుత్రోదయము మొదలగునవి 'సాంగోపాంగముగ' 'యథాయోగము' వర్ణింపదగును.

కొన్ని విషయములు పూర్వోక్తములైనను అనేకములు విశ్వనాథుని స్వోపజ్ఞకములుగ కనపడుచున్నవి.

---

1. ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే।
ఏషామష్టాదశానాం యైః కైశ్చిదూనమపిష్యతే॥
(ప్రతాపరుద్రీయము, కావ్యప్రకరణము, శ్లో. 71)

2. సంధ్యా సూర్యేందురజనీప్రదోషధ్వాంత వాసరాః।
ప్రాత ర్మధ్యాహ్న మృగయా శైల ర్తు వనసాగరాః॥
సంభోగ విప్రలంభౌ చ మునిస్వర్గపురాధ్వరాః।
రణప్రయాణోపయమ మంత్ర పుత్రోదయాదయః॥
వర్ణనీయా యథాయోగం సాంగోపాంగా అమీ ఇహ।
(సాహిత్యదర్పణము, 6వ పరిచ్ఛేదము, 322, 323, 324 కారికలు)

14. 5. ఒకవిషయము గుర్తింపదగినది. భామహుడు, దండి, రాజనీతిపరముగ 'దూత' ను వర్ణనావిషయముగచేయగా, 'అగ్నిపురాణము' న అది 'దూతీవచనవిన్యాసములు' అని శృంగారపరమై, 'ప్రతాపరుద్రీయము' న 'ద్యూత' అని జూదరులపాలై, సాహిత్యదర్పణమున అసలే అంతరించినది.

14. 6. ఈ వేర్వేరుజాబితాలవలన వర్ణనల అష్టాదశత్వముకాని వర్ణనాంశములు కాని నియతములు కావని తేలుచున్నది. బాణునికిపూర్వపు పరిస్థితి మనకు తెలియదు. ఒకవేళ భామహుడు బాణునికి పూర్వుడయినను భామహునికి తెలిసినవి పంచవర్ణనలే. కావున బాణునికి ఆలంకారికవర్ణనావిధికన్న పూర్వకావ్యప్రయోగములే లక్ష్యరూప లక్షణమై దారిచూపెనని నిశ్చయింపవచ్చును. వానిలోను విస్తారమైన వర్ణనలతోనిండిన ఆదికావ్యము, రామాయణము అతనికి ప్రబలలక్ష్యమగుట సంభావ్యము.

14. 7. బాణుడు 'కాదంబరి' లో కథాక్రమమున చేసిన వర్ణనల బాహుళ్యమును, వైవిధ్యమును తెలుపు కాదంబరీవర్ణనానుక్రమణిక ఇచట చేర్చబడినది.

'పూర్వకాదంబరి' లో వ్యక్తి – వస్తు – స్థల – కాల – చేష్టా – ప్రలాప – క్రియాది వర్ణనములు

| | వర్ణితాంశములు | కాలేప్రతిలో పుటలు | వావిళ్లప్రతిలో పుటలు |
|---|---|---|---|
| 1. | శూద్రకుడు (రాజు) | 8_13 | 7_8 |
| 2. | విదిశ (నగరము) | 13_14 | 8 |
| 3. | సింహాసనస్థశూద్రకుడు | 18_21 | 10_11 |
| 4. | చండాలకన్యక | 22_25 | 12_13 |
| 5. | శూద్రకసభావిసర్జనము | 28_30 | 15_16 |
| 6. | శూద్రకుని మజ్జనభోజనాదులు | 30_34 | 16 18 |
| 7. | శయనము | 34 | 18 |
| 8. | వింధ్యాటవి | 36_40 | 20_21 |
| 9. | అగస్త్యుడు - అగస్త్యాశ్రమము | 41_42 | 21_22 |
| 10 | పంచవటి | 43_44 | 22_23 |
| 11 | పంపాసరము | 44 46 | 23 24 |

| | | | |
|---|---|---|---|
| 12. | శాల్మలీతరువు | 46-47 | 24-25 |
| 13. | అందలి పక్షులు | 47-48 | 25 |
| 14. | ప్రభాతము | 49-52 | 26-27 |
| 15. | శబరసైన్యకోలాహలము - సైన్యము | 52-55 | 28-30 |
| 16. | శబరసేనాపతి | 55-59 | 30-32 |
| 17. | హారీతముని | 64-65 | 36-37 |
| 18. | జాబాలియాశ్రమము | 68-72 | 38-41 |
| 19. | జాబాలిముని | 73-76 | 41-43 |
| 20. | జాబాలిమహిమ | 77-79 | 43-45 |
| 21. | సూర్యాస్తమయము - సంధ్యారాగము | 81-82 | 47-48 |
| 22. | చంద్రోదయము | 82-84 | 48-49 |
| 23. | ఉజ్జయిని (నగరము) | 84-91 | 50-53 |
| 24. | తారాపీడుడు (రాజు) | 92-96 | 53-55 |
| 25. | శుకనాసుడు (మంత్రి) | 96-97 | 55-56 |
| 26. | తారాపీడునిసుఖజీవనము | 98-100 | 56-58 |
| 27. | విలాసవతి (రాణి) | 102 | 59 |
| 28. | విలాసవతి ధర్మకార్యములు | 108-109 | 63-64 |
| 29. | గర్భవతీవర్ణనము (విలాసవతి) | 114-116 | 67-68 |
| 30. | కుమారోదయము | 117-118 | 69 |
| 31. | సూతికాగృహము | 118-120 | 69-70 |
| 32. | చంద్రాపీడుడు (శిశువు) | 121-122 | 70-71 |
| 33. | విద్యామందిరము | 125-126 | 73 |
| 34. | విద్యాభ్యాసము | 126 | 74 |
| 35. | ఇంద్రాయుధము (అశ్వము) | 129-131 | 77-78 |
| 36. | చంద్రాపీడుని నగరాగమనము - పౌరవనితలు | 135-137 | 81-82 |
| 37. | ఆసమయమున ప్రమదాలాపములు | 137-040 | 82-84 |
| 38. | రాజకులము | 141-152 | 84-89 |
| 39. | ప్రదోషము | 158-160 | 94-95 |
| 40. | మృగయాసన్నాహవినోదములు | 160-162 | 95-96 |

| | | | |
|---|---|---|---|
| 41. | పత్రలేఖ (చంద్రాపీడుని తాంబూలకరంకవాహిని) | 163-164 | 97-98 |
| 42. | దిగ్విజయము | 182-193 | 107-115 |
| 43. | తరుషండము | 196-197 | 117-118 |
| 44. | అచ్ఛోదము (సరస్సు) | 197-200 | 118-120 |
| 45. | త్ర్యంబకాయతనము (చంద్రప్రభమనుచోట) | 203-207 | 121-123 |
| 46. | త్ర్యంబకుడు (చతుర్ముఖశివుడు) | 207-208 | 123-124 |
| 47. | మహాశ్వేత | 208-214 | 124-127 |
| 48. | అచ్ఛోదతీరోద్దేశము | 221-223 | 133-134 |
| 49. | పుండరీకుడు | 223-225 | 134-135 |
| 50. | పారిజాతసుమమంజరి | 225 | 135 |
| 51. | సూర్యాస్తమయము | 237-238 | 145 |
| 52. | మదనావిష్టపుండరీకుడు | 240-241 | 147-148 |
| 53. | చంద్రోదయము | 249-250 | 154-155 |
| 54. | చంద్రాలోకము (వెన్నెల) | 251 | 156 |
| 55. | క్షీణదివసము | 268-269 | 169 |
| 56. | చంద్రోదయము | 271-272 | 171-172 |
| 57. | కాదంబరీ మందిరము | 276-277 | 175-176 |
| 58. | కన్యకాజనము | 277-278 | 176-177 |
| 59. | పరిజనకన్యకాప్రలాపములు | 279-280 | 177-178 |
| 60. | శ్రీమండపము | 281 | 178-179 |
| 61. | కాదంబరి (నాయిక) | 282-288 | 179-182 |
| 62. | మరకతశిలాతలము | 302 | 193 |
| 63. | శేషహారము | 303-304 | 193-194 |
| 64. | కాదంబరీశైత్యోపచారపరిజనము | 320 | 206 |
| 65. | హిమగృహము | 321-323 | 207-208 |
| 66. | కాదంబరీవిరహము | 323-326 | 209-210 |
| 67. | రక్తధ్వజము | 332-334 | 214-215 |
| 68. | చండికావిగ్రహము | 334-337 | 215-217 |
| 69. | ద్రవిడధార్మికుడు | 337-340 | 217-219 |

వాల్మీకిచేసిన వర్ణనలకు[1] బాణుని వర్ణనలకును వర్ణనాంశములసామ్యమేగాని వర్ణనావిధానము వేరు. బాణుడు గద్యకవుల ప్రత్యేకపద్ధతిలో వక్రోక్తిమయమయిన వర్ణనలు చేసెను. వాల్మీకిలో వక్రోక్తి తక్కువ, అతిశయోక్తియు స్వభావోక్తియు ఎక్కువ.

---

1. వాల్మీకి రామాయణమున ముఖ్యవర్ణనలు తులనాత్మకవిమర్శన పాఠకులకు సులువుగ ఇచ్చట క్రోడీకరింపబడినవి. ఇందలి కాండ, సర్గ, సంఖ్యలు (మద్రాసు) లాజర్నల్ ప్రెస్సు నాగరి ప్రతిని (1953) అనుసరించును. షట్కాండములకే ఈ వర్ణనానుక్రమణిక పరిమితము.

1. నగరము — అయోధ్య (1-5); లంక (5-2, 5-4, 6-39).
2. ప్రాసాదాది — రావణగృహము (5-6); పుష్పకము (5-8); రావణాంతఃపురము (5-9).
3. రాజు — దశరథుడు (1-6); రాముడు (5-34).
4. మంత్రులు — (1-7) మంత్రాలోచనము (6-6 నుండి 6-15 వరకు).
5. కుమారోదయము — (1-18).
6. వివాహము — (1-73).
7. అభిషేకము — రామాభిషేకయత్నము (1-6); రామాభిషేకము (6-131); సుగ్రీవాభిషేకము (4-26); విభీషణాభిషేకము (6-115).
8. అరాజకము — (2-67).
9. నది — గంగ (2-50, 2-95, 4-27).
10. తటాకము — పంచాప్సరము (3-11).
11. సరస్సు — పంప (3-73).
12. సాగరము — (4-64, 6-21, 22).
13. శైలము — చిత్రకూటము (2-56, 2-94); ప్రస్రవణశైలము (4-27).
14. వనము — చిత్రకూటవనము (2-93); వనశైలాదులు (3-35); అశోకవనము (5-14).

14. 8. శాసనములలోని రుద్రదామ సముద్రగుప్తాది వర్ణనలవలెనే దీర్ఘమయిన వ్యక్తి వర్ణనలు, అట్లే సాంగోపాంగవస్తుస్థలాదివర్ణనలు, రీతిమాత్రభిన్నముగ, సుబంధువు యొక్క 'వాసవదత్త'లో ప్రథమముగ గద్యకావ్యమున పొడసూపి, బాణుని ఆఖ్యాయికాకథలలో పరిపూర్ణతను పొందినవి. వర్ణింపవలసినదానిని వాక్యములో కర్తగనో కర్మగనో నిలిపి, వర్ణనమంతయు దానికి విశేషణములు, సమానాధికరణములు, సంబంధములు, ఉపమాదికవిత్వ సామాన్యాలంకారములు, గద్యకవితావిశేషములగు శ్లేష విరోధ పరిసంఖ్యలు, ఇత్యాదిరూపములలో వర్ణనాపదజాలమును వర్ణితపద

---

(మిగులు) 15. యజ్ఞశాల — (1-13); యజ్ఞసామగ్రి (1-12); అశ్వమేధము (1-14).

16. ఆశ్రమపదము — పంచవటి (3-15).

17. ఆశ్రమములు — (3-1, 3-11, 4-13).

18. పాదపము — న్యగ్రోధము (2-55).

19. ఋతువులు — హేమంతము (3-16); వసంతము (4-1); వర్షము (4-28); శరత్తు (4-30).

20. చంద్రుడు — (5-5).

21. సూర్యుడు — ఆదిత్యహృదయము (6-107).

22. మధుపానభూమి — (5-11).

23. మధుపానము — (తే॰. 5-61).

24. దూత — భరతునికి (2-58); హనుమద్దౌత్యము (సుందరకాండ); అంగదదౌత్యము (6-41).

25. యుద్ధము — అయోధ్యాకాండ తక్క అన్నింటియందును, యుద్ధకాండలో పూర్తిగ.

రామాయణమునకును 'కాదంబరి'కిని కొన్ని సామ్యములు కలవు. రెండును ఎక్కువగా అరణ్యప్రాంతమున జరుగును. విప్రలంభము రామాయణమున ఒకముఖ్యరసము. 'కాదంబరి'కిని విప్రలంభశృంగారము ముఖ్యము. పంచవటి రెండుకథలకును కాదాచిత్కక్షేత్రము. ఇరువురుకవులును ప్రకృత్యవేక్షణాయుక్త వర్ణనాపటులు. వారి రీతులుమాత్రము వేరు.

విభక్త్యనుసారముగ సంస్కృతవాక్యమున అనుసంధించుట, వర్ణితవస్త్వంశమును ఎంతయల్పమైనను వదలక సమగ్రముగ ప్రస్తావించుటయు, బాణుని వర్ణనావిధానము.[1]

14. 9. బాణుని శాల్మలీతరువర్ణనమును స్థాలీపులాకన్యాయమున పరిశీలింపవచ్చును.[2] ఈ క్రింది విశ్లేషణమున వాక్యాంశములు కొంత ముందువెనుక లయినవి. ఇందలి ప్రధానవాక్యము, "పద్మసరసః పశ్చిమే తీరే శాల్మలీతరురవస్థితః" (పద్మసరస్సు పశ్చిమతీరమున బూరుగుచెట్టు కలదు). వర్ణితాంశములు శాల్మలీతరువిభాగములు, ఇతరసంబంధములును.

| వర్ణితాంశము | వర్ణనము |
|---|---|
| 1. మూలము (మొదలు)[3] | (క) దిగ్గజకరదండానుకారిణా జరదజగరేణ సతత |

1. సుబంధువును అట్లే, కాని బాణుని సమగ్రతయు ఉత్ప్రేక్షావైభవమును అతనికి లేవు.

2. కాలేప్రతి, పుట 46-47; వావిళ్ల, 24-25.

గమనిక :– కావ్యములలో ప్రథమముగ ఒకవృక్షమును ప్రత్యేకించి అపూర్వమైనదు వర్ణనము చేసినది వాల్మీకి (చూ. న్యగ్రోధవర్ణనము, రామాయణము, 2-55). ఈ న్యగ్రోధమే మరింత గొప్పదై 'పంచతంత్రము'న మిత్రసంప్రాప్తిలో

"అస్తి దాక్షిణాత్యే జనపదే మహిలారోప్యం నామ నగరమ్. తస్య నాతిదూరస్థో మహోచ్ఛ్రాయో నానావిహంగోపభుక్తఫలః, కీటైరావృతకోటరశ్ఛాయాశ్వాసితపథికజనసమూహో న్యగ్రోధపాదపో మహాన్." ఇదియే మరల పద్యములోను కలదు.

బాణుని శాల్మలీతరువు కొంత పంచతంత్రన్యగ్రోధానుకారియగుచు. సుబంధు బాణుల వాక్యవిధానమే అందును కలదు. పంచతంత్రము బాణునికన్న కనీసము రెండుశతాబ్దముల పూర్వపురచన అని చారిత్రకులమతము. ఈ వాక్యవిధానము ఒకవిధముగా గద్యకవులందరకును సామాన్యప్రక్రియ. అట్లే శూద్రకతారాపీడుల వర్ణనములు పంచతంత్ర కథాముఖమున 'అమరశక్తి' వర్ణనమును పోలును. ముఖ్యముగా 'నృపముకుటమణిమరీచిమంజరీచయచర్చితచరణయుగళః' అను విశేషణము గుర్తింపదగును.

3. మూలము అనుపదమునకు నిఘంటువులలో 'వేరు' అను అర్థము ఉన్నను, 'మొదలు, బోదె' అను అర్థము సంస్కృతమున వాడుకలో ఉన్నదనుటకు బాణుని ఈ ప్రయోగము నిదర్శనము.

| వర్ణితాంశము | వర్ణనము |
|---|---|
| (నేలదగ్గరిభాగము)<br>(మొదలుపైభాగము) | మావేష్టితమూలత యాఽఽబద్ధమహాలవాల ఇవ.<br>(గ) వనగజకపోల కండూయనలగ్న మదనిలీన మత్తమధుకరమాలేన లోహశృంఖలాబంధనిశ్చలే నేవ కల్పాంతస్థాయినా మూలేన సముపేతః. |
| 2. అహినిర్మోకములు (పాము కుబుసములు — ఇవి వృక్ష భాగముకాదు. వృక్షముతో అసమవాయ సంబంధము కలవి). | తుంగస్కంధా[1]వలంబిభి రనిలవేల్లితై రహినిర్మోకై ర్ధృతోత్తరీయ ఇవ. |
| 3. శాఖలు | దిక్చక్రవాలపరిమాణమివ గృహ్ణతా భువనాంతరాల విప్రకీర్ణేన శాఖాసంచయేన ప్రళయతాండవప్రసారితభుజసహస్ర ముడుపతిశకలశేఖరమివ విడంబయితుముద్యతః. |

1. స్కంధము అను పదమునకు నిఘంటువులలో సాధారణముగ 'చెట్టు బోదె' అను నర్థము కనబడును. కాని ఇచ్చట ఆపదమునకు చెట్టు మొదలునకు పైని ముఖ్యమయిన పెద్దకొమ్మలు అను అర్థము తీసికొనవలెను.

స్కంధః ప్రకాండోఽథ శిఖా శాఖాథ శిఖరం శిరః ।
స్కంధశాఖాతు శాలాస్యాత్ ........ ।

(వైజయన్తీ నిఘంటువు, వనాధ్యాయము, శ్లో. 15)

అట్లే పోతన పద్యము "లలితస్కంధము, కృష్ణమూలము ... ఇత్యాది." ఇచ్చట మూలము బోదె, స్కంధము కొమ్మ. స్కంధమునకు ఇచ్చట బోదె అను నర్థము చెప్పిన అది లలితము కావున మహాభాగవతవృక్షమునకు నడుమువిరిగి అది క్రింద పడును. కృష్ణమూలము అనుటలో 'నల్లని గట్టిబోదె' అని భావము.

మరియు ఉత్తరీయముతో పోల్చుటవలన బాణుని అహినిర్మోకములు చెట్టున కొంత ఎత్తునుండి వ్రేలాడుట ధ్వనించును. ఉత్తరీయము 'పైబడ్డ' కదా.

| వర్ణితాంశము | వర్ణనము |
| --- | --- |
| 4. శాఖలపై అల్లుకొన్న లతలు | నిఖిల శరీరవ్యాపినీభి రతిదూరోన్నతాభి ర్జీర్ణతయా శిరాభిరివ పరిగతో ప్రతతిభిః। |
| 5. ముండ్లు | జరాతిలకబిందుభిరివ కంటకై రాచితతనుః. |
| 6. తుమ్మెదలు | కోటరాభ్యంతరనివిష్టైః[1] స్ఫురద్భిః సజీవఇవ మధుకరపటలైః. |

1. ఇది పంచతంత్రన్యగ్రోధవర్ణనములోని అంశము. ఆపద్యము:

"ఛాయాసుప్తమృగః, శకుంతనివహై ర్విష్వగ్విలుప్తచ్ఛదః,
కీటైరావృతకోటరః, కపికులైః స్కంధేకృతప్రశ్రయః।
విస్రబ్ధం మధుపై ర్నిపీతకుసుమః, శ్లాఘ్యః సఏవ ద్రుమః,
సర్వాంగైర్బహుసత్త్వ సంగసుఖదో భూభారభూతో పరః॥

ఒకచెట్టు ఎన్నిజీవరాసులకు ఆశ్రయమైనదో వ్యక్తము. ఇచ్చట 'స్కంధము' అనుపదప్రయోగము గమనింపదగును.

'హితోపదేశము'న "అస్తి గోదావరీతీరే విశాలః శాల్మలీతరుః. తత్ర నానాదిగ్దేశాదాగత్య రాత్రౌ పక్షిణో నివసన్తి" అని న్యగ్రోధము శాల్మలిగా మారినది. ఈశాల్మలీతరువు కాదంబరీభావము.

ఒకయపూర్వమయిన న్యగ్రోధవర్ణనము తెలుగువాఙ్మయమున అప్రతిరూపుడైన కవి శ్రీకృష్ణదేవరాయల 'ఆముక్తమాల్యద' లో కలదు. అందులోని భావచమత్కారము సంస్కృతములోనిదికాదు. కావున స్మర్తవ్యము.

"కాంచెన్ వైష్ణవుఁ డర్ధయోజనజటాఘాటోత్థశాఖోపశా
ఖాంచజ్ఝాటచరన్మరుద్రయదవీయఃప్రేషితోద్యచ్ఛదో
దంచత్కీట కృతవ్రణచ్ఛలన లిప్యాపాదిశాధ్వన్య ని
ష్పంచారాత్త మహాఫలోపమఫలస్ఫాయద్వటక్ష్మాజమున్."

(ఆముక్తమాల్యద, 6-15)

| వర్ణితాంశము | వర్ణనము |
| --- | --- |
| 7. పక్షులు | దుర్యోధన ఇవోపలక్షిత శకునిపక్షపాతః.[1] |
| 8. ఎత్తు | (క) పురాణతయా పతనభయాదివ గగనస్కంధ లగ్నః. |
| (కొమ్మలలో మేఘములు దాగినవి) | (గ) ఇతస్తతః పరిపీతసాగరసలిలై ర్గగనాగతైః పత్రరథైరివ శాఖాంతరేషునిలీయమానైః క్షణమంబుభారాలసైరార్ద్రీకృతపల్లవై ర్జలధరపటలై రపవ్య దృష్టశిఖరః. |
| | (చ) తుంగతయా నందనవనశ్రియమివాలోకయితుమభ్యుద్యతః. |
| (పైకొమ్మలు సూర్యరథ సమీపమునవున్నవి) | (జ) సమీపవర్తినాముపరిసంచరతాం గగనతలగమనఖేదాయాసితానాం, రవిరథతురంగమాణాం, సృక్కపరిస్రుతైః ఫేనపటలైః సందేహితతూలరాశిభి ర్ధవళీకృతశిఖరశాఖః. |
| | (ట) నవజలధరవ్యూహఇవ నభసి దర్శితోన్నతిః. |
| | (డ) అఖిలభువనతలావలోకనప్రాసాదఇవ వనదేవతానాం. |

1. చెట్టుమీదిపక్షులు సామాన్యలక్షణము. దీనిసంబంధముగ ఒకచమత్కారము క్రీ. శ. మొదటిశతాబ్దపు 'గాథాసప్తశతి' యను ప్రాకృతకావ్యమున కలదు. ఇచ్చట ఛాయమాత్రము స్మరింతము.

"హసితం సహాస్తతాలం శుష్కవటముపగతైః పథికైః, పత్రఫలానాం సదృశే ఉడ్డీనే శుకబృందే (ఎండిన మఱ్ఱిచెట్టుమీది చిలుకలను పచ్చనియాకులు, ఎఱ్ఱనిపండ్లు అనిభ్రమసి నీడకై పథికులు అచ్చటికిరాగా ఆచిలుకలు ఎగిరిపోయి నీడనశించెను. వారు చప్పట్లుకొట్టుచు నవ్విరి" (గాథాసప్తశతి 3-63. దీనిని నాకు చూపినది శ్రీ K. S. రామానుజాచారి M. A, (నెల్లూరు సంస్కృత కళాశాలాధ్యక్షులు).

| వర్ణితాంశము | వర్ణనము |
|---|---|
| 9. గొప్పతనము | (క) అధిపతిరివ దండకారణ్యస్య. |
| | (గ) నాయకఇవ సర్వవనస్పతీనాం. |
| | (చ) సఖేవ వింధ్యస్య. |
| | (జ) శాఖాబహుభిరుపగుహ్యేవ వింధ్యాటవీం. |
| 10. వయస్సు | మహాజీర్ణః. |

పై వర్ణనములోని అలంకారాదివైభవ మట్లుండనిచ్చి వృక్షసంబంధమయిన అంశములు ఎన్ని వర్ణితములో గుర్తింపదగును.

14. 10. శాల్మలీవృక్షవర్ణనములోని ఒకయంశమయిన పక్షులకు వెనువెంటనే ప్రత్యేకవర్ణనముకలదు. చిలుకలు అవృక్షముమీద గూండ్లుకట్టుకొనియుండుటను చెప్పుచు

"1. శాఖాగ్రేషు 2. కోటరోదరేషు 3 పల్లవాంతరేషు 4. స్కంధసంధిషు 5. వల్కలవివరేషు" అని ఒక్కగ్రుక్కలో చెట్లమీద పక్షులు గూండ్లుకట్టు ప్రదేశ విశేషములను అన్నింటిని బాణుడు ఏకరువుపెట్టియున్నాడు. ఈచిన్నవిషయమున అతని సమగ్రవర్ణనావిధానము ప్రస్ఫుటము.

సమగ్రవర్ణనమే బాణుని వర్ణనావైశిష్ట్యము. సమగ్రత్వముచేతను, అలంకార వైభవముచేతను, సూక్ష్మవిషయావేక్షణవైదగ్ధ్యముచేతను బాణుడు మరియొకకవికి వర్ణనమున ఏదియు వదలడు. బాణుని వృక్షవర్ణనమునకు తరువాత మరియొక్కడు వృక్షమును వర్ణించి మెప్పింపలేడు. కావుననే 'బాణోచ్ఛిష్టం జగత్ సర్వం' అను మాట పుట్టినది.[1]

## 14. 11. బాణుని వర్ణనావిధానముపై ఒక అక్షేపము

బాణుని సమగ్రవర్ణనమున మనకు వర్ణితవస్తువులో తజ్జాతిసామాన్యగుణము లన్నియు, ఉండదగు విశేషగుణములన్నియు, కుమ్మరించినట్లు కనపడుటచేత అవస్తువు

1. చూ. 1-2-25 (జ).

ప్రత్యేకముగ, వివిక్తముగ కనపడదు. బాణుని శాల్మలీతరువర్ణనము మనకు అట్టి వృక్షమును అడవిలో గుర్తుపట్టు సామగ్రిని ప్రసాదింపదు. బాణుని ఉజ్జయిని, ఊహలో ఒకానొక గొప్పనగరమేకాని, వాస్తవపు ఉజ్జయిని కాదు. అతని కాదంబరి ఏప్రబంధకన్యక కారాదు ? ఇట్టివర్ణనలవలన పాఠకునికి ఏదియు స్పష్టముగ మనోగోచరముకాదు — అని ఆక్షేపము.

సత్యమే. కాని బాణునియుద్దేశము దేశకాలావచ్ఛిన్నమగు నశ్వరవస్తునిరూపణము కాదనవచ్చును. అతని వర్ణితవస్తువు వాస్తవజగదపేక్షవోత్పాదితమయినను కాలదోషముపట్టని కవితాజగత్తులోనిది. అతని వర్ణనము కొందరు ఆధునికచిత్రకారుల 'వర్ణనము' వలె ఆత్మగోచరమగు గుణభావసందోహమే కాని ఇంద్రియగోచరమగు రూపనిష్పాదనము కాదు. శాల్మలీతరుశతములను చూచినపుడు కలిగిన భావసముచ్చయము, సర్వోన్నతవృక్షసామాన్యగుణ - జ్ఞానమును, బాణుని శాల్మలీవృక్షమగుచున్నది. ఆవర్ణనము అవాస్తవికమయినను విస్మయోత్పాదకము, రమణీయతాస్ఫోరకమును.

అతనియుజ్జయిని సర్వనగరాంశసంకలితాతిశయము. అతని అచ్ఛోదము సర్వసరోరమణీయతాపుంజీభావము. అతని కాదంబరి సర్వప్రబంధనాయికాశిరోమణి. ప్రత్యేకత లేకున్ననేమి ? సమగ్రత అన్నిప్రత్యేకతల సమాహారముకదా.

## 14. 12. మరియొక ఆక్షేపము

కొందరు బాణునికి వర్ణనాప్రసంగమున మితియు తరతమభేదములును తెలియవనియు; అల్పవస్తువునకు భూరివర్ణనముచేయుననియును ఆక్షేపింతురు. అనగా దేనిని వర్ణించునపుడు అదియే సర్వోత్కృష్టముగ చెప్పుట అతనియలవాటు.

ఉదాహరణమునకు చండాలకన్య పత్రలేఖాలావణ్య ప్రశంస గణింపదగును. చండాలకన్యకను సుదీర్ఘముగ వర్ణించి "అహా! బ్రహ్మరూపరచనానైపుణ్యము!" అని అత్యాశ్చర్యము ప్రకటించి, మరియొకచోట పత్రలేఖను చూచిన కాదంబరి మనస్సులో "అహా! బ్రహ్మకు మనుష్యస్త్రీ నిర్మాణమున పక్షపాతము" అని పత్రలేఖాలావణ్య ప్రశంసచేయును. చండాలకన్యక పత్రలేఖ లలో ఎక్కువ తక్కువలు కనపడవు.

మరియు శూద్రకతారాపీడులకు వర్ణనాదైర్ఘ్యము తప్ప మహత్త్వమున భేదము కానరాదు. వీరివర్ణనములను తులనాత్మకముగ పరిశీలింపదగును.

ఈసందర్భమున ఒకవిషయము స్మర్తవ్యము. శూద్రకుని పుట్టుక చంద్రాపీడ మరణము తరువాత. చంద్రాపీడుని తండ్రియయిన తారాపీడుడు మహాశ్వేతాశ్రమము నొద్ద పర్ణశాల నిర్మించుకొని చంద్రాపీడపునర్జీవనప్రతీక్షచేయుచు జీవించియుండగా శూద్రకుడును రాజగును. తారాపీడుడు, శూద్రకుడు ఇరువురును చక్రవర్తులు కాగా వారివర్ణనములలో విరోధములు కొన్ని ఇట చర్చింతము.

(క) శూద్రకుడు: 'అశేషనరపతి శిరః సమభ్యర్చిత శాసనః — అందరు రాజులును శూద్రకునికి లోబడిరి అని భావము.

ప్రశ్న: తారాపీడునికూడ శూద్రకుడు జయించెనా ?

తారాపీడుడు: 'యం సేవాంజలికమలముకులవంతురైః శిరోభిః చరణనఖమ యూఖగ్రథితముకుట పత్రలతాగ్రంథమోభయచకితతరల తారదృశో భుజబలవిజితాః ప్రణేమురవనిపాః' — అందరు నరపతులను తారాపీడుడు జయింపగా వారు భయముతో అతనికి మ్రొక్కిరి అని భావము.

ప్రశ్న: వారిలో శూద్రకుడు కలడా ?

(గ) శూద్రకుడు: 'చతురుదధిమేఖలాయాః భువోభర్తా' — అనగా ఆసముద్రక్షితీశుడు; భూమికంతకును అతడే రాజు.

తారాపీడుడు: 'జలనిధి తరంగమేఖలాత్ ...' ఇత్యాది వలన తారాపీడుడును ఆసముద్రక్షితీశుడే.

ప్రశ్న: ఒకేకాలమున ఇరువురు ఆసముద్రక్షితీశులు ఎట్లు సంభవింతురు ?

(చ) శూద్రకుడు: 'గుణానాముత్పత్తిః' — ఇతడు అన్ని సుగుణములకును పుట్టుకస్థానము, ఇతనినుండియే మంచిగుణములు జగమున తెలిసినవి అని భావము.

తారాపీడుడు: 'యస్మాచ్చ నిర్జగామ గుణగణః' — ఇతనినుండియే అన్ని సుగుణములును పుట్టినవి.

ప్రశ్న: గుణములు సత్యముగ ఎవరినుండి పుట్టినవి ?

ఇట్లు అనేకములు పరస్పరవిరోధాంశములను చూపవచ్చును. ఈపరస్పర వ్యాఘాతములుగల వర్ణనలలోనుండి శూద్రకుని తారాపీడుని ఉద్ధరించుట కష్టము. కావున ఈ ఆక్షేపమునకు తగినసమాధానము లేదు.

కాని, కవులు సాధారణముగ కావ్యములలో రకమునకు ఒకవస్తువును, ఒకే నాయకుని, ఒకేనాయికను వర్ణింపుటవలన ఈయాక్షేపమునకు గురికాక, తప్పించు కొందురు. కాళిదాసును 'కుమారసంభవము'న అట్లే. అదియే రఘువంశపు రాజుల వర్ణనమున అంత వైవిధ్యమేమియు కనపడదు. వారు భిన్నకాలికులగుట అచ్చట శ్రేయము.

బాణుని 'కాదంబరి'లో ముగ్గురు రాజులు, ఇద్దరు నాయికలుచేరి వర్ణనలలో కొంత చర్వితచర్వణము తప్పలేదు. శూద్రకుడు మొదట కథలో కనపడును కాన కవి కావ్యప్రారంభసంరంభమున తనశక్తిని పూర్తిగ శూద్రకవర్ణనమున వినియోగించి తరువాత తారాపీడుని వర్ణింపబోయి 'బాణోచ్ఛిష్టమను స్వోచ్ఛిష్టము' మరల స్పృశింపక తప్పించుకొనలేకపోయెను. ఇచ్చట బాణుడు స్వప్రతిభాహతుడయ్యెనని తోచును. తారాపీడవర్ణనమును పొడిగించెనే కాని వైలక్షణ్యము చూపలేకపోయెను. ఈవిధమయిన వర్ణనము చంద్రాపీడునికి యత్నింపనేలేదు.

మహాశ్వేతను వర్ణ్యావిధానమునందే మనకు చూపుటవలన కాదంబరి కన్న భిన్నముగ కనపడును. చండాలకన్యకలో నల్లదనమునే ఉపలక్షించి, మహాశ్వేతలో తెల్లదనమునే ఉపమించి, ఉత్ప్రేక్షించి, కాదంబరిలో ఎఱ్ఱదనమునే ప్రత్యేకించి వర్ణించి, బాణుడు కొంత వైవిధ్యమును కల్గించెనని చెప్పవచ్చును.

### 14. 13. మహాశ్వేతాకాదంబరుల వర్ణనావిధభేదము

(క) మహాశ్వేతాకాదంబరుల సాంగోపాంగవర్ణనములపద్ధతిలో భేదముండుట గుర్తింపవలయును.

బాణుడు మహాశ్వేతను 'జటాభిరుద్భాసితశిరోభాగామ్'[1] (జడలుగట్టి ప్రకాశించు శిరస్సుగల ఆమెను)' అని మొదలుపెట్టి, తరువాత లలాటము, కంఠము, స్తనములు మొదలగునవి క్రమముగా అవరోహణక్రమమున పాదములవరకు వర్ణించును.

---

1. కాళే ప్రతి, పుట 211 - 212; వావిళ్ల, 125 - 126.

కాదంబరిని చరణములతో[1] మొదలుపెట్టి క్రమముగ ఆరోహణక్రమమున కేశములవరకును వర్ణించును.

ఈక్రమభేదమునకు కారణమేమియనుట సహృదయపాఠకునికి తోచదగిన ప్రశ్న.

(గ) కావ్యములో వ్యక్తుల ('స్త్రీల' అనిలేదు) సాంగోపాంగవర్ణనమునకు ఒకసంప్రదాయమున్నట్లు శ్రీ కోలాచల మల్లినాథసూరిగారు ఇట్లు ఉల్లేఖించియున్నారు,

"దేవతానాం రూపం పాదాంగుష్ఠప్రభృతి వర్ణ్యతే, మానుషాణాం కేశాదారభ్య" — ఇతిధార్మికాః.[2]

ఇట్లే మరియొక శ్లోకమును వ్యాఖ్యాతలు స్మరించియున్నారు,

'మానవా మౌళితో వర్ణ్యాః, దేవా శ్చరణత స్తథా.'[3]

కాని ఎవరును ఈనియమమునకు మూలము చెప్పలేదు. మల్లినాథునికి పూర్వము ఇది ఏగ్రంథమునందున్నదో తెలియదు. ఇది శాస్త్రమూలకమా, కేవలము కవిసమయమా అనికూడ నిర్ణయించుట కష్టము.

మల్లినాథుడు దీనిని ధార్మికవచనముగ స్వీకరించుటవలన ఇది ఏదో 'స్మృతి' లోనిది కావచ్చును. వైదికధర్మముగ పుట్టి కొందరుకవులచే పాటింపబడినదని తలప వచ్చును.

(చ) ఈదేవమానవ వర్ణనావిధానభేదమును తెలుగు ప్రబంధకవులు పాటించి నంత సంస్కృతకవులు పాటింపలేదు. కాళిదాసు పార్వతిని పాదాదికేశాంతము వర్ణించుటలో 'ధ్వని' చేత ఆమెకు దేవత్వమును ఆరోపించుచున్నాడో, లేక పార్వతిని ఆరాధ్యదేవతగ భావించి అట్లుచేసెనో చెప్పలేము. పార్వతిని, మహాశ్వేతాకాదంబరుల

---

1. కాలే ప్రతి, పుట 283-287; వావిళ్ల, 179-181.

2. కుమారసంభవ సంజీవనీ వ్యాఖ్య, 1-33.

3. వేదము వేంకటరాయశాస్త్రిగారి శృంగారనైషధ వ్యాఖ్యలో దమయంతీ వర్ణనోద్యమమునను, ఆముక్తమాల్యద వ్యాఖ్యానమున 3 ఆశ్వాసపు 85వ పద్యము క్రిందను దీనిని పేర్కొనియున్నారు. వారు దీనిని 'సమయము' అనిరి.

వలె, దేవయోనిగ గణింపవచ్చును, తండ్రి హిమవంతుడు 'దేవతాత్ముడు'[1], తల్లి మేనయు[2] పితృదేవతలమానసపుత్రికకావున. పార్వతి ఆరాధ్యదేవతయగుట శివుని భార్యయయిన పిదప. ఆమె భావిదేవీత్వమును ఊహతో ఇప్పుడే సాక్షాత్కరించుకొని[3] కాళిదాసు ఆమెకు ఆరోహణవర్ణనావిధిని అవలంబించియుండవచ్చునని సమర్థింప వచ్చును. ఎటులైనను పార్వతి మానవకాంతకాదు కావున ఈసమర్థనమును ఆవిధి యపేక్షింపదు.

అట్లే కాదంబరి చంద్రునిభార్య కాబోవు స్త్రీ అని దేవత్వమును ఆపాదించి బాణుడు పాదాదికేశాంతవర్ణనము చేసెనేమో ? మహాశ్వేత ఏదేవునికిని భార్యకాదు కావున మానుషీత్వమును ఆపాదింపవచ్చునా ?

(జ) ఈ సంప్రదాయము వైదికమో, ఆగమసంబంధమో లేక లాక్షణికమో తెలియుటలేదు. దీనిని కొందరు కవులు పాటించినట్లున్నది. కాని స్తోత్రరూపమైన కావ్యములలోకూడ ఈవిధికి అపవాదములున్నవి. దేవతాపూజావిధానములగు వ్రత విధులలోని అంగపూజకు పాదాదికేశాంతము క్రమము. కాని 'లలితాసహస్ర నామము'న జగదంబకు కేశాదిపాదాంతవర్ణనము కలదు. శ్రీ శంకరభగవత్పాదులవారి 'సౌందర్యలహరి'లో జగన్మాతవర్ణనము కేశాదిపాదాంతమే. శంకరులకు 'మానవాః మౌళితో వర్ణ్యాః' అనుట తెలియదా ?

(ట) ఉపలబ్ధ కావ్యస్తోత్రాదులనుండి ఈవర్ణనాలక్షణమును సమర్థింపజాలము. ఇది ఒకింత అర్వాచీనమని తోచుచున్నది. క్రీ. శ. 1000 కి తరువాత ఏర్పడి 14-వ

---

1. అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా, హిమాలయోనామ నగాధిరాజః ।
(కుమారసంభవము. 1-1)

2. స మానసీం మేరుసఖః పితౄణాం కన్యాం కులస్య స్థితయే స్థితిజ్ఞః ।
మేనాం మునీనామపి మాననీయాం ఆత్మానురూపాం విధినోపయేమే ॥
(అందే. 1-18)

3. పాశ్చాత్య సాహిత్య సంప్రదాయమున ఇది 'Prolepsis' అను అలంకారము. ఇందు భవిష్యత్తులో జరుగదగినదానిని ఊహించి వర్తమాన సత్యముగా చెప్పుదురు. దీనిని 'పూర్వాదానము' అనవచ్చును.

శతాబ్దిమున స్థిరమై మల్లినాథునిచేత పఠింపబడియుండును. బాణుడు మహాశ్వేతను అవరోహణక్రమమున వర్ణించి, వైవిధ్యముకొరకు కాదంబరిని ఆరోహణక్రమమున వర్ణించియుండదగును. కాళిదాసునకుగాని బాణునికిగాని శంకరులకుగాని, మానవులకు 'మౌళితః' దేవతలకు 'చరణతః' అని ఒకనియతవిధి తెలిపినట్లు లేదు. అట్లొకవిధి యుండినను అది అనుపాలనమునకన్న అతిక్రమణముచేతనే తరచు లక్షితమైనది.

## 14. 14. బాణుని ప్రకృతివర్ణనము

వ్యక్తప్రకృతిలోని మనుష్యేతరజీవములను, శైలపాదపసరోనద్యాదులను, దివారాత్రసంధ్యలను, నక్షత్రచంద్రసూర్యగ్రహములను వాయుమేఘవర్షములను, ఋతువైవిధ్యమును, పృథ్వీసముద్రగగనములందలి రమణీయాకృతులలో వేనినైనను కవితాసామగ్రిగచేసికొనుట భారతీయసాహిత్యమున వేదములనుండియే ప్రారంభమయినది. ఋగ్వేదములోని ప్రకృతివర్ణనము ప్రపంచసాహిత్యములలో ప్రథమము, విపులతమము, అత్యంతమనోహరము.

వేదములు మతసంబంధములుకాగా, కావ్యలోకమున ప్రకృతివర్ణనమునకు శ్రీకారముచుట్టి, అలంకారములకు ఉపమానములను ప్రకృతినుండి విస్తారముగ గ్రహించి తరువాత కాళిదాసాదులకు మార్గదర్శకుడయినకవి వాల్మీకి. కాళిదాసు తన కావ్యములనన్నిటిని ప్రకృతివర్ణనముతో నింపియున్నాడు. శాకుంతలములోని ప్రకృతివర్ణనము పాశ్చాత్యులను మిక్కిలియాకర్షించినది. అట్టి మనోహరమయిన ప్రకృతివర్ణనము ప్రాచీనపాశ్చాత్యసాహిత్యమున అరుదని అనేకవిమర్శకులమతము.

కాళిదాసునకుతరువాత ఎక్కువ ప్రకృతివర్ణనము చేసినది బాణభవభూతులు.[1] కాళిదాసు ప్రకృతిలోని మనోహరత్వమునే వర్ణించును. భవభూతి ప్రకృతిలోని ప్రచండతను, తీవ్రతను, భయానకదృశ్యములను వర్ణించును. బాణుడు ఇరువురి మెరుగులను చూపును. 'కాదంబరి'లో మహాశ్వేతతపోవనము శాంతమనోహరమై యుండ వింధ్యాటవి భయంకరము.

---

1. భవభూతికాలము చరిత్రకారుల మతమున క్రీ. శ. 7వ శతాబ్దపు టంతమునను 8వ శతాబ్దపు మొదటి భాగమునను. ఇతడు బాణునికి కొంత వెనుక. కావుననే బాణుడు భవభూతిని స్తుతింపలేదు అని కొందరి యభిప్రాయము.

కాదంబరి ప్రకృతివర్ణనల విధి. ఒక్కొకచోట స్వభావోక్తిలో ప్రకృతితత్త్వ నిరూపణము మనోహరముగ నుండును, జాబాలియాశ్రమవర్ణనమున అట్టివి పలుచోట్ల కలవు.[1] కొన్నిచోటుల వక్రోక్తిలో ప్రకృతి నూతనత్వమును పొందును.

కొందరు కవులు స్వానుభవము లేక ప్రకృతివర్ణనమును కేవలము పూర్వ కవుల కావ్యములలోనుండి గ్రహింతురు. ఆకవులు ఇతరకవిలోచనవిషయమగు ప్రకృతిని శ్రుతముగ గ్రహింతురు.[2] వారివర్ణనలు కృత్రిమములుగ కనబడును. బాణునిలోవిశేషమేమన, అతడు వాల్మీక్యాదులనుండి కొన్ని ప్రకృత్యవేక్షణాఘటితాంశ ములను గ్రహించినను వానిని స్వానుభవముతో సరిజూచుకొని ప్రయోగించును. కావున అతని ప్రకృతివర్ణనము అరువుతెచ్చుకొనినట్లుండదు. అతనికావ్యములు బహు విధరమణీయప్రకృతివర్ణనాసంచయములు. కాదంబరీకథ ఎక్కువగ అరణ్యప్రాంత మున నడచును కాన అందు బాణుడు ప్రకృతివర్ణనమున అతిశయించును.

ఉదాహరణమునకు అచ్ఛోదసరస్సునకు పోవు గజయూథమార్గవర్ణనమును చెప్పవచ్చును.[3] అందు కవ్యనుభవము, వ్యుత్పత్తి, స్వభావోక్తి, సమానాధికరణమున శోభించి పరస్పరసాహాయ్యకములుగ నున్నవి. ఇక అచ్ఛోదసరోవర్ణనమున[4] బాణుని పూర్వకావ్యసరోవర్ణనజ్ఞానమును, స్వీయసరోఽవేక్షణానుభవమును క్షీరనీరములుగ కలిసిపోయి అది అనన్యసామాన్యమయిన రచనాప్రక్రియగ విలిచిపోయినది.

ప్రకృతివర్ణనమున గద్యకవివిశేషమగు ఒక ఉక్తిచిత్రమును బాణుడు మిక్కిలి నిపుణతతో నిర్వహించియున్నాడు. అందు అచేతనప్రకృత్యంశములు మానవసుఖ దుఃఖములలో భాగస్వాములుగ చెప్పబడును. ముఖ్యముగ సూర్యచంద్రులు జగత్సా క్షులుకాన మానవులపై సానుభూతికలవారుగ చమత్కరించుట కాదంబరిలో కనబడును. ఉదాహరణమునకు,

---

1. కాశే ప్రతి, పుట 68-69; వావిళ్ల, 38-39.

2. తెలుగు ప్రబంధకవులు ఎక్కువగా ఇట్లు చేసియున్నారు.

3. కాశే ప్రతి, పుట 195;

4. కాశే ప్రతి, పుట 197-200.

(క) మహాశ్వేత దుఃఖమును విని కల్గిన శోకముచేతనోయన్నట్లు సూర్యుడు దివసవ్యాపారమును మాని అధోముఖుడయ్యెను.[1]

(గ) శోకానలదగ్ధమైన నల్లబారిన నడిమిభాగముకల మహాశ్వేతాహృదయమును తనమధ్యమున్న మచ్చనెపమున అనుకరించుచున్నాడో అన్నట్లు ...... తారకల రాజు ఉదయించెను.[2]

14. 15. బాణుని వర్ణనలు కవిత్వముగానే కాక సమకాలిక సాంఘికవిషయద్యోతకములుగకూడ పాఠకునిదృష్టిని నిలుపగలవు. సమగ్రవర్ణనాకాంక్షవలన ప్రాసంగికముగ బాణుడు చాలసంగతులను వర్ణనలలో చెప్పియున్నాడు. తరచిచూచిన ఆనాటివి ఎన్నియో సామాజికధర్మములు, ప్రజలయాచారవ్యవహార విశ్వాసములు, ప్రాసాదాది నివేశనములు, మనకు కాదంబరిలో దొరకును. సూతికాగృహవర్ణనమున ఆనాటి పురిటిల్లు మనకు ప్రత్యక్షమగును. రాజకులవర్ణనమున రాజప్రాసాదనివేశనవిశేషములు, కక్ష్యాంతరభేదములు తెలియును. హిమగృహవర్ణనమున ఆనాటికి వాడుకలోనున్న శైత్యసాధనములు గోచరమగును. ఇట్లు బాణునివర్ణనలు ఒకవైపున సాహిత్యమీమాంసకునికి మరియొకవైపున పూర్వసాంఘికవ్యవస్థామార్గణునికిని అత్యంతోపకారకములైయున్నవి.



1. శ్రుత మహాశ్వేతావృత్తాంత శోకోపజాత శోక ఇవ సముత్సృష్ట దివస వ్యాపారో రవిరపి భగవా నధోముఖతా మయాసీత్.

2. లాంఛనచ్ఛలేన విడంబయన్నివ శోకానలదగ్ధమధ్యం మహాశ్వేతా హృదయం ఉదగాత్ తారకరాజః.

అచేతన పదార్థములయందు చేతనత్వారోపణము, మానవచేష్టారోపణమును సంస్కృత కవిత్వమున సామాన్యప్రక్రియ. కొన్ని అలంకారముల నిర్వచనములలో అటువంటి భావము కనుపించినను దీనిని ప్రత్యేకాలంకారముగ మన ఆలంకారికులు గ్రహింపలేదు. ప్రాయికముగ ఇది ధ్వని విశేషమగును. పాశ్చాత్య సంప్రదాయమున, ఆంగ్లమున, దీనిని 'Pathetic fallacy' (మిథ్యానుభూతి లేక భావాభాసము) అని అలంకారవిశేషముగ చెప్పుదురు.

# 15. కాదంబరిలోని పాత్రలు

15. 1. పాశ్చాత్యవిమర్శనావిధానమున కథాకావ్యము, నాటకము, నవల మొదలగు కథాప్రధానమయిన సాహిత్యప్రక్రియలలోని పాత్రల మనస్తత్త్వచేష్టాదులను పరిశీలించుట వాడుక. ఈపద్ధతి ఆంగ్లవిద్యావిధానముతో మనకును సంక్రమించినది. 'పాత్ర పోషణము (Characterization)' అను శీర్షిక ఇప్పుడు విమర్శగ్రంథములలో అని వార్యము. భూమిక లేక పాత్ర[1] అనుట మనసంప్రదాయమున కేవలము నాటకమునకే సంబంధించినను నేడు 'కథలోని వ్యక్తి' అను సామాన్యార్థమున ప్రయుక్తము.

మన పూర్వపు సాహిత్యమీమాంసకులకు పాత్రలను వర్గీకరించుటలో మిక్కిలి యాసక్తి ఉండెడిది. నాటకములోని నాయకభేదములు, నాయికాభేదములు, ఆభేదములలో అంతర్భేదములు విడదీసి విస్తారముగ అనేక నాయకప్రకృతులను నాయికా స్వభావములను చెప్పియున్నారు. నాయికలు భానుదత్తువిమతమున 29 విధములు.[2] ఇక విదూషకవిటపీఠమర్దాది ఇతరప్రకృతులును నాటకలక్షణమున నిర్వచింపబడినవి.

కాని సంస్కృతవాఙ్మయమున కవులు ఆలంకారికమర్యాదలకు కట్టువడి పాత్రలను అచ్చులలో పోసిన విగ్రహములవలె వైవిధ్యములేక సృష్టించిరి. ధీరోదాత్త నాయకులకు ఒకఅచ్చు; ముగ్ధనాయికలకు ఒకఅచ్చు, ఇట్లే ఇతరపాత్రలకును. వీరిలో వ్యక్తిగతభేదము (individuality) లేక వర్గసామాన్యలక్షణమే (type) కనపడును. విదూషకులందరును ఒకవిధముగనే ఉందురు. మనవ్యాఖ్యాతలు ఈభేదములలో ఒక దానిని పాత్రకు నిర్ణయించి అంతటితో పాత్రవిమర్శనమును పూర్తిచేయుదురు. దుష్యంతుడు ధీరోదాత్తుడు, ఉదయనుడు ధీరలలితుడు, శకుంతల ముగ్ధ అని వ్యాఖ్యాతలు ఆపాత్రలజోలికి ఇక పోరు. ఆపాత్రలును అంతకన్న ఎక్కువ పరిశీలనమునకు ఆగవు.

---

1. ఆంగ్లపదము 'Character' అనుదానికి నాటకములో మన సంప్రదాయమున 'ప్రకృతి' అని, ఈ ప్రకృతిని వహించు నటుడు లేక నటి 'పాత్ర' లేక భూమిక (part, role)'.

2. చూ. రసమంజరి.

బాణుని 'కాదంబరి' లోని పాత్రలును అట్టివే. కాని కొన్నిముఖ్యపాత్రలలోని కొన్నియంశములుమాత్రము ఇచ్చట స్పృశింపదగినవి.[1] ఈచర్చలో కాదంబరీ కథాజ్ఞానము అపేక్షితము.

15. 2. 1. శూద్రకుడు : కావ్యారంభమున దీర్ఘముగ వర్ణింపబడిన రాజు; చంద్రునికి రెండవ మానవజన్మ; గుణవంతుడు, వీరుడు, ధీరుడు కాన ధీరోదాత్తుడే కాని కథానాయకుడు కాడు. కథలో వైశంపాయనశుకకథనమునకు శ్రోతయై, తనకును వైశంపాయనునకును శాపావసానమునకు నిమిత్తకారణమగును. కాదంబరీ కథలో ఇతనికి నిజముగ పాలులేదు.

ఇతని నారీపరాఙ్ముఖత్వము మాత్రము విశేషగుణము. దీనికి కావ్యములో ప్రయోజనము దుర్గ్రాహ్యముగ నున్నది. ఇతడు ఎట్లును హఠాత్తుగ చావవలసినవాడు కావున, సంతానమను తగులాటమేల అని బాణుడు ఇతనిని వివాహితబ్రహ్మచారిగ చేసెనన, అట్టివానికి వివాహముమాత్రమేల? తాను చచ్చి అనేకభార్యలను విధవలుగ చేయుటకా? అనుప్రశ్నలకు సమాధానము లేదు. 'సత్యపి ...... హృదయహారిణి బావరోధజనే (అందమయిన భార్యలున్నను)' అనుటవలన అతనికి పలుభార్యలుండి రని స్పష్టము.

ఇతనిపేరు కొంత విశేషమే. శూద్రకుడు అను రాజు కథలలోను, పురాణముల లోని రాజుల అనుక్రమణికలలోను కనబడును. 'మృచ్ఛకటిక' అను నాటకము యొక్క కర్త ఒక శూద్రకుడు. అతనిపేర ఒకభాణమును కలదు. అయినను ఆర్య సంప్రదాయమున 'శూద్రకుడు' అను పేరు క్షత్రియులు, బ్రాహ్మణులు పెట్టుకొనుట విచారింపదగినది.

'శూద్రక' అను పదము 'శూద్ర' అను పదముమీద 'క' అను స్వార్థ ప్రత్యయముతో ఏర్పడినది. కాని 'శూద్ర' అను పదము నాలుగవవర్ణమువారికి ప్రసిద్ధమై పిదారార్యసంప్రదాయమున 'జాతిహీనుడు' అనునట్లు నిందావాచకముగ కూడ ప్రయుక్తమే. అటులైన ఉత్తమకులజాలగు బ్రాహ్మణులకు, క్షత్రియులకు ఆపేరు ఎట్లు తగియున్నది అనుట విచార్యము.

---

1. పాత్రపోషణము అని కొందరు ఆ పాత్రను సంబంధించిన కథను వ్రాయుదురు. ఇచట అట్టి ప్రయత్నము లేదు.

శ్రీ వాసుదేవశరణ అగ్రవాలపండితుడు ఈశూద్రశబ్దవ్యుత్పత్తిని, బ్రహ్మసూత్ర భాష్యమున (1-3-34) శంకరాచార్యులు చెప్పినదానిని, ఉద్ధరించి చూపియున్నాడు[1]—

'శుచమభిదుద్రావ, శుచావాభిద్రువే (శోకమునుపొందువాడు; శోకముచే పొందబడువాడు).'

అనగా ఈశ్లోకమున 'కష్టజీవి' అనియర్థము. నాలుగవవర్ణమువారు తొలుత ప్రాయికముగ కాయకష్టముచేయువారు కావున 'కష్టజీవులు' అనునర్థమున శూద్ర శబ్దము ప్రసిద్ధమయియుండవచ్చును. నేడు 'పారిశ్రామికుడు' అన్నమాటవలె కావచ్చును. రాజులును, విద్యాధనులగు బ్రాహ్మణులును కాయకష్టమును హీనముగ చూచుటచేత కాలక్రమమున అది నిందావాచకమయియుండును. నేడును 'కూలిజనము' అనుటలో సంఘములో తక్కువవారు అను ధ్వని పోలేదు కదా.

గొప్పకులములలోను 'పిచ్చయ్య, పుల్లయ్య, ఏనాది' ఇత్యాది పేర్లు, కొన్ని విశ్వాసములవలన, పెట్టుకొనుట ఈనాడును ఆచారమైయున్నది. అట్లే ఆనాడు 'శూద్రకుడు' అని బ్రాహ్మణునికి లేక క్షత్రియునికి పెట్టెడు వారేమో ?

15. 2. 2. తారాపీడుడు : శుకకథారంభమునుండి కాదంబరీకథసమాప్తివరకును కథలో కనబడు రాజు, కథానాయకుడు చంద్రాపీడుని తండ్రి, మహావీరుడు, ధార్మికుడు, గుణములగని, ధీరోదాత్తుడు. బహుభార్యలున్నను అందు పట్టపుదేవి, విలాసవతియందు విశేషానురక్తుడు కాన అనుకూలనాయకుడు.[2] పుండరీకశాపమువలన[3] ఐంద్రుడు మర్త్యయోనియందు జన్మించుటకు ఇతడు భౌతికహేతువు.

అనపత్యతాదుఃఖమున్నను ధీరుడు, జ్ఞానసంపన్నుడు కాన విధిని దాట శక్యము కాదని యూరటచెంది, భార్యను ఊరడించును. ఆమెను ధర్మకార్యములు చేయుమని

---

1. చూ. 'కాదంబరీ ఏక్ సాంస్కృతిక్ అధ్యయన్ (హిందీ)'.

2. చూ. ప్రతాపరుద్రీయమున నాయక ప్రకరణము — 'ఏకస్యాం నాయికాయాం విశేషానురక్తో ఽనుకూలో నాయకః' ఇందుపై రత్నాపణవ్యాఖ్య 'సత్స్వపి నాయికాంతరేష్వితి'.

3. ఈ శాపము ఛూర్వభాగములోనిది.

చెప్పుటలో ఇతని ధర్మపరాయణత్వమును, సదాచారమున ఫలముకలుగును అను విశ్వాసమును, ప్రకటితమగుచున్నవి.

మంత్రి శుకనాసునియందు తారాపీడునికి అత్యంతసుహృద్భావము కలదు. శుకనాసునికి సంతానము కలిగెనని వినగానే మిక్కిలి యానందించి, చంద్రాపీడజన్మోత్సవమునకన్న మిన్నగ వైశంపాయనజన్మోత్సవమును జరిపించును. తారాపీడుడు అన్నివిధములను ఉత్తముడైన రాజు.

15. 2. 3. విలాసవతి : తారాపీడుని పట్టమహిషి, మంచియిల్లాలు. ఈమెయందు వేరు విశేషమేమియు లేదు. పత్రలేఖను చంద్రాపీడునికి తాంబూలకరంకవాహినిగ పంపునప్పుడు ఈమె కుమారునికి చెప్పి పంపిన సందేశముమాత్రము స్మరింపదగినది. —

"ఈమెను పరిచారికగ చూడరాదు. బాలగ లాలింపదగును. నిజమనస్సువలె చాపలవృత్తినుండి వారింపదగినది. శిష్యురాలుగ చూడదగినది. అంతరంగికగ తలపదగినది. పెంచి, పెద్దచేసినందువలన నాకు పుత్రికవంటిది. ఈమెయందు నాకు మిక్కిలి పక్షపాతము...[1]"

చంద్రాపీడుడు పత్రలేఖయందు అట్లే వర్తించుట అతని మాతృభక్తిని తెలుపును. యువరాజులకు పత్రలేఖవంటి అందమయిన వయసుకత్తెలను పరిచారికలుగచేయు నాచారము బాణునికాలమున ఉన్నదైన, ఈ సందేశము ఆయువరాజులకు నీతిబోధ కావచ్చును.

15. 2. 4. శుకనాసుడు : తారాపీడునిమంత్రి. బ్రాహ్మణుడు. మహాజ్ఞాని. పుండరీకుని వైశంపాయనావతారమునకు తగిన తండ్రి. ఇతడు చంద్రాపీడునికి చేసిన ఉపదేశము సర్వధర్మములకు, రాజనీతికిని సంగ్రహము, సన్మార్గదర్పణము, ఉన్మార్గనివారకమును. ఇంత అర్థసాంద్రతగల ఉపదేశము సాహిత్యమున వేరొకటిలేదు.

---

1. న చాస్యాం ఆయుష్మతా పరిజనసామాన్యాదృష్టినా భవితవ్యమ్. బాలేవ లాలనీయా, స్వచిత్తవృత్తిరివ చాపలేభ్యో నివారణీయా, శిష్యేవ ద్రష్టవ్యా, సుహృదివ సర్వవిస్రంభేషు అభ్యంతరీకరణీయా, దీర్ఘకాల సంవర్ధితస్నేహతయా స్వసుతాయామివ హృదయమస్యామస్తి మే. బలవానస్యాం పక్షపాతః ...... ఇత్యాది. (కాలేప్రతి, పుట 165; వావిళ్ల, 98 - 99).

ఈ 'శుకనాసోపదేశము' కాదంబరికి కావ్యాతీతమయిన శాస్త్రగౌరవము నిచ్చుచున్నది. భారతములో గీతోపదేశమువలె ఇది వేరుగ చిన్నగ్రంథముగ పరిగణింపదగినది. శుకనాసుడు ఆదర్శమంత్రి.

15. 2. 5. చంద్రాపీడుడు : ఇతడు కథానాయకుడు. అన్ని రాజలక్షణములు, సద్గుణములు కలవాడు. మృదుభాషి. ఒకేస్త్రీయందు అనురక్తుడు. పరస్త్రీని సోదరిగ చూచువాడు. 'వీర్యవాన్, గుణవాన్ ...' ఇత్యాదులచేత శ్రీరామునివంటివాడు. దిగ్విజయముచేత తన శౌర్యమును నిరూపించినవాడు.

చంద్రాపీడకాదంబరుల శృంగారము కావ్యమున ముఖ్యముకాగా, ముందు వర్ణితమగు మహాశ్వేతాపుండరీకులవృత్తాంతము పాఠకులమనస్సును హరించుటచేత, ప్రధానకథ అనుకరణభావమునుపొంది, కొంత చర్వితచర్వణమువలె తోచును. బాణుడే 'కాదంబరి' ని పూర్తిచేసియుండిన మరొకవిధమయ్యేడిదేమో. ఇచ్చట చంద్రాపీడుడు కథానాయకుడగుటకు అతడు చంద్రునియవతారమగుటయు, క్షత్రియుడగుటయు మాత్రమే కారణములు.

చంద్రాపీడునికి గొప్పధైర్యసాహసాదిగుణములున్నను అవి వ్యక్తమగుటకు కథలో అవకాశములేదు. స్త్రీలపట్ల అతనివర్తనముమాత్రము స్తవనీయము.

తల్లిమాటప్రకారము పత్రలేఖను సోదరిగనే గణించును. గుఱ్ఱముమీద తనతో నెక్కించుకొనిపోవుచు, తనశయనాగారముననే ఆమెనుకూడ పరుండజేయుచు, తప్పుడుగు వేయని ఇతని చరిత్రము భారతీయ సాహిత్యములోనే అపూర్వము. మనోవికారహేతువున్నను మనోనిగ్రహముండుటకదా, కాళిదాసుమతమున, మహా పురుషలక్షణము.[1]

మహాశ్వేతయందు ఇతనికి భక్తిగౌరవములు కలవు. కాదంబరియెడకూడ ప్రథమసమాగమమున మిక్కిలియుచితరీతిని ప్రవర్తించును. వాల్మీకి తనకాలమున మరావారులగు రాజులను చూచి, వారికి విరుద్ధమయిన ఆదర్శముగ, శ్రీరామునిపాత్రను తీర్చెనని అరవిందఘోషువాదము. బాణుడును సమకాలికరాజకుమారులకు చంద్రా పీడుని ఆదర్శచరితునిగ ఉద్దేశించియుండవచ్చును.

---

1. వికారహేతౌ సతి విక్రియంతే, యేషాం న చేతాంసి త ఏవ ధీరాః॥
(కుమారసంభవము 1 - 59)

15. 2. 6. పుండరీకుడు : కథలో ఉపనాయకుడు అనవచ్చును. ఇతడు దైవాంశసంభూతుడయినను విగ్రహము లేనివాడు. లక్ష్మి శ్వేతకేతుమునిని కామించుట వలన మానసపుత్రుడుగ జన్మించిన కారణముగ ఇతనియందు రజోగుణస్పర్శ యున్నట్లున్నది. శ్వేతకేతుపు జననహేతువుకాన పుండరీకుడు బ్రాహ్మణుడగును. చంద్రాపీడుడు క్షత్రియుడైనను సాత్త్వికుడు, పుండరీకుడు మునియయ్యును రాజసగుణోపేతుడు.

కావుననే విరహమునందు అన్నిమన్మథావస్థలను గొలదికాలములోనే దాటి వెన్నెలకుతాళలేక చంద్రుని నిష్కారణముగ శపించి,[1] తానును శప్తుడై, ఇరువురికిని లేనిపోని జన్మాంతరములను కల్పించి, కాదంబరీకథకు ముఖ్యహేతువయినాడు. ఇతని శాపము కాదంబరీవృత్తమునకు కేంద్రము.[2] వైశంపాయనుడుగ సంస్కారవంతుడయినను మహాశ్వేతను అస్పృష్టపూర్వస్నేహస్మృతివలన కోరి, బలాత్కరింపబోయి, శాపోపహతుడై చిలుకయగును.[3] ఇదియు రజఃఫలమే. విగ్రహము లేకున్నను, అదేకారణముగ పుండరీకునిలో ఒకవిధమయిన మానవత కనపడుటచేత 'కాదంబరి' పాత్రలలో ఇతడు పాఠకులసానుభూతిని పొందును. మహాశ్వేతాపవిత్రప్రేమకు పాత్రుడగుటయే ఇతనికి ప్రశంస.

15. 2. 7. మహాశ్వేత : ఈమె ప్రబంధనాయిక కాదగినది. 'కాదంబరి' లో ద్వితీయస్థానముననుండుటకు బాణుని కాదంబరీపక్షపాతమే కారణము. మహాశ్వేతా పుండరీకులవృత్తాంతము, వారిశృంగారమును, 'కాదంబరి' లో ప్రథమశ్రవణమువలన నూతనరమణీయమై, బాణుడు కావ్యారంభోత్సాహములో అతనిపుణముగ నిర్వహించుటవలన, మిక్కిలియాకర్షకముగనున్నది. వైశంపాయనుడు చిలుకయగుటయు, మరల పుండరీకుడుగ పూర్వస్థితినిపొందుటయు తప్ప పుండరీకమహాశ్వేతల కథ బాణోక్తమే. నాయికయగు కాదంబరిని బాణుడు సృజించినను పోషణము భూషణుని దైనది.

---

1. శాపముల సంగతి ఉత్తరార్ధములోనిది.

2. అభినవగుప్తుని నిర్వచనమున 'వృత్తము' శ్రవ్యకావ్యపు కథ. 'ఇతివృత్తము' నాటకపు కథ.

3. ఇదియును ఉత్తరార్ధములోనిది.

మహాశ్వేత ఉత్తమురాలు. తనకులేకపోగా కాదంబరికైనను వివాహసుఖము కలుగుగాకయని ప్రయత్నించుట ఆమె నిస్స్వార్థతను చాటుచున్నది. చంద్రాపీడుని కాదంబరియొద్దకు కొనిపోవుటలో వారిని జతగూర్చునుద్దేశము మహాశ్వేతకున్నట్లు బాణుడు చెప్పకున్నను క్షేమేంద్రుని 'బృహత్కథామంజరి' లో వాచ్యముగనే యున్నది. ఆయంశము సోమదేవుని కథనములో లేదు. అది ఒకవేళ గుణాఢ్యుని బృహత్కథలో ఉండియుండిన బాణుడు వలయునవియే దానిని విడిచెనని తలపవలసియున్నది.[1]

బాణుని విప్రలంభరసపోషణము మహాశ్వేతాపుండరీకులయందే పరిపూర్ణమైనది. కాదంబరీవిరహమును బాణుడు ప్రారంభించినను పూర్తిచేసినది భూషణుడు. చంద్రాపీడ మరణవృత్తాంతము, కాదంబరియందు కరుణపోషణము భూషణుని రచన.

మహాశ్వేతావృత్తాంతము పునస్సమాగమముమినహా సంపూర్ణముగ బాణునిదే కావున సంస్కృతవిద్యార్థులకు తరచు పాఠ్యభాగమగుచున్నది.

15. 2. 8. కాదంబరి : కాదంబరి కథానాయిక అనుటకు కావ్యనామము 'కాదంబరి' అగుటయే చాలును. కాని మహాశ్వేతవలన కాదంబరీప్రాముఖ్యము ఒకింత మరుగుపడుచున్నది.

కాదంబరిపేరు అపూర్వము. అట్టిపేరు సంస్కృతసాహిత్యమున బాణునికి పూర్వము కనరాదు. కాదంబరియనగా 'కదంబవృక్షసంబంధి' అనియర్థము. 'కాదంబరం లేక కాదంబరి' అని కదంబకుసుమములతో కాచిన ఒకకల్లుపేరు.[2] ఈపదము వాడుకలోనిదేకాని స్త్రీపేరుగ మొదట బాణకావ్యమున కనపడును.

కథాసరిత్సాగరకథలో కాదంబరికి తుల్యపాత్ర మకరందిక. ఆపేరు గుణాఢ్యునిదైన, బాణుడు మకరంద = మధు = కల్లు = కాదంబరి అని మధుసంబంధముగ పేరు మార్చియుండవచ్చును.

కాదంబరిపాత్రవర్ణనవలన మహోజ్జ్వలముగ కనపడినను, ఆమె కథ మహాశ్వేతకథవలెనే నడచును.

15. 2. 9. పత్రలేఖ : పత్రలేఖ ఉత్తమకులీన. కులూతరాజపుత్రి. మహారాణి విలాసవతియే పెంచిపెద్దచేసినది. కథారంభమున విలాసవతి పత్రలేఖను చంద్రాపీడునికి

1. క్షేమేంద్రుని కథ ఈ వ్యాసమున 10వ యధ్యాయమున నున్నది.

2. చూ. ఆప్టేనిఘంటువు ; 'కాదంబరీం ద్రావింతును ...' శృం. నై. 7-120.

తాంబూలకరంకవాహినిగ ఇచ్చును. తాంబూలకరంకవాహినులు అంతరంగికసఖులై దూతికలుగ వర్తింతురు. మహాశ్వేతకు తరలిక, కాదంబరికి తమాలికయు అట్లే.

బాణుడు పత్రలేఖను కథాంతమున ఎట్లు విడువదలచెనో మనకు తెలియదు. తాంబూలమిచ్చుచునే వృద్ధయయి మరణింపవలెనేమో ?

భూషణుని పూరణమున, చంద్రాపీడమరణమువలన మూర్ఛపడిన పత్రలేఖ దిగ్గునలేచి, పరుగెత్తి 'వాహనములేక రాజు (చంద్రాపీడుడు) ఒంటరిగా దూరము పోగా (చనిపోగా) నీవుండుట సరికాదు'[1] అని ఇంద్రాయుధమును ఈడ్చుకొనిపోయి దానితోకూడ తానును అచ్ఛోదసరస్సునడుమికి మునిగిపోవును. ఇంద్రాయుధము కపింజలుని రూపమున మరల లేచిరాగా, పత్రలేఖపాత్ర అంతటితో ముగియును. తదుపరి పత్రలేఖను కథలోని ఇతరపాత్రలు, కవియు విస్మరింతురు. ఆమెకు కథలో ఇక పనిలేదు.

కాని కథాంతమున, భూషణుడు, పేరుగ అతికించినట్లు, పత్రలేఖ ఏమాయెనని కాదంబరిచేత అడిగించును. చంద్రుడు (చంద్రాపీడుడు) పత్రలేఖ రోహిణియనియు ఆమె స్వస్థానము చేరెననియు చెప్పును.

'అందరు సుఖముండిరి' అని కథను ఇంచుమించుగ ముగించి మరల ఈ వివరణమును అతికించుట చిత్రముగనున్నది. ఈవిలంబితవివరణమునకు కారణమును ఇట్లూహింపవచ్చును. భూషణుడు 'కాదంబరి'ని పూర్తిచేసి హితులగు పెద్దలకు చదివి వినిపింపగా వారు అంతయు విని 'పత్రలేఖను ఏల అట్లు తుదముట్టించి విస్మరించితివి ?' అని అడిగియుందురు. పొరపాటు తెలిసికొని భూషణుడు అప్పుడు కథనంతయు 'మరమ్మత్తు' చేయుట మిక్కిలి కష్టము కావున ఏదో ఒక సమాధానమును అశ్లిష్టానుబంధముగ చేర్చియుండును.

### 15. 2. 10. కపింజలుడు - ఇంద్రాయుధము

బాణుని 'కాదంబరి'లో కపింజలుడు పుండరీకుని వయస్యుడగు మునికుమారుడు. ఇంద్రాయుధము చంద్రాపీడునియశ్వము. కపింజలుడే ఇంద్రాయుధము అను వృత్తాంతము భూషణుని పూరణములోనిది.

---

1. 'త్వం పునరేవ మే కాకీ వినా వాహనం దూరం ప్రస్థితే దేవే క్షణమపి అవస్థాతుం న శోభసే'. (ఉత్తర కాదంబరి. వావిళ్ల ప్రతి, 305)

మరియు చూ. ఈవ్యాసమున 9వ అధ్యాయము.

(క) కపింజలుడు పుండరీకునికి ఆప్తమిత్రుడు. పుండరీకుడు మునిజనానుచిత పథమున కామవ్యాపారములో చిక్కుకొనుట కపింజలునికి ఇష్టములేదు. అట్టి మరల్ప యత్నించును. ఆప్రయత్నము వ్యర్థమని తెలియగానే, శైత్యోపచారములచేత పుండరీకుని కామజ్వరమును తగ్గింపజూచును. అవియు విఫలములుకాగా, ఖిన్నుడై, గత్యంతరములేక మహాశ్వేతయొద్దకు పోయి ఆమెను తనమిత్రునికి ప్రేమభిక్షపెట్టి కాపాడుమని వేడుకొనును. ఆమె వచ్చులోపల పుండరీకుడు మృతినొందగా శోకోపహతుడై ఆమెను నిందించును. దివ్యుడు పుండరీకుని భౌతికకాయమును ఎత్తుకొనిపోగా కోపముతో వెంటాడును.

బాణుని కపింజలుడు ఇంతవరకే. ఇంతలోనే అతడు తనలోని మానవసహజములైన భావములచేత పాఠకులను ఆకర్షించును. రాగద్వేషములు, ఆశానిరాశలు, కోపశోకములు, దయాదాక్షిణ్యములు కపింజలునిలో వ్యక్తమగుటచేత అతడు గంధర్వులమధ్య సత్యమయిన పరిపూర్ణమానవాకృతిగ కనపడును.

(గ) ఇంద్రాయుధము. గొప్ప గుఱ్ఱము. పారశీకరాజు తారాపీడునికి కానుకగా పంపినది. తారాపీడుడు చంద్రాపీడునికి విద్యాభ్యాసాంతమున ఉపహారముగ ఇంద్రాయుధమును ఇచ్చును. ఇంద్రాయుధవర్ణనము కాదంబరిలో ఒక రమణీయాంశము. బాణుని ఇంద్రాయుధము భారతీయసాహిత్యప్రపంచములో సాటిలేని అశ్వరత్నము. పురాణములలో ఇంద్రుని ఉచ్చైశ్శ్రవము, చరిత్రలో అలెగ్జాండరు గుఱ్ఱము (Bucephalus) వంటి ప్రఖ్యాతి ఇంద్రాయుధమునకును కలదు. 'ఇంద్రాయుధము' అనగా 'గొప్పగుఱ్ఱము' అను అర్థము ఏర్పడినది.[1]

'ఇంద్రాయుధము' అను పేరు బాణునికి ఎట్లు తోచెననుట[2] జిజ్ఞాసువులు వేయదగిన ప్రశ్న. 'ఇంద్రాయుధము' అను సమాసమును బాణుడు సృష్టింపలేదు. ఇది 'ఇంద్రధనుస్సు' అను నర్థములో పూర్వమునుండి వ్యాప్తిలో కలదు. 'ఇంద్రా

---

1. వేదము వేంకటరాయశాస్త్రి 'ప్రతాపరుద్రీయ నాటకము' రాజా — రారా, బాబా, సాయింద్రాయుధమా' అనుట ఇంద్రాయుధ ప్రశస్తికి నిదర్శనము (పుట 28, 1973 ప్రతి)

2. 'ఇంద్రాయుధము' అని విశేషణముగ సుబంధుప్రయోగము దానిపై చర్చయు ఈ వ్యాసమున 2. 3. 10లో చూడదగును.

యుధం శక్రధనుః' అని అమరకోశము. ఇదికాక అశ్వపరముగ 'నేత్రైః కృష్ణై రింద్రాయుధోహయః' అని 'నల్లకండ్ల గుఱ్ఱము' అను అర్థము వైజయంతీనిఘంటువున పఠింపబడినది. బాణుడు ఇంద్రధనుస్సుతో ఇంద్రాయుధాశ్వమును పోల్చెననుటకు -

'అసితపీతహరితపాటలాభి రాఖండలచాపానుకారిణీభీ రేఖాభిః కల్మాషితశరీరం (నలుపు, పసుపు, ఆకుపచ్చ, లేతయెరుపు రంగులచేత చిత్రవర్ణశరీరముకలదై (ఇంద్రధనుస్సును అనుకరించుచున్నది)'[1] అని అతని వర్ణనమే తార్కాణము.

మరియు ఇంద్రాయుధాశ్వము 'ఇంద్రసంబంధోపకరణము' అను సూచన బాణుని వాక్యములో కలదు. బలాహకుడు అశ్వమును తెచ్చి చంద్రాపీడునితో చెప్పినప్పుడు,

'యాన్యుచ్చైఃశ్రవసః శ్రూయన్తే లక్షణాని తై రయముపేతః (ఉచ్చైఃశ్రవపు లక్షణములు ఏవి వినియున్నామో అవి కలది)'[2]

అని ప్రశంసించును. ఉచ్చైఃశ్రవముతో పోల్చుట సహజమైనను అది గుణాఢ్యుని కథనుండి బాణుడు గ్రహించియుండవచ్చుననుటకు ఒకయాధారము కలదు.

సోమదేవుని 'కథాసరిత్సాగరము' లోని 'మకరందికకథ' లో సోమప్రభునికి మాతలి ఇంద్రుని ఉచ్చైఃశ్రవపు కుమారుడైన ఆశుశ్రవమునుతెచ్చి ఇంద్రుని కానుకగా ఇచ్చును. సోమదేవుడు తాను గుణాఢ్యవచనములను యథామూలముగ సంస్కృతమున చెప్పెదనని ప్రతిజ్ఞచేయుటవలన ఆయంశము గుణాఢ్యవచనముగనే స్వీకరింపదగును. బాణుడు అందులోని ఇంద్రసంబంధమును మాత్రము గ్రహించి నామసార్థక్యమునకై 'రంగులచారలను' గుఱ్ఱమునకు ఆపాదించెనని తలపవచ్చును.[3]

---

1. కాశీప్రతి, పుట 129, 130; వావిళ్ల, 77,

2. కాశీప్రతి, పుట 124; వావిళ్ల, 76.

3. మరల వేదమువారి ప్రతాపరుద్రీయ నాటకమున ఒక తురకసిఫాయి ప్రతాపరుద్రుని గుఱ్ఱమును ప్రశంసించుచు

'అది దాటితే బూమ్కాఖోరడ్' అనును. 'బూమ్కాఖోరడ్' ఇంద్రధనుస్సు కావున బాణునియర్థము ఇచ్చట తేబడినది. 'దాటితే' అనుటతో, గుఱ్ఱము ప్లుతగతిలో (gallop) పరుగెత్తునపుడు ప్రతిగంతు చాపాకారముగ నుండును అని సూచన (చూ. ప్రతాపరుద్రీయము 1973 ప్రతి, పుట 32).

15. 2. 11. జాబాలి : 'కాదంబరి' లో జాబాలిమహర్షి ఒక కథకుడు. అతని కథనము వైశంపాయనశుకకథనాంతర్గతము. జాబాలి మునులకు, వైశంపాయనశుక మునకును, పుండరీక చంద్రాపీడాది వృత్తాంతమును మహాశ్వేత శాపమున వైశంపాయనుడు శుకమగువరకు చెప్పును. ఈశ్రవణమువలన వైశంపాయనశుకమునకు పూర్వజన్మజ్ఞానము, పూర్వపువిద్యలును కలుగును. రెక్కలువచ్చువరకు శుకము జాబాలి యాశ్రమమున సుఖముండును.

ఇచట జాబాలిపాత్ర నిమిత్తమాత్రమే. ఏఋషియైనను ఆపనికి చాలును. పురాణప్రసిద్ధులగు భరద్వాజాదులలో ఎవరినైనను బాణుడు ఈపనికి నియోగించి యుండవగును. అంతప్రసిద్ధుడుకాని జాబాలి పేరును బాణుడు ఏల వాడుకొనెనో విచారింపదగును.

కొన్ని వేదబ్రాహ్మణములందు 'జబాలా' అనునామె సంతతిగ జాబాలశబ్దము మాతృగోత్రాపత్యనామముగ కలదు. అందుప్రసిద్ధుడు సత్యకామజాబాలి. మరియొకడు మహాశాలజాబాలి. సత్యకామజాబాలి కథయొకటి భారతమున కలదు.

రామాయణమున రాముని వెనుకకుతెచ్చుటకు భరతునితోపోయిన ఒకఋషి మంత్రి జాబాలి. ఇతడు రామునికి ఒకవిధమయిన శూన్యవాదమును చెప్పి గతించిన తండ్రియాజ్ఞను పాటించుట అనావశ్యకమని బోధించును. తత్క్షణమే అతనివాదమును రాముడు ఖండించును. ఇచ్చట జాబాలి చెప్పినది బౌద్ధమనియు, బౌద్ధమతగ్రంథములు 'పిటకములు' కావున అప్రసంప్రవాసప్రతిపాదకమగు రామాయణమున పిటకములేల అనుభావమే, 'రామాయణంలో పిడకవేట్లాట' అను భ్రష్టరూపమును తెలుగులో పొందెననియు, జాబాలియుపన్యాసము రామాయణమున తరువాతికాలములో ఎవరో చొప్పించిరనియు చారిత్రకుల తీర్మానము.

'కాదంబరి' లోని జాబాలి వైదికజాబాలులలో ఒకరు కావచ్చును. రామాయణ జాబాలి బౌద్ధము 'కాదంబరి' లో లేదు. ఇతడు పూర్తిగ వైదికుడు. అప్రసిద్ధతచేత నూతనత్వాకర్షణము కలుగునని, ఎప్పుడును వినపడు భరద్వాజాదులను వదలి బాణుడు జాబాలినామమును వరించియుండును.



# 16. కాదంబరిలో బాణుని సమకాలికసమాజము

16. 1. కావ్యనిర్మాణమునకు కవిప్రతిభయే సాధనము ప్రేరకమును అయినను, కవి మానవసంఘములోని వ్యక్తియే కావున, కావ్యము ప్రజామనఃసామాన్యమునకును కవిమనోవిశేషమునకును సమాహారరూపభాషావ్యక్తీకరణమగును. మానవజీవితమే కవికి ప్రధానవస్తువు. కవికి బాగుగతెలిసినది తనకాలపు సమాజము. పూర్వగ్రంథములనుండి ప్రాచీనసామాజిక విషయములను తెలిసికొనును. పూర్వవిషయమును సమకాలికవిషయమును తనకల్పనచే నవీనమొనరించి కావ్యముచేయుట సత్కవిపద్ధతి. కావున వాచ్యముగనో, వ్యంగ్యముగనో, ఉద్దిష్టముగనో, అనవధానముగనో సమకాలిక సాంఘికసమాచారమును కవి తనకావ్యములో చేర్పకపోడు.

కవులు మిక్కిలి ప్రాచీనవృత్తములను తమకావ్యములకు గ్రహించినపుడు, పూర్వసామాజికవ్యవస్థ సరిగా తెలియనందున, వానిలో తమకాలపువిషయములను చెప్పుట సామాన్యముగ కనబడు దోషము.[1] షేక్స్పియరు (ఆంగ్లనాటకకర్త) ప్రాచీన రోమునగరప్రజలను తనకాలపు లండనునగరపౌరులుగనే చిత్రించెను. కాళిదాసుని దుష్యంతుడు గమారమి గుప్తులయుగములోని మహారాజులకు ప్రతిబింబమయి యుండును. తిక్కన భారతములోని కౌరవులు పాండవులు ఆనాటి ఆంధ్రులకు నమూనాలు.

ఇది కవిసైనము కాగా బాణుని కాదంబరిలో సమకాలికస్థానేశ్వరపరిసరప్రజలు, వారియాచారవ్యవహారములు కనపడుట తథ్యము. బాణుని 'హర్షచరితము' కవిత్వరూపమున వాస్తవవృత్తమును చెప్పునది కావున, అందులోని వ్యక్తులు, సంఘటనలు యథార్థములు కావునను, ఆనాటి సాంఘికవ్యవస్థకు దర్పణమువంటిది. కాదంబరిలో కల్పితమానవులు, అపౌరాణికదేవయోనులు, అద్భుతవృత్తాంతములు ఉండుటవలన వాస్తవిక సంఘసమాచారము తక్కువ. అయినను అందలి మిథ్యావ్యక్తులకును

---

1. ఆంగ్లములో దీనిని 'అనాక్రనిజమ్ (Anachronism)' అందురు ఒక కాలపు సంగతులను మరియొక కాలమునకు వర్తింపజేయుట.

మిథ్యాప్రదేశములకును ఆకరములు బాణునికి తెలిసిన యథార్థవ్యక్తులు, ప్రదేశములే కావున 'గాలించి' చూచిన అనేక సమకాలికవిషయములు గోచరించును.

16. 2. శూద్రకవర్ణనములో రాజసామాన్యవిషయములుపోగా 'పరిపీతధూమవర్తిః' అనుటచేత ఆనాడు చుట్ట, బీడి, సిగరెట్లవలె ఏదో సుగంధధూమపానము వాడుకయని తెలియుచున్నది.[1] హిమగృహవర్ణనమున 'ఘటీయంత్రము' అనుటచేత నీటినితోడు యంత్రము (Persian wheel) వాడుకలోనుండినదని గ్రహింపవచ్చును. అచ్చటనే 'యంత్రమయి ...' అనుమాటచేత అనేకవిధయంత్రసాధనప్రాచుర్యమును ఊహింప దగును. అట్లే సూతికాగృహవర్ణనమున ఎన్నియో వాడుకలు విశ్వాసములు తెలియును. ఇట్టివి కాదంబరికి విస్తృతవ్యాఖ్యానమున ఆయాచోట్ల చెప్పదగినవి. గ్రంథవిస్తర భీతిచేత ఇచ్చట కొన్నిముఖ్యాంశములుమాత్రము చర్చింపబడును.

## 16. 3. హర్షునిరాజ్యములోని ప్రజలు, ఆచారములు

(క) జాతి: నగరవర్ణనములనుండి బాణునికాలములో పరిసరములందు బహుప్రాంతములు, బహుభాషలు, బహువిధమతములప్రజలు ఉండిరని స్పష్టమగు చున్నది. తారాపీడాదులలో కాకేషియన్ (Caucasian) జాతిలక్షణములగు శ్వేతవర్ణము, దీర్ఘనాసికలు, ఆర్యసంప్రదాయము కనపడును. తారాపీడుని నౌకర్లలో ఆంధ్రద్రవిడ సింహళదేశీయులుండిరి.[2] అడవులలో నల్లని శబరనిషాదమాతంగాదులు ఉండిరనియూ తెలియును.

(గ) మతము: ప్రజలలో ప్రధానమతము వైదికపౌరాణికమయినను, జైన బౌద్ధమతములు ఆదరింపబడుచుండినవి. హర్షునిరాజ్యములో మొత్తముమీద మతసామ రస్యము ఉన్నట్లున్నది. జైనమతపు జీవకారుణ్యము (జినధర్మేణేవ జీవానుకంపినా) సకలప్రజాదరణము పొందినది. రాణి విలాసవతి సంతానప్రాప్తివిషయమై నగ్నక్షపణ కులను (దిగంబరజైనులు) ఆదరించి ప్రశ్నించుటలో, శుకనాసునియింట 'శాక్యముని

---

1. ఆయుర్వేదమున అనేక ధూమపానములు చెప్పబడియున్నవి. దినమునకు ఎనిమిదిమారులు ధూమపానము చేయవచ్చునని శాస్త్రము. ఇవి మానవుని రుగ్మత నుండి కాపాడునని విశ్వాసము.

2. దాక్షిణాత్యులు రాజులైన సామంతులుగను, సామాన్యులయిన నౌకర్లు గను తగుదురని ఉత్తరదేశస్థుల విశ్వాసము.

శాసనధౌరేయులు (బౌద్ధులు)', బ్రాహ్మణులు, పాశుపతులు రాత్రింబవళ్లు చేరియుందు రనుటలోను మతసహనము, వీరందరు శుకనాసుని గౌరవింతురనుటలో వైదికమతాధిక్యమును వ్యక్తమగుచున్నవి.

బాణుడు శైవుడగుట, చండికాశతకమును రచించుట, వీనివలన, కాదంబరిలో శివభక్తులు, చండికాయతనమును వలపు. వైష్ణవమతముమీద బాణునికి సదభిప్రాయము లేదనుట మహాలక్ష్మికి శ్వేతకేతువుమీద కామము కలుగునట్లు చెప్పుటలో తెలియుచున్నది. పార్వతికి అట్లేల చెప్పరాదు? లేదా ఎవరో మేనకనో తిలోత్తమనో చెప్పవచ్చును కదా ?[1]

ఆనాడు పురాణములను దేవాలయములందు చదివి విపులీకరించుట వాడుక యని విలాసవతి మహాకాలాలయములో మహాభారత ప్రవచనము విని దుఃఖించుట తార్కాణము.[2]

(చ) వేదాంతము : బౌద్ధ జైన హిందూతాత్త్విక చింతనమున కర్మవాదము, బహుజన్మలు, సామాన్యవిషయములుకావున కాదంబరీకథలోని జన్మపరంపరలు ప్రజలకు విశ్వసనీయములని చెప్పవచ్చును. విధినిదాట శక్యముకాదని తారాపీడుడు విలాసవతికి బోధించుట, జాబాలి వైశంపాయనశుకమును చూచి తన పాపకర్మచేతనే చిలుకజన్మ ప్రాప్తించెననుటయు గుర్తింపదగినవి. ఆనాడు తాపసులు, వేదాంతులు మిక్కిలి గౌరవింపబడుచుండిరనియు ఊహింపవచ్చును.

జగము మిథ్యయను శంకరాద్వైత ప్రతిపాదనము అప్పటికి తెలిసినట్లు లేదు.

(జ) వర్ణవ్యవస్థ: కాదంబరిలో వైశ్యులప్రస్తావన లేదు.[3] కాని, అనాటికిని

---

1. చూ. 10. ర.

2. 'హర్షచరితము'లో బాణునియింట వాయుపురాణ పఠనము జరుగుచున్నట్లు చెప్పబడినది.

3. చీనాయాత్రికుడు, హ్యూఇన్‌సాంగు హర్షవర్ధనుని వైశ్యుడు అని పేర్కొనెను. కాని 'బఇస్' అను రాజపుటానా క్షత్రియవంశము హర్షుని దనియు, ఆ మాటను హ్యూఇన్‌సాంగు వైశ్య పద భవమైన "వైస్ లేక వైస్" అనుకొనెననియు, పండితులు, చారిత్రికులు నిర్ణయించి యున్నారు. కాని కొంతకాలము అస్థానముననుండి మతములను చక్కగా అవగతముచేసికొనినవాడట్టి పొరబడునా ?

(క్రీ. శ. 7-వ శతాబ్దము) హిందూసంఘములోని ప్రథమ త్రివర్ణములు ఎక్కువగ వృత్తిభేదమువలన కల్గినవేకాని న్యూనాధిక్యసూచకములే కావేమో? ఆర్యసంస్కారములులేక పౌరాణిక హిందూమతమును, ముఖ్యముగా దేవాలయముల హిందూమతమును, పాటించు శ్రమజీవులు నాలుగవవర్ణమువారుగ నుండిరి.

ఎక్కువగ వేటలో జంతుహింస చేయుచు, చర్మములు బాగుచేసి వానితో పాదరక్షలు, జీనులు మొదలగునవి తయారుచేయు భిల్లజాతులను ఆనాడు చండాలశబ్దముచేత ఉపలక్షించుచుండిరి.[1] వీరే పంచమవర్ణమువారు. హిందూసంప్రదాయమున వీరు అంటరానివారైనను బౌద్ధమతప్రభావమున హర్షునిరాజ్యములో అంటరానితనము

---

1. చండాల శబ్దమును సాంప్రదాయిక వ్యాకరణమున చండి = కోపే అను ధాతువునుండి నిరూపింతురు. 'చండతే క్రూరకర్మత్వేన ఇతి చండాలః (కోపించును క్రూరపనులచేత అని చండాలుడు). ఇందు కోపము జాతిలక్షణముగ పేర్కొనబడినది. ఇది తార్కికబుద్ధికి సరిగాతోచదు. కోపించువారందరును చండాలురైన వారిలో దూర్వాసుడు అగ్రగణ్యుడగును గా? చండాలశబ్దపు వాస్తవమైన నిరూపణము మరియొకవిధము.

పూర్వము జైన బౌద్ధ మతగ్రంథములు గీర్వాణభ్రష్టరూపములయిన ప్రాకృత పాలీలలో ఉండెడివి. కాని తరువాతికాలమున వానిని సంస్కృత భాషలోనికి మార్చు ఉద్యమమున అనేక ప్రాకృతరూపములకు విసర్గలు తగిలించినందున ఒక సంకరజాతిపదజాలము (Hybrid words) ఏర్పడినది. చండాలపదము వానిలో ఒకటి కాదగును. కాలక్రమమున అది సంస్కృతమున రూఢియై దానికి వైయాకరణులచేత ధాతుమూలకమయిన కృత్రిమపు వ్యుత్పత్తి సమకూర్చబడినది. చండాలశబ్దపు పూర్వచరిత్రను ఇట్లు చూపవచ్చును —

చర్మకారః (తోలుపనిచేయువాడు) = ప్రాకృతమున చమ్మఆరో లేక చమ్డఆరో. అవియే వ్యవహారమున చమ్మారో (చమ్మార, చమ్మాల్) చమ్డారో (చండార్, చండాల్) అయినవి. ఇప్పటికిని హిందీ మాండలికములలో చమ్డా (చండా) అనగా 'తోలు' చర్మశబ్దభవము. 'చమ్మార్' అనుట 'చెప్పులు కుట్టువాడు'. 'చమ్డాలో' అను రూపమునకు విసర్గపెట్టిన 'చమ్డాలః = చండాలః' అనియగును. '—కారః —కారిణ' అను అంతములుకల కుంభకారీ (కుమ్భారి = కుమ్మరి), స్వర్ణకారీ (సొనారి) పూజాకారీ (పూజారి) పదముల వికృతులు ప్రసిద్ధములు.

పాటింపబడలేదని తెలియుచున్నది.[1] కాదంబరిలో చండాలకన్యక రాజదర్శనమునకు వచ్చియున్నదని ప్రతీహారి చెప్పగా శూద్రకమహారాజు,

"కోదోషః ప్రవేశ్యతామ్ (తప్పేమి, ప్రవేశింపబడునుగాక)" అనును. పవిత్ర క్షత్రియకులజుడయిన రాజును చాండాలిక సమీపించి ఎదురనిలుచుట తప్పు అను హిందూపూర్వాచారమును బాణుడు శూద్రకుని మాటలో, తరువాత వర్తనములో ఖండించుచున్నట్లు తోచుచున్నది. ఇచ్చట శూద్రకివాక్యము వాస్తవముగ హర్షునిదేమో. 'యథారాజా తథాప్రజా' అని హర్షునియభిప్రాయమును ఎంతపైదిపుడయినను బాణుడు అంగీకరించినట్లున్నది. మరియు చాండాలికను మహోజ్జ్వలముగ వర్ణించుటయు అస్పృశ్యతావిరోధమతమును బలపరచుచున్నది.

కాని అస్పృశ్యత అను భావము రూఢముగనే ఉన్నట్లు శూద్రకుని తరువాతి మాటలు తార్కాణము.

'అహో, విధాతురస్థానే రూపనిష్పాదనప్రయత్నః (అహా, కానిచోట బ్రహ్మ లావణ్యసృష్టిప్రయత్నము!)'[2]

'అస్థానే (కానిచోట)' అనుటలో చండాలకులము తగనిది అను భావమును కలదు. అట్లే మరల

"కిమర్థమపగతస్పర్శసంభోగసుఖే కృతం కులే జన్మ (ఏల స్పర్శయను భోగమువలని సుఖములేని, అనగా తాకరాని, కులమున (ఈమె) జన్మ కలిగినది ?"[3] అనియు,

"మన్యే చ మాతంగజాతిస్పర్శదోషభయాదస్పృశ్యతా ఇయముత్పాదితా ప్రజాపతినా ; అన్యథా కథమియమక్లిష్టతా లావణ్యస్య (మాదిగకులమును తాకుట దోషము అను భయమువలన బ్రహ్మ ఈమెను తాకకుండనే సృష్టిచేసెనా ? లేకున్న ఈలావణ్యపు సౌలభ్యము ఎట్లు ?)"[4]

---

1. చూ. బాణుని సమకాలికులు 2. 4. 1.

2. కాలే్రప్రతి, పుట 25 ; వావిళ్ల, 13.

3. కాలే్రప్రతి. పుట 25 ; వావిళ్ల, 13.

4. కాలే్రప్రతి, పుట 25 ; వావిళ్ల, 13.

అవియును అకులము అస్పృశ్యము అనుభావము శూద్రకుని మనసుననే కలదు. ప్రతీ హారియు ఆమెను ప్రవేశపెట్టి "దూరాదాలోకయ (దూరమునుండియే రాజును చూడు, అనగా, దగ్గరకుపోరాదు)"[1] అనుటయు ఆభావమే.

కాని మొదట 'కో దోషః' అనుట ఈభావమునకు విరోధము. బాణుని కాల మున అస్పృశ్యత తగునా అనుటమీద భిన్నాభిప్రాయములు ఉండినవని తెలియుచున్నది.

శూద్రకవర్ణనమున "చిత్రకర్మసు వర్ణసంకరాః"[2] అని చమత్కరించుటవలన అన్నివర్ణములవారును తమధర్మములను పాటించుచుండిరి అని గ్రహింపదగును. హర్షునికాలములో పరవర్ణమతజాత్యాదిసహనము ఉండెననుటయు చారిత్రకమతము.

(ట) సహగమనము: సహగమనము అను సంప్రదాయము వైదికవిధికాదు, భర్త చనిపోయినతరువాత భార్య భర్తదేహముతోనో లేక వేరుగనో అగ్నిప్రవేశము చేసి ప్రాణత్యాగము చేయుటను సహగమనము అని పేర్కొందురు. ఈసంప్రదాయము హూణులు, శకులు ఇత్యాది ఆర్యేతరజాతులు వలసవచ్చి భారతదేశమున ఆర్యసంప్ర దాయములో కలిసినపుడు కొందరిలో ఏర్పడిన విజాతీయసంస్కారము అని చారిత్ర కులు చెప్పుదురు. ఈపద్ధతి సర్వజనామోదము పొందలేదనియు, బాణుని కాలమున వాడుకలోనున్నను అనేకులు దానిని కాదనువారును ఉండిరనియు కాదంబరిలో బాణుని సహగమనవిధానఖండనము వలన తెలియుచున్నది.

'హర్షచరితము' లో బాణుడు రాణి యశోమతి తన భర్త ఎట్లును మరణింప నున్నాడని నిశ్చయించి మృత్యుయిదువగనే తన జీవితమును అంతమొందింపగోరి అగ్నిప్రవేశము చేసి ప్రాణత్యాగము చేయును. ఇది సహగమనమునకన్న ఒకమెట్టు ఎక్కువయిన 'పూర్వగమనము.'

రాజకులములో ఇట్టి ఆచారము ఉన్నను, బాణుడు మహాశ్వేతాసహగమన యత్నమును పురస్కరించుకొని చంద్రాపీడవాక్యములలో సహగమనఖండనము చేయును. ఈసహగమననిషేధోపన్యాసము[3] కాదంబరిలో ఒకగొప్పయంశము. ఇచ్చట

1. కాలేప్రతి, పుట 22; వావిళ్ల, 12.

2. చూ. 12. 6. 3. (క). 1.

3. యదేత దనుమరణంనామ త దతినిష్ఫలమ్ ...... ఇత్యాది.
(కాలేప్రతి, పుట 264, 265, 266; వావిళ్ల, 167, 168)

భావోద్వేగము, భాషాసౌందర్యము, తార్కికనైపుణ్యమును కనబడును. సహగమనము ఆర్షసంప్రదాయముకాదని, అది దారుణమయిన ఆత్మహత్యయనియు, దానివలన భర్తకు గాని భార్యకుగాని, పరమునగాని ఇహమునగాని ఏలాభమును లేదనియును, చంద్రాపీడుని వాదము. ఈఘట్టమున బాణుడు సంఘసంస్కర్తగ కనపడును.

(డ) బహుభార్యలు – ఒకభార్య: శూద్రక తారాపీడులకు బహుభార్యలున్నట్లు చెప్పినను, మహాశ్వేతాపుండరీకుల విషయమున, ఒకతెయందే అనురాగము గొప్ప అను ధ్వనిని బాణుడు, తరువాత కాదంబరీచంద్రాపీడులలో అశ్లేష భూషణుడును కలిగించియున్నారు.

రామాయణమున దశరథునికి అనేకభార్యలుండుటవలని యనర్థమును వాల్మీకి లోకోత్తరముగ చూపి, రామునిద్వారా తద్విపరీతమయిన ఒకేభార్యయందనురాగమును ప్రశంసించుట సంఘసంస్కరణాభిలాషగ తోచును.

బాణునితండ్రికి ఒకవర్ణాంతరభార్య ఉన్నట్లు 'హర్షచరితము' లో 'పారశవ' సోదరుని పేర్కొనుటవలన తెలియుచున్నది. బాణుని తల్లితో కవీనము ఇరువురు భార్యలగుదురు. ఈస్వానుభవము బాణుని ఏకదారత్వప్రతిపాదకునిగ చేసియుండ వచ్చును.

కాళిదాసుని నాయకులందరును బహుభార్యలవారే అని గుర్తింపదగును.

(త) తాంబూలము: కాదంబరిలోని తాంబూలాదానప్రదానచర్వణప్రాచుర్యము విచారింపదగినది. వైదికసంప్రదాయమున తాంబూలసేవనము లేదు. తాంబూలపువాడుక దేశమంతయు వ్యాపించినపిమ్మటకూడ వైదికులకు తాంబూలము తగదు అనుభావము 'వైదికుని చేతి విడెము' అను నానుడిలో కలదు. పూర్వకాలమున ఆర్యసంప్రదాయమున క్రతువులలో దక్షిణ ఇచ్చుట ముఖ్యమని కలదేకాని 'దక్షిణ తాంబూలము' అని లేదు. వాల్మీకిరామాయణమున తాంబూలప్రశంస లేదు. తమలపాకులతోటలోనికి బ్రాహ్మణుడు పోరాదట.

ప్రసిద్ధకావ్యములలో తొలిసారిగా తాంబూలీలతయు పోకచెట్లును దక్షిణదేశ వర్ణనమున కాళిదాసుని 'రఘువంశము' న కనబడుచున్నవి;

తాంబూలీనాం దలైస్తత్ర రచితాపానభూమయః ।
నారికేలాసవం యోధాః శాత్రవం చ పపుర్యశః ॥[1]

---

1. రఘువంశము 4 – 42.

[సైనికులు పానభూముల నేర్పరచికొనినవారై తాంబూలీదళములతో టెంకాయకల్లును త్రాగిరి; అట్లే శత్రువులగొప్పను హరించిరి]

తతో వేలాతటేనైవ ఫలవత్ పూగమాలినా ।
అగస్త్యచరితామాశాం - అనాశాస్యజయో యయౌ ॥[1]

[అంతట కాయలతోడి పోకచెట్లవరుసలుగల సముద్రతీరముమీదుగా అగస్త్యుడు నడచినదిక్కునకు (దక్షిణముగా) కోరకయే జయముకలుగు (రఘువు) పోయెను]

కాళిదాసునకు తమలపాకులతో దొన్నెలు చేయుట, పోకచెట్లు దక్షిణదేశవిశేషముగ, తెలిసినట్లున్నది. కాని ఈయాకును ఆపోకను కలిపి సున్నముపూసి నమలుట తెలిసినట్లు లేదు. కాళిదాసుకాలమునకు తాంబూలచర్వణము ఉత్తరభారతమున పూర్తిగ ప్రాకియుండదు. కాళిదాసునకు తెలిసియుండినను అసభ్యమైన నవీనాచారమని చెప్పలేదేమో ?[2]

చారిత్రకులమతమున కాళిదాసునకును బాణునకును అంతరము రెండుశతాబ్దములకన్న తక్కువ. చిత్రమేమన బాణునికాలమునకు తాంబూలచర్వణము నేడు కాఫీటీలవలె 'చిన్నాపెద్దా, వేళాపాళా', లేక ఉత్తరభారతమున పెద్దవ్యసనమైనదని తోచుచున్నది. కాదంబరిలో రాజులయిండ్లలో తాంబూలికభవనములు, తాంబూలకరంకములు, తాంబూలకరంకవాహినులు కనపడుట, పెండ్లికాని ఇరువదేండ్లలోపు యువకుడగు చంద్రాపీడునికి మహారాణి పనిగట్టుకొని పత్రలేఖను తాంబూలకరంకవాహినిగ నియమించుట, అట్లే మహాశ్వేతకు, కాదంబరికి తాంబూలకరంకవాహినులుండుట, పుండరీకుని ప్రేమలేఖను తరలిక తాంబూలసేటికలో దాచి తెచ్చుట,

1. రఘువంశము 4-44, మరియు చూ. 6-44 "తాంబూలవల్లీ".

2. ఈ తాంబూలీలత తూర్పుద్వీపములనుండి దక్షిణ భారతదేశమునకు తేబడి ఇచ్చటనుండి ఉత్తరమునకు వ్యాపించినదని కొందరు విమర్శకుల అభిప్రాయము. క్రీ. శ. 5వ శతాబ్దమున తాంబూలపు వాడుక ఉత్తరాదికి పోయియుండవచ్చును. తాంబూలశబ్దపు, మూలము తెలియదు. సంస్కృతశబ్దము విటికా (ప్రాకృతము 'విడా, బిడా, బీడా' తెలుగు విడెము)' ద్రవిడపు వెత్తలై' నుండి సాధింపవచ్చును. దీనినుండియే ఆంగ్లమున 'BETEL'. కాని తమిళపదపు మూలమేదో తెలియదు.

కాదంబరిని దర్శింపగనే చంద్రాపీడునికి మహాశ్వేత కాదంబరిచేత తాంబూలమిప్పించుట, చంద్రాపీడునికి శేషహారమును పంపుచు కాదంబరి కేయూరకుని చేత విడెము పంపుట, దానిని చంద్రాపీడుడు (దంతధావనమయినదో లేదో ?) తక్షణమే సమలుట, ఇవియంతయుఁ జూడగా ఆనాటికి బాణునిసమకాలికసమాజములో తాంబూలము వ్యసనమును, అతిథిగౌరవసామగ్రియును అయినదని తెలియుచున్నది.[1]

వైశంపాయనుడుకాని శుకనాసుడుకాని తాంబూలముసేవించినట్లు లేదు. వైదిక బ్రాహ్మణులు దీనిని అప్పటికే నిషేధించియుండిరేమో ?

ఎటులైనను కాలక్రమమున తాంబూలము ఔషధముకూడ అయినది. 'హితోపదేశము'న,

తాంబూలం కటుతిక్తమిశ్రమధురం క్షారం కషాయాన్వితం,
వాతఘ్నం కఫనాశనం క్రిమిహరం దౌర్గంధ్యదోషాపహం, ।
వక్త్రస్యాభరణం మలాపహరణం కామాగ్నిసందీపనం,
తాంబూలస్య, సఖే, త్రయోదశగుణాః స్వర్గేఽప్యమీ దుర్లభాః ॥[2]

అని కలదు.

(ద) అతిథిగౌరవవిశేషము : వచ్చినవారికి కాళ్లు కడిగి వస్త్రముతో తడియొత్తుటను, కపింజలుడు మహాశ్వేతను దర్శించినపుడు, చంద్రాపీడుడు కాదంబరిని చూచినపుడును బాణుడు వర్ణించియున్నాడు.

(ప) నమస్కారము - అంజలిఘటనము : ఆర్యసంప్రదాయమున వయోజ్ఞాన

1 బాణుడు దేశాటనమునకు పోయినపుడు అతని పరివారములో చండకుడు అను తాంబూలదాయకుడు ఉండుట గుర్తింపదగును. బాణుడును తాంబూలచర్వణ వ్యసనమునకు లోనైయుండును.

2. 'విగ్రహము'లో 8వ కథలో ప్రాసంగికము. ఇది దక్షిణదేశపు వ్రాతప్రతులలో నే కనపడుచున్నది. M. R. కాలే పరిష్కరించిన అచ్చుప్రతిలో లేదు. ఈ శ్లోకమును ఏదో మధ్యకాలపు ఆయుర్వేదగ్రంథములోనుండి ఎవరో ఎత్తి హితోపదేశమున చొప్పించియుందురు. అచ్చట దీని ఉల్లేఖనమునకు తగిన అవశ్యకత లేదు.

పదవులందు అధికులకు తక్కువవారు నమస్కరించుట (వంగుట, తలవంచుట) అంజలిఘటించుటయు (చేతులుజోడించుట, కేలుమోడ్పు) కలదు. తాపసులు వయసున చిన్నవారయినను నమస్కారార్హులు.

శృంగారచేష్టగా ప్రియురాలిని అనునయించుటలో తప్ప, నాయకుడు నాయికకు గాని మరియొక అల్పవయస్కయయిన స్త్రీకిగాని నమస్కరించుట భారతసాహిత్యమున ఒక్క 'కాదంబరి' లో కనబడును (?)[1]

చంద్రాపీడుడు మహాశ్వేతకు నమస్కరించుట ఆమె తపస్వినిగ కనపడుటచేత యుక్తమనదగును.

కాని చంద్రాపీడుడు కాదంబరికి ముందు నమస్కరించుటయు ఆమె ప్రతిప్రణామముచేయుటయు బాణుని సమకాలికాచారమో లేక అతని ఊహావిశేషమో ?

(బ) <u>విద్యాభ్యాసము</u> : చంద్రాపీడుని విద్యాభ్యాసములోని పాఠ్యప్రణాళిక (Syllabus) బాణుని సమకాలికవిద్యావిధానమునకు దర్పణము. ఒక విద్యార్థి ఇన్ని నేర్వగలడా అను ప్రశ్నను వదలి, ఆనాడు పఠనపాఠనములందున్న వివిధ శాస్త్రకావ్య కళాదులను బాణుని పట్టికలో చూడనగును.[2]

శాస్త్రములు

1. పదశాస్త్రము (వ్యాకరణము)
2. ఛందశ్శాస్త్రము
3. వాక్యశాస్త్రము (పూర్వమీమాంస)
4. ప్రమాణశాస్త్రము (తర్కము)
5. ధర్మశాస్త్రము
6. రాజనీతి (అర్థశాస్త్రము)

---

1. శాకుంతల నాటకాంతమున దుష్యంతుడు శకుంతలకు సాగిలబడి మ్రొక్కుట తాను చేసిన ఘోరాపరాధమునకు మన్నన కావున విశేషము. ఇది శృంగారచేష్ట కాదు.

2. కాశీప్రతి, పుట 126; పంక్తి 74.

7. ఆయుర్వేదము
8. విషాపహరణము (విరుగుళ్లు)
9. గంధశాస్త్రము (వాసననుబట్టి పదార్థవిజ్ఞానము, పరిమళద్రవ్యపరిజ్ఞానము)
10. మంత్రశాస్త్రము
11. శకునిరుతశాస్త్రము (శకునములు ?)
12. సాముద్రికశాస్త్రము
13. సురంగశాస్త్రము (Mining)
14. రత్నపరీక్ష
15. గ్రహగణితము (జ్యోతిషము)
16. నాట్యశాస్త్రము (నాటకలక్షణము)
17. గానశాస్త్రము
18. వాద్యములు (వీణా - వేణు - మురజ - కాంస్య - తాల-దర్దుర - పుటాములు)
19. రతిశాస్త్రము (కామశాస్త్రము)
20. హస్తిశాస్త్రము
21. అశ్వశాస్త్రము

లిపిలేఖనభాషాజ్ఞానములు

22. సర్వలిపిశాస్త్రము
23. సర్వసంజ్ఞాజ్ఞానము
24. లేఖ్యకర్మ
25. పత్రచ్ఛేదము[1]
26. సర్వదేశభాషాజ్ఞానము (దేశభాషలు)

కావ్యాదులు

27. కావ్యములు, కథలు, ఆఖ్యాయికలు, నాటకములు (సాహిత్యము)
28. పురాణములు, ఇతిహాసములు, రామాయణము, భారతము.

---

1. పత్రచ్ఛేదక = a leaf - cutter (Monier Williams)

కళలు

29. చిత్రకళ

30. శిల్పము

31. ద్యూతకళ

32. పుస్తకవ్యాపారము (బొమ్మలుచేయుట, Clay-modelling?)

చేతిపనులు (handicrafts)

33. దారుకర్మ (కొయ్యపని)

34. దంతపుచెక్కడము

పైవన్నియు అగ్రకులములగు బ్రహ్మక్షత్రియవైశ్యులకు అందరకును తగినవి. దేహపరిశ్రమ, ఆయుధప్రయోగము మొదలగునవి క్షత్రియులకు మాత్రము.

35. వ్యాయామవిద్యలు

36. తరణము (ఈదుట)

37. ప్లుతి (ప్లవనము - నావనడుపుట)

38. లంఘనము (దాటుట, అగడ్తలను దాటుట)

39. ఆరోహణము (ముట్టడిలో కోటగోడలు ఎక్కుట)

40. వాహనారోహణము (రథగజతురంగములను నడుపుట)

41. ఆయుధవిన్యాసము (చాప - చక్ర - చర్మ - కృపాణ - శక్తి - తోమర - పరిఘ - గదాదులు)

శైశవాంతమునుండి యౌవనము పూర్తిగ ఆవహించులోపల చంద్రాపీడుడు పై విద్యలన్నియు నేర్చెను. శైశవము 8 ఏండ్లవరకు, పూర్ణయౌవనము 18 ఏండ్లకు (లేక ఇరువది) అయిన పది లేక పండ్రెండు సంవత్సరములు విద్యాభ్యాసకాలము. చంద్రాపీడునికి బాణుడు ఆపాదించినంత ప్రతిభ సామాన్యరాజులకు లేకపోయినను ఈప్రణాళికలో సగమైనను బాణుని సమకాలికభూపతులు నేర్చుచుండిరని తలపవలెను. హర్షవర్ధనుని జీవితములో యౌవనారంభమునుండియే యుద్ధములు సంభవించుటవలన పై పట్టికలో ఆఖరు (35-41) సప్తవిద్యలలో ఆరితేరియుండునుగాని మొదటి ముప్పది

నాలుగింటికి తగినంత అవకాశము చిక్కియుండదు. అయినను రత్నావళ్యాదినాటకములవలన హర్షుని మేధాశక్తి, రాజ్యమును విస్తరించుటవలన భుజశక్తి, ఆరాజ్యమును బాగుగ పాలించినందున రాజ్యతంత్రవైదుష్యమును తెలియుచున్నవి.

ఇందులో బ్రాహ్మణోచితవిద్యలన్నియు బాణుడు నేర్చెనని అతని హర్షచరిత కాదంబరులే సాక్ష్యము.

ఇంకను త్రవ్వితీసిన ఎన్నోవిషయములు, బాణునికాలపు సామాజికసమాచారములు, 'కాదంబరి' లో దొరకును.

16. 4. బాణునికాలపు హిందూసమాజము నేటి హిందూసమాజమునకన్న భిన్నముగ తోచదు. హిందూసమాజపు స్థితిస్థాపకశక్తి (Power of restitution; elasticity) విచిత్రము. బాణునికి వేయేండ్లముందున్నట్లే బాణునికాలమున, అట్లే నేటివరకు, మధ్య ఎన్నిదండయాత్రలు, విదేశీయులు వలసవచ్చుట జరిగినను ఎక్కువమార్పులేక, హిందూసమాజము అచలముగ ఉన్నది. మూడువేలయేండ్లకు పూర్వపు ఆర్యమతము లోని మంత్రములు నేటికిను వినబడుచున్నవి. వైదికకర్మలు కొనసాగుచున్నవి. దేవాలయములలో పూజలు నిరంతరము చేయుచునేయున్నారు. వర్ణవ్యవస్థను రూపుమాపుటకు ప్రభుత్వము సంఘసంస్కర్తలు చేయు ప్రయోగములెల్ల విపరీతముగ మరింత వర్ణద్వేషములకు దోహదమిచ్చుచున్నవి. ఈపరిణామరహితత్వములో మేలు కీడు నిర్ణయించుట ఇప్పుడు దుష్కరము. కాలమే ఇచట నిర్ణేత.



# 17. కాదంబరీ కావ్యసందేశము

17. 1. ఈశీర్షికపేరు కొంత వివరణము కోరును. సంస్కృతభాషాసాహిత్య విమర్శనమున 'సందేశకావ్యము' అను ఒక కావ్యవిశేషమును చెప్పుచున్నారు. పూర్వలాక్షణికులు అట్టి కావ్యవిశేషమును గుర్తించి వర్గీకరింపకపోయినను అది ఇటీవల సాహిత్యచరిత్రమున రూఢి అయినది.[1]

ఈసందేశపదము (లేక దూత) కాళిదాసుని 'మేఘసందేశము' వలననే ప్రాచుర్యము పొందినట్లున్నది. 'సందేశకావ్యము' అను సమాసమునకు సందేశము చేత విశిష్టమయిన కావ్యము అని విగ్రహము చెప్పవలయును. ఈకావ్యములలో ఎవరో ఒకరు మరియొకరికి ఒక సందేశహరునిద్వారా సందేశము పంపుట ముఖ్యాంశముగ నుండును.

దూతలచేత సందేశమును ఒకరాజు మరియొకరాజునకు పంపుట రాజనీతి. కాముకీకాముకుల మధ్య 'దూతీవచన విన్యాసములు' శృంగారనీతి. సందేశము మతబోధయు కావచ్చును. అచేతనపదార్థములను, పశుపక్ష్యాదులను సందేశహరులుగ చేయుట పూర్వకవులనుండి వచ్చు సంప్రదాయముగ తోచును. భామహుడు అట్టి నోరులేని దూతలను వాడుట 'అయుక్తిమత్' అనుదోషముగ చెప్పి వానిలో మేఘమును ముందు స్మరించును.[2] భామహునికి పూర్వము ఇట్టి కావ్యములు అనేకములు ఉండియుండును.[3]

---

1. చూ. History of Classical Sanskrit Literature (M. Krishnamachari) Chapter XIII, Section 1. SANDESA.

2. అయుక్తిమద్యథా దూతా జలభృత్ - మారుతేందవః ।
తథా భ్రమరహారీతచక్రవాకశుకాదయః ॥

(భామహుని 'కావ్యాలంకారము' 1.42)

3. కాళిదాసుని 'మేఘసందేశము'నకు పూర్వపుకావ్యము అని 'ఘటకర్పర కావ్యము' అను చిన్నసందేశకావ్యమును విమర్శకులు పరిగణింతురు. ఈఘటకర్పరుడు విక్రమార్కుని యాస్థానములోని నవరత్నములలో ఒకడని సంప్రదాయము. కాళిదాసును వారిలో నొకడు. వీరికాలనిర్ణయము ఒక పెద్ద గొడవ.

ఈకావ్యములకు మూలసూత్రము వాల్మీకిరామాయణములో హనుమంతుడు రాముని నుండి సీతకు కొనిపోయిన సందేశమని వ్యాఖ్యాత శ్రీ కోలాచల మల్లినాథుని మేఘసందేశ వ్యాఖ్యలో సూచితము.

'కాదంబరి' లో శృంగారసంబంధమయిన సందేశములు కలవుకాని అవి ప్రాసంగికములు. 'కాదంబరి' సందేశకావ్యము కాదు. 'కాదంబరీకావ్యసందేశము' అనుటలో కావ్యప్రయోజనము ఉద్దిష్టము. ఇచ్చట కవి పాఠకునికి ఏమైన సందేశమును ఇచ్చుచున్నాడా, అనునది విషయము.

17. 2. <u>కావ్యప్రయోజనము</u>: పాశ్చాత్యవిమర్శన సంప్రదాయమున కావ్యములను రెండువర్గములుగ విభజింతురు — రంజకములు (Aesthetic), బోధకములు (Didactic). ఈవర్గీకరణము సాహిత్యమునకేకాక లలితకళలకన్నిటికిని వర్తించును.

కొందరిమతమున చిత్రకళకుకాని కవిత్వమునకుకాని మనోరంజనమే ధ్యేయము. కళాకారునికి (artist, poet) సదాచారదురాచారములు, నీత్యవినీతులు, సదసద్వివేకము పనిలేదు. అనగా కావ్యమునకును మానవసంఘమర్యాదలకును సంబంధము లేదు. రమణీయార్థము, రసము, శబ్దమాధుర్యమును చాలును. రమణీయముగ, రసనిష్యందముగ మధురముగ అవినీతిని ప్రతిపాదించినను తప్పులేదు. ఈవాదపు మకుటవాక్యము (motto) 'కళ కళకోసమే' (Art for art's sake) అనునది.[1]

17. 3. ప్రాచీనభారతమున అసత్కావ్యప్రసిద్ధి

భారతదేశమున కావ్యమును విశ్వశ్రేయస్కరముగనే భావించి అది సన్మార్గబోధకముగ నుండవలెనని లాక్షణికులు చెప్పినను, అట్టి కావ్యములు ప్రసిద్ధముగ ఉన్నను, తద్విరుద్ధమయిన కవిత్వముకూడ జనామోదము పొందినవి. మంచి కావ్యశయ్యలో రంకుపురాణములను చెప్పు ముక్తకములుకల 'గాథాసప్తశతి' యను

---

1. క్రీ. శ. 19-వ శతాబ్దాంతమున లండను నగరములో 'సౌందర్యసంస్థాపనోద్యమము' (Aesthetic Movement) వచ్చినది. అందు ప్రఖ్యాత ఆంగ్లరచయిత ఆస్కార్ వైల్డ్ (Oscar Wilde) ముఖ్యుడు. తెలుగునాడులో కొన్ని సంవత్సరముల క్రింద చలం, తల్లావజ్ఝల ఇత్యాది ప్రఖ్యాతరచయితలు ఇట్టి ఉద్యమమును ప్రయత్నించిరందురు.

ప్రాకృతసంకలనముయొక్క ప్రఖ్యాతి అందులకు నిదర్శనము. అందలి పద్యములను, అట్టి ఇతరపద్యములను ఆలంకారికులు ఉత్తమమయిన ధ్వని, వ్యంగ్యము ఇత్యాది గొప్ప కావ్యగుణములకు ఉదాహరించియున్నారు. పండితగోష్ఠిలో వీనిని ప్రస్తావించి ఆనందించుట ఈనాడును కలదు. ఈపద్యములలో ఎక్కువభాగము 'అసతీచరితాద్భుతములు, దూతీవచనవిన్యాసములు'[1]

అట్లే అసతీచరితములను గోపికలకన్వయించి, శ్రీకృష్ణుని మహావిటుని చేసి కొన్ని శృంగారముక్తకములు సంస్కృతమున వ్రాయబడినవి. 'అమరుకావ్యము', 'పుష్పబాణవిలాసము' ఆవర్గమున ప్రసిద్ధములు. వీనికి వ్యాఖ్యానములలో భక్తిపరముగ, వేదాంతపరముగ అర్థము చెప్పి వ్యభిచారమును పరమాత్మాభిసరణముగ తీర్చినారు. దీనిని వేదాంతులు ఆమోదించిరో యుందురు.

అట్లే సత్కావ్యములలోను సంభోగశృంగారము క్రమతిమించినది. మైథున వర్ణనము ప్రధానాంశమయినది. ఈచాపల్యమునకు కాళిదాసును గురియైనాడని 'కుమార సంభవము'న 8-వ సర్గ ప్రమాణము. 'నైషధీయచరితము'న 18 నుండి 22 వరకు నాలుగుసర్గలు శృంగారక్రీడలు. 'రామాయణము'తో ఉదాత్తముగ మొదలుపెట్టిన సంస్కృతకావ్యము ఈదశకు వచ్చినది. ఈ 'పచ్చిశృంగారము', దానికి ఆధ్యాత్మిక పవిత్రతను ఆపాదించుట బౌద్ధులకును జైనులకును, నేడు క్రైస్తవులకును, హిందూ మతఖండనమునకు ఉపకరణములయినవి.

## 17. 4. అసత్కావ్యనిషేధము

ఈసందర్భమున వైదికమార్గావలంబులకును అట్టి కావ్యములపై రోతపుట్టి వానిని చదువుట తుచ్ఛకామోద్దీపకవ్యాపారమని తోచియుండును. ముఖ్యముగా మీమాంసకులు కావ్యపఠనమును నిషేధించియుందురని ఊహింపవచ్చును. ఇట్టి నిషేధప్రస్తావన ప్రథమముగ యజుర్వేదభాష్యమున సాయణాచార్యులవారు చేసియున్నారు.

"కావ్యనాటకాలంకారాదులను వినుటవలన (చదువుటవలన) వృథా - ఆయుక్షయముతప్ప వేరుగ నొక పురుషార్థము చూడలేకున్నాము. కావుననే వాజసనేయులు ఇట్లు తలచుచున్నారు —

1. చూ. అగ్నిపురాణములోని వర్ణనలజాబితా, ఈ వ్యాసమున 14.4 (చ).

'వేదములకు భిన్నమయిన శబ్దజాలమును పఠించుటవలన కంఠశోష అను పర్యవసానమే ఏర్పడుచున్నది "[1]

ఈనిషేధము కేవలము మదనకలాపపూర్ణములగు కావ్యములవలన ఏర్పడినను దాని అతివ్యాప్తిచేత రామాయణాది సత్కావ్యములను మరుగునపడు సన్నివేశము కలిగినది. అప్పుడు కొందరు పండితులు, కవులు వేదాంతులు, సదాచారప్రవర్తకులును కలిసి ఒకవిధమైన 'రాజీ' కుదిర్చి అన్నికావ్యములను నిషేధింపరావని, 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అనునిషేధము అసత్కావ్యములకే తగును అని నిర్ణయించిరేమో.

అట్టి 'రాజీ'ని సూచించు వ్యాఖ్యాతృవచనము ముఖ్యముగ మల్లినాథుని రఘువంశవ్యాఖ్యానపీఠికలో కనపడుచున్నది.[2]

## 17. 5. కావ్యసందేశము

కావ్యము పాఠకునికి కవి ఇచ్చు సందేశము అనవచ్చును. గొప్పకవి మానవ జీవితమును కావ్యవస్తువుగా చేసినపుడు వాచ్యముగనో వ్యంగ్యముగనో 'ఇదిమంచి, ఇదిచెడు' అని చూపింపగలడు. అట్లుచేయుటయే కవిసందేశము లేక బోధనము.

కావ్యమున నాయకుడు ఉదాత్తగుణములుకలవాడైన, ధ్వనిచేత కావ్యము సద్గుణప్రతిపాదకమగును. కావుననే ఆలంకారికులు కావ్యమునకు లోకోత్తరగుణుడగు

---

1. నహి కావ్యనాటకాలంకారాది శ్రవణేన వృథాయుక్తయా మంతరేణ కంచిత్ పురుషార్థం పశ్యామః. అతఏవ వాజసనేయినః సమామనంతి —

వేదవ్యతిరిక్తస్య శబ్దజాలస్య కంఠశోషమాత్రపర్యవసాయిత్వమేవ ఉపపాద్యతే (యజుర్వేదభాష్యము ప్రపా. 2. అను. 15).

దీనిని దయతో నాకు చూపినవారు నెల్లూరుమండలమున సాటిలేని వేదపండితులు శ్రీ అరవత్తూరు విశ్వనాథశ్రౌతులు.

సాయణులకు పూర్వము ఈనిషేధమునకు ఉల్లేఖనము కలదేమో తెలియదు.

2. కావ్యాలాపాంశ్చ వర్జయేదిత్యస్య నిషేధశాస్త్రస్య అసత్కావ్యవిషయతాం చ పశ్యన్ ... (రఘువంశవ్యాఖ్యానముఖము)

నాయకుడు కావలెననిరి.[1] అనుమానప్రమాణముచేత నాయికయు సుశీల కావలెనని చెప్పవచ్చును. సచ్చరిత్రప్రతిపాదకమగుకావ్యము విశ్వశ్రేయము కల్గించునని వారి యాశయము.[2]

సంస్కృతవాఙ్మయమున నిలిచిన కావ్యములలో ఎక్కువభాగము సత్కావ్యము లనియే చెప్పవగును. వానిలో సదాచారమో, దైవభక్తియో ఏదో ఒక సందేశము ఉండును. కాని సందేశము లేక బోధనము, తప్పక ఉండవలయునా అనుప్రశ్న నరియైనదే. కృష్ణమిశ్రుని 'ప్రబోధచంద్రోదయము'[3] కాళిదాసుని 'శాకుంతలము' కన్న మేలా? 'అధ్యాత్మరామాయణము' వాల్మీకి 'రామాయణము' కన్న గొప్పదా అనుప్రశ్నలకు సమాధానము చర్చింపవగినది.

సాహిత్యప్రియుల అనుభవములో కావ్యమునకు మనోరంజనమే ప్రధానము అని తోచినను అది ఉదాత్తముగ ఉండవలెననియే సహృదయుల మతము అనవచ్చును. సద్గుణప్రతిపాదనము కావ్యమున లేకపోవచ్చును కాని దుర్గుణబోధకకావ్యము అవశ్యము వర్జ్యము. కావ్యములో బోధనమునుగురించి ఒక ఆంగ్లవిమర్శకుడు —

"మనము కవి కృషిలక్ష్యములను మతబోధకుని లేక ధర్మప్రవర్తకుని కృషి లక్ష్యములను తారుమారు చేయరాదు. కవిపని పాఠకుని మనస్సులో సంచలనము కల్గించి సంభావనాచైతన్యమిచ్చి, ఆలోచనకు ప్రేరించి, ఉత్సాహపరచి, ఆనందపరచుట. వారిపని సద్విషయబోధనము, సన్మార్గదర్శనమును.'

కాని కవి సంఘమునుండి వేరు కాడు. సాంఘికలక్ష్యములను అతడు విస్మరింపరాదు. మహాకవులందరును మానవసంఘాభ్యుదయకాంక్షులే. కాని వారికి రసరామణీయకములు ప్రధానము.

---

1. విద్యానాథుని 'ప్రతాపరుద్రీయము'న ఈవర్చ సుదీర్ఘముగ ఉన్నది. అతనిమతమున గొప్పనాయకుడులేనికావ్యము అసత్కావ్యము.

2. "విశ్వశ్రేయః కావ్యమ్"

3. ఈనాటకమున ప్రకృతులన్నియు మూర్తీభవించిన గుణదోషములు. బుద్ధిప్రమోదము, ఆత్మజ్ఞానమును విశదీకరించు నాటకము.

4. We are not to confuse the functions of the poet with those of the preacher or homilist, their business is to instruct and guide, his to stir and vivify, to inspire, to energize and delight.

(W. H. Hudson's 'Introduction to the Study of Literature' pages 93-94)

### 17. 6. కాదంబరి అసత్కావ్యమా ?

పై సత్కావ్యాసత్కావ్యవిచారము కాదంబరికి అనుసంధింపవలసియున్నది.

'కాదంబరి' లాక్షణికుల మన్ననను పొందినది. ఇతరకవుల ప్రశంసలను అందుకొన్నది. దీనివలన బాణునికి మహాకవులశ్రేణిలో స్థానము కలిగినది. అయినను 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్ - ఇతి నిషేధోఽసత్కావ్యవిషయే, యథా కాదంబర్యాదేః ...'[1] అని ఎవడో ఒకవ్యాఖ్యాత అనినట్లున్నది. దీనివలన కాదంబరి అసత్కావ్యమయినది. ఈయభిప్రాయము సర్వజనీనము కాకపోయినను కొందరికి కలిగియుండును.

ఈకావ్యములో నాయకుడగు చంద్రాపీడుడు జగత్సాక్షి చంద్రభగవానుడే. పుండరీకుడు శ్వేతకేతుమహర్షిదర్శనజనితలక్ష్మీకామసద్యఃఫలము. మహాశ్వేత, కాదంబరి గంధర్వకన్యలు. తారాపీడాదులు ఉత్తములు. ఇందు వర్ణనలు గొప్ప; అలంకారములు లెస్స; రసము ఉదాత్తశృంగారము; అంతము మంగళము. దీనిని అసత్కావ్యమనుట యెట్లు ?

ఇట్లుండవచ్చును. స్థూలదృష్టికి ఇందు గొప్ప సందేశమేమియు కనపడదు. కేవలము మనోరంజకకావ్యమగు దీనిని చదివి ఫలమేమి అని ఒకవీరవైదికుడో వీరవేదాంతియో దీనిని నిషేధించియుండును. కాని బాణుడు గొప్ప సాహిత్యశిల్పి. కావ్యములో సామాజికభావములు ప్రాసంగికముగ ఉండుటయే తగును. అవియే కావ్యవిషయమయిన అది ఏదో శాస్త్రగ్రంథమగును గాని మనోరంజకకావ్యముకాదు. తరచి చూచిన 'కాదంబరి' లో అనేకవిషయములు చర్చింపబడియున్నవి. అందు కొన్ని మచ్చునకు —

### 17. 7. 'కాదంబరి' లో సామాజికసందేశము

(క) అనేకజీవితసమస్యలమీద వ్యాఖ్యానములు 'కాదంబరి' లో పాత్రనిష్ఠములై కథామగ్నములై యున్నవి,

---

1. ఇట్టివాక్యమును తాము వినియుంటిమని ఇరువురు మువ్వురు పండితులు ఈవ్యాసకర్తకు చెప్పిరి. ఏపుస్తకములో అని వారికి జ్ఞప్తి లేదు. ఈవ్యాసపాఠకులెవరయిన గుర్తుపట్టగలిగిన తెలియజేయుదురని ఈవ్యాసకర్త ఆశ.

1. అనపత్యతాదుఃఖము : పుత్త్రుడు, పుత్ అను నరకమునకు పోనీయక ఆపు త్రాత అని ప్రాచీనకాలమునుండి భారతీయుల విశ్వాసము. క్రైస్తవ, ఇస్లాము మతము లందును గృహస్థధర్మమును, సంతానమును గొప్పవిగనే చెప్పియున్నారు. తారాపీడ విలాసవతుల కథలో, బిడ్డలు లేకుండుట ఎంతదీనస్థితియో బాణుడు గట్టిగ నిరూపించి యున్నాడు. ధర్మకార్యములు చేయుటవలన సంతానము కలుగవచ్చునను ఆశాభావ మును అచ్చట కలదు.

ఈనాటికిని భారతీయులలో ఈవిశ్వాసములు గాఢముగ నున్నవి. బిడ్డలకొరకు వ్రతములు చేయుట, తీర్థములకు పోవుట జనసామాన్యమే. వైజ్ఞానికదృక్పథమున ధర్మకార్యములకు సంతానోత్పాదకశక్తి లేకున్నను, ఈకాలమున ఇంతవిశ్వాసము కనపడగా బాణుని కాలమున చెప్పవలెనా ?

'అపుత్త్రులకు గతిలేదు; ధర్మకార్యము నిష్ఫలముకాదు' అని బాణుని ఉపదేశము. రామాయణములో దశరథుని అనపత్యతాదుఃఖమును, పుత్త్రికామేష్టి ఫలమును బాణుడు అనుకరించినట్లున్నది.

2. విధిబలీయము, కాని పురుషప్రయత్నము మానరాదు : ఇది తారాపీడుడు అనపత్యతాదుఃఖమున విలపించుచున్న విలాసవతికి బోధించిన విశేషము. విధిని దాటలేము అని నమ్ముట మనఃశాంతికి మూలకభావము. ఇది మానసికశాస్త్రసమ్మతము. కాని ప్రయత్నము లేకుండుట పురోగతికి విరోధకము. కావున 'పురుషప్రయత్నము మానరాదు; ఫలము దైవాధీనము' అని బోధ.

3. సహగమనము కూడదు :[1] అను చంద్రాపీడుని వాదమును బాణుని సందే శముగనే స్వీకరింపదగును.[2] బాణుని కాలమున ఇట్టివాదము చేయుటకు ఎంతధైర్యము వలసియుండెనో ఇప్పుడు ఊహించుట కష్టము. అట్లే, చండాలకులముయొక్క అస్పృశ్యత్వము మీద బాణుని అభిప్రాయము.[3]

4. తల్లిదండ్రుల అదుపాజ్ఞలు; కౌమారితల వర్తనము : మహాశ్వేత తల్లి దండ్రుల అనుమతిలేక పుండరీకునియొద్దకు పోవుటకు శంకించును. కాదంబరియు చంద్రాపీడుని వరించినందులకు అట్లే చింతించును. మహాశ్వేత పుండరీకుని దగ్గరకు

---

1. మరికొంతవివరము 16-3 (ట) లో చూడదగును.

2. మరికొంతవివరము 16-2 (జ) లో చూడదగును.

పోక అతడు మరణించిన తనకు బ్రహ్మహత్యాపాతకము కలుగునని ఆమె భయము. పోవుట అధర్మము, పోకయుండుట మహాపాపము కాగా మహాశ్వేత గొప్ప తప్పును తప్పించుకొనుటకు చిన్నతప్పు చేయుటకు పాల్పడును. ప్రాణము ఆచారమున కన్న గొప్పదికదా? ఈసందర్భములలో బాణుడు కన్య నడవడిని సహేతుకముగ విశదీకరించియున్నాడు.

5. ఇట్టి కథాంశములలో అనేకసామాజికసందేశములు కలవు. తారాపీడ శుకనాసులయందు రాజు మంత్రుల ఆదర్శసంబంధము, చంద్రాపీడ వైశంపాయనుల యందు మిత్రుల గొప్ప అనురాగము, మహాశ్వేతాపుండరీకులయందు, కాదంబరీ చంద్రాపీడులయందును ఉదాత్తశృంగారమును విలక్షణముగ చిత్రించి బాణుడు 'కాదంబరి'ని ఒక సదాచారదర్పణముగ చేసియున్నాడు.

(గ) బాణుడు గుణాఢ్యునికథనే గ్రహించెననిన దానినే అనువదించిన సోమదేవుని 'మకరందిక కథ'లో ఒక సందేశము ఉన్నది. కథాంతమున గోముఖుడు నరవాహనదత్తుని విరహవ్యథ మానుమనుచు, "ఈరీతిని కాలవిలంబమైనను ప్రాణులకు విహితసమాగమము కలుగుచుండును" అను నీతిని చెప్పును. బాణుడు ఈభావమును చంద్రాపీడుని సహగమనాచారఖండనమున ధ్వనింపజేసి 'ధీరా హి తరంత్యాపదామ్ (మనస్సు నిలుకడకలవారు ఆపదలను దాటుదురు)' అని సూచించును. ఇచ్చట 'బ్రతికియుండిన సుఖములు బడయవచ్చు' అని సందేశము.

17. 8. బాణుని 'కాదంబరి'లోని కొన్నియంశములు శాస్త్రగౌరవమును పొందినవని నిదర్శనము కలదు.[1]

లండననగరమున బ్రిటిషు మ్యూజియం లైబ్రరీలో ఒక నీతిశాస్త్రవ్రాతప్రతుల కట్టయున్నది. అందు కామందక నీతిసారములో మధ్య కర్తపేరు లేక కొన్ని పత్రములు వేరుగ కలవు. వానిలో పట్టాభిషేకమునుగురించి కొన్నివాక్యములు, సమగ్రమైన రాజనీత్యుపదేశమును లిఖితములు. అవి 'కాదంబరి'లోని పత్రములు. బాణుని పట్టాభిషేకవర్ణనము (స్వల్పము), శుకనాసోపదేశము, నీతిశాస్త్రబోధనమునకు విద్యార్థులకు చెప్పుచుండిరని అనుమానింపదగును. కేవలము మనోరంజకము అనబడు కావ్యమునకు ఇంతకన్న ప్రశంస ఏల?

---

1. చూ. C. R. Bendell's report quoted by C. M. Ridding in her introduction to 'Kadambari', an English translation.

17. 9. కాదంబరీకావ్యాంతరార్థము - అగ్రవాలావాదము[1]

కొన్ని కావ్యములకు వేదాంతపరమయిన అంతరార్థము చెప్పు వాడుక మనకు తెలిసినదే. రామాయణ భారతములకు, భాగవతములోని రాసక్రీడలకును అట్టిభాష్యము లున్నవి. వేదాంతదేశికుని పద్యము[2] —

దర్పోదగ్రదశేంద్రియాననమనోనక్తంచరాధిష్ఠితే,
దేహేఽస్మిన్ భవసింధునా పరిగతే దీనాం దశామాస్థితః ।
అద్యత్వే హనుమత్సమేన గురుణా ప్రఖ్యాపితార్థః పుమాన్,
లంకారుద్ధవిదేహరాజతనయాన్యాయేన లాలప్యతే ॥

భావము - జీవుడు దేహములో లంకలో సీతవలె బంధింపబడి మొత్తుకొనుచున్నాడు. ఎట్లన, లంక దేహము; పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు అను పది ముఖములచేత గర్వించిన మనస్సు రావణుడు; సంసారము లంకనుచుట్టిన సముద్రము; వీనిలో చిక్కి, గురువు అను హనుమంతునిచేత పరమార్థమును (విమోచనము, ముక్తి) తెలిసికొనును.

అట్లే భారతములో పంచపాండవులను పంచేంద్రియములనుట, కురుపాండవ సమరము లోకములోని దుష్టశక్తులకును సాత్త్వికశక్తులకును పోరాటమనుటయు సామాన్యమే. కృష్ణుడు గోపికల సంగతి సరేసరే.

ఈవిధముగా ‘ కాదంబరి ’ కిని అంతరార్థము కలదని, అది నిగూఢవేదాంతజ్ఞాన ప్రతిపాదకకావ్యమనియు, శ్రీవాసుదేవశరణ అగ్రవాలాపండితుడు శ్రమించి ప్రమాణములతో నిరూపించియున్నాడు. ఆవ్యాఖ్యానములో కొన్ని విషయములు సంగ్రహముగ ఇట్లు[3] —

---

1. చూ. వాసుదేవశరణ అగ్రవాలా రచించిన ‘ కాదంబరీ, ఏక్ సాంస్కృతిక్ అధ్యయన్ (హిందీ).

2. సంకల్పసూర్యోదయనాటకము,

3. ఇట అగ్రవాలా హిందీలో చెప్పినదానిలో కొన్నివిషయములు అతి సంక్షేపముగ తెలుగున చెప్పబడినవి. ఇందలి గుణదోషములు ఈ వ్యాసకర్తకు అందునవి కావు. వేదాంతులు మూలమును చూచి నిర్ణయింతురు గాక.

1. కాదంబరీకథకు రెండు సూత్రములు. ఒకటి బ్రహ్మతత్త్వము; అది పుండరీకవైశంపాయనులది. రెండవది క్షత్రతత్త్వము; అది చంద్రాపీడశూద్రకులది. పుండరీకుడు బుద్ధికి ప్రతీక; చంద్రాపీడుడు మనస్సునకు ప్రతీక. అతడు అగ్ని; ఇతడు చంద్రుడు. అతడు విజ్ఞానము; ఇతడు ప్రజ్ఞానము.

2. అచ్ఛోదసరస్సు: కథకు కేంద్రము. ముఖ్యాంశములన్నిటికిని స్థానము. ఇది వేదాంతమున 'పారమేష్ఠ్యసాగరము'; సాంఖ్యమున 'ప్రధానము'; బౌద్ధదర్శనమున 'అనవతప్తహ్రదము'.

3. పుండరీకుడు: ఇతడు వేదాంతములోని 'సహస్రదళపద్మము' అను బుద్ధి స్థానము; బౌద్ధమున అదియే 'మణిపద్మము'. అది విజ్ఞానతత్త్వము. దానికి ప్రజ్ఞ సహవర్తి. కాని కామోపహతబుద్ధి ప్రజ్ఞతో చేరదు. ఇచ్చట ప్రజ్ఞ మహాశ్వేత. పుండరీకుడు సంయతబుద్ధి కానిదే ఆమెతో సమాగమము లేదు.

4. చంద్రాపీడుడు: చంద్రుని యవతారము. చంద్రుడు మనస్సునకు అధిపతి. కావున చంద్రాపీడుడు మనఃప్రతీక.

5. కాదంబరి: ఈమె సురకు ప్రతీక. విరహము అను తాపము(వేడి)చేత అది సోమరసమగును. సోమరసము చాంద్రమే. కావున కాదంబరి సోముని పొందును. కాని చంద్రాపీడునికి కామస్పర్శకలుగుటవలన శూద్రకజన్మ ప్రాప్తించినది. ఆజన్మలో కామస్పర్శలేదు కావున మనస్సునకు శుద్ధి. తరువాత సమాగమము.

6. అప్సరసలు: 'అబ్భ్యః సరంతి ఇతి అప్సరాః (నీటినుండి పుట్టినవారు)' అని వ్యుత్పత్తి. నీరే సృష్టికి మూలము. అప్సరసలు జలతత్త్వముకలవారు కావున మాతృతత్త్వమునకు ప్రతీకలు.

7. గంధర్వులు: 'యోషిత్కామా వై గంధర్వాః' అని శతపథ బ్రాహ్మణమున, స్త్రీకామావై 'గంధర్వాః' అని ఐతరేయ బ్రాహ్మణమునను చెప్పుటచేత గంధర్వులు వృషలు; అప్సరసలు యోషలు. గంధర్వులది పితృతత్త్వమైన వీర్యము, అనగా సృష్టికారకము, అది మాతృతత్త్వమైన అప్సరసలను కోరును. చిత్రరథుడు మదిరతోను హంసుడు గౌరితోను చేరుట న్యాయము.

8. అగ్రవాలాపండితుని వివరణమున విస్మయకారకములయిన సంగతులు కలవు, కాని అన్నింటికిని ఏకసూత్రముగ భావము గోచరించుటలేదు. 'తీర్థమునకు తీర్థము, ప్రసాదమునకు ప్రసాదము' అన్నట్లు సామాన్యపాఠకునికి తోచును. ఈ వాదమునుగూర్చి సాహిత్య విమర్శకుడయిన ఆర్. డి కర్మకరపండితుడు,

"కాదంబరీ కావ్యమును పరమవేదాంతగ్రంథముగ పరిగణించిన శ్రీ అగ్ర వాలాగారి వైదుష్యము మిక్కిలి శ్లాఘనీయము. కాని ప్రసిద్ధమయిన ఏకథనైనను నుకరముగ ఇట్లు వివరింపవచ్చుననుటయు న్యాయమే. కావ్యమును ఇంత ప్రయాసతో పఠింపవలెనా అనునదే ప్రశ్న ...[1]".

9. అగ్రవాలావాదము సత్యమో కాదో బాణుడు చెప్పవలసినదే. పూర్తిగ వేదాంతపరముగ అన్వయము వీలుకాకపోయినను, కథలోని వ్యక్తుల మనస్తత్త్వము లలో కొంత తత్త్వశాస్త్రాన్వయము బాణునివంటి ఆర్యవాఙ్మయమునంతను దిగ ద్రావిన కవి చేయకపోడు. అగ్రవాలా పండితుడు ఈవాదముచేత 'కాదంబరి'కి ఉత్తమస్థానము కలిగించుట ప్రశంసింపదగినది. 'కాదంబరి' అసత్కావ్యమెట్లగును?

'కాదంబరి' అసత్కావ్యమను ప్రవాదము 'కాదంబరి'ని సరిగ చదువకయే ఎవరో చెప్పినదనియు ఆమాట అగ్రవాలాకు ప్రేరకమై కాదంబరీ కావ్యసందేశా న్వేషణమునకు దించినదనియు, తలచి, 'కాదంబరి' రమణీయార్థ ప్రతిపాదకమేకాక సత్యార్థ ప్రకాశకమును అని విరమింపదగును.



1. 'Prof. Agrawala deserves all credit for his ingenuity in looking upon the "Kadambari" as a metaphysical treatise in the ultimate analysis; at the same time, it is but fair to state that any well-known story, for the matter of that, could be so described without much ado. The question is whether it is worthwhile taking so much trouble in the case of a Kavya ...'

(Bana, Dharwar (1964), Pages, 78-79)

# పరిశిష్టము - 1

## శుకశారికా కలహవృత్తాంతము

'కాదంబరి' లో శుకశారికాకలహవృత్తాంతము మాత్రమే వృత్తాంతరము, చిన్నసంఘటన. అయినను శృంగారవాతావరణమున తదనుగుణమైన సుస్మితహాస్యమునకు వ్యంజకమగును.

1. ఈసందర్భమున శారికాశుకములను భార్యాభర్తలుగ చేయు కవిసంప్రదాయము విచారింపదగినది.

శుకము, శారిక అను రెండుపక్షులు అశ్వమేధయాగమున బలియిచ్చు అశ్వేతర ప్రాణిసమూహములో యజుర్వేదమున పేర్కొనబడినవి. శుకశారికలకు విశేషముగ 'పురుషవాక్' అని యుండుటచేత ఆనాటికే (క్రీ. పూ. కనీసము 1000 సం॥) అవి ఇండ్లలో పెంపుడుపక్షులయి తమ మనుష్యవాగనుకరణముచేత మనుష్యులకు వినోదము కల్పించుచుండినవని తెలియుచున్నది. శుకపు పంజరమును, శారిక పంజరమును ఇండ్లలో ఉంచుకొనుటయు ఒక్కొక్కప్పుడు ఒకేపంజరమున శుకమును శారికను బంధించుటయు వాడుక అయియుండును.

సంస్కృతకవిత్వమున పదలింగముమీద చమత్కారము సామాన్యము. చిలుకలకు జాతివాచకము 'శుకః' అని నిత్యపుంలింగమున, గోరువంకలకు జాతివాచకము 'శారికా' అని నిత్యస్త్రీలింగమునను సంస్కృతభాషలో సిద్ధపదములు కావున శుకమును భర్తగను శారికను భార్యగను[1] చేసి వానికి దాంపత్యమును, తదనుగుణ శృంగారచేష్టలను కవులు కల్పించియున్నారు. అవి మాటలాడు పక్షులగుటచే ఈకవిసమయము సుకరమును, వాస్తవికమును అయినది.

---

1. ఈసంప్రదాయము కేవలము సంస్కృతభాషాలింగమర్యాదవలన వచ్చినను, భారతీయసాహిత్యములన్నియు గీర్వాణసాహిత్యముచే ప్రభావితములు కావున, శుకశారికాదాంపత్యము ప్రాంతీయభాషాసాహిత్యములలోనికిని ప్రాకినది, కాని

శుకశారికలకు దాంపత్యమును సూచించు ప్రయోగము సంస్కృతకావ్యములలో ప్రథమముగ ఆదికావ్యమగు రామాయణమునందు కనబడుచున్నది.

మన్యే ప్రీతివిశిష్టా సా మత్తో లక్ష్మణ, శారికా ।
యస్యాస్తచ్ఛ్రూయతే వాక్యం శుక, పాదమరేర్దశ ॥

(రామాయణము 2-53-22)

ఈశ్లోకమునకు అర్థము సుకరముకాదు.[1] వ్యాఖ్యాతలు బహుభంగుల చెప్పికొన్నారు. అర్థమెట్లున్నను ఇందు శుకశారికలను జతచేయుట మనము గుర్తింపదగినది. ఈసంప్రదాయము బాగుగవ్యాపించినదనుటకు 'వాసవదత్త' లోను 'కాదంబరి' లోను శుకశారికాకలహములుండుట నిదర్శనము.

2. సుబంధుని 'వాసవదత్త' లో శుకశారికావృత్తాంతము ఇట్లు[2] —

కందర్పకేతువు (కథానాయకుడు) స్వప్నములో ఒక రాకుమారిని చూచి వలపుగొని వయస్యుడు మకరందునితో వెతకుచు పోయి, అడవిలో చీకటిపడగా, ఒక నేరేడుచెట్టుక్రింద విశ్రమించుచు. ఆచెట్టుపైన ఒకశారిక ప్రియుడగు శుకము ఆలస్యముగా గూడుచేరినందులకు కినుకవహించి,

---

(మిగులు) పదనిష్పన్నలింగము అనువాదములవలన తెలుగున లేకపోవుటచేతను, అందమైన స్త్రీని 'చిలకవంటిది' అని జాతీయప్రయోగము వలనను, తెలుగువారు కలో 'చిలకాగోరింకలవలె' అని అనుకూలదాంపత్యమును చెప్పుటలో సంస్కృతకవి సమయములోని లింగములు తారుమారైనవి.

1. దీనియర్థము శ్రీచదలవాడ సుందరరామశాస్త్రులవారి టీకప్రకారము — రాముడు లక్ష్మణునితో అనుచున్నాడు, "లక్ష్మణా, మనము వనమునకు పోవుచున్నాము అని అమ్మ (కౌసల్య)తో చెప్పినప్పుడు, ఆమె పెంచిన గోరువంక ప్రియుడైన చిలుకతో 'శత్రువగు కైకేయి పాదమును కొరుకుము' అని చెప్పినది కదా! ఆగోరువంక కౌసల్యాతనయుడనైన నాకు జరిగిన అన్యాయమును సహింపక అట్లనినది. ఆపిట్టకు నాతల్లిమీద నాకంటె మించిన ప్రేమకదా. ఆమెకు అట్టి ఉపశమనవాక్యము నేదియూ నేను చెప్పలేదు."

2. ఈయనువాదము భావైకలక్ష్యము, చూ. వాసవదత్త, చౌఖంబా (1967) ప్రతి, పుట 85.

"మోసగాడా, మరియొక శారికవెంటబడి పోయి యుందువు. లేకున్న ఇంతరాత్రి దనుక రాకపోవుటేమి" అని నిందించును.

శుకము శారికను అనునయించుచు,

"కోపము వదలుము. 'బృహత్కథ'లోని అద్భుతములవంటిది కళ్ళార చూచితిని. కావున ఆలస్యము," అని పలుకగా కథాశ్రవణకుతూహలమున కోపము మరచి శారిక "ఆకథ చెప్పుము" అని కోరును.

ఈసందర్భమున శుకముఖమున 'వాసవదత్త'లోని కథానాయికా పూర్వ వృత్తాంతమంతయు వివరింపబడును. వాసవదత్త (కథానాయిక) కలలో కందర్పకేతువును చూచి మరులుగొని, అన్వేషించుటకు దూతిని పంపును. (ఆమెపేరు తమాలిక!) ఆమెయు యాదృచ్ఛికముగ ఆచెట్టుదగ్గరకేవచ్చి కందర్పకేతువును చూచును.

ఈకథలోని శుకశారికలలో శుకము కథకుడై నాయికాజననాదివృత్తాంతమును చెప్పును కాన కథనోపకరణమగును. శుకకథనము శారికాసాంత్వనార్థము కాన వాని కలహవృత్తాంతము 'వాసవదత్త' ముఖ్యవృత్తముతో సంశ్లిష్టమగును.

3. 'కాదంబరి'లోని శుకశారికాకలహము ఇట్లు[1] —

చంద్రాపీడుడు కాదంబరిని మొదటిసారిగా కలిసికొనినపుడు సిగ్గుపడుచుండిన కాదంబరిచేత మహాశ్వేత చంద్రాపీడునికి తాంబూలము ఇప్పించును. అప్పుడు కాదంబరి పెంపుడుశారిక, కాళింది అనుపేరుకలది, పరిహాసుడు అను పెంపుడుశుకము వెంటపడగా వేగముగ వచ్చి కాదంబరితో కోపముగ ఇట్లనును;

"ఈదుర్వినీతుని (శుకమును) ఏల నివారింపవు? ఉపేక్షింతువేని అసువుల బాసెదను, నీపాదములాన.?"

మహాశ్వేత కుతూహలమున "ఏమిది?" అని అడుగ, కాదంబరి సఖి మదలేఖ చెప్పుచున్నది;

---

1. ఈయుపాఖ్యానము 9-వ అధ్యాయములోని కాదంబరీకథాసంగ్రహమున వర్ణితము. ఇచ్చట సంగ్రహానువాదము.

చూ. వానిశ్ల ప్రతి, 186 - 188.

"ఈశారికకును ఈశుకమునకును ప్రీతితో అర్యపుత్రియే పెండ్లి చేసినది. ఈదినము ఈశుకము తమాలికకు (తాంబూలకరంకవాహినికి) ఏవోమాటలు చెప్పుచుండగా చూచి ఈశారిక అలిగి భర్తను చేరుట లేదు. మేమెంత చెప్పినను వినుట లేదు."

ఇదివిని చంద్రాపీడుడు మందహాసమొనరించి నర్మోక్తిగా ఇట్లనును,

"ఈకథ విన్నదే. అందరును చెప్పుకొనుచున్నారు. అది అట్లుండనిండు. దేవి ఏల ఈదుష్టను తమాలికను నివారింపదు? శారికయందు ఆమెకు సానుభూతి లేకున్న మొదట ఆయభాగ్యను ఏల ఈదుర్వినీత పరిహాసునికి ఈయవలెను? ఇప్పుడు ఈశారిక ఏమి చేయగలదు? సవతి వచ్చుట స్త్రీలకు ప్రథమకోపకారణము కాదా? ఇప్పుడు ఇది సిగ్గుమాలి శుకమును చేరినచో దీనిమొగము చూడరాదు."

ఈమాటలకు అందరును నవ్వగా పరిహాసశుకము కోపముతో,

"ధూర్తరాజపుత్త్రా, ఇదియు (శారికయు) జాణయే. నీమాటలకు మోసపోదు. ఈపాటి వక్రోక్తులు దానికిని తెలియును, రాజకులసంపర్కముచేత దానిమతియు చతురమే. నీభుజంగభంగిభాషితముల కిది తావుకాదు. ఎప్పుడు కోపింపవలెనో, ఎట్లు పలుకవలెనో, ఎప్పుడు మన్నింపవలెనో దానికి తెలుయునులే."

4. ఈ శుకశారికోపాఖ్యానము 'వాసవదత్త' లోవలె కథనోపకరణము కాదు. దీనిని ఇతరత్ర ఉపాఖ్యానరహితమైన కాదంబరీకావ్యములో ఏల ఇమిడ్చెనని స్థూల దృష్టికి అందుటలేదు. వ్యాఖ్యాతలును దీనిని వివరించువారేకాని దీని ఔచిత్యచర్చ చేయరైరి.

నిర్ణయసాగరవారి భానుచంద్రసిద్ధచంద్రవ్యాఖ్యాసమేత మగు 'కాదంబరి' ప్రతిలో పుటల ఊర్ధ్వదేశప్రతీకలలో శుకశారికావృత్తాంతసందర్భమున "శుకశారికాముఖేన కౌతుకారంభః" అనియున్నది.[1] ఆప్రతి సంపాదకుడు కాశీనాథపరబ్ పండితుడో, లేక అందలి 'చషకము' అను అధికటీకను సంతరించిన భట్టశ్రీ మథురానాథ శాస్త్రియో, ఈవృత్తాంతముమీద కొంత విమర్శనాదృష్టిని ప్రసరించిరని "కౌతుకారంభః" అనుపదమువలన తెలియుచున్నది.

1. ప్రస్తుతము దుర్లభమగు ఈప్రతిని నాపనికొరకు నాయధీనమున ఉంచిన శ్రీ పోలూరి హనుమజ్జానకీరామశర్మ గారికి (ప్రాచ్యభాషాశాఖాధ్యక్షులు, V. R. కాలేజి, నెల్లూరు) కృతజ్ఞతలు.

ఆసూచనమీద ఇట్లు విస్తరింపవచ్చును —

చంద్రాపీడుడును కాదంబరియు ప్రథమసమాగమముననే పరస్పరము గురు ప్రణయభావావిష్టులయినందున మాటలు నిలిచిపోయినవి. అందరును కూర్చొని యుండగా సంభాషణ స్తంభించుట సంస్కృతిపరులకు అసభ్యముగను, లజ్జాకరముగను ఉండును కావున, ముఖ్యపాత్రల మనసులను వేరువిషయముపైకి మళ్లించుటకు వినోద కరమైన శుకశారికావృత్తాంతమును బాణుడు కల్పించియుండవచ్చును. ఈర్ష్యయు, సాంత్వనమును శృంగారము కావున కాదంబరీచంద్రాపీడుల శృంగారభావమునకు అనుకూలమై ఉద్దీపకములు అగును. ఏదో ఒక ఉపాఖ్యానమును లేక సంఘటనను కల్పింపక రససందర్భమునకు సహాయకమగు శుకశారికావృత్తాంతమును బాణుడు నేర్పుతో నిర్వహించెను.

మరియు రమ్యమయిన శృంగారానుగుణమైన హాస్యరసవ్యంజకమగు ఈయుపాఖ్యానమును బాణుడు విలక్షణమైన లాక్షణికప్రయోగముగ చూపుట అతని శృంగారరసతత్త్వ వైదుష్య నిదర్శనముగ గ్రహింపదగును. శుకము పేరు 'పరిహాసుడు' అని పెట్టుటలో 'ఇదిహాస్యము' అని బాణుడు పాఠకునికి నిశ్చయముగ చెప్పుచున్నాడు.[1]



1. చూ. ఇందు 13-15.

# పరిశిష్టము - 2

## (క) బాణుడు – దండి

సుబంధువు 'వాసవదత్త', బాణుని "హర్షచరితము", 'కాదంబరి' యును, దండి "దశకుమారచరితము", — ఇవి నాలుగును సంస్కృత గద్యకావ్యములలో మిక్కిలి ప్రసిద్ధములు. వీనిని గద్యకావ్యచతుష్కము అనవచ్చును. వీనిలో సుబంధు బాణుల సామ్యభేదముల చర్చ ముందే అయినది.[1] దక్షిణదేశమున దండి కావ్యము రమారమి బాణుని 'కాదంబరి' యంతటి ప్రాచుర్యముకలది. కాని వానికి సామ్యము తక్కువ, భేదములు ఎక్కువ. ఆభేదములు ఇంచుక —

| కాదంబరీకథ | దశకుమారచరితము |
|---|---|
| 1. బాలవరకు లాక్షణికులు చెప్పు కథా కావ్యలక్షణములు ఉన్నవి. | కథ, ఆఖ్యాయికల లక్షణములు రెండును కలవు. మిశ్రరూపము.[2] |
| 2. ఇరువురు నాయకులు, ఇరువురు నాయికలు ఉన్నను వృత్తైక్యత కలదు. | పలునాయకులు, పలుకథలు. ఏకథకు అదియే. |
| 3. ఉదాత్త శృంగారకావ్యము; ఉదాత్త పాత్రలు, వర్ణనములు కలవు. ఆదర్శప్రాయము. | ఎక్కువగ దుశ్చరితులు, చోరులు, జారుల పాత్రలు కలవు. వాస్తవికము. |
| 4. ఎక్కువగ గంధర్వాదులు, తత్తుల్య మానవులు పాత్రలగుటచేత దీని నుండి సమకాలిక సాంఘికవ్యవస్థ కేవలము అనుమేయము. | ఆనాటి సాంఘికవ్యవస్థకు దర్పణము వంటిది. |

1. చూ. 2-3-8 నుండి 2-3-13.

2. చూ. ఇందు 4-6 నుండి 4-14.

| | |
|---|---|
| 5. శృంగారరసప్రధానము. | ఒకరసమని లేదు. అద్భుతరసప్రాచుర్యము కలదు. |
| 6. సుదీర్ఘమగు బహువర్ణనలు కలవు. | వర్ణనలు తక్కువ. పూర్వపీఠికలో కొంత కలదు కాని, అది దండిది కాదని విమర్శకుల యభిప్రాయము. |
| 7. రీతి – సామాన్యముగ పాంచాలి; వర్ణనలలో గౌడి; సంభాషణలలో ముఖ్యముగ మనోభావ ప్రకటనమున వైదర్భి. రీతులు ఔచిత్యమును అనుసరించి మారును. | ఎక్కువగ వైదర్భి. సులువైన భాష. శబ్దాలంకారములు ఎక్కువ. పదలాలిత్యము కలదు. |
| 8. భాష ప్రామాణికము, పాణినీయము. | అపాణినీయములు ఎక్కువ. దండి తన 'కావ్యాదర్శము'న చెప్పిన దోషము లన్నియు ఇందు కలవని ఒక విమర్శకుని యభిప్రాయము. |
| 9. గద్యకావ్యవిశేషములగు శ్లేషాద్యలంకారములు విరివిగ కలవు. | శ్లేషకూడ ఎక్కువలేదు. సుబంధుబాణుల శ్లేషోపమాసంచయములు, శ్లేషవిరోధసందోహములు, శ్లేషపరిసంఖ్యానసమూహములు కనపడవు. |
| 10. కథలో కథగ, పాత్రల ముఖముల నుండి కథనము క్లిష్టసంధానముగ చేయబడినది. | ఒ మూలనుండి వివిధ దిశలకు పోవు కొమ్మలవలె చిక్కులేని కథనము. |
| 11. వాక్యములు బహుదీర్ఘములు. సమానములు పెద్దవి. పదజాలము విస్తారము. | దీర్ఘవాక్యములున్నను సరళశైలి. పదములు కవిసామాన్యములు. |
| 12. పండితప్రమోదజనకమయినను, అల్పసత్త్వుడైన పాఠకుడు మధ్యలో విరమించునట్లు కొంతదుర్ధర్షమయిన కావ్యము. | కొద్దిపాటి సంస్కృతపాటవమున్న పాఠకునికి సాంతముగ పఠించు కుతూహలము కల్గించును. |

(గ) ఇతరగద్యకావ్యములు

సుబంధు బాణ దండుల తరువాతి గద్యకావ్యములు అంతప్రసిద్ధములు కావు. అయినను జిజ్ఞాసువులకొరకు వానిలో ముఖ్యమయినవానిని గురించి ఇంచుక —

1. తిలకమంజరి : కవి ధనపాలుడు (క్రీ. శ. 10-వ శతాబ్దము)

ఇది ఒక విస్తృతమయిన శృంగారగాథ. నాయకుడు సమరకేతువు, నాయిక తిలకమంజరి. పూర్తిగ కాదంబర్యనుకరణము. భాష నాతికఠినము. మంచి భావన లున్నవి. కథ జైనసంప్రదాయము లోనిది. బాణునియందు ధనపాలుని భక్తి, ఇందు బాణప్రశస్తి 1-2-7 లో చూడదగును.

2. నలచంపువు : కవి త్రివిక్రముడు (క్రీ. శ. 10-వ శతాబ్దము)

చంపువులలోను విస్తారగద్యభాగముండును, కావున ఇట ప్రస్తావింపవచ్చును. ఇతడును బాణుని అనుకరించినవాడే. (చూ. బాణప్రశస్తి 1-2-5)

దీనికి 'దమయంతీకథా' అనియు పేరు. త్రివిక్రమునకు సింహాదిత్యుడు అని నామాంతరము. ఈకావ్యము 'కాదంబరి' వలెనే అసంపూర్ణము.

ఒకశ్లోక మితనిది మిక్కిలి ప్రసిద్ధము —

ఉదయగిరిగతాయాం ప్రాక్ప్రభా పాండుతాయాం,
అనుసరతి నిశీథే శృంగమస్తాచలస్య ।
జయతి కిమిప తేజః సాంప్రతం వ్యోమమధ్యే
సలిలమివ విభిన్నం జాహ్నవం యామునం చ ॥ (6-1)

దీనివలన ఇతనికి యమునా - త్రివిక్రముడని పేరువచ్చెనట. ఈకావ్యకథ అందరికిని తెలిసినదే.

ఇతడు 'కాదంబరీకథాసారము' అను పద్యకావ్యమును రచించిన త్రివిక్రముడు (విక్రమదేవుడు) కాడు.

3. యశస్తిలకచంపువు : కవి సోమదేవుడు (క్రీ. శ. 10-వ శతాబ్దము)

ఇతడును ఒక జైనకవి. ఏడాశ్వాసములలో యశోధరుడు అను ఒక అవంతి రాజు కథ. ఇందు హిందూరాజు జైనుడుగ మారుట వృత్తము. ఆఖరు మూడు అశ్వాసములును జైనమతవివరణము.

సోమదేవునికాలము కచ్చితముగ తెలియును. అతని పూర్వకవిస్తుతిలోని కవులకాలములకు అతనికాలము పశ్చిమావధి అగును.

4. 'ఉదయసుందరీకథా': కవి సోడ్ఢలుడు (క్రీ. శ. 11-వ శతాబ్దము)

ఇతడు క్షత్రియకవి. బాణస్తుతుడు, అనుకర్త. (చూ. బాణప్రశస్తి, 1-2-8). 'ఉదయసుందరీకథ' ఎనిమిది ఆశ్వాసములలో నాయిక ఉదయసుందరి వివాహకథ చెప్పును. నాయిక నాగకన్య. సోడ్ఢలుని భాషయు, భావములు రమ్యములు.

5. 'రామాయణచంపువు': కవి భోజుడు (క్రీ. శ. 11-వ శతాబ్దము)

కిష్కింధకాండపర్యంతము రామాయణకథ. తరువాతి కాండను ఒక లక్ష్మణ కవి పూరించెను. మిక్కిలి ప్రామాణికుడైన సంస్కృతకవి, పండితుడు అయిన భోజరాజు రచించిన ఈచంపువు దక్షిణభారతమున బహుకాలముగ పఠనపాఠనము లందు కలదు.

6. కృష్ణచరితము: కవి అగస్త్యుడు (క్రీ. శ. 14-వ శతాబ్దము)

ఈఅగస్త్యుడే 'ప్రతాపరుద్రీయము' అను అలంకారశాస్త్రమును రచించి కాకతీయ ప్రతాపరుద్రుని ఆస్థానమున నున్న విద్యానాథుడని కొందరివాదము. కాని ఆవాదమునకు తగిన బలము కనబడదు.

'కృష్ణచరితము' భాగవతములోని కథయే. ఆఖ్యాయికగా చేయబడినది. ఇటీవల అచ్చయినది. బాణాదులను అనుకరించిన గద్యము.

7. "వేమభూపాలచరితము": కవి వామనభట్టబాణుడు (క్రీ. శ. 15-వ శతాబ్దము)

ఇతడు ఆంధ్రుడు, సంస్కృతకవి. బాణుని మించి సంస్కృతమున గద్యము వ్రాయుదునని 'హర్షచరితము'నకు పోటీగా ఆంధ్రరాజు వేమభూపాలుని చరితమును ఆఖ్యాయికగా రచించెను. ఆంధ్రదేశమున కూడ ఈగ్రంథమునకు తగిన ప్రచారము లేదు. కుంభకోణమున నాగరిలిపిలో ముద్రింపబడినది.

ఈకవియు కాదంబరీబాణునివలె వత్సగోత్రుడే. ఇతని పద్యములు కొన్ని బాణప్రశస్తి 1.2-18 లోను, దాని అధోజ్ఞాపికలోను చూడనగును.

దీనిని ప్రొద్దుటూరులోని సంస్కృతకాలేజిలో అధ్యాపకులు శ్రీ బండ్ల వేంకట రమణయ్యగారు పద్యకావ్యముగ ఆంధ్రీకరించియున్నారు. ఇంకను అచ్చుకాలేదు.

(చ) కాలక్రమమున గద్యప్రక్రియ మందగించి పద్యకావ్యములు ఎక్కువయినవి. క్రీ. శ. 14-వ శతాబ్దము తరువాత సంస్కృతసాహిత్యము ఒకవిధముగా జీవచ్ఛవమయినది. 19-వ శతాబ్దపు కడమభాగమున శ్రీ R. V. కృష్ణమాచార్యులు మొదలగువారు సంస్కృతగద్యమును పునరుద్ధరించి క్రొత్తపోకడలలో ప్రయోగించి ఒక నూతనవికాసమును తెచ్చిరి.

సంస్కృతభాష భారతప్రజలలో వృద్ధికావలెనన్న ప్రామాణికమును సరళమును సగుణశయ్యలో నూతనవస్తువుగల సాహిత్యము ఏర్పడవలెను. సామాన్యపాఠకునికి వలయు వినోదమిచ్చు సాహిత్యము కావలసియున్నది. నవీన సాంఘికనాటకములు, నవలలు, చిన్నకథలు వ్రాయుట అవశ్యకము. సంస్కృతమున డిటెక్టివు నవలలు ఏల వ్రాయరాదు ?



# పరిశిష్టము - 3

## తెలుగుకవులపై బాణుని ప్రభావము[1]

1. కాదంబరీవైశిష్ట్యపరిశీలనమున ఈశీర్షిక అప్రస్తుతమయినను, ఈవ్యాస మంతయు తెలుగున నుండుటయు, అది తెలుగు పాఠకులకే ఉద్దిష్టమగుటయు కారణముగా, బాణుని ప్రతిభ పలు తెలుగుకవులను అనుకరణకు ప్రేరేపించుటయు అతని వైశిష్ట్యమే కావున, ఆవైనమును సంగ్రహముగ పరిశీలించుట తగును.

తెలుగుకవులందరును ప్రాయికముగ పద్యకవులు అయినను, రమారమి అందరును 'చంపువు' అను పద్యగద్యమిశ్రకావ్యరూపమునే గ్రహించిరి. తిక్కన 'ఉత్తరరామాయణము' ఒక్కటియే గొప్పతెలుగు కావ్యములలో గద్యరహితము. గద్యభాగములందు సంస్కృతగద్యశైలి అనుకరణములు ముఖ్యముగా రెండు ప్రక్రియలందు కనపడుచున్నవి. అవి 1. దీర్ఘసమాసప్రయోగము 2. శ్లేషసంబంధ మయిన ఉపమావిరోధపరిసంఖ్యాలంకారసముచ్చయముల ప్రయోగము.

2. దీర్ఘసమాసముల ప్రయోగము —

(క) తెలుగుసాహిత్యమునకన్న ఒకయడుగు ముందు అవతరించిన కన్నడ సాహిత్యములో ముఖ్యమయిన ప్రథమకావ్యము పంపకవి రచించిన భారతము. ఇది చంపువుగ నుండుటయే నన్నయకు ఆరూపమును గ్రహించుటకు మార్గదర్శకమయినది. నన్నయ 'మానా'ను తరువాత తిక్కన మొదలగువారు అనుకరించిరి.

పంపభారతమున ప్రథమవచనమున

"సమున్మిషద్ - వివిధ - రత్నమాలా - ప్రభాభీలా (?) రుణజలప్లవావిల - విలోల - వీచీ - రయ - ప్రదారిత - కులాచలోదధిపరీత ...."

---

1. బాణునిప్రభావము అనుటలో సుబంధునిప్రభావము అనికూడ గర్భితము. గద్యకావ్యప్రభావము అని చెప్పుట మేలేమో. కొందరు తెలుగుకవులు సుబంధువును పేర్కొనియున్నారు. కాని 'వాసవదత్త' కన్న 'కాదంబరి' ప్రసిద్ధి హెచ్చు.

అనుదీర్ఘసమాసము దాక్షిణాత్యసాహిత్యములందు ప్రథమమనవచ్చును.

ఇది సంస్కృతమున రుద్రదామప్రశస్తి మొదలుగా కనపడు గద్యపు బాణీ.

(గ) ప్రథమాంధ్రకవి – నన్నయ

నన్నయ సంస్కృతశార్దూలవృత్తముతో మొదలుపెట్టి పద్యగద్యములలో దీర్ఘసమాసములను ప్రయోగించి సంస్కృతసమాసవృత్తిని ఆంధ్రభాషాసామాన్య ప్రక్రియగ చేసెను. నన్నయసమాసములు దీర్ఘములయినను బాణుని సమాసములవలె పులకార్థకములు. మరియు నన్నయ సమాసములు మృదుపదసంతానములై బాణుని కన్న అక్షరరమ్యత కలవి. మచ్చునకు —

మొదటివచనము (ఆదిపర్వము) —

తత్ప్రసాద – సమాసాదిత – నిత్యప్రవర్ధమాన – మహీరాజ్య – విభవుండును, నిజభుజ – విక్రమ – విజితారాతి – రాజ – నివహుండును, అఖిల – జగజ్జేగీయమాన నానాగుణరత్నరత్నాకరుండును, ఐ పరగుచున్న రాజరాజనరేంద్రుడు.

తరువాతి పద్యమున —

అపరాజిత – భూరిభుజా – కృపాణ – ధారాజల – శాంత – శాత్రవపరాగుడును.

రెండవవచనమున —

అఖిల – జలధి – వేలా – వలయ – వలయిత – వసుమతీ – వనితా – విభూషణంబైన వేఁగిదేశంబునకు,

ద్వితీయాశ్వాసపు 28-వ పద్యమున —

1. అలఘు – ఫణీంద్రలోక – కుహరాంతర – దీప్త – మణి – స్ఫురత్ ప్రభావ ......

2. శశ్వదుదవాప – మహావ్రత – శీతపీడితాచల – ముని – సౌఖ్య – హేతు విలసత్ – బడబాగ్ని – శిఖాచయంబులకా.

29-వ పద్యమున —

వివిధోత్తుంగ - తరంగ - ఘట్టన - చలద్వేలా - వనైలావలీ - లవలీ - లుంగ - లవంగ - సంగత - లతా - లాస్యంబులీక్షించుచుఁ ... ఇత్యాది.

నన్నయ బాణుని వక్రోక్తులను అనుకరింపలేదు. ఆయన అలంకారికగద్యము నకు పూనుకొనలేదు. తిక్కనయు అట్లే.

కవిత్రయము వ్యాసభారతమును ఆంధ్రీకరించువారు కావున మూలములో లేని గద్యవక్రభాషణములను తెలుగులో చూపరైరి. దీర్ఘసమాసప్రయోగము మాత్రము మువ్వురును విరివిగనే చేసియున్నారు. తిక్కన 'ఉత్తరరామాయణము' పూర్తిగ పద్యమే అగుటవలన అందును గద్యభణితులకు తావు లేకపోయినది. ఎఱ్ఱన మాత్రము తన 'నృసింహపురాణము' లో గద్యవిశేషభాషాప్రక్రియలను పూర్తిగ తెలుగులోనికి దించియున్నాడు.

(చ) ఎఱ్ఱాప్రెగ్గడ (శ్లేషాలంకారములు)

'నృసింహపురాణము' లోని ప్రథమాశ్వాసమున[1] పురవర్ణనగద్యము సుబంధు బాణుల యనుసరణమునకు మంచియుదాహరణము. ఇందు శ్లేషోపమలు, విరోధాభాసములు సముచ్చయములుగ నున్నవి. ఉదా:

1. శ్లేషోపమలు — వైకుంఠపురము,

| | |
|---|---|
| పురుషోత్తము మహిమయుంబోలె | వర్ణనాతీతవైభవంబు |
| లక్ష్మీహృదయంబునుంబోలె | నారాయణనివాసయోగ్యము |
| వేదాంతసారంబునుంబోలె | మహాయోగిదర్శనోపలాలితంబు |
| భాగవతపురాణంబునుంబోలె | నచ్యుతావతారకథాబహుళంబు |
| శంకరువామభాగంబునుంబోలె | సర్వమంగళాలంకృతంబు |
| ... ... ... | ఇత్యాది |

2. విరోధాభాసములు — వైకుంఠపురము,

| | |
|---|---|
| శేషభోగాస్పదంబయ్యును | నశేషభోగనివాసంబు |
| సముత్తుంగగాంగేయభవనభాసురంబయ్యును | శిఖండివిహారహృద్యంబు |

1. వావిళ్లప్రతి (1968), పుట 23, 24.

వివిధవిలాసినీవిలసనోల్లసితంబయ్యును జితేంద్రియగమ్యంబును
... ... ... ఇత్యాది

ఇక ఎఱ్ఱన చేసిన పురుషోత్తముని అంగవర్ణనము. (తృతీయాశ్వాసము, 14) ఆంధ్రభాషలో నద్వితీయమైన గద్యము. అది, గద్యభణితులన్నియు పుష్కలమై, నిడివిలో బాణాదులను మించి, ఎఱ్ఱన గద్యప్రతిభకు ఉత్తమనిదర్శనముగ నున్నది.

(ఙ) నాచన సోముడు

ఎఱ్ఱనకు వెనువెంటనే చెప్పవలసిన నాచన సోముడు అన్నింటియందును అందరిని మించుదునను కోరికతో శ్లేషను విజృంభించి ప్రయోగించినాడు. తత్కారణముగ అతని 'ఉత్తరహరివంశము' పలుచోటుల అర్థమగుటలేదు. ఎటులైనను సంస్కృతగద్య శైలిని ఎఱ్ఱనను మించి ప్రయోగించెననుట నిర్వివాదము.

ఈదీర్ఘసమాసములను చూడుడు —

వందీకృత - నాందీ - నందావిత - వందనమాలా - సందోహవిహరద్ - బృందారకసుందరీ - హార - ఘటిత - నటనారంభ - విజృంభిత - రంభా - కుచకుంభ - నందర్శన - సంభావనాసుభగం - భావుక - కుబేరకుమార - సంభ్రమావతరణ - కరణ - చరణ - ఝణఝణాయమాన - మణిమంజీర - జ్ఞాపిత - సోపాన - పథోపగమ్యంబై ...

కుంద గిరిమల్లికా - కుముద - సముదయ - దాయాద - సదాదితేయనదీ - సుమేరుశిఖర - విసర - విసరదుదీచీ - ముఖ - ప్రవాహ - విహరమాణ - విరించిపుర - మహిళాపయోధర - కుంకుమరాగ - రాగచ్ఛవిచ్ఛురిత - తరంగ - పరంపరా - పరార్థ్య - ఫేనపట - పల్లవిత - విగతరజ - రుచిరతరాధిత్యకాదిత్య - కాత్యాయనీ - రమణ - శిరోభూషణ - శశాంకశకల - విలాస - నిస్తంద్ర - చంద్రికా - విచరదవాచీ - ముఖరోచిర్ - ఝరీపరీత - పరిసర - పరిహృత - తపనీయ - తట - ద్యుతి - నిపతదితరేతర - కాంతి - నివిమయంబై ... ఇత్యాది[1].

(ఉత్తరహరివంశము, ద్వితీయాశ్వాసము, 160)

బాణుడు కూడ ఇంత పొడవుగల సమాసములు వ్రాయలేదు.

1. వావిళ్లప్రతి (1968), పుటలు 8౭ నుండి 88 వరకు.

2. ఇక గద్యసాహిత్యపు ప్రత్యేకలక్షణములు

శ్లేషానుప్రాణితోపమలు — (ఆశ్రమవర్ణనము. 2-వ ఆశ్వాసము)

| | |
|---|---|
| వలాహకంబునుంబోలెఁ | గరకాస్పదంబై, |
| కుంజరంబునుబోలె | కుంభాభిరామంబై, |
| రంగస్థలంబునుంబోలె | శైలూషశతరమ్యంబై, |
| తరుణీముఖంబునుంబోలె | తిలకవిరాజితంబై, |
| మహాభారతంబునుంబోలె | శతపర్వసనాథంబై, |
| గగనంబునుంబోలె | ఋక్షగణసంకీర్ణంబై, |

ఇత్యాది.

శ్లేషవిరోధాభాసములు (అందే)

బుద్ధ సిద్ధాంత సంశ్రయంబయ్యు - నజినవాసస్థితి శోభితంబై,
పుణ్యజనేశ్వర నివాసంబయ్యును, యమనియమవశంవదశాంతలోకంబై,
సమిద్భారధురీణ సంకులంబయ్యును, నక్షమాలాభాతిశయంబై,

... ఇత్యాది.

శ్లేషోపమ, శ్లేషవిరోధము ఒకేసరముగ

కైలాసనగరంబునుబోలె = నీశ్వరప్రియంబులయ్యును
X నసురాధిష్ఠితంబులై,
సాగరంబునుంబోలెఁ = బ్రకటిత నిఖిలావర్తంబులయ్యును
X జడమయంబులై,
అక్షర సంచయంబునుబోలె = దీర్ఘప్లుతప్రచారంబులయ్యును
X హ్రస్వంబులై

ఈపై ప్రయోగములు బాణునియందు కానరావు.

3. పదగుంఫనములు

సంస్కృతగద్యములో బాణాదులు చిత్రమైన పదగుంఫనములు చేసియున్నారు. వానివలె తెలుగున తెలుగునుడిననుసరించి సోముని చిత్రగుంఫనము —

వడిపెడక వారింపక, యొపరిలక యోలంబుగొనక, పంటింపక పాముకొనక, నడలక శంకింపక, నందీక సరకుగానక, వెనుకమెట్టక వేగిరపడక, చరచిపోక చాలింపక, చలింపక చాయదరుగక ........ ఇత్యాది.

కథాసందర్భమున పురవర్ణనము లేమి పరిసంఖ్యలు లేవు.

(౮) శ్రీనాథుడు

శ్రీనాథుడు ప్రబంధయుగమునకు రమారమి ప్రారంభకుడు. అతని 'భీమేశ్వర పురాణము', 'శివరాత్రిమాహాత్మ్యము' ను సంస్కృతగద్యశైలిని ఆంధ్రములో చూపు చున్నవి. ఇతడు

గణుతింతు నిరవద్యగద్యపద్యనిబంధ
పరితోషితస్థాణు భట్టబాణు(న్).

అని భీమేశ్వరపురాణమున బాణుని స్తుతించుచు అందు బాణునికి పద్యనిబంధమున కూడ నైపుణ్యమును చెప్పుట విశేషము. ఇది భోజునియభిప్రాయమునకు భిన్నము. అట్లే 'శివరాత్రిమాహాత్మ్యము'న

బంధుర గాంభీర్య బంధు సుబంధు వి
స్ఫురితమహోన్నతిస్తోము సోము,

అని పలువురు మరచిన సుబంధువును, తెలుగున సుబంధుతుల్యుడగు సోముని చెప్పి,

బాణునద్భుతశాస్త్ర బహుకళాపారీణు(న్)

అని బాణుని స్మరించును.

దీర్ఘసమాసములు శ్రీనాథునికవిత్వములో సామాన్యగుణము. ప్రౌఢమయిన గౌడీయరీతిలోని వచనములు భీమేశ్వరపురాణమున కలవు. శ్లేషచమత్కారములకు ప్రథమాశ్వాసములోని దక్షవాటీపురవర్ణనము[1], భక్తిభావపూరితమయిన ఓజస్సునకు తృతీయాశ్వాసములోని భీమేశ్వరస్తోత్రమును[2] చెప్పదగినవి.

---

1. వావిళ్లప్రతి (1967) పుటలు 33 నుండి 37 వరకు.
2. వావిళ్లప్రతి (1967) పుటలు 136 నుండి 139 వరకు.

అయినను 'శివరాత్రిమాహాత్మ్యము' నందు శ్రీనాథుడు అత్యధికముగా కాదం బరీప్రభావమునకు గురియయ్యెనని పాఠకులకు తప్పక తోచును. ఇందు భాషయే కాక కాదంబరిలోని వస్తువుకూడ కొంత శ్రీనాథుడు స్వీకరించుకొనెను. తారాపీడవిలాస వతుల అనపత్యతాదుఃఖము, విలాసవతి కోవెలలో మహాభారతపురాణశ్రవణమున 'అపుత్రులకు గతిలేదు' అను భావమును వినుట, తదనుదుఃఖము, తారాపీడుడు దుఃఖ కారణమడుగుట, మొదలగు కథాంశములను శ్రీనాథుడు అస్పుటముగ 'కాపీకొట్టి' యజ్ఞదత్తునిలల కథలో వాడుకొనియున్నాడు. బాణుని తాంబూలకరండవాహినుల నుండి ఒకతెను శ్రీనాథుడు 'అరువు' తెచ్చుకొనెననుటలో బాణుని ఔత్కృష్ట్యవి ఎంతమెచ్చి, ఎంతయనుసరించెనని బోధపడును.

ఇక శైలిలో, ముఖ్యముగ వచనములందు, నాదసౌకుమార్యములే శ్లేషమూలకము లయిన ఉపమావిరోధాభాసాలంకారములను శ్రీనాథుడు సమర్థముగ నిర్వహించెను.[1]

బాణుని 'చండీశతకము' లోని 7, 8 శ్లోకములను శ్రీనాథుడు హరవిలాస మున సీసములుగ చేసియున్నాడు. పోతనయు ఒక శ్లోకమును వాడినట్లున్నది.

(ఛ) బమ్మెర పోతన

బమ్మెర పోతన 'భాగవతము'లో కవిత్రయము, సోమన, శ్రీనాథుల[1] కవితాశైలివిశేషములన్నియు సామాన్యములగును. పౌరాణికగాంభీర్యము, వక్రోక్తి చమత్కారము, దీర్ఘసమాసములు, చిన్నచిన్న తెలుగుపదములు అన్నియు ఆయా చోటుల ఔచిత్యముతో ఒప్పుచు, భక్తిరసమున మునిగి, అనన్యసామాన్యమయిన కావ్యముగ పోతన 'భాగవతము' తెలుగున కుదిరినది.

పోతన తన పూర్వకవిప్రశంసలో ముందుగ వాల్మీకివ్యాసశుకులను చెప్పి, వెనువెంటనే

మృదుమధురవచనవర్గపల్లవితస్థాణునకుం బాణునకుం మ్రొక్కి-

---

1. వర్ణనాదులయందును, ఇతరసులందునను శ్రీనాథుని బాణానుసరణమును విపులముగ ఉదాహరించి శ్రీ కల్లి సాంబమూర్తిగారు చర్చించియున్నారని శ్రీ B. గానురాజుగారు తమ శివరాత్రిమాహాత్మ్య పీఠికలో చెప్పియున్నారు.

అని బాణుని పేర్కొని, తరువాతనే కాళిదాసాదులను స్మరించుటను మనము బాణునికి మహాకావ్యకర్తలలో అగ్రస్థానము ఇచ్చుట అని తలపవచ్చును.

సంస్కృతగద్యభణితులు పోతనకు 'మంచినీళ్లప్రాయము'. వానిని తెలుగు చేయుటకు ఎఱ్ఱన సోమనలు పోతనకు మార్గదర్శకులు. పోతనసమాసములు ఎంత ఓజఃపూరితములో అతని తెలుగునుడి అంత మధురము; అతని ఊహ ఎంత ఉన్నతమో భావము అంత గంభీరము.

ఉదాహరణమునకు భాగవతము మొదటనే నైమిశారణ్యవర్ణనమును, అష్టమ స్కంధమున నరసింహావతారవర్ణనమును చూడవచ్చును.

పోతన భాగవతము సర్వవిధపద్యగద్యశైలులకును దర్పణమగును. తెలుగు భారతము దేశభాషావాఙ్మయములలో అత్యుత్తమకృతియైనట్లు తెలుగు భాగవతము దేశభాషాభాగవతములన్నిటికిని తలమానికము. తెలుగున రామాయణమునకు అట్టి స్థితిలేదు. రామాయణమును తమిళములో కంబడును హిందీలో తులసీదాసును ఉత్కృష్టముగ చేసిరి.

ఇక ప్రబంధకవులలో సంస్కృతగద్యసరణులు కనబడుచునే ఉన్నవి. గ్రంథవిస్తరభీతిచే ప్రబంధముల పరిశీలనమును ఆంధ్రసాహిత్య జిజ్ఞాసువులకు వదలి ఈశీర్షికను ఇంతటితో త్రెంచివేయవలసినది.



# పరిశిష్టము - 4

## కాదంబరిలోని సుభాషితములు

### ( అకారాదిగ )

ఇందు చూపిన పుటసంఖ్యలు M. R. కాలేప్రతి (1918) కిని, వావిళ్లప్రతి (1965) కిని సంబంధించును.

| సుభాషితములు | కాలే, పుట | వావిళ్ల, పుట |
|---|---|---|
| 1. అకారణం చ భవతి దుష్ప్రకృతేరన్వయః, శ్రుతం చావినయస్య. | 168-169 | 100 |
| 2. అకారణావిష్కృతవైరదారుణా<br>దసజ్జనాత్ కస్య భయం న జాయతే ।<br>విషం మహాహేరివ యస్య దుర్వచః<br>సుదుస్సహం సన్నిహితం సదాముఖే ॥ | 3 | 3 |
| 3. అచింత్యోహి మహాత్మనాం ప్రభావః. | 267 | 168 |
| 4. అజస్రమక్షపావసానప్రబోధా ఘోరా చ రాజ్యసుఖ సన్నిపాత నిద్రా భవతి. | 167 | 100 |
| 5. అణురప్యుపహారపరిగ్రహః ప్రణయ మారోపయతి. | 217 | 130 |
| 6. అతనురేష (మన్మథః) హుతాశనః. | 349 | 226 |
| 7. అతికష్టాస్వవస్థాసు జీవితనిరపేక్షా న భవన్తి ఖలు జగతి ప్రాణినాం ప్రవృత్తయః. | 63 | 35 |
| 8. అతికృపణాః ఖల్వమీ ప్రాణాః. | 84 | 36 |

| | | |
|---|---|---|
| 9. అతిక్రాన్తాన్యపి హి సంకీర్త్యమానాని అనుభవసమాం వేదనా ముపజనయన్తి సుహృజ్జనస్య దుఃఖాని. | 259 | 162 |
| 10. అతిపిశునాని చాస్యైకాంతనిష్ఠురస్య దైవహతకస్య విలసితాని. | 267 | 169 |
| 11. అదుర్లభం హి మరణమధ్యవసితం. | 262 | 165 |
| 12. అదూరకోపా హి మునిజనప్రకృతిః. | 228 | 137 |
| 13. అనాయాసేనైవాత్మా దుఃఖాభిహతైః పరిత్యజ్యతే. | 264 | 167 |
| 14. అనుజ్ఝితధవలతాపి సరాగైవ భవతి యూనాం దృష్టిః. | 167 | 100 |
| 15. అనుభవే చ కో వికల్పః. | 266 | 168 |
| 16. అనేకవిధాశ్చ కర్మణాం శక్తయః. | 267 | 168 |
| 17. అపగతమలే హి మనసి స్ఫటికమణావివ రజనికరగభస్తయః, విశన్తి సుఖముపదేశగుణాః. | 168 | 100 |
| 18. అపరిగతాని దైవతాన్యప్యనుచిత పరిభవభాఞ్జి భవన్తి. | 133 | 79 |
| 19. అపరిణామోపశమో దారుణో లక్ష్మీమదః. | 166 | 99 |
| 20. అపరిభవనీయో హి కుమారికాజనో యూనామ్. | 346-347 | 224 |
| 21. అప్రతిపాద్యా హి పరస్వతా సజ్జనవిభవానామ్. | 305 | 195 |
| 22. అమోఘఫలా హి మహామునిసేవా భవతి. | 105-106 | 61 |
| 23. అయత్నేనైవ ఖలు ఉపహాసాస్పదతామీశ్వరో నయతి జనమ్. | 238-239 | 146 |
| 24. అలీకాభిమానోన్మాదకారీణి ధనాని. | 169 | 101 |

| | | |
|---|---|---|
| 25. అవితథఫలాశ్చ ప్రాయో నిశావసానసమయ దృష్టా భవన్తి స్వప్నాః. | 110 | 64 |
| 26. అశిశిరోపచారహార్యోఽత్యన్తతీవ్రో దర్ప దాహజ్వరోష్మా. | 166 | 99 |
| 27. అహంకారదాహజ్వరమూర్ఛాన్ధకారితా విహ్వలా హి రాజప్రకృతిః. | 169 | 101 |
| 28. అహో, జగతి జంతూనామసమర్థితోపనతాని ఆపతన్తి వృత్తాన్తరాణి. | 194 | 127 |
| 29. అహో, దుర్నివారతా వ్యసనోపనిపాతానామ్. | 218 | 131 |
| 30. అహో, రూపాతిశయ నిష్పాదనోపకరణ కోశ స్యాక్షీణతా విధాతుః. | 2.5 | 136 |
| 31. ఆత్మకృతానాం హి దోషాణాం నియతమను భవితవ్యం ఫల మాత్మనైవ. | 195 | 117 |
| 32. ఆత్మేచ్ఛయా నశక్య ముచ్ఛ్వసితుమపి. | 267 | 169 |
| 33. ఆదౌ వినయాధికం కుసుమేషుశరాః ఖండ యన్తి పశ్చాన్మర్మాణి. | 287 | 224 |
| 34. ఆరూఢప్రతాపో హి రాజా త్రైలోక్యదర్శీవ సిద్ధాదేశో భవతి. | 180 | 106 |
| 35. ఆశయా హి కిమివ నక్రియతే. | 262 | 165 |
| 36. ఇంద్రజాలపిచ్ఛికేవాసంభావ్యమపి ప్రత్యాశా పురఃస్థాపయతి. | 301 | 192 |
| 37. ఇన్ద్రియ హరిణహారిణీ చ, సతతమతి దురన్తేయం, ఉపభోగమృగతృష్ణికా. | 167 | 100 |
| 38. ఉదారజనాదరో హి బహుమానమారోపయతి. | 317 | 203 |

| | | |
|---|---|---|
| 39. కటు క్వణన్తో మలదాయకాః ఖలాః<br>తుదన్త్యలం బంధనశృంఖలా ఇవ ।<br>మనస్తు సాధుధ్వనిభిః పదే పదే<br>హరన్తి సన్తో మణినూపురా ఇవ ॥ | 3 | 4 |
| 40. కథమప్యేకస్మిన్ జన్మని సమాగమః, జన్మాన్తరసహస్రాణి చ విరహః ప్రాణినామ్. | 268 | 169 |
| 41. కాలో హి గుణాశ్చ దుర్నివారతా మారోపయన్తి మదనస్య సర్వథా. | 228 | 137 |
| 42. కిమివ హి దుష్కరమకరుణానామ్. | 61 | 33 |
| 43. కింవా ప్రశమహేతునాఽపి న ప్రచండతరీ భవతి బడబానలో వారిణా. | 169 | 100 |
| 44. కుసుమశరప్రహారజర్జరితే హి హృదయే జలమివ గలత్యుపదిష్టమ్. | 168 | 100 |
| 45. క్లేశభీరు రకృతజ్ఞః సుఖాసఙ్గలబ్ధో లోకః స్నేహసదృశకర్మానుష్ఠాతుమశక్తో నిష్ఫలే నాశ్రుపాతమాత్రేణ స్నేహ ముపదర్శయన్ రోదితి. | 264 | 167 |
| 46. గంగేవ వసుజనన్యపి (ఇయం లక్ష్మీః) తరంగబుద్బుదచంచలా. | 172 | 102 |
| 47. గర్భేశ్వరత్వం, అభినవయౌవనత్వం, అప్రతిమరూపత్వం, అమానుషశక్తిత్వం చేతి మహతీయం ఖలు అనర్థపరంపరా — సర్వావినయానామేకైకమ ప్యేషామాయతనం, కిముత సమవాయః. | 167 | 100 |
| 48. గరీయసీ గురోరాజ్ఞా ప్రభవతి దేహమాత్రకస్య. | 331 | 213 |

| | | |
|---|---|---|
| 49. గురువచనమమలమపి సలిలమివ మహదుప జనయతి శ్రవణస్థితం శూల మభవ్యస్య; ఇతరస్యతు కరిణ ఇవ శంఖాభరణం ఆన నశోభాసముదయం అధికతర ముపజనయతి. | 168 | 100 |
| 50. గురూపదేశశ్చ నామ పురుషాణాం అఖిల మల ప్రక్షాలనక్షమజలం స్నానం; అనుప జాతపలితాదివైరూప్యం అజరం వృద్ధత్వం; అనారోపితమేదో దోషం గురూకరణం; అసువర్ణవిరచనం అగ్రామ్యం కర్ణాభరణం; అతీతజ్యోతిరాలోకః, నోద్వేగకరః ప్రజా గరః. | 169 | 100-101 |
| 51. చన్దనప్రభవోఽపి నదహతి కిం అనలః? | 169 | 100 |
| 52. చిత్రం చ దైవమ్. | 267 | 168 |
| 53. జనయతి ప్రభుప్రసాదలవోఽపి ప్రాగల్భ్యం అధీరప్రకృతేః. | 217 | 130 |
| 54. జనయన్తి హి పశ్చాత్ వైలక్ష్యం అభూమి పాతితా వ్యర్థాః ప్రసాదామృతదృష్టయః మహతామ్. | 331 | 213 |
| 55. జన్మాన్తరకృతం హి కర్మ ఫలముపనయతి పురుష స్యేహజన్మని. | 105 | 61 |
| 56. తరలహృదయం అప్రతిబుద్ధం చ మద యన్తి ధనాని. | 180 | 108 |
| 57. తిమిరోపహతేవ యూనాం దృష్టిః అల్పమపి కాలుష్యం మహత్పశ్యతి. | 300 | 191 |
| 58. తృణలవలఘు చ జీవితమ్. | 311 | 198 |

| | | |
|---|---|---|
| 59. దుఃఖితమపి జనం రమయన్తి సజ్జనసమాగమాః. | 275-276 | 175 |
| 60. దుర్లభో హి దాక్షిణ్యపరవశో నిర్నిమిత్తమిత్రం అకృత్రిమహృదయో విదగ్ధజనః. | 290 | 183 |
| 61. దైవతాన్యపి హి మునిశాపవశాత్ ఉజ్ఝిత నిజశరీరాణి శాపవచనోపనీతాని శరీరాన్తరాణి అధ్యాసత ఏవ. | 132 | 79 |
| 62. ధర్మపరాయణానాం హి సమీపచారిణ్యః కల్యాణసంపదః భవన్తి. | 107 | 63 |
| 63. ధీరా హి తరన్తి ఆపదామ్. | 283 | 163 |
| 64. ధైర్యధనా హి సాధవః. | 232 | 141 |
| 65. న క్షమతే (విధిః) దీర్ఘకాలం అవ్యాజరమణీయం ప్రేమ. | 268 | 169 |
| 66. న చ తద్భూతం ఏతావతి త్రిభువనే అన్యత్ (మదనస్య) శరశరవ్యతాం యన్నయాతం, యాతి, యాస్యతి వా. | 349 | 226 |
| 67. న చాయం (కామః) ప్రతికూలయితుం శక్యతే. | 245 | 151 |
| 68. నహి కించిన్నక్రియతే హ్రియా. | 239 | 147 |
| 69. నహి క్షుద్రనిర్ఘాతపాతాభిహతా చలతి వసుధా. | 218 | 131 |
| 70. నహి శక్యం దైవం అన్యథాకర్తుం అభియుక్తేనాపి. | 105 | 61 |
| 71. నాస్తి ఖలు అసాధ్యం నామ తపసామ్. | 217 | 129 |
| 72. నాస్తి ఖలు అసాధ్యం నామ భగవతో మనోభవః. | 245 | 151 |

| | | |
|---|---|---|
| 73. నాస్తి జీవితాత్ అన్యత్ అభిమతతరం ఇహ జగతి జంతూనామ్. | 63 | 35 |
| 74. నిజగుణగణాభరణభూషితాంగయష్టయః (భవాదృశః) క్లేశహేతుం ఇతరజనబహుమతం ఆభరణభారం అంగేషు నారోపయన్తి. | 303 | 195 |
| 75. నిత్యం అస్నానశౌచవధ్యః బలవాన్ రాగమలావలేపః. | 167 | 100 |
| 76. నిపుణమన్మథగృహీతా చిత్రవర్తికేవ తరుణచిత్తవృత్తిః నకించిత్ నాలిఖతి. | 301 | 191 |
| 77. పరోపకారోపకరణం శరీరమ్. | 311 | 199 |
| 78. పుణ్యాని హి నామగ్రహణాన్యపి మునీనాం, కిం పునః దర్శనాని. | 77 | 43 |
| 79. ప్రణయిజనప్రత్యాఖ్యానపరాఙ్ముఖీ, దాక్షిణ్యపరవతీ మహాత్మా సతామ్. | 305 | 195 |
| 80. ప్రతిశబ్దక ఇవ రాజవచనం అనుగచ్ఛతి జనో భయాత్. | 169 | 101 |
| 81. ప్రభవతి హి భగవాన్ విధిః. | 267 | 169 |
| 82. ప్రముదితప్రజస్య హి పరిసమాప్తసకలమహీప్రయోజనస్య నరపతేః విషయోపభోగలీలా భూషణం, ఇతరస్యతు విడంబనా. | 101 | 58 |
| 83. ప్రాణత్యాగేనాపి రక్షణీయాః సుహృదసవః. | 239 | 146 |
| 84. ప్రాయేణ చ నిసర్గత ఏవ — అనాయతనస్వభావభంగురాణి సుఖాని, ఆయతస్వభావాని చ దుఃఖాని. | 268 | 169 |

| | | |
|---|---|---|
| 85. ప్రాయేణ ప్రథమం మదనానలో లజ్జాం దహతి, తతో హృదయమ్. | 347 | 224 |
| 86. ప్రాయేణ అకారణమిత్రాణి అతికరుణార్ద్రాణి చ సదా ఖలు భవన్తి సతాం చేతాంసి. | 67 | 38 |
| 87. ప్రాయేణ హి పక్షిణః పశవశ్చ భయాహార మైథుననిద్రావేదినో భవన్తి. | 27 | 14 |
| 88. ప్రాయో మహాభూతానామపి దురభిభవాని భవన్తి మహాత్మనాం తేజాంసి. | 78 | 44 |
| 89. బలవతీ చ నియతిః. | 267 | 169 |
| 90. బలవతీ హి ద్వంద్వానాం ప్రవృత్తిః. | 218 | 131 |
| 91. బహుప్రకారాశ్చ సంసార వృత్తయః. | 267 | 168 |
| 92. బహుభాషిణో న శ్రద్దధాతి లోకః. | 314 | 201 |
| 93. మూఢో (ఢః) విషయోపభోగేసు అనిష్టానుబంధిషు యః సుఖబుద్ధిం ఆరోపయతి. | 243 | 150 |
| 94. మూఢో హి మదనేనాయాస్యతే. | 243 | 149 |
| 95. యదేతదనుమరణంనామ తదతి నిష్ఫలం; అవిద్వజ్జనచరిత ఏషమార్గః. | 264 | 167 |
| 96. యస్య చేంద్రియాణి సన్తి, మనో వా వర్తతే యః పశ్యతి వా శృణోతి వా, శ్రుతమవధారయతి వా, యో వా శుభమిదం, నశుభమిదమితి వివేక్తుమలం, స ఖలు ఉపదేశమర్హతి. | 243-244 | 150 |
| 97. యౌవనారంభే చ ప్రాయః శాస్త్రజలప్రక్షాలన నిర్మలాఽపి కాలుష్యముపయాతి బుద్ధిః. | 167 | 100 |
| 98. విపద్విపదం సంపత్ సంపదం అనుబధ్నాతి. | 123 | 72 |

| | | | |
|---|---|---|---|
| 99. | సకుసుమశ్రీముఖా హి శోభతే లతా. | 328 | 211 |
| 100. | సతతమతిగర్హితేన అకృత్యేనాఽపి రక్షణీయాః మన్యన్తే సుహృదసూన్ సాధవః. | 246 | 152 |
| 101. | సతత మమూలమన్త్రగమ్యో విషమో విషయవిషాస్వాదమోహః. | 166-167 | 100 |
| 102. | సర్వథాదుర్లభం యౌవన మస్ఖలితమ్. | 242 | 149 |
| 103. | సర్వథా నకించిత్ నఖలీకరోతి జీవితతృష్ణా. | 14 | 36 |
| 104. | సర్వథా న నకించన స్పృశన్తి శరీరధర్మాణం ఉపతాపాః. | 218 | 131 |
| 105. | సాపత్న్యకరణం నారీణాం ప్రధానం కోపకారణం; అగ్రణీః వివాదహేతుః, పరం పరిభవస్థానమ్. | 295 | 187 |
| 106. | సాహసకారిణ్యః తా యాః స్వయం సందిశన్తి, సముపసర్పన్తి వా. | 351 | 227 |
| 107. | సుఖముపదిశ్యతే పరస్య. | 243 | 150 |
| 108. | సుభాషితం హారి విశత్యధో గలాత్<br>న దుర్జనస్యార్కరిపో రివామృతమ్।<br>తదేవ ధత్తే హృదయేన సజ్జనో,<br>హరి ర్మహారత్న మివాతి నిర్మలమ్॥ | 4 | 4 |
| 109. | సుహృదా సుహృత్ అసన్మార్గప్రవృత్తః యావచ్ఛక్తితః సర్వాత్మనా నివారణీయః. | 242 | 149 |
| 110. | సుహృద్దుఃఖ ఖేదితే హి మనసి క్వైవ సుఖాశా. | 274 | 173 |
| 111. | స్నేహలవోఽపి వారిణేవ యౌవనమదేవ దూరం విస్తార్యతే. | 300 | 191 |

| | | |
|---|---|---|
| 12. స్వప్న ఇవ అననుభూతమపి మనోరథో దర్శయతి. | 301 | 192 |
| 113. స్వల్పోఽపి ఏకదేశావస్థానే కాలకలా పరిచయముత్పాదయతి. | 217 | 130 |
| 114. హరతి సకల మతిమలినమపి, అంధకారమివ దోషజాతం ప్రదోషసమయనిశాకర ఇవ, గురూపదేశః. | 168 | 100 |



# ఈ గ్రంథరచనకు చూచిన గ్రంథములు


## I. కాదంబరి (బాణుని)

కాదంబరి :

సంపూర్ణమూలము, భూషణుని పూరింపుతో, వావిళ్ల ప్రతి తెలుగులిపి (1965)

కాదంబరి :

సంపూర్ణము, భానుచంద్ర సిద్ధచంద్ర వ్యాఖ్యలతో, నిర్ణయసాగర వారి నాగరిప్రతి (1940)

కాదంబరి :

పూర్వభాగము. M. R. కాళే ఆంగ్ల సంస్కృత వ్యాఖ్యలతో, మోతీలాల్ బనారసీదాస్ వారి నాగరిప్రతి (1968)

కాదంబరి :

పీటర్సను ప్రతిలోని 124 - 237 పుటలవరకు. P. V. కాణే ఆంగ్ల టీకా వ్యాఖ్యలతో, నాగరిప్రతి, బొంబాయి (1921).

కాదంబరి :

పూర్వభాగము, ప్రతిపద సంస్కృత వ్యాఖ్యతో, చౌఖంబా వారి నాగరి ప్రతి (1971)

కాదంబరి :

ఆంగ్లానువాదము - మిస్. రిడింగ్.

## II. హర్షచరితము (బాణుని)

హర్షచరితమ్ :

సంస్కృతవ్యాఖ్యతో చౌఖంబా వారి నాగరిప్రతి (1948)

హర్షచరితమ్ :

గజేంద్రగడ్కర్ వ్యాఖ్య, ఆంగ్లటీకతో, నాగరిప్రతి, పూనా (1918)

హర్షచరితమ్ :

ఆంగ్లానువాదము - Cowell and Thomas. పునర్ముద్రణము, మోతీలాల్ బనారసిదాస్ వారిది (1968)

## III. వాసవదత్త (సుబంధుని)

వాసవదత్త :

సంస్కృతవ్యాఖ్యతో, నాగరి, తిరుచిరాపల్లి (1909)

వాసవదత్త :

సంస్కృతవ్యాఖ్యతో, నాగరి, చౌఖంబా (1967)

వాసవదత్త :

ఆంగ్లానువాదము - L. H. Gray. పునర్ముద్రణము, మోతీలాల్ బనారసీదాస్ (1962)

## IV. ఇతరకావ్యములు వగైరా

సూర్యశతకము (మయూరుడు)
చండీశతకము (బాణుడు)
పంచతంత్రము
హితోపదేశము
కుమారసంభవము (కాళిదాసు ; మల్లినాథవ్యాఖ్య)
రఘువంశము ( ,, ,, )
దశకుమారచరితమ్ (దండి)
వేమభూపాలచరితమ్ (వామన భాణుడు)
బృహత్కథామంజరి (క్షేమేంద్రుడు)
కథాసరిత్సాగరమ్ (సోమదేవుడు)
రామాయణము (వాల్మీకి)
భారతము (వ్యాసుడు)
విష్ణుపురాణము
అగ్నిపురాణము

## V. వైదికము

తైత్తిరీయోపనిషత్
ఐతరేయ బ్రాహ్మణము
Vedic Reader — Macdonell
Vedic Index — Macdonell and Keith

## VI. శాస్త్రములు - వ్యాకరణాది

అష్టాధ్యాయి (పాణిని)
భాష్యము (పతంజలి)
నిరుక్తము (యాస్కుడు)

## VII. శాస్త్రము - అలంకారము

భరతనాట్యశాస్త్రము : కాశీ (1929)
భామహాలంకారము
కావ్యాదర్శము (దండి)
కావ్యాలంకారసూత్రవృత్తి (వామనుడు)
కావ్యప్రకాశ (మమ్మటుడు)
కావ్యానుశాసనము (హేమచంద్రుడు)
ప్రతాపరుద్రయశోభూషణము (విద్యానాథుడు)
సాహిత్యదర్పణము (విశ్వనాథుడు - వేదమువారి తెలుగు)
అలంకార సంగ్రహము (అమృతానందయోగి)
Introduction to the Study of Literature (W. H. Hudson)

## VIII. బాణ కావ్యవిమర్శ

Bana Bhatta : Mrs. Neeta Sarma (1968)
Bana Bhatta : S. S. Dixit (1963)
Bana : R. D. Karmakar (1964)
కాదంబరీ - ఏక్ సాంస్కృతిక్ అధ్యయన్ - హిందీ - V. S. అగ్రవాల్ (1970)
బాణభట్ట్ కీ ఆదాన్ ప్రదాన్ - హిందీ - అమరనాథపాండేయ (1967)

## IX. సాహిత్య చరిత్రలు

History of Indian Literature — A. Weber, English Translation (1878)

History of Sanskrit Literature — A. B. Keith (1928)

History of Indian Literature — M. Winternitz, English Translation by S. Jha.

History of Classical Sanskrit Literature — M. Krishnamachariar.

దక్షిణ భారత సాహిత్యములు: చల్లా. రాధాకృష్ణశర్మ.

## X. నిఘంటువులు - సూచికలు, ఇతరములు

ఆప్టే: ఆంగ్ల - సంస్కృత నిఘంటువు.
అమరకోశము

Select Sanskrit Inscriptions: Diskalkar Vol I

## IX. తెలుగు గ్రంథములు

భారతము, ఆదిపర్వము (నన్నయ)
ఉత్తర హరివంశము (నాచన సోమన)
భాగవతము (బమ్మెర పోతన)
శివరాత్రి మాహాత్మ్యము (శ్రీనాథుడు)
శృంగార నైషధ వ్యాఖ్య (వేదము వారిది)
ఆముక్తమాల్యద వ్యాఖ్య ( ,, )
ఉత్తర రామచరిత పీఠిక ( ,, )
ఆంధ్రసాహిత్యదర్పణము ( ,, )
ఆంధ్రకథాసరిత్సాగరము ( ,, )
త్రిపురాంతకోదాహరణము (నిడదవోలు వెంకటరావుగారి పీఠిక)
పార్వతీ పరిణయము (పిసుపాటి విశ్వేశ్వర శాస్త్రుల యనువాదము)
ఆంధ్ర కాదంబరి (పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు)
పద్య కాదంబరి (తద్దేపల్లి నాగగోపాలరావు)
శృంగార కాదంబరి (చింతలపల్లి నరసింహశాస్త్రి)

# ఉదాహృతపద్యములకు అకారాద్యనుక్రమణిక

[అంకెలు పుటలను తెలుపును. శ్లోకములు ఎక్కువగ అధోజ్ఞాపికలలో నుండును.]

[బాణుని కాదంబరి - దాని వైశిష్ట్యము]

# నామవిషయముల అకారాద్యనుక్రమణిక

[ఇది సమగ్రము కాదు. ఇందులోని సంఖ్యలు ప్రాయికముగ అధ్యాయముల లోని పేరానంబర్లు. కొన్నిచోటుల పుట అని ప్రత్యేకించి చెప్పబడినది. ఇందు అధ్యా = అధ్యాయము, పరి = పరిశిష్టము. అ. జ్ఞా. = అధోజ్ఞాపిక (foot note) అని ఎరుంగవలెను.]

# తప్పులు - ఒప్పులు

[ఎంతజాగ్రత్తగ చూచినను కొన్నితప్పులు దొర్లినవి. వానిలో ముఖ్యమైనవి, వానిసాధురూపములు ఇచ్చట చూడనగును. ఈ తప్పులను ముందు సవరించుకొని తరువాత పుస్తకము నుపయోగించుట మంచిది.]

| పుట | పేరాగ్రాఫు | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 5 | అ. జ్ఞా. 1. | 5 | శారఙ్గధరపద్ధతి | శార్ఙ్గధరపద్ధతి |
| 16 | 1.2.22. | 4 | (నిరావంకముగ) | (నిరాతంకముగ) |
| 16 | అ. జ్ఞా. 2. | 3 | అ, సర్వత్ర... | అః, సర్వత్ర... |
| 31 | (జ) - 2 | 1 | వాసవద | వాసవదత్త |
| 75 | పుట - ఊర్ధ్వప్రతీక | | అలంకారిక | ఆలంకారిక |
| 77 | ,, | | ,, | ,, |
| 79 | ,, | | గద్యకావ్యస్వరూపము | గద్యకావ్యరూపములు |
| ,, | ,, | | అలంకారిక | ఆలంకారిక |
| 81 | ,, | | గద్యకావ్యరూపము | గద్యకావ్యరూపములు |
| 86 | అ. జ్ఞా. 2 | | నానాఖ్యేయను మేధ | నానాఖ్యేయమ మేధ |
| 91 | 6.1 | చివరిపంక్తి | క్రీ. శ. 1871 | క్రీ. శ. 1882 |
| 95 | 7.1 | 5 | బిరునిచ్చి | బిరుదునిచ్చి |
| 144 | అ. జ్ఞా. 2 | 1 | తద్వేతత్ | తద్వైతత్ |
| 205 | 13.8 | 6 | ప్రథమమన్మథావస్థ | ప్రథమమన్మథావస్థః |
| 226 | అ. జ్ఞా. 1 | 1 | నిషంటువులలో | నిఘంటువులలో |
| 238 | 15.1 లో | | | |
| | 3వ పేరా | 1 | వాఙ్మ్రయమున | వాఙ్మయమున |
| 241 | అ. జ్ఞా. 1 | 1 | పరిజనసామాన్యాదృష్టినా | పరిజనసామాన్యదృష్టినా |
| 304 | | | IX తెలుగు... | XI తెలుగు... |
| ,, | | | విశ్వేరశాస్త్రిల | విశ్వేశ్వరశాస్త్రిల |

ఇంకను ఎన్నో ఉండవచ్చును. సహృదయపాఠకులు ప్రకరణబలముచేత సరిదిద్దుకొందురని ఆశ.



